# ఆంగ్లేయౌషధగుణదీపిక.

ఆంగ్లేయవైద్య చింతామణి, ఆంగ్లమున కన్ఫెషన్స్ ఆఫ్ యే
బోగస్ పేట్రియట్, యిత్యాది గ్రంథకర్తయగు
చిల్లరిగె సేతుమాధవరాయ
కృతము.

పునర్విమర్శనంది పెంపొందిన
రెండవకూర్పు

బెజవాడ:
ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
క. కోదండరామయ్యగారిచే
ముద్రింపబడియె.

1933

వెల: రూ. 4 లు

చిల్లరిగె సేతుమాధవరావు,
గాంధినగరము, బెజవాడ.

ఈ కూర్పునకు

# పీఠిక.

---

తే॥ గీ॥ మానసికశక్తులను నీవు ♦ మరువరాదు
సుఖము యనుకొన్న వారికే ♦ సౌఖ్య మిలను
దుఃఖ మనుకొన్న దుఃఖమే ♦ తుదకునంట
వ్యాధు లన్నను భయమంద ♦ వలదు మిత్ర!

ఏ మహాశక్తి యొక్క ఆశీర్వాదమున నీ యాంగ్లేయౌషధ గుణదీపిక యొక్క యీ రెండవ కూర్పును నేటికి బ్రకటింప గలిగితినో యా మహామూర్తికి ప్రప్రథమమునగా హృదయపూర్వకమగు నమస్కారముల నర్పించుచున్నాను.

ఇట్టి గ్రంథమును వ్రాయుటకగు నుత్సాహమును పట్టుదలయును నాకొసంగినందులకు గూడ నా పరమేశ్వరుని కృపావిశేషముల నుతించుచున్నాను.

ఆంగ్లవైద్యశాస్త్రమును నేర్చుకొనుటయందు క్రమమగు శ్రద్ధాభక్తు లుండిన యెడల నయ్యది సామాన్యముగ ననుకొను నంతటి కష్టమైనది కాదు. జంతుకోటికి వైద్యజ్ఞానము సహజముగ నలవడియే యుండును. మానవకోటియందు మాత్రము కొందరకు గొంచెముగను మరికొందర కధికముగను యీ సహజశక్తి పూర్వకర్మానుసరణముగ నొసగబడి యుండును. దీని మన కృషివలన నభివృద్ధి చేసికొనవలయును.

పాఠకమహాశయా! ఈదరలేని ఓషధీమహాసముద్రమును జూచి దీని నెట్లు లంఘింపగలమా యని భయపడవలదు. వైద్యవిద్యాలయములయందైదారు సంవత్సరములు బఠించిన వైద్యపండితులైనను అన్ని ఓషధులయొక్క ప్రయోజనములను బరీక్షించి యందుల గుణాగుణములను దెలిసికొని యుండరు. ఎవ్వరో నియమితములగు నోషధులయొక్క సంపూర్ణలక్షణములను మాత్రమే వారు పరిశీలన జేసియుందురు. కాని, వారివారి అనంతర అనుదినానుభవము వలన నెక్కువ వైద్యజ్ఞానమును సంపాదించి యుందురు. అటులనే నీవును యెంత మాత్రమును నిరాశను జెందక యాసక్తితో నోషధుల వివేచనయుతముగ నుపయోగింపుచు వాని గుణముల గ్రహించి వైద్య

జ్ఞానమును క్రమముగ నభివృద్ధి చేసికొనవలయును. అపాయకరములగు విషపదార్థముల నుపయోగించుట యందు తొందరను వహింపరాదు.

ఈ పీఠికను ముగించు సందర్భమున ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల యందలి యధికారులకును పనివారలకునుగూడ నా కృతజ్ఞతను దెలుపనిచో నావిధాయక కృత్యమును మరచినవాడ నగుదును. ఏలాగో నేను చెప్పజాలనుగాని - యీగ్రంథమును పరిశుభ్రముగను శీఘ్రముగను ముద్రించి పూర్తిచేయుటతో సంబంధించిన ప్రతి వ్యక్తియును - అధ్యక్షాధికారి మొదలు చిన్నపిల్లవాని వరకును - నాయందు భక్త్యనురాగములతో బనిచేసినందులకు వా రందరియెడలను నేను కృతజ్ఞతను వహించియున్నాను. కృపాంతరంగు డగు నా భగవంతుడు వారల కెల్లరకును మేలుసేయుగాక!

ఈకూర్పును సిద్ధపరచుటలో నీ క్రింది గ్రంథముల సహాయమును గూడ కృతజ్ఞతతో నందుకొంటిని.

రఖల్ దాస్ గోష్ బిరీంద్రనాద్ గోష్ గార్లు రచియించిన మెటీరియా మెడికా.

కె. యం. నాడ్కార్ణిగారు రచియించిన ఇండియన్ మెటరియా మెడికా.

డాక్టర్ కోమన్ గారి యిండియన్ ఔషధుల గూర్చిన రిపోర్టు.

మరికొన్ని పత్రికా ప్రకటనములు.

మెగ్రిగాల్ రాబర్ట్సన్ గార్లు రచియించిన హౌసోల్డ్ ఫిజిషన్.

సర్పంగను గూర్చిన కొన్ని పుస్తకములు.

ఇట్లు,

గాంధీనగరము,
బెజవాడ,
**15–5–1933.**

# విషయసూచిక.

నిష్కళంక ప్రేమపూరితులగు

# మాతాపితలకు

## ప్రథమకూర్పునకు

# పీఠిక.

ఆంగ్లేయౌషధ గుణదీపిక యను ఈ గ్రంథమును మిక్కిలి కృషిచేసి రచియించి సిద్ధమైన ప్రతి నొకదానిని గ్రంథకర్త యగు సేతుమాధవరావు గారు నాయొద్దకు పంపి దానికి పీఠిక వ్రాయుమని కోరిరి. పీఠిక వ్రాయు సమయమున చర్చింపవలసిన విషయము లనేకము లున్నను సావకాశము లేకపోవుటచే నాకు ముఖ్యముగ తోచిన విషయములు కొన్నిటిని గూర్చి వ్రాయుచున్నాను.

### ప్రస్తుత వైద్యస్థితి.

పూర్వ మొకప్పుడు మిక్కిలి ప్రసిద్ధిగాంచి అరేబియా గ్రీసు ఈజిప్టు మొదలగు దేశముల కంతకు వ్యాపించిన ఆయుర్వేద వైద్యము ఇప్పుడు వార్తాపత్రికలలోని ఔషధపు ప్రకటనలను బట్టి మాత్రము వృద్ధిజెందుచున్నట్లు కనబడినను, కొంచెము మించుమించుగా నశించినదని చెప్పవచ్చును. ఆంగ్లేయ వైద్యపద్ధతి ఇప్పుడిప్పుడు కొంచెము వ్యాపించుచున్నను మన ప్రాంతమునందు పట్టణములలో నూటికి అయిదుగురి కంటెను పల్లెటూళ్ళలో వేయింటికి ఒక్కనికంటెను హెచ్చుగ దీని ఫలితమును బొందుచున్నారని చెప్పుటకు వీలు లేదు. ఇప్పుడు పల్లెటూళ్లలో నివసించుచున్న భాగ్యవంతులకును విద్యావంతులకును మరింత కష్టము సంభవించియున్నది. గ్రామమునందుండు సామాన్య వైద్యునిచే చికిత్స చేయించుకొనవలెననిన నతని వైద్యమునందు తమకు నమ్మకము లేదు. ఆంగ్లేయ వైద్యశాస్త్రప్రవీణుడగు వైద్యుడు తమకు కావలెనినిన గ్రామములో సాధారణముగ దొరకుట సాధ్యము కాకయున్నది.

### శాస్త్రయుక్తముగ వైద్యమును నేర్చుట సులభమా?

ఆంగ్లేయ వైద్యశాస్త్రమును నేర్చుకొనుటకు నావద్దకు కొందరిని పంపుదుమనియు కొంతవరకైన నీ వైద్యపద్ధతి వారికి నేర్పి తమగ్రామములకు తిరిగి పంపవలసినదనియు నాస్నేహితు లనేకులు నన్ను కోరిరి. కాని కనీసము నాలుగు సంవత్సరముల వరకైనను శాస్త్రయుక్తముగ చదివినగాని వైద్యపద్ధతి ఏదియైనను అలవడదనియు అట్టి శాస్త్రయుక్తముగ విద్య గరపుటకు తగినన్ని సాధనములు ప్రస్తుత మమర్చుట సులభసాధ్యము కాదనియు, మిడిమిడి జ్ఞానముతో వైద్య మంతయు నాకే తెలియుననుస్వాతిశయముతో బయలుదేరు వైద్యులు దేశమునకు ఉపకారమునకంటె అపకారమే హెచ్చుగ చేయుదురనియు తలచి నేను నాస్నేహితులను నిరుత్సాహ పరచితిని.

## ఆయుర్వేద శాస్త్రపారీణులు ఆంగ్లేయవైద్యశాస్త్రము నభ్యసించుట.

ఆయుర్వేద శాస్త్రమును బట్టి కొంతవరకు వైద్యజ్ఞానము సంపాదించిన వారికి ఆంగ్లేయ వైద్యపద్ధతులు కొన్ని బోధించిన ఉపయోగకరముగ నుండునా యను అంశము యోచింపదగియున్నది. ఇట్టివారిలో ననేకులకు పూర్వము ఎప్పుడో చెప్పబడిన ఔషధప్రయోగములయందే విశ్వాసముగాని ఎంత యుపయోగకరములైన వానినైనను క్రొత్తమార్పులను వారు సాధ్యమయినంతవరకు చొరనియ్యరు. వారిలో గొందరు తమ శాస్త్రమే ప్రపంచములోని అన్ని శాస్త్రములను మించిన దని ఏదోవిధమున రుజువుపరచుటకును ప్రయత్నించు చుందురు. ఇట్టియభిమానము కొంతవర కుండవలసినదేగాని మంచి చెడ్డలను యోజింపక తాము పట్టిన కుందేటికి మూడే కాళ్లనువారికి క్రొత్త విషయములను బోధించుట దుర్లభము. నిండుకుండ తొణకదుగాని శాస్త్రజ్ఞానములేని వైద్యులు ఇతరుల కంటె గంభీరవాక్యములు పలుకుచు అన్ని వ్యాధులను తామే కుదిర్చెద మని చెప్పుకొనుచుందురు. ఈవైద్యులలో కొందరు, ఇంగ్లీషువైద్యులకు నాడీజ్ఞానము తెలియ దని తమ కేమో విశేషించి తెలిసినట్లు దూషించు చుందురు. ఇట్టి వైద్యులకు ఆంగ్లేయ వైద్యశాస్త్రమందు కించిత్ జ్ఞానము సమకూడినను అదియు నొక చేటే యగును.

## ఆంగ్లేయ వైద్యశాస్త్రమందు నిరంతరము గలుగుచుండు మార్పులు.

ఆంగ్లేయ వైద్యశాస్త్రము మన వైద్యశాస్త్రమువలె పెంపుమాసినది కాదు. కడచిన సంవత్సరమున నొక వ్యాధికి మనము చేసిన చికిత్స ఈ సంవత్సరమందు కని పెట్టబడిన క్రొత్త యంశములచే మారిపోవుచున్నది. ఇప్పుడు మనము చేయుచున్న వైద్యపద్ధతి యంతయు మారి నాలుగైదు సంవత్సరములలో క్రొత్తపద్ధతి యేర్పడ వచ్చును. కొంతకాలముక్రిందట ఆంగ్లేయవైద్యులు చలిజ్వరము బురదనేలలనుండి వచ్చు గాలివలన కలుగునని నమ్మియుండిరి. ఇప్పుడట్టి యభిప్రాయము పూర్ణముగ మారి దోమలమూలమునగాని చలిజ్వరము వ్యాపింపదని సిద్ధాంతీకరింప బడినది. మన వైద్య శాస్త్రమునకు ఇట్టి పెంపులేదు. మనశాస్త్రము కేవలము నమ్మకమును బట్టి ఏర్పడినది. ఒక కాలపు సిద్ధాంతములు అప్పటి దేశస్థితిని బట్టి శాస్త్రవేత్తలచే నంగీకరింపబడినను ఆకాలపు ఇతరదేశవైద్యుల సిద్ధాంతములతో పోల్చినప్పుడు గౌరవనీయము లైనను పూర్వసిద్ధాంతములే యెల్లప్పుడు మార్పులేకుండ నుపయోగింపవలె ననిన అది యసంభవము.

## దేశీయౌషధముల గుణముల నిరూపించుట యెట్లు?

మన దేశీయ వైద్యశాస్త్రమునందు చెప్పబడిన ఔషధయోగములు ఇప్పటికిని ఉపయోగించునవి కొన్ని యుండవచ్చును. అవి వేలకొలది పనికిమాలిన ఔషధ

రోగములలో మరిగి యుండును. అట్టి వానిని నవీనశాస్త్రపద్ధతులను బట్టి నిరూపించి గుణములను గ్రహింపవలె ననిన మిక్కిలి కష్టము. ఆంగ్లేయ వైద్య శాస్త్రపారీణులును స్వోదరపోషణార్థమై పాటుపడ నక్కరలేని ధనికులును కొందరు కేవల శాస్త్రాభివృద్ధియే పరమార్థముగా నెంచుకొని అధిక శ్రమచేసి సంవత్సరముల కొలది పాటుపడిన కొంతవరకు సాధింపవచ్చునుగాని శాస్త్రయుక్తముకాని పద్ధతులచే కొన్ని మందులను ఉపయోగించి అడ్డదిడ్డముగా పనిచేయుట వలన ఆంగ్లేయ వైద్య శాస్త్ర పారీణులకు గూడ ఎంత మాత్రము ప్రయోజనము లేదని నానమ్మకము. ఉభయ శాస్త్ర వేత్తలగు అయిదారుగురు పండితులు ఒకసమిరగా జేరి యొక వైద్యశాలను సాహాయ్యము చేసికొని శోధనలను జరిపించిన యెడల ఆంగ్లేయౌషధ శాస్త్రమునందు చెప్పబడని యౌషధయోగము లెవ్వియైన మనదేశీయౌషధములయం దున్న యెడల కనిపెట్టవచ్చును. ఇట్టిది ధనికులయొక్కయు దొరతనము వారియొక్కయు సాయము లేనిది నెరవేరుట కష్టము. నాగరకత జెందిన ఇతరదేశములలో ధనికు లొసంగిన విరాళములతోను, మతాభివృద్ధికిని, దేవస్థానముల యభివృద్ధికిని ఏర్పడిన ద్రవ్యసాహాయ్యముతోను, వైద్యశాలలు వేనవేలుగా పోషింప బడుచుండును. పూర్వ మొకప్పుడు బౌద్ధమతము ప్రబలిన కాలమున బౌద్ధాలయములతో పాటు వైద్యశాలలుకూడ నియమింప బడుచుండినను మనదురదృష్టవశముచేత నట్టి యాచార మిప్పు డంతరించినది.

## ఆంగ్లేయ వైద్యులు.

ఇప్పుడు ఆంగ్లేయ వైద్యశాస్త్రమునందు సామాన్య పండితు డనిపించు కొనుటకు 5 సంవత్సరముల కాలమును రమారమి మూడువేల రూపాయలద్రవ్యమును పట్టుచున్నది. ఈపండితులకు గూడ పూర్ణముగ తెలిసిన వ్యాధులకంటె తెలియని వ్యాధుల సంఖ్య హెచ్చుగ నున్నది. ఇంకను ఒక్కొక్కవ్యాధినిగూర్చి ప్రత్యేకజ్ఞానము సంపాదించవలెననిన ఇంకను హెచ్చుకాలమును ధనమును కావలసియుండును. ఇట్లు నేర్చిన పండితులతో నీడుగ మేమును వైద్యులమే యనుచు పనిచేయు వారలయొక్క తారతమ్యములను కొంచె మాలోచింపదగును.

## పల్లెటూరి వైద్యులు.

పూర్వకాలమునందు ఆకలములు తినుచు విరాగులై సంచరించు గోసాయిలును, సాధారణముగ తమసహజవృత్తులచే జీవించుచు వైద్యముచేయుట యొక గౌరవముగ నెంచుకొని యుండు ఇతరులును, ఉచితముగ వైద్యముచేయుచుండిరి. వారికి వైద్య శాస్త్రాభ్యాసము ప్రధానవృత్తి కాకపోవుటచేత దానియందు వారికిగల అభిరుచి

తరతరములకు తగ్గుచువచ్చెను. తుద కిపుడు గ్రామములో తగినవైద్యుడు లేనప్పుడు యెట్టివాడైనను వైద్యు డనిపించుకొనుచున్నాడు.

## శాస్త్రజ్ఞానములేని వైద్యులవలని యుపద్రవములు.

ప్రజలు తమ మూఢ విశ్వాసముచేతను, వేరొక వైద్యుడు సమయమునకు దొరకక పోవుటచేతను అపత్కాలమునందు ముందు రాబోవు అసందర్భములను తెలిసికొనక కనబడిన ప్రతియాకుయొక్క పసరును, దొరకిన కుప్పె లన్నిటినుండి మాత్రలు, రోగి కిచ్చి అనేక చోట్ల విషప్రాయములగు నీ యౌషధముల మూలముననే ప్రాణములను కోల్పోవుచున్నారు. మోతాదుల నియమములేక అజ్ఞానులగు వైద్యులు కొందరు పోసిన విషములచే గలిగిన యుపద్రవములను మరల్చుకొనుట వ్యాధిని కుదుర్చుట కంటె దుర్లభ మగుచున్నది. రాయివలెనుండి నేపాళము మాత్రలను పుచ్చుకొని యెందరో ప్రాణములను గోల్పోయిరి. ఒకానొకప్పుడు నేర్చిన వైద్యుడు శ్రమపడి చికిత్స చేయుచున్నను వాని స్వభావలక్షణములనుబట్టి కొన్నివ్యాధులు కుదురుటకు కొంతకాలము పట్టును. మనదేశములోని వాడుక ప్రకారము రెండుదినములలో వ్యాధి కుదరక పోయిన యెడల నెంతటివైద్యునైనను మాన్పి మరియొకనిని పెట్టుదురు; లేదా, సన్నిపాతజ్వరమునందు రెండు వారములు గడచి వ్యాధి కుదురు సమయమునకు ఏమంత్రగాడో దారిని పోవుచువచ్చి రెండుదొంగమాటలు చెప్పి అమ్మవారికి నైవేద్యము పెట్టించి ఆవ్యాధి కుదిరినప్పుడు తనదే మహిమ యని చెప్పుకొనును. శ్రమపడిన మొదటి వైద్యునకు హస్తవాసి మంచిది కాదనుటతప్ప ప్రత్యుపకారము వేరొకటి యుండదు.

తమయందు ఏదో యొకశక్తి లేనియెడల నింతమంది వైద్యులెట్లు తమప్రభావమును స్థాపించుకొనుచున్నారని కొందరికి సందేహము తోచవచ్చును. ఈవైద్యులలో ననేకులు ఉచితముగ వైద్యము చేయుదుమని చెప్పుచు పరోపకారచింతనమును సూచించుటయే వారి జయమునకుగల కారణములలో మొదటిది. మనదేశమునందు సామాన్యజనులేగాక మిక్కిలి ధనవంతులుగూడ నిందుచేతనే వైద్యసాహాయ్యము నుచితముగ కోరుచుండుట కలవాటుపడి యున్నారు,

ఏవో కొన్ని కఠినవ్యాధులను తప్ప సామాన్యమగు నేవ్యాధినైనను నైసర్గికముగ నివారించుటకు మన శరీరమునందు నిర్మాణములుగలవు; అనగా వానియంతట అవియే కుదురును. ఇట్లు నైసర్గిక కారణములచే వ్యాధులు కుదురుటచే పైన వ్రాసిన వైద్యుల కీర్తిని వ్యాపింపజేసి వారి వైద్యమును సాగించును. ఇది రెండవ రహస్యము.

## వైద్యులు—వార్తాపత్రికలు.

ప్రతి గ్రామమునందుండెడి వైద్యులుగాక నవనాగరకతచే మనదేశమునందు వ్యాపించిన వార్తాపత్రికలలోని ప్రకటనలనే సులభమార్గముగ జేసికొని గ్రామములందు మూల మూలలకు వ్యాపించియున్న ఆయుర్వేదీయ ఔషధములను లెక్కింపనలవి కాకున్నది. ఇట్టి ప్రకటనవృత్తియే జీవనాధారముగ జేసికొనిన యొకానొకరిట్లు చెప్పియున్నారు. "గ్రామమున కొక్కడైనను వెఱ్ఱివాఁడు ఉండినంతకాలము నాసంచులు నిండును. ఒక్కడుగూడ లేనప్పుడుకదా నేను వేరొకవృత్తి చూచుకొనవలెను?" దీని యర్థమేమన వార్తాపత్రిక ప్రకటనలో వర్ణింపబడిన అర్ధరూపాయి మందు లనేకములలో ఒక్కొక దానియందు స్వల్పవిలువగల మందుమాత్రమే యుండును. మందుసీసాలకును వాటిపై వేసియున్న చక్కని అచ్చుకాగితములకును పత్రికాప్రకటనలకును కొంత కర్చు కాగలదు. అయినను ఒక్కొక గ్రామమున కొక్కొక సీసా చొప్పున ఒక లక్ష సీసాల నమ్మిన సంవత్సరములోనే మిద్దెలు మేడలు కట్టవచ్చును.

పైన ఉదహరించిన ప్రకారము శాస్త్రజ్ఞానము లేని వైద్యుల మూలముననువార్తాపత్రికా వర్ణనలచే భ్రమింపజేయు రహస్యపు మందులమూలమునను గలుగు నరకములలో ముఖ్యముగ గమనింపవలసినది, యొక్కటి గలదు. రోగి యేదో యొకమందును సేవించుచున్నానుగదా యను సంతృప్తిచేతను, ఏదైన నొకమందు గుణము కలుగజేయకపోవునా యను ఆశచేతను, దొరకిన మందుల నన్నింటిని తిని మిగుల విలువగల కాలమును వృథాపుచ్చుచు తన వ్యాధిని ముదరబెట్టుకొను చున్నాడు. పాప మనేక రోగులు, వ్యాధి అసాధ్య మగువఱకును, ఈవిషయమును సకాలమున గ్రహింపలేక తుదకు మిక్కిలి చింత నొందెదరు. వ్యాధి అసాధ్యమయిన తర్వాత మిక్కిలి పరితపించుచు, ఔషధశాలలకు వచ్చి నిరాశజెంది తిరిగిపోయినట్టివారలు లెక్క లేకుండ గలరని చెప్పుటకు మిక్కిలి చింతిల్లు చున్నాను.

## ఆంగ్లేయౌషధగుణదీపిక.

ప్రజలలో నిజమైన వైద్యశాస్త్రజ్ఞానము కొరవడియున్న ఇట్టిసమయమునందు మన యాంధ్రదేశములో నీకొరతను దీర్చుటకు సమకట్టి, పట్టుదలతో నీ యాంగ్లేయౌషధగుణదీపికను రచించిన సేతుమాధవరావు గారు మిక్కిలి వందనీయులు. ఆంగ్లేయపద్ధతిని చికిత్సచేయు వైద్యులు ఉపయోగించు ఔషధయోగములను పెక్కింటిని ఇందు సమకూర్చి యున్నారు. వీరు ఆంగ్లేయవైద్యశాస్త్రమునందు పాండిత్య

మును బొంది పట్టాలను సంపాదించినవారు కాకపోయినను తమశక్తికొలదిని సరియైన మార్గమున కృషిచేయుచున్నారు. వీరిదివరలో ఆంగ్లేయవైద్యచింతామణియను గ్రంథమును రచించి దానికి సాయపడునట్లు ఈఔషధగుణదీపికను వ్రాసియున్నారు. ఈ గ్రంథమును చదువువారలు దీనిని ముగించిన తోడనే ఆంగ్లేయ వైద్య మంతయు సాంగముగ గ్రహించితిమని విఱ్ఱవీగ దగదు.

## వ్యాధి నిదానము.

వ్యాధి యెద్దియో గుర్తించుటకు కౌశలముగలవైద్యుడు కావలెనుగాని, వ్యాధి కారణమును, నిదానమును, తెలిసికొనిన తరువాత చికిత్సయందంతగా కష్టముండదు. ఈగ్రంథమున జదివి నేఔషధము లేయేవ్యాధుల కుపయోగించునో తెలిసికొనినవారు అంతటితో తృప్తినొందక విశేష పరిశ్రమచేతను అనుభవముచేతను మాత్రము సంపాదింప శక్యమగు వ్యాధి నిదానాదివిషయములను తెలిసికొనుటకు నిరంతరము కృషి చేయుదు రనియు, ఏదో యొకవ్యాధిని అదృష్టవశమున కుదర్చగలిగినంత మాత్రమున తన కంతయును తెలియునని గర్వపడ రనియును. "తెలివి యొకింత లేనియెడ" తో ప్రారంభమగు భర్తృహరి సువాక్యమును మరువరనియు నమ్ముచున్నాను.

ఈ గ్రంథమునకు పీఠికను వ్రాయు గౌరవమును నాకొసంగి నాయభిప్రాయములను కొన్నింటిని ప్రజలకు తెలియజేయుటకు తగిన సమయమును కలుగజేసినందులకు గ్రంథకర్తగారికి నేను కృతజ్ఞుడను.

29—9—1912,
చింతాద్రిపేట,
మద్రాసు.

ఇట్లు విధేయుడు,
ఆచంట లక్ష్మీపతి,
బి. యే., యం. బి. అండ్ సి. యం.

ప్రథమకూర్పునందలి

# విజ్ఞాపన.



ఇప్పటికి మూడు సంవత్సరముల క్రిందట నాంగ్లేయ వైద్యశాస్త్రమును గూర్చి యాంధ్రమున "ఆంగ్లేయ వైద్యచింతామణి" యను పేరఁ బ్రకటించి యుంటిని. ఈ గ్రంథముయొక్క ప్రథమ ముద్రణపు ప్రతుల నిప్పటికి వ్యయపడఁగలిగి యుండుటచే నా కాంధ్ర మహాజనులనుండి కలిగిన ప్రోత్సాహమునకు వారియెడ నెంతయుఁ గృతజ్ఞుఁడనై యున్నవాఁడను. ఈ మూఁడు సంవత్సరముల నుండియు నీ యాంగ్లేయౌషధ గుణదీపికను వెల్లడిలోనికి దీసికొని రావలయునని యెంత ప్రయత్నించినను గాలపరిపక్వస్థితి రానందున నేటివఱకు నట్లొనర్పలేక పోతిని.

ఆంగ్లేయౌషధములకు సరి యగు తెలుఁగుపేరు లున్న విషయములలో సాధ్య మయినంత వఱకు వాటిని దెలియ పఱచితిని. కొన్ని మూలికలు ఇండియాదేశమునఁ జిక్కని వగుటచే సరియగు పదము లాంధ్రమున లభియించి యుండలేదు. నా చేత నైనంతవఱకు నెల్లరకు సులభబోధకమగు నటుల వ్రాసియుంటిని.

ఈ గ్రంథము నాంధ్రీకరించుట యందలి నా ముఖ్యోద్దేశ మిట్టి విలువ గలిగిన విదేశశాస్త్రమును నా శక్తి కొలఁది నాంధ్రజనుల కందుబాటునం దుండు నటులఁ జేసి నా జీవితము నందలి విధాయక కృత్యమును నెరవేర్చు కొనుటయే యైనను నీ కార్యమునందు నే నెంతవరకు సఫలీకృతుఁడ నైనదియు నాంధ్రప్రపంచము నిర్ధారింపవలసిన యంశమై యున్నది.

ఆంగ్లేయౌషధముల గుణములను బూర్ణముగ గ్రహింపకుండ వాటి నుపయోగించుట యం దొకప్పు డపాయమును గలుగ జేసినను, యీ యౌషధముల క్రమోపయోగమువలన గలిగెడి లాభమును మనము పొందుటకు యత్నించుట యెంతయుఁ గోరఁదగినదై యున్నది. ప్రతి పల్లెటూరు నందును నీ వైద్య శాస్త్రము నందు పాండిత్యమును వహించిన యొకని నెన్నడైన సంపాదింపఁ గలుగుదుమా యను విషయమున నిచ్ఛామాత్రమునకైనను బ్రస్తుతదేశస్థితిని బట్టి అస్పదము గనఁబడ కున్నది. ఇట్టి సందర్భమున మన దేశజనులు ఆంగ్లేయౌషధముల యొక్క వాడుకను బ్రోత్సాహ పఱచుటకై వలయు శ్రద్ధాశ్రమములను దీసికొందురని నమ్ముచున్నాను. అగ్నివలన నొకప్పుడు శరీరమును గృహములును సయితము దహింపబడు ననెడి భయముచే, అనుదిన వ్యవహారములయందు దానియొక్క ఉపయోగమును వదలుకొన

జాలము. అటులనే ఆంగ్లేయౌషధములయొక్క దురుపయోగమువలన నొకప్పుడు కలుగబోయెడి అపాయములను బట్టి వాటియొక్క ఉపయోగమును బూర్ణముగ ద్యజించుట యెంతయు శోచనీయము. వీటియొక్క ఉపయోగమును క్రమక్రమముగ దేశమునం దంతటను వ్యాపింపజేసి ప్రజలకు వ్యాధిరాహిత్యతను సౌఖ్యమును గలుగజేయుట ప్రతి యాంధ్రుని యొక్కయు విధియై యున్నదని తలచుచున్నాను.

ఈగ్రంథమును వ్రాయుట యందు నాకు సహకారము లైన యాంగ్లేయ భాషయందలి యీక్రింది గ్రంథముల కృతజ్ఞతా పూర్వకముగ నుదహరించడమైనది.

| | |
|---|---|
| బ్రిటిష్ ఫార్మకోపియా | British Pharmacopoeia |
| మార్టిన్ డేల్ అండ్ వెస్టుకాట్స్ యక్స్ట్రా ఫార్మకోపియా | Martindale & Westcott's Extra Pharmacopoeia. |
| విట్లాజ్ మెటీరియా మెడికా | Whitla's Materia Medica. |
| కెంప్ అండ్ కోజ్ ప్రిస్క్రైబర్స్ ఫార్మకోపియా | Kemp & Co's Prescribers' Pharmacopoeia. |
| వేరింగ్స్ బజార్ మెడ్సిన్స్ ఆఫ్ ఇండియా | Waring's Bazaar Medicines of India. |
| కే. యం. నాడ్కార్నిజ్ ఇండియన్ ప్లాన్ట్స్ అండు డ్రగ్స్ | K. M. Nadkarni's Indian Plants & Drugs. |
| మోహిదీన్ షరీఫ్ ఖాన్ బహదర్స్ మెటీరియా మెడికా ఆఫ్ మద్రాస్ | Mohideen Sheriff Khan Bahadur's Materia Medica of Madras. |
| మిచెల్ బ్రూస్ గారి మెటీరియా మెడికా | Materia Medica, Mitchell Bruce. |

మచిలీపట్టణము,
**1-10-1912.**

ఇట్లు,
చిల్లరిగె సేతుమాధవరావు.

# మెటీరియా మెడికా యననేమి?



మెటీరియా మెడికా యనగా వ్యాధిచికిత్సలయం దుపయోగింపబడు వస్తువుల యొక్క వివరములను దెల్పు గ్రంథమని చెప్పనగును. అట్టి గ్రంథ మీక్రింది విషయముల బోధించును.

1. మూలికలయొక్క యుత్పత్తి చరిత్రమును, యే యే దేశములలో నే యే ప్రదేశములయం దవి దొరకునదియు, వాటియొక్క స్వరూపములను, రసాయనసంబంధ మగు లక్షణములను - దెలుపుట - యీ గ్రంథముయొక్క ప్రథమధర్మమై యున్నది.

2. ఈ మూలికలను శాస్త్రీయముగను క్రమపద్ధతులను మిశ్రితముజేయుట వలన వాటిని ప్రయోగమునకు దగినటులజేయు విషయములను బోధించు పద్ధతికి "ఫార్మసీ" (Pharmacy) యందురు. ఔషధయోగము (Prescriptions) లను (అనగా వేరువేరు మందులను జేర్చు ప్రకరణములను) వ్రాయుటయు, అట్టి పట్టికల ప్రకారము మందులను కొలత తూనికలప్రకారము సమకూర్చుటయు, బుడ్లకు ఔషధ సేవ నిర్ణయసూచన పత్రముల నంటించుటయు, కార్కు బిగియుటయు మొదలగు విషయములు "డిస్పెన్సింగ్" (Dispensing) నాబడును.

మూలికలను తయారుజేయుటకుగాను కొన్ని ప్రత్యేక పద్ధతులు నియమితములై యుండును. అట్టి ప్రత్యేక పద్ధతులను బోధించుగ్రంథము "ఫార్మకోపియా" (Pharmacopoeia) యనబడును. ఆరోగ్యస్థితియందు సామాన్యముగా శరీరముపై నంతటనుగాని, లేక, శరీరముయొక్క ప్రత్యేకావయవముల పైనిగాని, మూలికల యొక్క ప్రయోగమువలన గలుగు ఫలితమును బోధించు శాస్త్రమునకు "ఫార్మకాలజీ" (Pharmacology) యందురు.

ప్రాణాపాయమును గలుగజేయునంత పెద్దమోతాదులలో మూలికల నుపయోగించు నెడల గలుగు ఫలితముల బోధించు శాస్త్రమునకు "టాక్సికాలజీ" (Toxicology) యందురు.

వ్యాధియం దుపయోగించబడు చికిత్సాపద్ధతుల బోధించు వైద్యభాగమునకు "తేరాప్యూటిక్సు" (Therapeutics) యందురు. ఈ వైద్యపద్ధతి రెండు విధములై యున్నది.

మొదటిది:— అనుభవ పద్ధతి.

కేవల మనుభవమువలన మాత్రమే వ్యాధిచికిత్సను జేయుచు, కొన్ని మూలికలయొక్క ప్రయోగమువలన నే శాస్త్రసహితములగు కారణములచే నట్టి ఫలితము గలుగుచున్నదో చెప్పుటకు వీలు లేకుండును. ఒకానొక వ్యాధియందొకానొక మూలిక నుపయోగించుటవలన గలిగెడి సత్ఫలితమునకుగాని దుష్ఫలితమునకుగాని యీ చికిత్సాపద్ధతియందు సహేతుకములగు కారణముల దెల్పనవకాశము లేకుండును. ఒకానొక వ్యాధియందొకానొకమూలిక జయప్రదముగ బనిచేయుచుండు మాత్రము చేతనే యామూలిక నుపయోగించుచుందుము. గౌట్ (కీళ్లనొప్పి సంబంధము) వ్యాధియందు "కొల్చికం" ఉపయోగించును. ఆమూలిక శరీరమునం దెట్టి వివరముగ బనిచేయునదియు మనకు ప్రస్తుతము తెలియజాలదు. మన వైద్యజ్ఞానమభివృద్ధిని జెందిన కొలదియు నిట్టి కారణములు బోధపడు చుండును. కొంతకాలము క్రిందట కొఱుకువ్యాధియందు రసము (పాదరసము) యెట్టిపని చేయునదియు తెలియకుండెను. ఇప్పుడా వ్యాధియందామూలికయొక్క ప్రయోగ కార్యక్రమము విదితమై యున్నది.

రెండవది:— హేతువాదనా పద్ధతి.

రసాయన శాస్త్రము, శారీరశాస్త్రము, వ్యాధినిదానశాస్త్రము, వస్తుగుణ శాస్త్రము — యీ యన్ని శాస్త్రముల యొక్కయు జ్ఞానఫలితముగ మన మవలంబించు చికిత్సామార్గము హేతువాదనాపద్ధతి ననుసరించి యుండును.

క్షయవ్యాధి యందలి రాత్రిచెమటలకు అట్రోపిన్ సల్ఫేట్ (Atropine Sulphate) యొక్క గ్రెయినులో (1/100 గ్రె) నూరవవంతు మోతాదు నుపయోగించిన యెడల చెమట లెట్లు కట్టునదియు, టెటనస్ (ధనుస్సంధి) వ్యాధియందలి శ్వాసావరోధమును క్లోరల్ హైడ్రేట్ (Chloral Hydrate) నుపయోగించుట వలన గుణము నిచ్చు టెట్లు కలుగునదియు, హృదయ సంబంధమగు నంజులయందు డిజిటాలిస్ (Digitalis) నుపయోగించుట మూలమున వ్యాధిరాహిత్యత యెట్లు కలుగునదియు, నీ హేతువాదనా పద్ధతివలననే నిశ్చయింప బడినవి.

మూడవది:—సహకార పద్ధతి.

ఈపద్ధతియందు ఔషధములమూలమునగాక యితరమార్గములవలన వ్యాధిచికిత్స చేయబడును. ఉదాహరణము:—శీతోష్ణస్థితియొక్క మార్పు — అనగా — నివాస ప్రదేశమును మార్చుట — ఆహారముయొక్క నియమములను మార్చుట, ధరించుదుస్తు

లను మార్చుట, శరీరసాధకమును జేయుట, స్నానములపద్ధతి నవలంబించుట, ఒడలు మర్దనచేయుట — అనగా — కండరముల నొత్తి పట్టువిడుపులకు లోనగునటుల జేయుట — యీమొదలగు మార్గముల ననుసరించి చికిత్సజేయుటయు నొక పద్ధతియై యున్నది.

## ఔషధమూలములు.

జంతుసంబంధమగునట్టిగాని వృక్షసంబంధమగునట్టిగాని ఓషధీమూలములు (Crude drugs) వివిధములగు నౌషధముల తయారుచేయుటయం దుపయోగింపబడును. ఈ ఓషధిమూలములయొక్క విలువ వానియం దుండు చురుకుగ బనిచేయు రసాయన సంబంధమగు వస్తుసంపుటిని బట్టి యుండును.

ఒకచెట్టునందలి యీఔషధప్రయోగార్హమగు వస్తుసముదాయము ఒక్కొకప్పుడాచెట్టుయొక్క కొన్ని భాగములమాత్రమే యనుసరించియు, మరొకప్పుడా చెట్టుయొక్క యన్నిభాగముల ననుసరించియు నుండును. ఉదాహరణము:—కలబందయందు మట్టల (ఆకుల) ననుసరించి మాత్రమే ఔషధగుణము లుండును. వీని నుండియే ముసాంబరమును తయారుచేయుదురు.

## ఔషధజాతుల నిర్ణయము.

ఔషధములను వానియొక్క పుట్టుకనుబట్టి యీక్రిందిజాతులుగ విభజింపవచ్చును.

1. వృక్షజాతికిగాని జంతుజాతికిగాని సంబంధించని వస్తువులు ఉ. గంధకము, ఓజోన్, అమ్మోనియా మొదలైనవి.

2. లోహజాతికి సంబంధించినవి. ఉ. ఐరన్, తామ్రము, వెండి, బిస్మత్, జింక్ మొదలైనవి.

3. జీవజాతి : ఇందులో వృక్షసంబంధము లనియు, జంతుసంబంధము లనియు రెండువిధములు. వృక్షసంబంధముల కుదాహరణములు:— అకొనైట్ (నాభి), హాయొసామస్, నల్లమందు మొదలైనవి. జంతుసంబంధముల కుదాహరణములు:— కెంతారిడీస్, కాడ్ లివరు ఆయిల్ మొదలైనవి.

4. రసాయనశాస్త్ర పరిశోధనాసిద్ధములుగ దయారుచేయబడునవి. ఉ. క్లోరోఫారం, ఈతర్, అమిల్ నైట్రైస్ మొదలైనవి.

## ఓషధీ జన్మస్థానము.

ఔషధమూలము నిచ్చునట్టి వృక్షజాతియొక్కయే గాని జంతుజాతియొక్కయే గాని స్వాభావిక జన్మస్థానమును గుర్తింపనగును. అనగా — కొన్ని ఔషధ మూలములు కొన్ని ప్రత్యేక దేశములయందుగాని ప్రత్యేక ప్రదేశములయందునుగాని స్వభావసిద్ధముగ దొరకును. ఉ. గంజాయి యిండియా దేశమునందును, ఆలోజ్ (కలబంద) సాకోట్రా, బార్బడాస్ ద్వీపములయందును, అకోనైట్ బ్రిటన్ దేశమునందును, క్వాసియా మెక్సికో దేశమునందును, ఇపికాక్ బ్రెజీల్ దేశమునందును, సహజముగ విరివిగ బెరుగుచుండును.

## ఔషధ స్వీకరణము.

ఔషధముయొక్క పనిచేయునట్టి చురుకుదనము ఆయౌషధముయొక్క జన్మస్థానము ననుసరించియు, మనము దానిని సేకరించు ఋతువు లేక కాలము ననుసరించియు, నుండును. రుబార్బు (రేవలచిన్ని) ఆరుసంవత్సరము లెదిగిననేగాని యుపయోగింపనేరదు. ఇండియా దేశమునందలి రుబార్బుకంటె చీనాతురుష్క దేశములయందలిది ఘాటైనది. సింకోనా చెట్లలో ముదురుచెట్లయొక్క బెరడులో నెక్కువ క్వినీన్ యుండును. మనుష్యులు పెంచెడి డిజిటాలిస్‌యందు కంటె సహజముగా దానియంతట నది విరవిగా బెరుగునట్టి డిజిటాలిస్ యెక్కువ చురుకుగా బనిచేయును.

## ఔషధ లక్షణములు.

వస్తుగుణదీపిక యందలి యీ భాగము మిక్కిలి యుపయోగమై యున్నది. గ్రంథమునందు జదివి ఔషధలక్షణముల నేర్చుకొనుటకంటె మూలికలను స్వయముగ బరీక్షించి వాటియొక్క గుర్తులను దెలిసికొనుట శ్రేష్ఠము. ఈ క్రింది పరీక్షా పద్ధతుల గమనింపనగును:—(1) పదార్థపరీక్ష (2) రసాయన పరీక్ష.

## పదార్థపరీక్ష.

1. చూచుట కెట్లుండును? ఘనపదార్థమా, ద్రవపదార్థమా—లేక — భస్మమా? ఘనపదార్థమైనయెడల, ఆకారము, పొడుగు, మందము, చిక్కదనము — యెట్లుండును? భస్మమైనయెడల మెరయుచుండునా—లేక —స్ఫటికాకారముగ నుండునా? స్ఫటికాకారమైనయెడల స్ఫటికములయొక్క స్వభావ మెట్లుండును?

2. వర్ణము. గంధకమువలె పసుపువర్ణముగ నుండునా? క్వినీన్‌వలె తెల్లగా నుండునా? మెర్క్యూరీ అయొడైడ్ వలె యెర్రగా నుండునా? బొగ్గువలె నల్లగా నుండునా? కాపర్ సల్ఫేట్ (మైలతుత్తము) వలె నీలవర్ణముగ నుండునా? యాలకు అరఖువలె ఆకుపచ్చవర్ణముగ నుండునా! ఈతర్ వలె నిర్వర్ణమైయుండునా? ఈవిధముగ వర్ణమును బరీక్షించి తెలిసికొనవలయును.

3. బరువు. లెడ్ ఆక్సైడ్‌వలె బరువుగా నుండునా — లేక — మెగ్నీసియా వలె తేలికగా నుండునా?

4. వాసన:—వాసనను వర్ణించుట మిగుల కష్టము. కాడ్ లివరు అయిల్ చేప వాసనగ నుండును; ఇంగువగాని యాలకగింజలుగాని ఘాటైనవాసనను గలిగియుండును. రోజ్ (గులాబి) సువాసనగ నుండును: అయొడోఫారం డోకును పుట్టించు వాసనను గలిగియుండును; ఓపియం (నల్లమందు)యొక్క వాసన వర్ణింపనక్కరలేకుండగనే దాని వాసనను దెలిసికొననగును. ఇదే విధముగ కొన్ని కొన్ని ఔషధములకు కొన్ని కొన్ని ప్రత్యేకమగు వాసన లుండును. వాటివాసనను బట్టియే వాటిని గుర్తింప వచ్చును. ఉ. అమ్మోనియా, ఈతర్, క్లోరోఫారం, ఆసిటిక్ ఆసిడ్, హైడ్రోసియానిక్ ఆసిడ్, కార్బాలిక్ ఆసిడ్, క్రియసోట్, ఇంగువ, అయొడోఫారం, ఆమిల్ నైట్రైట్, ఓపియం, వెలీరియన్, చాల ప్రధాన తైలములు మొదలైనవి.

5. రుచి:—రుచినిగూడ వర్ణించుట తేలికైనదికాదు. చక్కరవలె తియ్యగా నుండును; టార్టారిక్ ఆసిడ్‌వలెగాని వినిగర్‌వలెగాని పుల్లగానుండును; ఉప్పువలె ఉప్పగానుండును; నేలవేమువలెగాని క్వినీన్‌వలెగాని చేదుగా నుండును; అవపిండివలె గాని మిర్చివలెగాని కారముగా నుండును.

6. నీరు మొదలగు వాటిలో వేసిన కరగెడి గుణము (Solubility).

ఈ కరగెడి గుణమునుగూర్చి ప్రతి వైద్యుడును దెలిసికొని యుండవలయును. ఈ సంగతిని దెలియకుండ నౌషధయోగమును నిర్ణయింప నలవికాదు. ఒకయౌషధము చల్లని నీటిలో కరుగవచ్చును; ఇంకొక ఔషధము చల్లని నీటిలో కరుగక వేడినీటిలోగాని మసలెడి నీటిలోగాని కరుగవచ్చును; మరియొక ఔషధము నీటిలో నెంత మాత్రమును కరుగక అల్కహాల్‌లోగాని, క్లోరోఫారంలోగాని, ఈతర్‌లోగాని, ఆయిల్‌లోగాని, గ్లిసరీన్‌లోగాని కరుగవచ్చును. ఇందును గురించి ప్రత్యేక సూత్రమును ని యించుటకు వీలులేదు. క్షారపదార్థములయందు దాదాపుగా నన్నియు సామా

స్యముగ నీటిలో గరగును. వృక్ష సంబంధములగు క్షారములు చాలవరకు నీటిలో గరగవు.

కొన్ని ఔషధములను గాలి దగులునట్లు పెట్టినయెడల అవిరి నాకర్షించి ద్రవ పదార్థము లగును. ఉ. పొటాసియం అసిటేట్, కాల్సియం క్లోరైడ్. మరికొన్ని ఔషధముల నట్లు గాలి దగులునట్లు పెట్టిన యెడల నందలి జలభాగ మావిరిగా మారి వాటిపైన గుల్లరీతిని పొడి యేర్పడును. ఉ. అమ్మోనియా కార్బనస్, సోడియం కార్బనేట్.

## రసాయన సంబంధమగు పరీక్ష.

ఈ పరీక్షయు చాలవర కవసరమనియే చెప్పవచ్చునుగాని యీ గ్రంథమునం దాపరీక్షను దెలుప నవకాశము లేకున్నది. రసాయన శాస్త్రజ్ఞానము కొంతవర కవ సరమై యున్నది.

# ఔషధయోగ నిర్ణయ పద్ధతులు.



గ్రంథమునందు దాయా సందర్భములలో గొన్ని ఔషధయోగము లియ్యబడి యున్నవి. అయినను మఱికొన్నిటిని గ్రంథాంతమున జేర్చడమయినది. ఔషధయోగ మును వ్రాయుటయందు నేర్పరితన ముండవలయును. ఔషధయోగము సామాన్య ముగ 4 భాగములు గలదై యుండును; మొదటిది, ముఖ్యముగా నుపయోగింపదల చిన యౌషధము; రెండవది, మొదటి ఔషధముయొక్క కార్యక్రమమునకు సహా యము చేయునది, మూడవది, పై రెంటిలో దేనియందైనను నేదైన దుర్గుణ ముండిన యెడల నట్టి దుర్గుణము నణచివేయునది; నాల్గవది; ఔషధమును లోనికి బుచ్చుకొను టకు అనుకూలముగ నుండునట్లు చేయునది. ఈక్రింది ఔషధయోగము నంజువ్యా ధియందు నుపయోగింపబడు చున్నది.

| | | |
|---|---|---|
| పొటాష్ అసిటస్ (Potass Acetas) | ... | 5 డ్రా॥ |
| టింక్చర్ డిజిటాలిస్ (Tincture Digitalis) | | 1 డ్రా॥ |
| సిరప్ అరంటి (Syrup Aurantii) | | 1 ఔన్సు. |
| జలము (Water) | | 8 ఔన్సులు. |

4 గంటల కొకపర్యాయము 1 ఔన్సు చొ॥ పుచ్చుకొనవలయును.

పొటాష్ అసిటస్‌యందు మూత్రప్రకోపగుణమును, సాధువిరేచనగుణమును గలదు; టింక్చర్ డిజిటాలిస్‌గూడ మూత్రప్రకోపగుణమునకు సహాయము చేయును. పై రెంటివలన నేమైన జీర్ణక్రమగుణము నెడ గలిగెడి లోపమును సిరప్ అరంట సర్దుబాటు చేయును; వీటి నన్నిటిని లోనికి బుచ్చుకొనుటకు వీలుగ నుండునటుల జలమును గలుపవలెను. ఔషధయోగమునందు పై 4 భాగములను సూచించుటకు గాను ఔషధములయొక్క సంఖ్య అధికముగ నుండినను నుండవచ్చును.

ఔషధయోగము నందలి ఔషధములను నియమించుటయందు మూడువిధ ములైన అసందర్భస్థితులు (Incompatibilities) సంభవించు చున్నవి. (1) రస వాదశాస్త్రసంబంధ మగునవి. (2) ఔషధములయొక్క గుణఫలితములయందు వ్యతిరేక మగునవి. (3) కలిపినను గలియనట్టివి.

ఇందు మొదటివిధమైన దానియందు దుదాహరణముగ లోహము (Iron) ను ట్యానిక్ అసిడ్ ను కలిగియున్న వివిధపదార్థములను దీసికొనవచ్చును; ఈ రెండును

నొకదాని పదార్థగుణమును రెండవదాని పదార్థగుణము ప్రతిహతపఱచు చున్నది. కాబట్టి ఈరెంటిని గలిపి యుపయోగింపరాదు. రెండవతరగతిదాని కుదాహరణముగ స్ట్రిక్నిన్ను పొటాసియం బ్రొమైడ్ను దీసికొనవచ్చును,

మూడవతరగతిదాని కుదాహరణముగ, బిస్మత్ సబ్ నైట్రిన్ను నీటిని దీసికొనవచ్చును; ఈరెండును జిగురు (Gum) యొక్క సహాయము లేకుండ గలియనేరవు.

పైన జెప్పబడిన ఔషధయోగ సంబంధమగు వసందర్భస్థితులను గూర్చి ముఖ్యముగ జ్ఞాపియం చుంచుకొనవలసినది యేమనగ — ఏ ఔషధమునుగాని వానిని గుర్తించుట కుపయోగింపబడెడి యౌషధము (Test) తోగాని, విరుగుడుగ వర్తించెడి యౌషధముతోగాని, జేర్చి యియ్యగూడదు.

ఈ క్రింద జెప్పబడిన యౌషధములు మిగుల కొద్దివాటితో గలియును గనుక వాటిని విడిగా నీటితో గలిపి యిచ్చుటయే మంచిదైయున్నది:—

పొటాష్ పర్మాంగనేట్, ట్యానిక్ ఆసిడ్, గ్యాలిక్ ఆసిడ్, హైడ్రొజరీ క్లోరిడ్, పొటాసియం అయొడైడ్, లెడ్ (ప్లంబం) లవణములు, జింక్ లవణములు, అయొడిన్ యును దాని ద్రవసంబంధములును, అర్జంటి నైట్రిస్, ఫెర్రియి యెట్ క్వినిన్ సిట్రిస్.

---

# ఔషధములు — వాటితో జేర్చదగనివి.

# Incompatibilities.

ఈ క్రింది ఔషధములను వాటికి నెదురుగ జేర్కొనబడినవాటితో నియ్యగూడదు.

| | |
|---|---|
| ఆర్శినియస్ ఆసిడ్ | లైం వాటర్, ఐరన్ (లోహము) లవణములు, మెగ్నీసియం |
| ఆసిడ్స్ (సామాన్యముగ నన్నియు) | క్షారపదార్థములు, ఆసిటేట్స్, లోహసంబంధమగు ఆక్సైడ్స్ (Metallic Oxides) |
| ఆల్బుమిన్ | ఆసిడ్స్, స్పిరిట్, ట్యానిక్ ఆసిడ్, హైడ్రాజరీ సబ్ క్లోరీడ్ |
| క్షారలవణములు:- ఆకొనైట్స్, అట్రొపీన్, కఫీన్, కొకేన్, కొడీన్, స్ట్రిక్ నిన్ | ట్యానిన్, క్షారసంబంధమగు కార్బనేట్స్, అయొడిన్ యును అందు సంబంధమగు మిశ్రపదార్థములును, లైకరిస్ (అతి మధురము), బల మైన జిగురుపదార్థములు, క్షార సంబంధ మగునట్టియు అమ్మోనియా సంబంధ మగు నట్టియు టింక్చర్స్. |
| సోడా బైకార్బనేట్ | ఆసిడ్స్, ఆసిడ్ లవణములు, లోహసంబంధ మగు లవణములు, క్షారసంబంధ మగు లవణములు. |
| బిస్మత్ సబ్నైట్రిస్ | ట్యానిన్, సల్ఫర్ (గంధకము), సల్ఫైడ్ ఆఫ్ ఆంటిమొని, క్యాలొమెల్ (రస భస్మము). |
| క్లోరల్ హైడ్రస్ | క్షారపదారములు, అమ్మోనియం లవణములు, పొటాసియం అయొడైడ్, పొటాసియం పర్మాంగనేట్, ఆల్కహాల్ తో గూడిన బ్రొమైడ్స్. |
| పొటాస్ క్లోరస్ | లోహసంబంధ మగు ఆసిడ్స్, జంతుసంబంధ మగు పదార్థములు, సల్ఫర్, కార్బన్, రసభస్మము, ఫెర్రియి అయొడైడ్. |
| క్లోరీన్-క్లోరొఫారం వాటర్ | క్షారపధార్థములు, అమ్మోనియా లవణములు, వృక్షసంబంధ మగు లవణములు, సిల్వర్ నైట్రేట్, లెడ్ లవణములు, ట్యానిన్, వృక్షసంబంధమగు జిగురు పదార్థములు, కషాయములు, టింక్చర్లు, షరబతులు, పాలు. |

| | |
|---|---|
| హైడ్రార్జిరీ సబ్ క్లోరిడ్ | కార్బొనేట్లు, లైంవాటర్, పొటాసియం అయొడైడ్, ఓపియం, వృక్షసంబంధ మగు కషాయములు, ట్యానిన్. |
| డిజిటాలిన్ | ట్యానిన్, ప్లంబ్ ఆసిటస్, అయొడిన్, పొటాసియం అయొడైడ్, క్షారసంబంధమగు కార్బొనేట్లు. |
| అంటిమొని | సోడా బైకార్బొనస్; పొటాసియం, ఆసిడ్ టార్టరేట్. |
| గం (జిగురు) | ఫెర్రయి పెర్ క్లోర్, లెడ్ లవణములు, స్పిరిట్ ఈతర్ తో గూడిన టింక్చర్లు, బొరాక్సు (వెలిగారము) |
| అయొడిన్ | అమ్మోనియా, లోహసంబంధ మగు లవణములు, స్టార్చి (పిండి, గంజి మొదలగునవి), క్రొవ్వు సంబంధమగు చమురులు, క్లోరల్, గం (జిగురు), ట్రాగకంత్. |
| లోహసంబంధ మగు పొడి | ఆలోజ్ (మూసాంబరము), వృక్షసంబంధమగు కషాయములు; ట్యానిన్, లోహసంబంధ మగు నట్టియు క్షారసంబంధమగు నట్టియు లవణములు. |
| లైం వాటర్ | ఆసిడ్లు, కార్బొనేట్లు, అమ్మోనియా లవణములు, లోహసంబంధమగు లవణములు, టార్టరేట్లు, కషాయములు, టింక్చర్లు, ట్యానిన్. |
| మార్ఫియాయును అందు సంబంధమగు లవణములును. | ఫెర్రయి ఆక్సైడ్, లోహసంబంధమగు లవణములు, మేంగనీజ్, సిల్వర్. |
| మస్క్ (కస్తూరి) | ఆసిడ్లు, ఆసిటేట్లు, ట్యానిన్, లోహ లవణములు. |
| సిల్వర్ నైట్రేట్ | హైడ్రోక్లోరిక్, సల్ఫ్యూరిక్, ఆసిటిక్, టార్టారిక్, ఆసిడ్లును అందు సంబంధమగు లవణములును, హైడ్రోసియానిక్ ఆసిడ్ యును అందు సంబంధమగు మిశ్రపదార్థములును, అయొడిన్, పొటాసియం అయొడైడ్, పొటాసియం బ్రోమైడ్, సల్ఫర్, అంటిమొనీ సల్ఫైడ్. |
| అమిల్ నైట్రైస్ | టింక్చర్లు, క్షారసంబంధమగు కార్బొనేట్లు, రసభస్మము, లెడ్ లవణములు. లోహసంబంధమగు లవణములు, పొటాసియం అయొడైడ్. |

| | |
|---|---|
| ఓపియం (నల్లమందు) | క్షారసంబంధమగు కార్బనేట్లు, లోహసంబంధమగు లవణములు, ట్యానిన్, అయోడిన్, క్లోరోఫారం వాటర్, నక్సువామికా. |

ఓపియంయును బెలడోనాయును శరీరమునందు గలుగజేసెడి ఫలితములయందు వ్యతిరేకమును వహించియున్నను, యీ రెంటిని గలిపి యిచ్చుటవలన, మంచి గుణము నిచ్చినటుల తెలియుచున్నది.

| | |
|---|---|
| పెప్సిన్ | ఆల్కహాల్, టింక్చర్లు. |
| పొటాస్ పర్మాంగనేట్ - జంతుసంబంధ మగు పదార్థములు. | |
| సాలిసైలిక్ ఆసిడ్ | లోహబంధ మగు లవణములు, పొటాసియం అయొడైడ్. |
| సోడా సాలిసైలస్ | లైంవాటర్. |
| స్ట్రొఫాంతస్ | ట్యానిన్, గ్యాలిక్ ఆసిడ్. |
| ట్యానిక్ | గం (జిగురు), లోహసంబంధమగు లవణములు, లైంవాటర్, క్షారసంబంధమగు కార్బనేట్లు, కోడిగుడ్డులోని ధాతు పదార్థము. |
| టార్టార్ ఎమెటిక్ | ఆసిడ్లు, క్షారపదార్థములు, రసఫిస్మము, ట్యానిన్, రుబార్బ్, సింకోనా, గం (జిగురు), ఓపియం. |

## పౌడర్లు — Powders.

కొన్ని మందులను పౌడర్లరూపమున లోని కియ్యవలసియుండును. ఈపౌడర్లయం దుపయోగింపబడు పదార్థములు గడ్డలుగాని పలుకులుగాని యుండవచ్చును. అట్టి వాటిని మెత్తనిపొడిగ జేయుటకుగాను, ప్రత్యేకముగ రాలతో జేయబడిన చిన్న రోలును, అడుగుభాగమున రాయియును పైభాగమున కొయ్యయును గలిగియుండి చేతితో పట్టుకొనుటకు వీలుగా నుండిన చిన్నరోకలియును, అవసరమై యున్నవి. ఈ రోలునకు మార్టర్ (Mortar) అనియు రోకలికి పెజిల్ (Pestle) అనియు ప్రత్యేకనామములు గలవు. వైద్యుడు వీటిని సంపాదించవలసి యుండును.

నియోగింపబడిన ఔషధపదార్థములలో మెత్తని పొడిగ గొట్టవలసియున్న యెడల నట్టివాని మెత్తని పొడిగ జేసిన పిమ్మట, పొట్లములుగ గట్టవలసియుండును.

పొట్లములు కట్టుటకు వేరువేరు పద్ధతులుగలవు. డోవర్సు పౌడరు 5 గ్రేయిను చొప్పున 12 పొట్లములను గట్టవలయునని యెంచెదము. ఇయులకు అయిదేసి గ్రేయి

నుల నొక్కొక్కసారి తూచుకొనుచు 12 పొట్లములను గట్టుకొనుట కొంచె మాలస్య మగు పనియైయున్నది; 60 గ్రె॥ను అనగా 1 డ్రాముకు నొక్కసారిగనే దూచి, 6, 12, 18, 24 మొదలగు అంకెలతో గురుపెట్టబడిన రాతిపలకపైన యీపొడిని యెన్ని భాగములను జేయవలయునో ఆఅంకెవఱకును పొడుగు వెడల్పులయందును యెత్తు యందును యీపొడిని సమానపఱచి, అగురింపబడిన భాగముల ప్రకారము పొడిని కత్తితో దీసికొని అదివరకే సిద్ధముగ నుంచబడిన కాగితపు ముక్కలలో పొట్లము లను గట్టవలయును. ఇందులకై ప్రత్యేకముగ దయారు జేయబడియుండు రాతి పలకకు స్లాబ్ (Slab) అందురు, ఈకత్తికూడ వంగుదలకు లొంగునట్టి స్వభావము గలిగి ప్రత్యేకముగ నీ మందుఉపయోగములకై చేయబడియుండును, దీనికి స్పాట్యులా (Spatula) అందురు ఎక్కువ అనుభవమును గలిగినవారు తమఅలవాటును బట్టి యిట్టికొలలు అవసరము లేకుండగనే 1 డ్రాము ను ఒక్కసారిగనే తూచి కంటి యొక్క సహాయముననే ఉజ్జాయింపుగ విభజించుచు 12 పొట్లములను గట్టుదురు.

నియోగింపబడిన వివిధములగు లవణములను సాధ్యమైనచో రాతిపలకపైన కత్తితో గలిపినను గలుపవచ్చును.

---

## మాత్రలు – Pills.

మాత్రలను జేయుటయందు మింగుటకు వీలగు పరిమాణమును వహించియుం డునటుల జేయవలయును, సామాన్యముగ 4 లేక 5 గ్రెయినులకు మించియుండ రాదు. మాత్రలను జేయుటయందు ఔషధ పదార్థములను గలియునటుల జేయుటకు గాను, యీ క్రిందివాటిలో దేనినైన నుపయోగింపవచ్చును:—జిగురు. సామాన్య మగు సోప్, సిరప్, స్పిరిట్, గ్లిసరీన్, మ్యూసిలేజ్ ఆఫ్ ట్రాగకంతా, యక్ట్రాక్టు ఆఫ్ జన్షన్ (Extract of Gentian).

యక్ట్రాక్టు ఆఫ్ జన్షన్ అనునది బూడిద నలుపువర్ణములు గలిగిన ముద్దగా నుండును; దీనియొక్క మోతాదు — 2 గ్రె॥ మొ॥ 8 గ్రె, మాత్రలను జేయుట కుపయోగించు నిరపాయకర మైనట్టిది.

మాత్రలను జేయుటకు యీక్రిందివిధముగ జేయబడు ప్రాక్టార్స్ పేస్టు (Proctor's Paste) అనబడు నట్టిది గూడ నుపయోగింతురు:—1 డ్రాము ట్రాగకంతా పొడి, 3½ డ్రాముల గ్లిసరీన్, 1 డ్రాము జలము — వీటి నన్నిటిని గలుపగా తయారయిన పేస్టు.

మాత్రలుగా జేయవలసిన పదార్థములను అవసరమైనచో మాత్రరసనందు బాగుగా గలియునట్లు నూరి, స్లాబ్ పైన పౌడర్లను జేయుటకు జెప్పబడిన విధముననే చమును పఱచి, యెన్నిమాత్రలుగ జేయవలసి యుండునో అన్నిటిగ భాగించి, కుడిచేతి మొదటి రెండు లేక మూడు వేళ్లయొక్క సందున మాత్రరూపము సేర్పఱచి, మాత్రలు యొకదాని కొకటి యంటుకొనకుండునట్లు సీమసున్నపు పౌడిలో పొర్లించి వదులైన పొట్లముగ గట్టి యియ్యనగును.

మాత్రలను జేయుటయందు యీ క్రింది అంశములను గమనింపవచ్చును.

కార్బాలిక్ ఆసిడ్ (స్ఫటిక రూపముననున్న దానిని) 2 గ్రెయినులను 1½ గ్రా॥ గోదుమ పిండితో గలిపిగాని, రొట్టె లోపలి మెత్తని భాగముతో గలిపిగాని, మాత్రగా జేయనగును.

క్రోటన్ ఆయిల్ను అతిమధురముయొక్క పౌడితో గలిపి మాత్రగా జేయవచ్చును.

కోపేబాను మాత్రగా జేయవలెనన్న మెగ్నీసియం కార్బనేట్తో గలుపనగును.

ఫెర్రయి యెట్ క్వినైన్ సిట్రస్ (Ferri et Quinine Citras) ను మిక్కిలి సూక్ష్మ పరిమాణములగు సమానమైన స్పిరిట్ తోడను నీటితోడను గలిపి మాత్రగా జేయనగును.

క్యాంఫర్ను అతిమధురముయొక్క పౌడితో గలిపి కొంచెము జిగురును గూడ గలిపి మాత్రగా జేయవచ్చును.

మూసాంబరము (Aloes) ను స్పిరిట్తో గలిపి మాత్రగ జేయవచ్చును.

కాల్సియం సల్ఫైడ్ను లైకరిస్ (అతిమధురము) పౌడితోడను ట్రాగకంతా పేస్టుతోడను గలిపి మాత్రగా జేయవచ్చును.

యక్స్ట్రాక్టులను వేటినైనను మాత్రలుగా జేయవలసి వచ్చినపుడు యక్స్ట్రాక్టు జన్షన్ను జేర్చి మాత్రగా జేయవచ్చును.

పొటాసియం అయొడైడ్ను కొద్దిచుక్కల నీటితో మెత్తని పేస్టుగా జేసి, లైకరిస్ పౌడిని మాత్రయగుట కవసరమైన దానిని గలిపి మాత్రలుగా జేయనగును.

రుబార్బ్ పౌడర్ (Rhubarb Powder) ను దానిలో 5 వ వంతు యెత్తుగల గ్లిసరీన్‌తో గలిపి మాత్రగా జేయనగును.

ట్యానిక్ ఆసిడ్ (Tannic Acid) ను, దానిలో 5 వ వంతు యెత్తుగల గ్లిస రీన్‌ను, 10 వ వంతు యెత్తుగల జిగురును, గలిపి మాత్రగా జేయనగును.

పొటాసియం పర్మాంగనేట్ (Potassium Permanganate) ను మాత్రలుగా జేయవలసి వచ్చినపుడు, జంతు సంబంధమగు పదార్థమునకు దగిలినయెడల ప్రాణవాయువును తెలువఱచును గావున. ఈ మాత్రలను బహు జాగ్రతతో జేయవలయును. దీనిని మెత్తని పొడిగ జేసి సాఫ్టు పేరఫిన్ తోడను హార్డు పేరఫిన్ తోడను గలిపి మాత్రలుగ జేయ నగును.

గ్యాలిక్ ఆసిడ్ (Gallic Acid) 5 గ్రయినులను మెత్తని పొడిగా జేసి అం దొకచుక్క గ్లిసరీన్‌తో గలిపినయెడల మాత్ర చేయుటకు వీలుగ నుండును.

---

# మిశ్రౌషధములు - Mixtures.

మిశ్ర ఔషధములను గూర్చిన కొన్ని వివరములు గ్రంథసమందు వ్రాయబడి యున్నవి గాని మఱికొన్ని ముఖ్యాంశముల నిచట వ్రాయడ మయినది.

క్వినీన్ సల్ఫేట్ మిశ్ర ఔషధములయందు దఱచుగ నుపయోగించబడుచున్నది. ఒకప్పుడు కొంచెము షరబతుతోడను జలముతోడను మాత్రమే నియోగింపబడు చున్నద. ఇట్టి సందర్భమున నౌషధమును గలిపి మఱియు బుచ్చుకొను నటుల నియోగింపవలయును; లేనితో క్వినీన్ పొడి అడుగున జేరి చివరి మోతాదునందు మాత్రమే యీవలను రా నగును.

క్వినీన్, మిశ్రౌషధమునందు గలియవలయు నన్న, అదివరకే ఆసిడ్ (సల్ఫూరిక్ ఆసిడ్) తో గలుపబడి యున్న జలమునందు దీనిని గలుపవలయును; అంతియే గాని బలమైన ఆసిడ్‌లో దీనిని గలుపగూడదు; దీనిని గలుపుటకు ముందుగనే ఆసిడ్‌ను విరివైన నీటిలో గలిపి యుండవలయును.

క్వినీన్‌ను, టింక్చర్లతోడనుగాని, స్పిరిట్ ఈథర్ నైట్రిస్‌తోడనుగాని, యితర సంబంధములతోడను గాని యిచ్చునపుడు, గ్లిసరీన్ సిరప్ జలములను గూడ చేర్చవచ్చును. ఇట్టి సందర్భమునందు నియోగింపబడిన టింక్చర్ మొదలగు

స్పిరిట్ సంబంధములందు క్వినీన్‌ను గలిపి, మిళిత మైన పిమ్మట గ్లిసరీన్‌ను సిరప్‌ను గలిపి, అటుతరువాత జలమును గ్రమక్రమముగ గలుపవలయును; ఇట్లు చేయుట వలన మిశ్రితౌషధము మడ్డిగ నుండక పరిశుభ్రతను వహించి రోగికి హితవుగ గన బడును.

క్షారపదార్థములు, స్పిరిట్స్ అమ్మోనియా అరోమేటిక్ మొదలగువాటితో క్వినీన్ కలియదు; ఇట్టి విషయములలో కొంచెము జిగురును గూడా కలుపుట మంచిది.

ఘనపదార్థములు మిశ్రితౌషధము నందు నియోగింప బడినయెడల వీటిని విడిగా మార్టరు నందు నీటితో గలిపి, పిమ్మట మందులో గలుపుట మంచిదై యున్నది.

టర్పన్‌టీన్‌ను గలుపవలసి వచ్చినపుడు, ఒక్కొక ఔన్సు టర్పన్‌టీన్‌కు ఒక్కొక గ్రుడ్డులోని పసుపు భాగమును గలిపి మార్టరునందు నూరిన యెడల గలిసి పోవును.

ఆల్మండ్ ఆయిల్ (బాదం నూనె) ను కొంచెము లైకర్ పొటాస్‌తో గలి పిన యెడల, లోనికి బుచ్చుకొనుటకు వీలుగ నుండునటుల జేయవచ్చును.

ఏదైన చమురులను లోనికి బుచ్చుకొనుటకు వీలుగ నుండునటుల జేసికొనుటకు ప్రతి ½ ఔన్సు చమురునకును 5 మినిముల టింక్చర్ సెనిగా (Tincture Senega) గలుపనగును.

---

## లినిమెంట్స (తైలములు) - Liniments.

శరీరముపై రుద్దుటకు నియోగింపబడిన తైలము లినిమెంట్ అనబడును. దీనిని పైన రాయుటకు మాత్రమే ఉపయోగింతురు. దీనిని అరచేతులో కొంచెముగ వేసికొని అస్వస్థతా భాగమున నింకిపోవునటుల రుద్దవలయును; మరికొంచెముగ వేసికొని మరల రుద్దవచ్చును. ఈ లినిమెంట్లలో ననేకములు మెత్తని సలములయందు దాకినయెడల రేగుదలను మంటను గలుగజేయును గనుక దీని నుపయోగించిన వెనుక చేతులను శుభ్రముగ గడుగుకొనవలయును. లినిమెంట్లలో గొన్నిటిని — అనగా అయొడిన్ లినిమెంట్ మాదిరివి — కుంచె (Brush) తో నైన రాయవలయునే గాని రుద్దగూడదు. లినిమెంట్లను యెన్నడును లోనికి బుచ్చుకొనరాదు. ఇందులకై తగుజాగ్రతను బుచ్చుకొనుటకుగాను, యీ మందుబుడ్డి పైని "పైన రాయుటకు మాత్రమే" అని చీటిని అంటించి యుండుట మంచిదై యున్నది.

---

# ఆయింటుమెంట్సు—Ointments.

గ్రంథమునందు "అంగ్యుయెంటం" అని చెప్పబడిన వన్నియు ఆయింట్‌మెంట్లు అని తలచవలయును. ఆయింట్‌మెంట్ల యందలి పదార్థములను శరీరమునందు యింకునట్లు చేయుటకుగాను బాగుగా రుద్దవలయును; కొలుకు వ్యాధియందు రసమును శరీరములో జేర్చుటకుగాను రససంబంధమగు ఆయింట్‌మెంటును రుద్దుట యొకపద్ధతియై యున్నది. ఇట్లు రుద్దుటకు గజ్జలోను చంకలోను మంచిస్థలమై యున్నది. ఆయింట్‌మెంటును గొంచెముగ దీసికొని దినమున కొకసారిగాని రెండుసారులుగాని నెమ్మదిగను నిలుకడతోగూడిన యొత్తిడితోడను రుద్దవలయును. రుద్దుట అయిన పిమ్మట, గుడ్డలకు దాకకుండునటులను శరీరమునం దింకుట కనుకూలముగ నుండునటులను ఫ్లానల్ గుడ్డను పైన జుట్టవలయును. రససంబంధమగు దుర్గుణములు యేమయిన గనబడిన వెంటనే యిట్లు రుద్దుటను నిలిపివేయ వలయును.

రెండు ఆయింట్‌మెంట్లనుగాని, ఒక ఆయింట్‌మెంటును ఒకద్రవపదార్థమును గాని, కలుపవలసి వచ్చినపుడు — తూనికల ప్రకారము దీసికొని స్పాట్యులాతో స్లాబ్‌పైన గలుపనగును; కొన్నివిషయములలో యక్స్ట్రాక్టులను, పౌడర్లను మొరుముగ నుండెడి పదార్థములను, నూరి ఆయింట్‌మెంట్లుగా జేయవలసి వచ్చినపుడు, మార్టర్‌లో వేసి నూరుట మిక్కిలి అవసరమైయున్నది; లేనిచో ఆయింట్‌మెంటుకు వలసిన మెత్తదనము రానేరదు.

---

# ఆంగ్లేయపదముల నిరూపణములు.

## డికాక్షన్ (కషాయము) — Decoction.

కషాయముగ గాచవలసియున్న పదార్థములను తూనిక ప్రకారము నీటిలో వేసి, మూతపెట్టి, కాచి, పిమ్మట వడపోయవలయును.

## ఇన్‌ఫ్యూజన్ — Infusion.

ఇన్‌ఫ్యూజన్‌ను జేయదలచిన పదార్థమును మొరుమైన పొడిగ గొట్టి, ఉడుకు నీళ్లను యిందుపైన బోసి కొంచెముసేపు ఉంచి వడపోయవలెను; సామాన్యముగ నిట్లు చేయుబడున వన్నియు వృత్తసంబంధమైనవై యుండును; కలంబానుండి ఇన్‌ఫ్యూజన్‌ను దయారుచేయుటకు మాత్రము చల్లని నీళ్లను బోయవలసి యుండును; ఇందువలన నందలి పిండిపదార్థము గలియనియ్య బడదు.

## సొల్యూషన్ — Solution.

ఏదైన నొక ఘనపదార్థ మొక ద్రవపదార్థము నందు గలియునట్లు చేయబడెడి దానికి సొల్యూషన్ అందురు. ఇట్టి స్థితియందు కొన్ని విషయములలో వేడిమియు కొన్ని విషయములలో జల్లదనమును, గలుగును. కొన్ని సందర్భములలో రసవాద సంబంధమగు మార్పులుగూడ గలుగుచుండును. సిరప్ (షరబతు) లో చక్కెర మిళితమైయుండి, మరల నీ సొల్యూషనును మరగగాచిన యెడల చక్కెరను విడదీయ నగును. దీనిని "సింపిల్ సొల్యూషన్" (Simple Solution) అందురు; రసవాద సంబంధమగు మార్పులు కలిగి మఱల నిట్లు విడదీయుటకు వీలులేనట్టి దానికి "కెమికల్ సొల్యూషన్" (Chemical Solution) అందురు. వేడిచేయుటవలన ఘన పదార్థము త్వరితముగ కలిసిపోవును.

## ఆల్టరేటివులు — Alteratives.

కొన్ని ఔషధములను లోని కిచ్చుటవలన నే అవయవములపైన నెట్టిపని చేయునదియు వివరములను గనుగొన వీలులేకుండ నుండి మంచిఫలితమును మాత్రమే గనబరచును. ఇట్టి ఔషధములకు ఆల్టరేటివులు అందురు. ఉ॥ అంటిమొని, మెర్క్యురీ, ఆర్సెనిక్ (పాషాణము), అయొడిన్, కొల్చికం — యును, వీటితో జేయబడిన ఔషధములును.

## అనాఫ్రొడిజియాక్స్ — Anaphrodisiacs.

సంభోగావయవములను బలహీన పఱచునట్టివాటికి యీ పేరుగలదు. ఉ॥ క్యాంఫర్ (హారతికర్పూరము), పొటాసియం బ్రొమైడ్, టొబ్యాకో (పొగాకు), కోనియం, సోడియం అయొడైడ్, పొటాసియం అయొడైడ్.

## అఫ్రొడిజియాక్స్ — Aphrodisiacs.

సంభోగశక్తి బలపఱచి, సంభోగావయవములకు ఉద్రేకతను గలుగజేయు నట్టివాటికి యీ పేరు కలదు. ఉ॥ ఫాస్ఫరస్, కెంతారిడిస్, స్ట్రిక్నిన్, డామియానా, కెనెబిస్ ఇండికా, యోహింబీన్ మొదలైనవి.

## ఆస్ట్రింజెంట్స్ — Astringents.

గిలటీన్ (జాంతవము)ను అల్బుమిన్ (ధాతుపదార్థము)ను పేరుకొనునట్లు చేయుటవలన, స్నాయువులను ముడుచుకొనునట్లు చేసి, అల్లికలను, ఘనీభవింప జేయునట్టి యౌషధములకు ఆస్ట్రింజెట్లు అనిపేరు. ఉ॥ ట్యానిక్ ఆసిడ్, గ్యాలిక్

ఆసిడ్, ఆలం, క్రియసోట్, లోహసంబంధ మగు ఆసిడ్లు, విశేష మగు లోహసం బంధమగు లవణములు.

### టానిక్స్ (బలవర్ధకౌషధములు) — Tonics.

ఏ అవయవము పైన బనిచేసి ఆ యవయవమునకు బలమును గలుగజేయుట కుప యోగింపబడునో ఆ యవయవముతో సంబంధించినంతవఱకు నొక యౌషధము బల వర్ధకౌషధము (టానిక్) అని పిలువబడుచున్నది. వృక్షసంబంధమగు చేదు పదా ర్థము లన్నియును జీర్ణకారులును జీర్ణాశయసంబంధమున బలవర్ధకౌషధము లనబడు చున్నవి. సుషుమ్న (Spinal Cord) పైన బనిచేయు స్ట్రిక్నిన్ యును, గుండెపైన బనిచేయు డిజిటాలిన్ యును, నరములపైన బనిచేయు క్వినిన్ యును వెలీరియన్ సం బంధములును, స్నాయువులపైన బనిచేయు ట్యానిక్ ఆసిడ్ యును, రక్తముపైన బని చేయు లోహము మొదలైనవియును,—ఆయా సంబంధములగు బలవర్ధకౌషధము లన బడుచున్నవి.

---

# రోగిని బరీక్షించుట.



రోగిని రెండు విధముల బరీక్షించవచ్చును. మొదటి పద్ధతి యేమన — రోగిని స్వయముగా బ్రశ్నించి తన వ్యాధి యెట్టిదో, తన ఆరోగ్యమునం దెన్నిదినముల నుండి యేమార్పులు కలిగినవో, యేయే అవయవములయం దేయే బాధ కలిగియున్నదో — యీ మొదలగు సంగతుల దెలిసికొనవలయును. ఈ విషయముల నన్నిటిని దెలిసికొనిన పిమ్మట శరీరమును బరీక్షించి అస్వస్థత కగు మరికొన్ని గుర్తులను దెలిసికొనవచ్చును. సంపూర్ణ వ్యాధినిదానము నందు రోగి యొక్క స్వచరిత్రనేగాక కుటుంబచరిత్రను గూడ — అనగా కుటుంబమునందలి పూర్వీకులలో నే ప్రత్యేక వ్యాధికైనను నుద్యుక్తత యుండియున్న సంగతిని గూడ — విచారింపవలయును. ఈ రెండువిధములగు బరీక్షలను సలిపిన పిమ్మట వ్యాధినిగూర్చి కొంతవరకు వివరముల దెలిసికొనవచ్చును.

## శరీరముయొక్క దృష్టిపరీక్ష.

శరీరమేగాని, యే ప్రత్యేకావయవముగాని స్వాభావికముగ నుండు రీతిని మారియున్నదా? శరీరాకారము, వర్ణము, పరిమాణము మొదలైనవానిలో అస్వాభావికముగ నేదైన గనబడుచున్నవా?

## శరీరపు బరువు.

చాల వ్యాధులలో శరీరపు బరువు మారుచుండును. అప్పుడప్పుడు గొను తూనికలలో బరువు హెచ్చుచున్నదా? తగ్గుచున్నదా? బరువు హెచ్చుచుండిన యెడల సామాన్యగతులలో నారోగ్యమునే సూచించును; తగ్గుచుండిన యెడల వ్యాధి హితమని గ్రహింప వలయును. ఈ క్రింది పట్టికనుబట్టి మనిషియొక్క యెంత యెత్తున కెంత బరు వుండవలసినదియు సిద్ధాంతీకరింపబడినది.

| అ. అం. | | అ. అం. | | | | |
|---|---|---|---|---|---|---|
| 4 – 6 | నుండి | 5 – 0 | యెత్తువరకు | బరువు సుమారు | 92 | పౌనులు. |
| 5 – 0 | ,, | 5 – 1 | ,, | ,, | 115 | ,, |
| 5 – 2 | ,, | 5 – 3 | ,, | ,, | 127 | ,, |
| 5 – 4 | ,, | 5 – 5 | ,, | ,, | 139 | ,, |
| 5 – 6 | ,, | 5 – 7 | ,, | ,, | 144 | ,, |
| 5 – 8 | ,, | 5 – 9 | ,, | ,, | 157 | ,, |

| అ. అం. | | అ. అం. | | | | |
|---|---|---|---|---|---|---|
| 5 –10 | నుండి | 5 –11 | యెత్తువరకు బరువు-షుమారు | 170 | పౌనులు. |
| 5 –11 | ,, | 6 – 0 | ,, | ,, | 177 | ,, |
| 6 – 0 | ,, | పై యెత్తుకు | | ,, | 218 | ,, |

ఈ తూకములయందు దుస్తులయొక్క బరువు కలిసి యుండదు. 45 సం॥ల వయసువరకు తూకము కొంచెము హెచ్చుచుండ వలయును.

## అవయవ సౌష్ఠవము.

కొందరు మనుష్యులు యెముకల పోగువలె నుందురు. కొందరు స్నాయు పటుత్వమును గలిగి దార్ఢ్యముగ గనబడుచుందురు. కొందరు వదులైన స్నాయువులను గలిగి తాకుటకు మెత్తగనుండి స్నాయుపటుత్వము తక్కువగనుండి బలిసినట్లు కన బడు చుందురు. ఇందు మొదటితెరగలవారు సామాన్యముగ వ్యాధిదూరులుగ నుం దురు. రెండవ తెరగలవారు తరచు వ్యాధుల కుద్యుక్తులుగ నుందురు.

## వర్ణము.

శరీరవర్ణము పాలిపోయి యుండినయెడల రక్తపరిమాణమునందు లోపమును గాని రక్తశ్రేష్ఠతయందు లోపమునుగాని సూచించును. ఈ సందర్భమున అజీర్ణవ్యాధి గాని, మూత్రాశయసంబంధమగు వ్యాధిగాని రక్తసంబంధమగు నితరమగు వ్యాధి యెద్ది యైనగాని యుండినట్లు సూచించును. పసుపువర్ణము పచ్చకామాలవ్యాధిని సూచిం చును; యీ పసుపువర్ణము కండ్లలో నెక్కువగ గనిపించును. నీలవర్ణము శ్వాస కోశాస్వస్థతను సూచింపవచ్చును.

## నంజు వాపులు.

ఈ వాపులు తరచుగా పాదములపైనను చీలమండలయొద్దను గనబడు చుండును. ఆయాభాగములలో వ్రేలితో గొంచె మొత్తి వ్రేలును దీసినయెడల గుంట పడియుండి క్రమముగా మరల నాగుంట పూడిపోవును. కంటి కడుగురెప్ప క్రింద నట్టివాపు గనబడినయెడల నిట్టిస్థితి మూత్రాశయవ్యాధిఫలితమై యుండును. ఉదరము విజృంభించి యున్నయెడల నంజువ్యాధిని సూచించును.

## ముఖవైఖరి.

ముఖవైఖరినిబట్టి వ్యాధియొక్కస్థితిని జాలవరకు గ్రహింపవచ్చును. శరీర వర్ణమునుగూర్చి పైన చెప్పబడియే యున్నది. కొద్ది కొద్దిగా వచ్చుచుండెడి జ్వరము

అలో ముఖమునం దెట్టి చురుకుదనమును లేక, నిర్వికారసముగ నుండవచ్చును. ముఖము యొక్క యొకవైపున నెట్టి ముడతలు లేక రెండవవైపున ముడత లుండవచ్చును. ఈలక్షణము పక్షవాతమును సూచించును. ఓరగా జూచునెడల మెదడు వ్యాధిని సూచించును. మిడిగుడ్లు గండమాలా (Goitre) వ్యాధిని సూచించును.

## తీరు.

నిల్చుండు, కూర్చుండు, చేతులు కాళ్లు ముడుచుకొనియుండు—స్థితులనుబట్టి కొన్నివ్యాధిగతులను దెలిసికొనవచ్చును. ఉదరభాగము వాచియున్నయెడల నిట్లు ముడుచుకొనుట తటస్థించును. మరియు బిడ్డలయందు వెన్నుపాముతో సంబంధించిన వ్యాధి యున్నయెడల తలను, మెడను, భుజములను గదపకుండ నుందురు.

## శరీర వేడిమి.

శరీరవేడిమి యొకేసారిగ 103, 104 డిగ్రీలకు హెచ్చి ప్రారంభజ్వరము వచ్చినపుడు సామాన్యముగ నిది చలిజ్వరమో, లేక న్యుమోనియా జ్వరమో అయి యుండును. శ్వాసకోశాస్వస్థత గనబడినచో న్యుమోనియా జ్వరముగ నెంచవచ్చును. ఇంతియేగాకుండ న్యుమోనియాజ్వరమునందు యీ తీవ్రజ్వరము యొకేపట్టుగ నుం డును. చలిజ్వరమునందు జ్వరము పూర్తిగా విడిచి మరల వచ్చుచుండును. ఈ రెంటికిని భేద మిదియే. ఆరోగ్యస్థితియందు శరీర వేడిమి 98.4 డిగ్రీలు అయియున్నది. 105 డిగ్రీలు గాని అంతకుమించిగాని శరీరవేడిమి యుండియున్నపుడు అత్యుగ్రత జ్వర మనబడును, 104 డిగ్రీలు ఉగ్రతజ్వరము; 102.6 డిగ్రీలు జ్వర మనబడును; 100.4 కొద్ది జ్వరము; 98.4 ఆరోగ్యమందలి వేడిమి; 97.8 ప్రమాణము కంటె తక్కువ; 96.8 కి తక్కువ క్షీణస్థితిని సూచించును; ఈ పైకొలతలు తెర్మామెట రును చంకలోబెట్టి చూచుటవలన గననగును. శరీర వేడిమిని కచ్చితముగ కనుగొనవలె నన్న తెర్మామెటరును ఆసనమునందు బెట్టి పరీక్షించవలెను. శరీరవేడిమి 105 డిగ్రీ లకు మించియున్నపుడు ప్రాణాపాయమని గుర్తెరుగ వలయును. 101 గాని దాని సమీపవేడిమిగాని పట్టుగా నొకేరీతిగా నున్నపుడు శ్వాసకోశాస్వస్థత యుండియున్న దేమో యని అనుమానించవలసి వచ్చును. శరీరవేడిమిని ఉదయమునను సాయంకాల మునను ప్రతిదినమునను ఒకేగంటకు దీసికొనుచు వ్యాధియొక్క నడకను గుర్తెరుగ వలయును.

## నాడి.

నాడియొక్క ప్రాముఖ్యత శరీరవేడిమికి పిమ్మట నేర్పడుచున్నది. నాడిని మణికట్టు యొద్ద బరీక్షింప నగును.

నాడియొక్క పరీక్షయందు నాలుగంశములను గమనింపవలయును. (1) నాడియొక్క కొట్టుకొనుట యందలి తఱచుదనము (తఱచుగా గొట్టుకొనుట) (2) నాడియొక్క పరిమాణము (3) నాడియొక్క ఒత్తిడి కణగు గుణము (4) నాడియొక్క క్రమత.

(1) నాడియొక్క తఱచుదనము (Frequency).

ఒక్క కాలపరిమాణములో లెక్కింపనగు దెబ్బలయొక్క సంఖ్యనుబట్టి నాడియొక్క తఱచుదనము గుర్తింపబడుచున్నది.

1. శరీరవేడిమి అధికమైనకొలదియు నాడియొక్క చురుకుదన మతిశయమై యుండును; శరీరము నీరసస్థితియందున్నపుడును నాడియొక్క తఱచుదన మధికముగ నుండును. శరీరవేడిమి నిలుకడగ నుండి యున్నప్పుడుగాని, శరీరవేడిమి తగ్గుదల నందుచున్నపుడుగాని, నాడియొక్క కొట్టుకొనుట దినదిన మధికమగుచుండిన యెడల గుండెయొక్క కార్యక్రమత చెడిపోవుచున్నదని గ్రహింపవలయును.

2. పిత్తము రక్తమునందు గలిసి ప్రచారము నందుచున్నపుడుగాని, మఱియే దైన విషము రక్తప్రచారమునందు గలిసినపుడుగాని, నాడి మందమైయుండును. నీరసస్థితియందున్న వృద్ధవయస్కులలో నాడి యీస్థితి నందియుండును.

3. ఒకప్పుడు నాడి యెడతెగకుండ గొట్టుకొనుచు పరిమాణము నందు హీనమై లెక్కపెట్టుటకు వీలులేకుండ నుండును. ఒక దెబ్బకును మరియొక దెబ్బకును నుండెడి మధ్యకాలము గుర్తించుటకు వీలులేక దెబ్బలను లెక్కపెట్టుటకు వీలులేకుండ నుండును. రక్తనాళమునం దొకవిధమగు వణకుదనమును మాత్రమే గమనించుటకు వీలుగనుండును. మరణావస్థయందున్నవారలయందీ విధమగు నాడిని గనిపెట్టవచ్చును.

(2) నాడియొక్క పరిమాణము (Size)

ఈ విషయమున నాడిసంబంధమగు రక్తనాళము యొక్క పరిమాణమును, దెబ్బయొక్క పరిమాణమును, గుర్తింపవలయును.

నాడి, వ్రేలికి ప్రమాణస్థితికంటె నెక్కువ విస్తరింపు నందినటుల కనబడిన యెడల వైశాల్యగతి నందియుండినటుల జెప్పనగును. (Large Pulse). జ్వరగతుల యందిట్లుండును.

నాడి, వ్రేలికి ప్రమాణస్థితికంటె దక్కువగ గనిపించిన యెడల క్షీణగతి నందియుండినటుల జెప్పవచ్చును (Small Pulse). ఈస్థితియందు పరిశుద్ధరక్తనాళి ములలో నుండవలసినంత పూర్ణముగు రక్తమును ప్రచారమునం దుంచకపోవుటచే, గుండె దుర్బలత్వము నందుచున్నదని తెలిసికొనుటకు గురుగ నెంచవలయును. ఒకొక్కప్పుడు మంచి ఆరోగ్యమునం దున్నవారలకు నిట్టి విధమగు నాడి ఉండి ఉండుటను మనము మరువరాదు. మూత్రగ్రంథి యొక్క అస్వస్థతయందును నిట్టివిధమగు నాడిని గనుగొనవచ్చును. ఆసందర్భమునందు దీనిని గుండెయొక్క అస్వస్థతాఫలితమని యెంచదగదు. ఈవిధమగు నాడియందే దారమువలె సన్నగ నుండునట్టిది బహు అపాయస్థితిని సూచించును. (Thready Pulse).

(3) ఒత్తినచో నణగునట్టి స్థితి — Compressibility.

నాడి గట్టిగ నున్నదా? మృదువుగ నున్నదా? (Hard pulse or Soft pulse)? అనగా నాడి కొట్టుకొనుటను నిలుపుచేయుటకు గట్టిగ నొత్తవలయునా లేక తేలికగ నొత్తవలయునా?

మూత్రగ్రంథులు వాపుదల నందియున్న స్థితియందు నాడి గట్టిగ నుండును; ఈగతియందు పరిశుద్ధరక్తనాళములలో రక్తము పూర్ణముగ నిండియుండును. ఈ కారణమున దెబ్బయొక్క పరిమాణము చిన్నదిగ నుండును. ఈ దెబ్బను ఆపు చేయుటకు గట్టిగ నణచిపెట్టవలసి యుండును (Hard pulse). మృదువునాడి యనగా వ్రేళ్లతో నదిమినయెడల బహుతేలికగా నాగిపోవునట్టిది. ఈస్థితి గుండె యొక్క దుర్బలత్వమును సూచించుచు, శుద్ధరక్తనాళములు విస్తరింపునందుటకు వలసి నంత రక్తమును గుండె పంపుటలేదని తెలిసికొననగును. (Soft pulse.)

ద్విత్వనాడి:— మృదువునాడియందు జేరియున్న మరియొక విధమైనది ద్విత్వ నాడి యనబడుచున్నది. ద్విత్వనాడియందు రెండుదెబ్బ లుండును. ఈవిధమగు నాడి సన్నిపాతజ్వరము (Typhoid Fever) యొక్క అంత్యగతులయందు దట్టముగ గనబడును. మణికట్టుయొద్ద ప్రతిదెబ్బయందును మొదటగ పెద్ద దెబ్బయును పిమ్మట చిన్నదెబ్బయును గనబడును; ఈ రెండుదెబ్బలను గలిపి యొకటిగనే గమ నించవలయును; ఒకొక్కప్పుడు పరిమాణమునం దీ రెండుదెబ్బలును సమానముగా నుండుటచే గొందరు వాటిని రెండింటిగా లెక్కించి పొరబడవచ్చును. ఇట్టి అనుమా న మున్నపుడు గుండెదెబ్బలను లెక్కించుటచే ననుమానమును దీర్చుకొనవచ్చును. మృదువునాడి యందువలెనే ఈస్థితియందును శుద్ధరక్తనాళములు అసంపూర్ణముగ

రక్తపూరితము లగుటచే నీ ద్విత్వనాడి కలుగుచున్నది. ఇది యెల్లప్పుడును అపాయమును సూచింపనేరదు. (Dicrotic pulse).

(4) క్రమత దప్పిన నాడి.

1. నాడియొక్క దెబ్బ ఒకటి బలముగను రెండవది దుర్బలముగను, లేక మొదటిది దుర్బలముగను రెండవది బలముగను నుండి యిదేవిధముగ నడచుచుండును.

2. నాడియొక్క యొక దెబ్బకును పిమ్మటి దెబ్బకును నుండెడి మధ్యకాలము భేదించుచుండుట; ఒకసారి త్వరితముగ గొట్టుకొనుచు మరియొకసారి నెమ్మదిగ గొట్టుకొనును.

దీనిని మిగుల అపాయస్థితిగ నెంచనగును. శ్వాససంబంధమగు వ్యాధియందు ఈవిధమగు నాడి జనింపవచ్చును.

ఒక్కొకప్పుడు మధ్య నొకదెబ్బ నిలచిపోవచ్చును. అజీర్ణమునందును పొగ చుట్టను విశేషముగ గాల్చుటవలనను, నీస్థితి కలుగవచ్చును గాన నీస్థితి నెల్లప్పుడును నపాయకరముగ నెంచ దగదు (Intermittent Pulse).

నాడికొట్టుకొనుట విశేషముగనుండి, క్షీణగతి నందియుండి, మృదుత్వము నం దతిశయముగ నున్నయెడల, గుండెయొక్క దుర్బలత అధికగుమచున్నదనియు రోగియొక్కస్థితి మిగుల అపాయకర మగుచున్నదనియు దెలియవలయును.

## మరికొన్ని పరిశోధనలు.

రోగిని చూచినవెంటనే చేతియందు నాడినిగాని, లోపలనున్న బాధలనుగాని బరీక్షింప బ్రయత్నింపకుండ, ముఖమును, ముఖమునందుండు కళలను, బరీక్షింపవలెను. వ్యాధి 10, 15 రోజుల నుండి బాధించుచున్నను ముఖమునందు కళ తగ్గియుండకపోవచ్చును. 4 రోజులనుండి మాత్రమే వ్యాధి బాధపెట్టుచున్నను రోగి మిక్కిలి డస్సిపోయి, ముఖవర్చస్సు ఎక్కువగ మారి, వ్యాధి ప్రబలముగ నున్నదను నంశమును స్పష్టపరచును.

నాలుక చాపించి చూచినయెడల మరికొన్ని యంశములు తేటపడగలవు. విషమజ్వరములలో నాలుక మెత్తగను, ఎర్రగను, ద్రవముతో గూడినదిగను ఉండక అనేక మార్పులను గలిగియుండును. ఈమార్పుల స్వభావమును, వాని యర్థమును వ్యాధి నిదాన విమర్శయందు వచ్చును.

సామాన్యముగ జను లెల్లరు నిమిషమునకు 18 సార్లు ఊపిరిని వదలి, ఊపిరిని పీల్చుకొనుచుండ, జ్వరపీడితులగు రోగులు 25, 30 సార్లు పీల్చెదరు. కాని కొన్ని సమయములందు ఎక్కువసార్లు ఊపిరిని దీసికొనుటయేగాక, ఉచ్ఛ్వాస నిశ్వాసములలో నెక్కువ శ్రమను పొందుదురు. ఈ యాధిక్యశ్రమకు ముఖ్యనిదర్శనము ముక్కుల నెగరవేయుట.

## హృదయశోధన.

వెన్నెముకచేతను ప్రక్కయెముకలచేతను గూడియున్న పంజరములో మూడు ముఖ్యావయవములు కలవు. వీనిలో నొకటి గుండె; మఱియు రెండు ఊపిరితిత్తులు కలవు.

### 1. గుండెపరీక్ష.

గుండె, 2 వ ప్రక్కయెముకనుండి 5 వ యెముకవరకు, వ్యాపించియుండును; కుడివైపున మధ్యయెముకనుండి $\frac{3}{4}$ అంగుళము కుడివైపున కుండును. ఎడమ వైపున స్తనాగ్రమునుండి యొన్నగ నిలువుగీత గీచినయెడల నీ గీతను దాటదు. గుండె ఎప్పుడును గొట్టుకొనుచుండును; అనగా చిన్నదయి పెద్దదగుచుండును. ఇట్లు నిమిషమునకు 72 సార్లు కొట్టుకొనుచు, కొట్టుకొనునప్పు డెల్ల దీనియగ్రము ఎదురురొమ్మునకు దగులును. కాని లోపల ఈ అవయవ మీమార్పులను పొందుచున్నట్లు ఎవరిమట్టుకు వారికి గోచరము కానేరదు. విశేషముగ ప్రయాసపడినపుడుగాని, లేక భయమును సంక్షోభము చెందినపుడుగాని, గుండె ఎదురురొమ్ముపై గొట్టుకొనుచున్నట్లు మనకు దెలియును. తదితరసమయములయం దిట్లు గోచరమగుట ఆరోగ్యలక్షణము కాదు. ఆరోగ్యస్థితిలో హృదయముపై ఎడమవైపున 5, 6 ప్రక్కయెముకలమధ్యను, స్తనాగ్రము నుండి గీచిన నిలువుగీతకు అరంగుళము లోపుగను బొటనవ్రేలుపెట్టి చూచిన, గుండె ఎదురురొమ్ముపై గొట్టుకొనుట తెలియును. ఈస్థానము ఇంకను క్రిందికిగాని, లేక యింకను ఎడమవైపునకుగాని బోవుట మంచిదిగాదు. అట్లయినచో గుండె పెద్దదైనదని యర్థము; లేక, చుట్టునున్న ఇతరావయవముల యం దుండు మార్పును, గుండె స్వస్థానమునుండి తొలగింప బడెననియు నర్థము. పాటు ఎక్కువ పడినకొలది గుండె ఎక్కువపని చేయవలసివచ్చుటవలన, గుండె పెద్దదయ్యును ఆరోగ్యమునకు భంగమును గలుగజేయకుండును. ఇట్లు పెద్దదయినపుడు వైశాల్యము వృద్ధియగుటయేగాక, అవయవముకూడ గట్టిపడి ఎక్కువ బలముగ నుండును. ఇంకను పెద్దదయినచో గుండె యొక్క వైశాల్యమే ఎక్కువగునుగాని, గట్టితనములో హెచ్చు గనిపించదు. ఇప్పుడే గుండె బారయినదని చెప్ప నవకాశ ముండును. ఇప్పుడే గుండెసంబా గలదని చెప్పగలము. ఏలనన గుండె క్రమముగ బనిచేయకుండుటచే, రక్తప్రవాహము నిర్బం

ధింపబడి, రక్తములోని నీరు సంహతుల (అల్లికల) లోనికి పారి నంజూకింద పరిణమించును. ఇప్పుడే ఆయాసము పుట్టి ప్రాణహానికి అవకాశ ముండును.

ప్రతి అవయవమును బరీక్షించుటకు 4 పద్ధతులు గలవు.

I పరీక్షించి చూచుట.

II స్పర్శ దీనిచేతనే పైన చెప్పబడినట్లు గుండె కొట్టుకొనుననని గమనింపగలము.

III తట్టి చూచుట.

ఇందు ఒకహస్తము గుండెపై బెట్టి రెండవ హస్తపు మధ్యవ్రేలితో మొదటి హస్తపు మధ్యవ్రేలుపై టక్ టక్ మని గొట్టుట. ఇట్లు గొట్టినప్పుడు శబ్దమనేకవిధములుగ నుండును. గట్టివస్తువుపై నట్లు గొట్టినచో శబ్దము మందముగను (టక్, టక్ మనుచు) నుండును. బోలువస్తువుపై గొట్టినచో, డమ్ డమ్ అనును. ఊపిరితిత్తుల యందు గాలి ఉండుటచే మోత డమ్ డమ్ అనును. గుండెయందు రక్త ముండుటచే గుండెపై గొట్టినపుడు మోత మందముగ నుండును. కావున ఎడమప్రక్కపు నుండి హృదయమును ఈవిధముగ చేతుల జరుపుచు శోధించునపుడు శబ్దము ఎచ్చట మారునో, ఎచ్చట డమ్ అను శబ్దము టప్ అగునో, అచ్చటనే ఊపిరితి త్తు అగ్గి గుండె ప్రారంభమయినదని యర్థము. ఇటులనే కుడిప్రక్కనను, పైభాగమునను, అడుగుభాగమునను, గుండెయొక్క సరిహద్దులను నిర్ణయింపవచ్చును. సరిహద్దులను, నిర్ణయించిన పిమ్మట, క్రమమగు సరిహద్దులను బోల్చి చూచి గుండె స్థానమం దున్నది, లేనిది, పెద్దదిగ నున్నది, సరిసమానముగ నున్నది, తెలిసికొనగలము.

IV. మరియొకపరీక్ష హృదయశోధనపరికరముతో (స్టెతస్కోప్) జేయబడును. ఈపనిముట్టును గుండెపై బెట్టినచో రెండు శబ్దములు వినబడును. వీనిలో మొదటిది దీర్ఘముగను మందముగను ఉండును. రెండవది హ్రస్వముగను చురుకుగను ఉండును. మొదటిది "లూబ్" వలె నుండును. రెండవది "డప్"వలె నుండును. ఈపనిముట్టువలన నిట్టి శబ్దములు వినిపించినచో గుండె క్రమముగ నున్నదని యర్థము.

ఇట్టిశబ్దములు క్రమముగ వినిపించక శబ్దమునకు పూర్వముగాని, పిమ్మటగాని, "ఉజ్ జ్" అనుశబ్దము వినిపించిన యెడల వ్యాధిని సూచించును. ఈపనిముట్టుతో బరీక్షించునపుడు పనిముట్టును 5 వ ప్రక్కఎముక క్రింద ఇదివరకు సూచించిన స్థానమున నుంచి చూడవలెను. మధ్యయెముకయొక్క అడుగుభాగముపై బెట్టియు రెండవ ప్రక్కఎముక క్రింద యిరుప్రక్కల బెట్టియు గూడ చూడవలెను.

## 2. శ్వాసకోశముల పరీక్ష.

I. నేత్రసహాయముచే హృదయముయొక్క కదలికలో హెచ్చుతగ్గులను గమనింపవలెను.

II. స్పర్శ. రెండు అరచేతులను, వీపుమీదను, ఎదురురొమ్ము పయినను, ఉంచి ఇరుప్రక్కలను ఊపిరిని దీసికొనుటయందు రెండు భాగములును సమానముగ గదలుచున్నవా లేవా యను సంశయమును స్థిరపరచవలెను. ఒకవైపు తక్కువ కదలుచున్న యెడల నావైపు ఊపిరితిత్తిలోనికి గాలి తక్కువగ బోవుచున్నదని యర్థము. గాలి తక్కువగ బోవుటకు ముఖ్యకారణము ఏమన, ఊపిరితిత్తిలోని రంధ్రములు కళ్లిపదార్థముచే నిండియుండుట. అప్పుడు ఈఅవయవములు బోలువానివలెగాక గట్టివానివలె ప్రవర్తించును. శబ్దము గాలియందుకంటె నీటియందు ఎక్కువ గట్టిగను, నీటియందు కంటె కర్రయందెక్కువ గట్టిగను వినబడును. కావున గాలితో నిండిన ఊపిరితిత్తులగుండ కన్న, కళ్లితో నిండి గట్టిపడిన ఊపిరితిత్తిగుండ, శబ్దము ఎక్కువ గట్టిగ వినబడును. కావున ఇరుప్రక్కలను చేతు లుంచి రోగిని ఒకటి, రెండు, మూడు అని చెప్పుమనిచినచో, ఒకప్రక్కను శబ్దములు గట్టిగను, మఱియొకప్రక్కను సూక్ష్మముగను వినిపింపవచ్చును. దీనియర్థమేమనిన, గట్టిగా వినిపించువైపున ఊపిరితిత్తి కళ్లితో నిండి, గట్టిపడినది. సూక్ష్మముగ వినిపించు ప్రక్కను ఊపిరితిత్తి గాలితోనిండి ఆరోగ్యస్థితియందుండును. అయినను యిరుప్రక్కలను శబ్దము భేదముగ నున్నప్పుడు, ఏప్రక్కశబ్దము ప్రమాణమయినదియు, ఏప్రక్కను మార్పు చెందినదియు చెప్పుట అనుభవమువలననే తెలియగలదు. సామాన్యముగా నుండు శబ్దప్రమాణము అనుభవముచే గ్రహించి, హెచ్చుతగ్గులను దీనితో బోల్చియే గమనింపవలయును.

III. తట్టి చూచుట.

గుండెపరీక్షయందు చెప్పబడిన దంతయు ఇచ్చటను వర్తించును. ఊపిరితిత్తులెప్పుడును డమ్ డమ్ శబ్దమునిచ్చును. కళ్లితోనుండి రోగముతో గూడియున్నపుడు టప్ టప్ శబ్దము నిచ్చును. వీపును, ఎదురురొమ్మును, సర్వత్ర బరీక్షించి, ఏ భాగమున జబ్బు ఉన్నదో యాభాగమును గుర్తింపవలెను.

IV. హృదయశోధనపరికరము. (స్టెతస్కోప్) Stethoscope.

దీనితో జూచిన ఊపిరి తీయునపుడు లోన గలుగు శబ్దము తూములోనికి గాలి చొరునపుడు గలుగు శబ్దమువలె నుండును. ఊపిరి వదలునప్పు డింతశబ్ద ముండదు. ఊపిరి దీయునపు డుండు శబ్దము వదలునపు డుండుదానికన్న 4 రెట్లెక్కువ కాల ముం

డును. ఈశబ్దములో గుడగుడధ్వను లుండరాదు. ఇట్టిధ్వనులు మూడుతరగతులు గలవి. బహు సూక్ష్మముగను, మధ్యరకముగను, ముతకగను నుండవచ్చును. వీనియర్థ మేమనిన నీటిలో మునిగి గాలి వదలినచో నెట్లు గుడగుడశబ్దము బయటకు తెలియగలదో యటు లనే ఊపిరితిత్తులలోనికి బోవుగాలి ఖాళీస్థలములలోనికిగాక ద్రవపదార్థము (లేక కల్లి మొదలగు గట్టి పదార్థము) గుండ ప్రవేశించుచున్నది. ఇట్టి పదార్థములు ఆరోగ్యస్థితి యందు ఊపిరితిత్తులలో నుండవు. ఉబ్బసపుదగ్గులో నిట్టి పరీక్ష చేసినయెడల పిల్లికూత వంటి శబ్దములు వినిపించును.

---

## మూత్రపరీక్ష.

1. మూత్రముయొక్క చిక్కదనము బరీక్షించుట కొకపనిముట్టు గలదు. దీనిని యురీనోమీటర్ (Urinometer) అందురు. దానియందు అంకెలు వేసియుం డును. ఈచిక్కదనము నీటితోబోల్చి తెలిసికొనబడును. నీటియొక్క చిక్కదనము **1000** అంకెచే గుర్తింపబడినచో ఆరోగ్యమగు మూత్రముయొక్క చిక్కదనము **1003 - 1015** వరకు నుండును. ఆంగ్లేయగ్రంథములయందు **1015 - 1025** అని చెప్పబడునుగాని ఈ యంకెలు మనదేశమునకు సామాన్యముగ వర్తింపవు.

2. లిట్మస్ కాగిద మని యొక రంగుకాగిద ముండును. ఇందులో నీలపుది యొకటి, ఎరుపుది యొకటి యుండును. ఆరోగ్యమందున్న మూత్రములో నీలపు కాగిదమును ముంచిన ఎర్రబడును. ఒకవైపున యెరుపురంగు గలిగినట్టియు రెండవవైపున నీలపురంగు గలిగినట్టియు లిట్మస్ పెన్సిలు లుండును. కాగిదము పయిన యీపెన్సిలుతో గీసి, పైవిధమునవే యీ కాగితముల మూత్రమునందు ముం చుటవలన బరీక్ష చేయవచ్చును.

3. అల్బ్యుమెను (Albumen) శ్వేతధాతువు.

ఒకచిన్నగాజుగొట్టమును దీసి దానియందు ముప్పాతిక వరకును మూత్రము పోసి, అడుగుభాగమును బట్టుకొని పైభాగమునందున్న మూత్రమును స్పిరిటుదీప ముపై కాచవలెను, అప్పుడు కాచినచోట తెల్లగ మబ్బువలె మార్పుగలిగినచో నీమూ త్రమునందు మహాద్రావకము (Nitric Acid) ఒకబొట్టును మెల్లగా పోయవలెను. ఈమబ్బు కరగని యెడల అల్బ్యుమెను గలదు. కరిగిన యెడల ఫాస్ఫేట్సను లవణములు గలవు. మబ్బులేని యెడల మూత్రము ఆరోగ్యముగ నున్నది.

4. మధుపరీక్ష (Sugar Test).

పేవీసు సొల్యూషనునుగాని ఫేలింగ్సు సొల్యూషనునుగాని కొంచెము గాజు గొట్టములో పోసి, స్పిరిట్ దీపముపై మరగపెట్టి, అందు మెల్లగ 5, 6, బొట్లు మూత్రమును గొట్టముప్రక్క నుండి జారబోయవలయును. పిమ్మట తిరిగి కాచ వలెను. అప్పుడు నీలపువర్ణముగల పైద్రావకము కాచిన పండిటుక వర్ణము నొంద నచో మధుదోష మున్నదని యర్థము. ఇట్టి సందర్భమున మూత్రముయొక్క చిక్క దనము గూడ హెచ్చయి 1020, 1030, 1040 కూడ నుండును.

5. అన్ని మూత్రముల యందును నొక పింజవలె మధ్యను తేలుచుండును. ఇది దోషలక్షణము కాదు.

మూత్రమును ప్రాతఃకాలమున బరీక్షింపవలెను.

---

## వ్యాధిచికిత్స లెన్నివిధములు ?

వ్యాధి నేమార్గమున గుదర్చ యత్నించినను అయ్యది చికిత్స నా బడును. ఈచికిత్సల నిక్రిందివిధముగ విభజింపవచ్చును.

(1) శరీరమునుండి కొద్ది రక్తకణముల దీసి యారక్తమును సూక్ష్మదర్శిని యంత్రముక్రింద బరీక్షించి యందలి మూలపదార్థలోపమును గ్రహించి యాలోప మును పరిపూర్తి చేయుట మూలమున.

(2) దేహమునందలి యే యెముకయైనను ప్రమాదము వలనగాని మరియే యితరకారణము వలనగాని విరుగుటగాని, స్వస్థానమునుండి తొలగుటగాని, తట స్థించిన యెడల నట్టిలోపమును "యక్స్రే" సహాయమున బరీక్షింపించి దానిని సరి చేయుట.

(3) ఆరోగ్యసూత్రముల ననుసరించి నడుచుకొనుట మూలమున.

(4) ఏ అవయవము యద్దాని ధర్మానుచరణలోపమున వ్యాధిని గలుగుచున్నదో గుర్తెరింగి, యితర జంతువులకు సంబంధించిన ఆ అవయవముయొక్క సారమును సమ కూర్చి లోని కిచ్చుటవలన.

(5) శరీరారోగ్యమున కనుకూలమగు ఆహారనియమముల నేర్పరచుటవలన

(6) టీకాలనుజేయుట - అనగా - సీరం (రసి)ను గాని, తత్సంబంధమగు దానినిగాని, మశూచివ్యాధి విషయమునందువలె యింజక్టుచేయుట మూలమున.

(7) జలచికిత్స - జలమును విరివిగ లోని కిచ్చుట మూలముననను, వివిధములగు స్నానముల జేయుట మూలముననను.

(8) వేడిమిని గలిగించి చేయు చికిత్స. ఉ. వాపుదలలయందు వేడికాపడ ముల నిచ్చుట మూలమున.

(9) వెలుతురు మూలమున జేయు చికిత్స. ఉ. సూర్యకిరణ చికిత్స. ఇందు వెలుతురును వేడిమియును గలిసియుండును.

(10) విద్యుచ్ఛక్తి ప్రయోగ మూలమున చేయు చికిత్స.

(11) వెన్నుపూస ననుసరించి పైభాగమున — అనగా — వెన్నుపూస మెదడుతో కలిసెడి స్థానమునుండి వెన్నుపూస క్రిందివరకును నుండెడి నరములను సవరించుట మూలమున జేయు చికిత్స. ఇయ్యది ప్రత్యేక శాస్త్రమై యున్నది.

(12) స్నాయువులకు ఒత్తిడిని గలుగజేసి — అనగా — పట్టువిడుపుల మూలమున మర్దనచేయుటచే అయా అవయవధర్మముల క్రమపరచుటవలన (Massage).

చాల వ్యాధులలో వాటియొక్క నిర్ణీతకాలము గతించిననేగాని వ్యాధులు నయము కానేరవు. ఈమధ్యకాలములో ఆహారాదినియమముల జాగ్రతగ నడపుచు, చిక్కు స్థితులు గలుగకుండ జూచుచు, ఒకవేళ నేదైన చిక్కుస్థితి తటస్థించినచో నందుల కగు పరిచర్యలను జేయుచు, సుఖవును గలుగజేయు మార్గములను అవలం బింపవలయును.

---

## ఆహారనియమము లేమి ?

ఆహారము జీర్ణమగుటకు ఈ క్రింది కార్యానుకూలము లవసరములు:—

(1) మనుష్యుడు జాగ్రతావస్థయం దుండుట; ఏలనన, నిద్రించునపు డాహారము జీర్ణము కానేరదు. (2) జీర్ణకోశమునం దంతటను ఆహారమునకు కదలిక కలుగుట. (3) సూర్యునియొక్క వేడిమి, వెలుతురు. (4) జీర్ణకోశమునం దుత్పత్తియగు వివిధ రసములు. (5) జీర్ణాశయము (Stomach) నిలువుగా నుండుస్థితి.

రాత్రి పరుండునపుడు జీర్ణాశయము వాలియుండును గనుక యెక్కువ జీర్ణ క్రియము జరుగనేరదు. అట్టి సమయమున నే యాహారమైనను కడుపులో నిలువ యున్నయెడల నది క్రిళ్ళి వ్యాధుల కనువును గలుగజేయును. ఇదిగాక జీర్ణాశయము నకు గొంతవిశ్రాంతి కావలయును. జీర్ణాశయమునందు బరువుపదార్థములు లేకుండిన సుఖనిద్ర కలుగును. నిద్రలేచిన పిమ్మట నాలుగయిదు గంటలవరకును యెట్టి ఆహారమును లోనికి దీసికొనరాదు. ఉదయముననే కాఫీ మొదలైనవి దీసికొనుట దురలవాటై యుండి ఆరోగ్యమునకు భంగము కలిగించును.

ఒకసారి లోనికి దీసికొనిన ఆహారము పూర్తిగ జీర్ణము గాకముందు, మరల నే ఆహారమును దీసికొనరాదు. ఇట్లుచేయుట - ఉడుకుచున్న అన్నములో క్రొత్తగా మరికొన్ని బియ్యము పోసి వంటజేసినట్లే యుండును.

ఆహారమును పూర్తిగా నమలవలయును. ఇట్లుగా జేయుటవలన గొంత జీర్ణ క్రియము నోటియందే జరుగుచుండును. శాకాహారమే మంచిది. మాంసమును ద్యజింపవలయును. ఇతరజంతువులు విశేష ఆహారమును దినును గాని మనుష్యున కట్టి ఆవశ్యకత లేదు. మనుష్యుడు ప్రాణావసరమున కగత్యమగు ఆహారమును మాత్రము నే భుజింపవలయును. జీవించుటకుగాను దినవలయునుగాని తినుటకుగాను జీవింపరాదు. ఎక్కువగా దినినచో శరీరమునందు క్రొవ్వు పదార్థ మధికమగును. క్రొవ్వుపదార్థ మధికమైనచో అనారోగ్యతకు విత్తనము నాటినట్లే యని యర్థము చేసికొనవలయును.

## ఆహార సూత్రములు.

**1.** నీకెంత ఆహార మవసరమో అంత ఆహారమును ఒక్కసారిగనే వడ్డింపించుకొనుము. దానిని దినిన పిమ్మట మారు వడ్డనకు జెయ్యి నడ్డుము. ఇదియే ప్రథమ సూత్రము.

**2.** ఇంకను కొంత ఆకలి యుండగనే విస్తరియొద్ద నుండి లెమ్ము.

**3.** నీ కెంత ఆహారము కావలసియుండునో దానిని నీ అనుదినానుభవమువలన నిశ్చయించుకొనుము. ఎక్కువ నాశింపకుము.

**4.** భోజనమునకు గూర్చుండునపుడు మనము కుక్కుటాసనమును వహింపవలయును గాని పద్మాసనమును వహింపరాదని మన శాస్త్రములు చెప్పుచున్నవి. కుక్కు

టాసనమున గూర్చున్నచో జీర్ణాశయమును బూర్తిగా నింపుటకు వీలు లేకుండును. ఇందుల కిదియే కారణము. తక్కువగా దినుట కిదియే దీని ముఖ్యోద్దేశము.

**5.** వడ్డించిన భోజనపదార్థముల సంఖ్యలో సాధ్యమైనంతవరకు తక్కువగా నుండుట మంచిది.

**6.** ఒక ముద్దను బాగుగా నమలి మ్రింగిన పిమ్మట మరియొక ముద్దను నోటి లోనికి పోనిచ్చుచుండవలయును. ఇందువలన నాహారము ఉమ్మి ద్రవముతో గలిసి జీర్ణమున కనువగును.

మన పూర్వులు దినమునకు రెండు భోజనములను మాత్రమే నియమించియుండిరి. కాని, నలుబది సంవత్సరముల వయస్సు దాటినవారు దినమున కొకసారి భుజించుటయే మంచిది. గ్రీకులు, రోమనులు, పర్షియనులు — వీ రందరును పూర్వ కాలములో దినమున కొక్క భోజనమునే చేయుచుండెడివా రనుమాట చరిత్రాంశమే అయియున్నది. దేవతలు దినమున కొక్కమారే భుజింతు రట! మనుష్యుడు రెండు సారులు భుజింపవలెనట! మృగములు ముమ్మారు భుజించునట! కావున మనుష్యులు మృగముల బోలి నడచుకొనకుండుట శ్రేయస్కరము.

## మానసిక చికిత్స.

మానసిక చికిత్సయన ఔషధసేవనములు మొదలగు పద్ధతులవలన జికిత్స జేయ నెంచు తక్కిన చికిత్సాశాస్త్రము లెట్టివో యిదియు నట్టిదేగాని, దీనిని మతసంబంధమైనదనిగాని, భూతవైద్యమువంటి దనిగాని యెంచదగదు. ఇందలి పద్ధతులు ప్రకృతి సూత్రముల ననుసరించి యుండుటచే నట్టిసూత్రముల కీయనగు గౌరవమునే దీనికిని యియ్యనగును.

సృష్టియం దుండెడి శక్తిబలములు ప్రాణబోధితములై యున్నవి. ప్రాణమును వెంట నంటియే మనస్సుగూడ నుండి యున్నది. బ్రహ్మాండమున కంతకునుగూడ మనస్సు గలదు.

శరీరమునకు వర్తించు కొన్ని ప్రకృతిసూత్రములు గలవు. ఆ ప్రకృతి సూత్రముల నుల్లంఘించినయెడల వ్యాధి కలుగుచుండును. రోగికి వ్యాధిని గుదుర్చుటకు యత్నించుటలో నీమనశ్శక్తిని నీ వుపయోగింపవలయును. రోగియు దనవ్యాధి కుదరగల దను నమ్మకమును గలిగియుండవలయును. ఇట్టి మనశ్శక్తులు బనిచేయని దే

యెట్టి వ్యాధియైనను కుదిరిక నందజాలదు. వైద్యున కుండెడి యిట్టి శక్తికే మనవారలు హస్తవాసి యని చెప్పుచుందురు.

పాఠకమహాశయా!

నీ మనశ్శక్తియందును నీ చికిత్సాశక్తియందును నమ్మకమును గలిగియుండుము. ఇట్టి సహజశ్శక్తిని భగవంతుడు ప్రతిమానవునికిని పారితోషికముగ నిచ్చియున్నాడు. ఈ శక్తిని నీ వుపయోగించిన కొలదియు నద్దాని బల మధిక మగును. శరీరసాధకము జేసిన నీ కండరము లెట్లు వృద్ధినందునో అటులనే యీ విషయమునను నుపకరింప గలదు.

నీవు చేయు చికిత్సలయందు జయ మందినయెడల గర్వము నందకుము, ఇట్టి శక్తి నెవరు బ్రయత్నించినను బడయగలరు. ప్రకృతిమాతృముల హస్తమునందు నీ వొక సాధనముగా వర్తించు చున్నావు. అంతకు మించి మరేమియు లేదు. బ్రహ్మాండము నందలి శక్తులనుండి నీవు నీ శక్తిని గ్రహించుచున్నావు. నీ స్వశక్తివలన నీవు జేయున దేమియును లేదు.

రోగి కిచ్చునట్టి ఆహారపదార్థ విషయమై ప్రథమ జాగ్రతను బుచ్చుకొనవల యును. రెండవ ముఖ్యవిషయము శరీరమున కవసర మగు జలమును క్రమముగా నుప యోగించుట. ఆరోగ్యమున కగు మూడవ ఆవశ్యకత క్రమ ఊపిరి. ఊపిరి దీయుట క్రమముగా లేకపోయినయెడల రక్తము పరిశుభ్రపడదు. ఇందుమూలమున ఆరోగ్యత చెడును. దీర్ఘ ఊపిరిని దీయుట సాధకమూలమున ముందుగా నీవు నేర్చుకొని పిమ్మట నీ పద్ధతిని యవలంబింప రోగికి బోధించుము.

శరీరసాధకము, స్నానముచేయుట మొదలగునవియు నావశ్యకములే. నిద్ర— అనగా— శరీరమున కంతకును విశ్రాంతి— ప్రకృతి మాతృముల ననుసరించి యిది యును వలసినదే. దీనినే మనోవిశ్రాంతిగ గూడ భావింపవచ్చును.

వీని కన్నిటి కంటె ముఖ్యము మనశ్శాంతి. ఈ మనశ్శాంతి లేనిదే శరీరము క్రమారోగ్యమును వహించి యుండనేరదు. ఈ మనశ్శాంతి రోగికిని వైద్యునకునుగూడ నవసరమే. వైద్యునియొక్క చికిత్సావిధానము ఈశ్వరాంశప్రబోధిత మైనదియు పవిత్రమైనదియు నయియున్నది. ఈ ఆశయము నెప్పుడును మనమునం దుంచుకొన్నచో వైద్యవృత్తి ఆనందదాయక మైనదియు జయప్రద మైనదియు నగును. ప్రకృతి మాత నుండి దూరముగ జనిన సోదరులకు శరీరారోగ్యబలములయొక్క సంతోషవార్తను దెలిపి వారల ఋజుమార్గమునకు దే బ్రయత్నింపవలయును.

## సూర్యకిరణస్నానము.

ఈ సూర్యకిరణస్నానచికిత్స గ్రీకుల రోమనుల ఔన్నత్యస్థితి నాటినుండియు నుండియున్నది. ఆర్యులు ఆదినుండియు సూర్యునిమహిమ నెరిగియే యుండిరి. అనుదినమును ఆర్యులు తమసంధ్యావందనమునందు సూర్యుని కభిముఖులై అర్ఘ్యమును విడచుటను బట్టియే వారియొక్క నమ్మకమును మనము గ్రహింపవచ్చును.

వ్యాధిసహితమగు క్రిములు చీకటిలో పెరుగును. విశేషవెలుతు రున్న విశేష ఆరోగ్యమేగాక దీర్ఘమైనట్టియు సంతోషమైనట్టియు జీవితమున కనుకూలతయని మనము గ్రహింపవలయును. మనము దుస్తులను ధరించియుండుట మూలమున మన శరీరములు కొంతవరకు మాత్రమే యీ సూర్యకిరణస్నాన యవకాశమును బొందుచున్నవి.

సూర్యకిరణమును విభజించి చూచినయెడల నందు యేడురంగు లుండును; ఒకవైపున యెర్రనిరంగును రెండవవైపున నీలమును ఊదారంగును నుండును. ఈరెండవవైపుననుండు ఊదావర్ణముగల కిరణములకు 'అత్యంత ఊదాకిరణములు' (Ultra-violet rays) అనిపేరు. ఇవియే రసాయన సంబంధమగు కిరణములు. చెమ్మ, దుమ్ము. వాయువు నందుండెడి జంతుపదార్థములు— యివన్నియు నీ చికిత్సాకిరణముల ధ్వంసముచేయును. వేడికిరణములయొక్క తీవ్రత యెక్కువైనచో అపాయకరములగు ఫలితములు కలుగగలవు. ఇందుమూలముననే యిండియాదేశమునందు వడదెబ్బ తగిలి జనులు చనిపోవుచుందురు. సూర్యరశ్మి అన్నిజంతువులకును అన్నివృక్షములకును ఆవశ్యకమై యున్నది. చర్మమునందలి బిలములును చర్మముయొక్క సూక్ష్మమగు అల్లికలయందు ప్రచారము నందుచున్న రక్తమును ఈ కిరణముల నాకర్షించి శరీరమునందలి పరిస్థితులలో మార్పును గలుగజేయును. చిన్నబిడ్డలలో యెముకలు గట్టిపడకుండ నుండు వ్యాధియందు ఈ చికిత్సవలన బ్రయోజన ముండగలదు. ఈ వ్యాధియందు "విటమిన్ డి" ని గలిగియున్న కాడ్ లివరు చమురును వెన్నను గూడ నిత్తురు. క్షయవ్యాధియందును, అనేక చర్మవ్యాధులయందును, బట్టతలయందును, కీళ్లనొప్పియందును, అనేక విధములగు ఆరోగ్యహీనతలయందును, నాడీబలక్షయమునందును ఈ సూర్యకిరణ చికిత్సాపద్ధతివలన ప్రయోజనము లందబడి యుండెను.

స్విట్జర్లాండు దేశములోని లెయిసిన్ పట్నమునందు డాక్టర్ రోలియర్ యను నాయన యీ చికిత్సామార్గమున జాలసంవత్సరము లనేకవ్యాధుల గుదుర్చుచుండెను. ఈ సూర్యకిరణస్నానమువలన వ్యాధులను రాకుండ గూడ జేసికొననగును. ఇట్టి స్నానాభ్యాసమువలన శరీరమునకు బలము కలిగి వ్యాధి అవహింపకుండ నడ్డగింపును గలిగించును.

సూర్యకిరణ స్నానమువలని ఔషధవిలువ యొప్పుకొనబడియుండుటను బట్టియు, చీకటిలో వ్యాధిహితక్రిములు వృద్ధినందుచుండుటను బట్టియు, యీ చికిత్సాపద్ధతి ననుచరణయం దుంచుట కెంతమాత్రమును సందేహింపవలదు. శరీరమునకును సూర్య కిరణములకును యెంతమాత్రము అడ్డుయున్నను ఈ "అత్యంత ఊదాకిరణములు" పనిచేయజాలవు. కాబట్టి యీ చికిత్సవలని అధికారోగ్యదీవనల నందుటకుగాను పూర్తిగ దిగంబరియై యీ స్నానము నొనర్పవలయును.

మధ్యాహ్న సమయమున అనగా సుమారు ఒంటిగంటవేళ ఒక చాపనుగాని మరియే యితరపక్కనుగాని బరచుకొని వస్త్రుల నన్నిటిని తొలగించి అందుపైన పది నిమిషములపాటు శరీరమున కంతకును సూర్యరశ్మి తగులునట్లు దొరలుట మూల మున నీ చికిత్సను గావింపవచ్చును. ఇట్టి చికిత్స 15 నిమిషములకు మించి చేయరాదు. వేడిమి అధికముగ సోకినయెడల జబ్బుచేయగలదు గావున జాగ్రతను వహించియుండ వలయును.

ఈక్రింది పరిస్థితులయందు సూర్యకిరణస్నాన మాచరింపదగదు. ఒకవేళ ఆచరించినను తక్కువ కాలమును దీసికొనవలయును.

1. వేడిమిని అతిత్వరితముగ నాకర్షించుకొను చర్మమును గలిగినట్టి రోగులు.
2. హృద్రోగముల యందలి తీవ్రస్థితుల యందు.
3. స్పష్టమగునట్టి ధాతునష్టమునందు.
4. జ్వరముతో గూడిన క్షయవ్యాధియొక్క తీవ్రస్థితియందు.

---

## క్షయ చికిత్స.

1. ఆహారమును విరివిగా నియ్యవచ్చును. పాలు, గ్రుడ్లు, రొట్టె, వెన్న, శాకపదార్థములు, పండ్లు, మాంసాహారములు— యి వన్నియు నియ్యవచ్చును.

2. విరేచనక్రమమును గమనించవలయును.

3. శరీరమునకు చలిగాలి సోకకుండునట్లు వస్త్రు లుండవలయును.

4. స్నానమును క్రమముగా చేయవలయును. ఒడ లంతటిని గోరువెచ్చని నీటిలో స్పంజిచేసి, పిమ్మట గట్టిగా తుడువవలయును. స్నానమును బహిరంగస్థల ములలో చేయరాదు.

5. ఆయాసమును గలుగజేయు పనిని చేయరాదు.

**6.** శరీరసాధకము మంచిదేగాని అందువలన దగ్గును, శరీరవేడిమియును కలుగకుండునట్లు చూడవలయును.

**7.** రోగియుండు గదిలోనికి సూర్యరశ్మియును వెలుతురుయును గాలియును బాగుగా వచ్చుచుండ వలయును.

**8.** సముద్రతీరమందుగాక లోపప్రదేశమునం దుండుట మంచిది. తేమలేని ప్రదేశమై యుండవలయును. క్షయవ్యాధులలో గొన్నిటియందు సముద్రప్రయాణము మేలు చేయును. ఆంధ్రదేశమునందు మదనపల్లి క్షయరోగులకు మంచి నివాసస్థానముగ నెంచబడుచున్నది.

**9.** జ్వరమునకు మందుల నియ్యనక్కర లేదు. ఫారన్‌హీట్ 75 డిగ్రీల వేడిమిగల నీటితో చేతులు కాళ్ళుగాని, ఒడ లంతయుగాని, తుడువవలయును. రోగి భరింపగలిగిన యెడల యీ నీటివేడిమిని 60 డిగ్రీలవరకు దింపవచ్చును.

**10.** పొడిదగ్గుగానుండి నొస యున్నయెడల, టింక్చర్ బెంజాయిన్ కోనుగాని, మెంతాల్ నుగాని, క్రియసోట్ నుగాని, కర్పూరమునుగాని, కలిపిన ఉడుకునీటి నుండి వచ్చెడి ఆవిరిని బీల్చుటవలన నుపయోగకరముగ నుండగలదు.

**11.** చెమట లధికముగ నున్నయెడల యక్స్ట్రాక్టు బెలడోనాను అర గ్రెయిను మొదలు ఒక గ్రెయినువరకు మాత్రగా జేసి యియ్యవచ్చును.

**12.** అజీర్ణవిరేచనములకు ఒక టీస్పూన్ చిట్లాముదము నియ్యవచ్చును.

**13.** ఎదురొమ్ములో నొప్పి యుండినయెడల పట్టును వేయవలయును.

**14.** రక్తస్రావ ముండిన యెడల అట్రోపీన్ 1/100 గ్రెయిను $\frac{1}{8}$ మార్ఫియాతో గలిపిగాని కలపకుండగాని రక్తములోని కింజక్టు చేసినయెడల తరుచుగా చక్కని గుణము నిచ్చును.

---

## ఆంటిఫ్లోజిస్టీన్ — **Antiphlogistine.**

శరీరమునం దేఅవయవమైనను సరియే వాచుటవలనగాని, లోపలిభాగముల యందు రక్తము కూడుకొనుటవలన నొప్పి మొదలగునవి కలుగుటవలనగాని, అస్వస్థత కలిగినయెడల దీనిని పట్టువేయుట కుపయోగింతురు. ఇదియొక విధమగు రేగటి మన్నుతో గొన్ని ఔషధములను గలిపి అమెరికాదేశమునందు తయారుచేసినది. ఇది అయిదుసైజుల డబ్బాలలో విక్రయింపబడును. దాని నుపయోగించు పద్ధతు

లన్నియు అందలి ప్రకటన పత్రమందు దెలుపరపబడియుండును. క్షయవ్యాధి యందును న్యూమోనియాయందును అవసర మున్నయెడల నుపయోగింపగలదు.

## రేడియం — Radium.

ఇది చాలావిలువగల పదార్థము. సృష్టియం దుండెడి క్షారపదార్థములలో నిది యొకటి. నిలువ యుంచినయెడల దీనియొక్క గుణము మారిపోవుచుండును. సృష్టి యందు మిక్కిలి తక్కువగా దొరకెడి పదార్థములలో నిది యొకటి. సామాన్యముగ స్త్రీలకు గలుగు స్తనవ్యాధియం దిది యుపయోగింపబడును. ఒక కురుపుగా లేచి మిగుల బాధపెట్టును. ఈవ్యాధికి యీ ఔషధసేవవలన తప్ప నితరవిధముగా చికిత్సజేయ నలవి కాదు. ఇండియాదేశమునందు పెద్ద ఆసుపత్రులలో కొద్దివాటియందు మాత్రమే యీచికిత్స చేయబడును.

## రాన్జన్ కిరణములు — Roentgen Rays.

(X - Rays)

జర్మనీదేశములోని ఊర్జుబర్గ పట్నమునందలి ప్రొఫెసర్ రాన్జన్ యను నాయన యీ కిరణములను కనుగొనెను. ఈ యంత్రమును బనిచేయుటయందలి వివరములు మన కనవసరమై యున్నవి. ఈ కిరణములు ప్రసరించుటకుగాను కొయ్యగాని యిటుకలుగాని అడ్డు రానేరవు. రక్తము, మాంసపదార్థము — యివి కూడ అడ్డు రానేరవు. పైబట్టలపైనను దీయకుండ మనిషియొక్క శరీరములోని యెముకలయొక్క ఫొటోగ్రాఫ్‌ను దీయవచ్చును. ఏదైన యెముక విరిగినచో కట్టుకట్టినయెడల నాకట్టు కట్టిన తరువాత యెముకయొక్క రెండు ముక్కలును సరియైన స్థానములో నున్నవో లేవో యీ రాన్జన్ కిరణముల సహాయమున బరీక్షింపవచ్చును. తుపాకీదెబ్బ తగిలి అందులోని గుండు శరీరమునందు చిక్కుకొనియున్నయెడల సరిగా యేస్థానమున నున్నదియు తెలిసికొనుటకు ఈ పరీక్ష యుపయోగించును. అనంతరము జరుగు శస్త్రమున కీ పరీక్ష మిక్కిలి సహాయకారిగ నుండును. హృదయమునందలి అల్లికలు గూడ నీ కిరణములవలన యేస్థితియం దున్నదియు దెలిసికొనవచ్చును. ఇందుమూలమున హృదయము విస్తరింపు నందియున్న స్థితిని దెలిసికొనవచ్చును. ఒక పిల్లవాడొక నాణెమును మ్రింగియుండెను. ఈ కిరణసహాయమున నానాణె మెచ్చట నున్నదియు దెలిసికొని పిమ్మట క్లోరొఫారము నిచ్చి శస్త్రము చేయుటచే నానాణెము తేలికగా బయటికి తీయబడెను. ఇదే విధముగ నీ కిరణసహాయమున వ్యాధిచికిత్సలలో నపరిమితమగు సహాయమును బొందవచ్చును.

## కొన్ని జాగ్రతలు.

1. కాడ్ లివరు చమురు నెప్పుడును భోజనానంతర మియ్యవలయును. లోహ మును పాషాణమును గూడ నటులనే యియ్యవలయును.

2. ఏ ఔషధమును దాని విరుగుడుతో గలిపి యియ్య రాదు.

3. బిస్మత్ సబ్ నైట్రిస్‌ను సోడియం బైకార్బనేటును గలిపి యొకే మిశ్రితౌషధమునం దియ్యరాదు. అంగారక్షారవాయు వుత్పత్తి యగుటచే ప్రేలుట కలుగవచ్చును.

4. పొటాసియం క్లోరేట్‌ను పొటాస్ అయొడైడ్‌ను గలిపి యియ్యరాదు. లోన విషముగ వర్తించును.

5. జీర్ణకారులను, చేదుపదార్థములను (కలంబా, చైరేటా, క్వాసియా) భోజ నమునకు 15 లేక 30 నిమిషములకు పూర్వ మియ్యవలయును.

6. చిల్లామదమును ఉదయముననే పరగడుపున నియ్యవలయును.

7. కార్బనేట్లకు బదులుగా బైకార్బనేట్లనే యెప్పుడును ఉపయోగించవల యును; పొటాసియం లవణములకంటె సోడాలవణముల నెక్కువగా నుపయోగింప నగును.

8. బిడ్డలయొక్క అజీర్తియందు గ్రేపౌడరు చిన్న మోతాదులలో మిగుల నుపయోగించును.

9. గుండెను చురుకుదనమును బుట్టించుటకు స్ట్రిక్నీ సంబంధము లుపయో గించును. గుండెయొక్క నడకను క్రమపరచుటకుగాను డిజిటాలిస్ నుపయోగించ వలెను. స్ట్రొఫాంతస్‌యొక్క యుపయోగములను గూడ జూడుడు.

10. స్త్రీయొక్క ప్రసవానంతరము మావి వెలువడిన పిమ్మటగాని యెర్గాట్ ను యివ్వరాదు.

11. పాలను "పెప్టొనైజ్" చేయుట— అనగా, తేలికగా జీర్ణ మగునట్లు చేయుట. దీనికే "పెప్టొనైజ్డ్ మిల్కు" (Peptonised Milk) అందురు:— ఒక పైంటు పాలలో 4 ఔన్సుల జలమును గలుపవలయును; ఇందులో సగముపాలను పొంగువచ్చునట్లు గాచవలయును; పిమ్మట తక్కిన సగమునుకూడ యిందులో గలుప వలయును. దీనికి 2 టీ స్పూన్ల లైకర్ ప్యాంక్రియాటిన్‌ను గాని, లేక - 5 గ్రెయినుల ప్యాంక్రియాటిన్ యక్ట్రాక్టును 20 గ్రెయినుల సోడా బైకార్బనేటునుగాని - గలిపి 15 నిమిషములవరకు నిప్పుసెగ నుంచవలయును; నిప్పు లేనిచో మూడుగంటలకాలము

చలిగాలి తగులకుండ నుంచవలయును. దీనిని వెంటనే యుపయోగించుటకు కాక పోయిన యెడల పొంగువచ్చునట్లు కాచవలయును.

## ఇన్సూలిన్ — Insulin.

అతిమూత్ర వ్యాధియందును, రాచపుండ్లు కలిగిన స్థితియందును లోనకు యింజక్టు చేయుటకుగాను యెద్దుయొక్క కడుపులో నుండు వృక్వకము (Pancreas) నుండి తయారు చేయబడిన యీమందు అప్పటి కప్పుడు గుణము నిచ్చునుగాని దీని యొక్క ఫలితము విశేషకాలము వర కుండునట్లు కనుపడదు. దీనిని అమెరికాఖండ మునందలి కనడాదేశములో నిద్దరు డాక్టరులు యైరోపాసంగ్రామ కాలమున గని పెట్టియున్నారు.

---

## విటమిన్స్ — Vitamins.

విటమిన్స్ అనగా ఆహారములందు ఆరోగ్యపోషకములగు పదార్థములు. ఈ విట మిన్స్ శాకపదార్థములయందును పండ్లయందును ఉండును. ఈవిటమిన్స్ ఏ, బి, సి, డి, అని నాలుగుతరగతులుగా విభజింపబడినవి.

ఏ విటమిన్స్ — దీనిలోపమువలన రేజీకటి వ్యాధికలుగును; మరియు, కొన్ని శ్వాసకోశవ్యాధులును, చర్మవ్యాధులును కలుగును. పాలు, పచ్చని ఆకుకూరలు, వెన్న, కాడ్ లివరు చమురు, గుడ్లలోని పచ్చనిభాగము — వీనియందు యీజాతి విట మిన్స్ యుండును.

బీ విటమిన్స్ — దంపుడుబియ్యమును దినుటవలన యీ విటమిన్స్ లోపపరి పూర్తి చేయబడును. ఉల్లగడ్డలయందుకూడ యీ పదార్థము కొంచె ముండియున్నది. ఈ లోపమువలన నంజువ్యాధి కలుగును.

సీ విటమిన్స్ — స్కర్వీమొదలగు చర్మరోగములు యీ పదార్థలోపము వలన గలుగును. క్యాబేజి, నిమ్మ, నారింజ, టర్నిప్, నారింజ, కర్పూరపు వంగ (Tomatoes) — వీటియందు యీ పదార్థ ముండును.

డీ విటమిన్స్ — బిడ్డలయం దెముక గట్టిపడకుండ నుండుస్థితి యీ పదార్థ లోపమువలన కలుగును. కాడ్ లివరు చమురు, వెన్న - వీనియందు యీ ఆహారపదార్థ ముండును.

ఈ విటమిన్స్ — పునరుత్పత్తి చేయుట కుపయోగించు విటమిన్స్‌కూడ నుండి యున్నట్లు ఇవాన్సు అను నాయన రుజువుజేయుచున్నాడు.

---

## ప్యాన్‌క్రియసాల్ — Pancreasal.

అతిమూత్ర వ్యాధికై పైన నిర్ణయింపబడిన ఇన్సూలిన్ మందు లోని కింజక్టు చేయుటకు మాత్రమే పనికివచ్చును. అదిగాక దానియొక్క గుణము వెంటనే కను పడినను ఆపట్టు యొక్కవకాలము నిలువనేరదు దీనియందుండెడి అనర్థ మిదియై యున్నది. దీనికి ప్రతి ఘటనముగ జర్మనీలోని బర్లిన్ పట్నమునందలి డాక్టర్ రిచార్డ్ వైస్ అను నాయన ప్యాన్‌క్రియసాల్ అను నీమందును గనిపెట్టియున్నాడు. దీనిని పందియొక్క కడుపులో వృక్కకము (Pancreas) నుండి తయారుచేసినాడు. ఇది నెమ్మదిగా పనిచేయునుగాని దీనియొక్క పట్టు నిలచియుండి శరీరమునందు మరి యెవ్విధమగు కలతయును గలుగజేయదు. ఇది బిళ్లలుగా జేయబడును. మోతాదు రొకటికి 3 లేక 4 బిళ్లలను బుచ్చుకొనవలయును. దీనియొక్క విశేషోపయోగమును గూర్చి గొప్ప డాక్టరులు ఆమోదించియున్నారు.

---

## లైకర్ హైడ్రోజెన్ పెరాక్సైడ్ — Liq. Hydrogen Peroxide.

ఇది శస్త్రసంబంధమున మిక్కిలి యుపయోగింపబడును. ముఖమునకు వన్నె దెచ్చుటకు పూసికొను పరిమళ ద్రవ్యములలోని సుగుణము దీనివల్లనే కలుగు చున్నది. దీని 1 కి 8 సొల్యూషనును, పుంటికును, చీముపట్టిన గాయములకును, సవాయి పొక్కునకును, చెవిలోనుండి వచ్చు దుర్వాసనాసహితమగు స్రావములకును ఉపయోగింపనగును.

పంటిచిగుళ్లనుండి చీము వచ్చినపుడును, డిఫ్తీరియా వ్యాధియందును, గండూష ముగ నుపయోగింపనగును. నాలుకపై పాచిపట్టినపుడు కూడ దీనిని పుక్కిలించి ఉమ్మి వేయుటవలన బ్రయోజనకారిగ నుండగలదు. చీముపట్టిన అన్నివిషయములయందును యిది మిగుల నుపయోగించును.

---

## హెల్మిటాల్ — Helmitol.

ఇదికూడ గ్రంథమం దుదహరింపబడిన పైపరజీన్ తరగతిదే అయియున్నది. మూత్రకోశమున కిది యెట్టిరేగుడలను గలుగజేయదు. మూత్రకోశమునందు క్రిళ్లు స్థితిని బాగుజేయును.

---



# ఆంగ్లేయౌషధగుణదీపిక.

ఈ యౌషధగుణదీపికయొక్క యుద్దేశము, వ్యాధులయం దుపయోగింపదగు పదార్థములయొక్క వివరముల నిచ్చుట, యీపదార్థముల నౌషధములుగ నుపయోగించు విధములను గమనించుట, శరీరావయవములపై నట్టిపదార్థముల (ఔషధముల) యొక్క మార్పుదలలను గలిగించు గుణములను బోధించుట యయి యున్నది.

## కంపౌండింగ్ Compounding.

ఈ సందర్భమున నౌషధములను మిశ్రమమును జేయు విషయమై కొంచెముగా జెప్పదగి యున్నది. దీనికి ఆంగ్లేయభాషయందు కంపౌండింగు అందురు. ఈపనిని బహుజాగ్రత్తతోడను, పరిశుభ్రతతోడను జేయుటయేగాక, తూనికయందు గాని, కొలతయందుగాని కొంచెమైనను హెచ్చుతగ్గులు లేకుండగ నౌషధముల సేకరించుటయు ముఖ్యమై యున్నది. ఈపనిని జేయునప్పుడు పరధ్యానము లేకుండగ బహు శ్రద్ధాభక్తులను వహించియుండవలయును. ఏలనన, నొకవస్తువు నుపయోగించుటకు బదులుగ నింకొకవస్తువు నుపయోగించినయెడల ప్రాణాపాయము దటస్థించుటయు గలుగును.

## తూనిక.

ఔషధములను దూచుటయందు బహు ఖచితముగా నుండవలయును. ఒక ఔన్సునకంటె నెక్కువగ దూచుట యెన్నడును సామాన్యముగ దటస్థించదు. కొన్ని విషయములలో డ్రాములవరకు మాత్రము దూచుటయును, మఱికొన్ని విషయములలో గ్రెయినులవరకు మాత్రమే దూచుటయును, దటస్థించుచున్నది. ఈతూనిక కొఱకై మధ్యస్తంభమును గలిగి యుండి యొకవైపున గాజుపళ్లెము గలిగియుండిన త్రాసును సంపాదించియుండుట మంచిది.

ఈ గాజుపళ్లెము యొక్క ముఖ్యత యేమనగా పులుసుపదార్థముల దూచినను మాలిన్య మేర్పడ జాలదు. మందులను వేయుటకు గాజుపళ్లెరమును, తూనికరాళ్లను వేయుటకు రెండవదైన యిత్తడిపళ్లెమును, ఉపయోగింపనగును. ప్రతితడవయును

తూనిక అయిన పిమ్మట, రెండుపళ్లెములను శుభ్రముగా గుడ్డతో దుడిచివేయుట మిగుల మంచిది. ఇందువలన త్రాసునందు హెచ్చుతగ్గు తూనికలు రాకుండగ జాగ్రతగ జేయుటకు వీలుగ నుండును.

రెండు గ్రెయినులకు లోపుగ దూచవగు అభిని (Morphine) విషముష్టి (Strychnine) మొదలగు బలీయమగు ఔషధముల దూచుటకు బహు సున్నితమైన వేరుత్రాసు నుపయోగించుచు, డ్రాములను దూచుట కుపయోగించు త్రాసునే మందుల కుపయోగింపకుండ నుండవలయును.

## కొలత.

ఔషధములను గొలుచుట తేలికయే గాని, తక్కిన వాటియందువలె దీనియందును జాగ్రతయు నలవాటును నుండవలయును. ఈ కొలతలు గుర్తుపెట్టబడిన వివిధాకారములు గల గాజుకొలతలు అమ్మబడును. ఈకొలతగుర్తులను సూచించు గీతలు రెండువైపులను అనగా ముందువెనుక వైపులను వేయబడియుండవలయును. కొలగ్లాసును యెడమచేతియొక్క బొటన వ్రేలునకును పిమ్మటి రెండువ్రేళ్లకును మధ్యగా బట్టుకొని, కంటితో సమానమైన యెత్తునకు దీసికొని రావలయును. దేనినుండియైతే మందును బోయవలయునో అబుడ్డిని కుడిచేతితో బట్టుకొని, దానియొక్క మూతను యెడమచేతి చిన్నివ్రేలితో బట్టుకొని యుండవలయును. ఈమూతను (కార్కు) ఈప్రకారము బట్టుకొనుటకై కొంతవఱకు అలవాటు కావలయును గాన అట్లు చేయుటలో జారవిడిచి దానిని బగులగొట్టు అపాయమునుండి తొలగుటకు గాను, కొలుచునప్పుడు దానిని విడిగా నుంచుటయే యుత్తమము.

కొలతను సరిగా గుర్తించుటకుగాను ముందు వెనుక వైపుల గుర్తులకు రెండు వైపులను లోనిద్రవపదార్థము సమానపు ఎత్తుగ నుండునటుల జూచుకొనవలయును. డ్రాములను గొల్చుటకు పెద్దదైన ఔన్సు కొలగ్లాసు ఉండును. మినిములను గొల్చుటకు చిన్నదైన డ్రాము కొలగ్లాసు ఉండును. ఔన్సు కొలగ్లాసులో మినిములను గొల్చుట కుపయోగింప దగదు. ఇట్లుచేయుటలో ఖచితమైన కొలతకు భంగము కలుగుట తటస్థించును.

## మిశ్రితౌషధములు Mixtures.

మిశ్రితౌషధములను జేయుటయందు, నియోగింపబడిన ఔషధములను కొలతల ప్రకారము ఒక పెద్దబుడ్డిలో గలుపుటయే అయియున్నది. కాని, దీనిని పద్ధతి ప్రకా

రమును, బహు మెలకువతోడను జేయవలసియుండును. విశేషమైన యనుభవ ముండిననే తప్పు, నియోగింపబడిన ఔషధములబుడ్లన్నియు నొకచోట బెట్టుకొని క్రమ ప్రకార మొక్కొకదానినుండియే వలసినదానిని గైకొనినపిమ్మట రే మందుబుడ్డిని దానిదాని స్థానమం దుంచవలయును.

మిశ్రితౌషధములను జేయుటయందు క్రమము యేమనగా:— టింక్చర్లను గాని యితర ద్రవపదార్థములనుగాని ముందుగా కొలచి, మందును బోయుటకు యేర్పడిన సీసాలో బోయవలయును. వీటిని ముందుగా గలిపి, షరబత్ (Syrup) వగైరాల నేమయినను గలుపుట అవసరమున్నచో పిమ్మట గలిపి, చివరగా నవ సరమగు నీటినిగాని కషాయమును (Infusion) గాని కలుపవలయును. ఎక్కువనీటిలో విడివిడిగా నియౌషధములను గలుపుటకంటె పైపద్ధతి ప్రకారము చేయుట మంచిది. ఒక యౌషధయోగము (Prescription) నందు, 8 ఔన్సుల మిశ్రితౌషధ మునకు రెండు ఔన్సుల టింక్చరులును, ఒక ఔన్సు జిగురు (Mucilage) ను 5 ఔన్సుల జలమును, నియోగింపబడినయెడల, టింక్చర్లకు ముందుగా నీ జిగురును గలిపినయెడల నంతయు ముద్దయగును; అట్లు గాకుండునటుల నీటిని గలిపిన పిమ్మట నీ జిగురును చివరగా గలుపవలయును; లేదా, యీజిగురును అవసరమగు నీటిలో గలిపియుంచుకొని, అట్టినీటిని యీటింక్చర్లను గలుపవలయును. ఇట్టివేయగు నితర బాధకము లేమయినను దటస్థించినచో సామాన్యజ్ఞానమువలనను అనుభవము వలనను గ్రహించి సద్దుబాటు చేసికొనవచ్చును. ఒక్కవిషయము మాత్రము, బహుజనులు అశ్రద్ధ చేసెడి దైనను, జాగ్రతను వహించదగిన యంశమై యున్నది. మిగుల విషపదార్థమైన దానిని, అనగా నాభి (Aconite), పాషాణము (Arsenic), విష ముష్టి (Strychnine), ప్రూసిక్ అసిడ్ (Prussic Acid) మొదలగునవి ఔషధ యోగమునందు నియోగింపబడినయెడల వీటిని జివరగా జేర్చుటను ముఖ్యసూత్రముగా బెట్టుకొనవలయును; ఇట్లు జేయుటవలన నియౌషధములను పొరబాటుగా నైనను రెండుసారులు జేర్చుట తప్పిపోవును; ఇట్టిది ఒకటికి రెండుసార్లు వేసినయెడల ప్రాణాపాయము తటస్థించును. అన్ని మిశ్రితౌషధములును జివరకు బాగుగ గలప బడుట మంచిది.

బిస్మత్ సబ్నైట్రిస్ (Bismuth Subnitras) మొదలగు కొన్నివస్తువులు నీటి లో గలువవు. అట్టివాటిని నీటితోజేర్చి, జిగురుతో గలిసిననీళ్లను బోసి మార్టర్ (రాతిరోలు)లో గలియబెట్టినయెడల గలిసిపోవును.

## జలము.

మిశ్రితౌషధములయం దుపయోగింపబడు జలము, ఆవిరి చల్లార్చబడి చేయబడినదైనయెడల శ్రేష్ఠము. అట్టిది వీలుకానియెడల సామాన్యముగ ద్రాగెడి నీటిని మసలగాచి చల్లార్చి ఉపయోగింపనగును. ఇట్లు మసల గాచుటవలన నందలి జంతుజాలము లన్నియు నశింపు నందును.

## మోతాదు.

ఈగ్రంథమునందలి మోతాదులు ఇంగ్లాండుదేశమునందు సర్వజనులకు ప్రమాణగ్రంథమగు "బ్రిటిష్ ఫార్మకోపియా" ననుసరించి వ్రాయబడినవి. ఈ ఫార్మకోపియాతో సంబంధించని కొద్దిపాటి యితర ఔషధములకు నితర ప్రమాణ గ్రంథములను బట్టి మోతాదులు యేర్పరచబడినవి. ఇందలి మోతాదులు సామాన్యగతులయందు, వయస్కుల కేర్పరుపబడియున్నవి. శరీరతత్వమును, ఇతరసందర్భములను అనుసరించి మోతాదులందు వివేచనయుతమగు కొద్దిమార్పులను జేసికొనినను జేసికొనవచ్చును. పటిమ తక్కువవారికిని, దుర్బలులకును, పసివారలకును మోతాదులు తగ్గించవలసి యుండును. సుకుమారులగు స్త్రీలకును అదేప్రకారము మోతాదును తగ్గించవలసి యుండును.

డాక్టరు యంగ్ గారియొక్క పద్ధతినిబట్టి నిర్మితమైన మోతాదును $\frac{\text{రోగియొక్క వయస్సు}}{\text{రోగియొక్క వయస్సు} + 12}$ చే గలిగిన భిన్నము ప్రకారము, అసలు మోతాదునందు భాగము నేర్పరచి యియ్యవలయునని స్థిరపరచి యున్నారు. ఎట్లనగా వయస్కునకు 1 గ్రెయిను మోతాదుగ నేర్పరుపబడిన ఔషధము, యీక్రిందిప్రకారము వయస్సునుబట్టి మోతాదును స్థిరపరుప నగును.

| | | |
|---|---|---|
| 1 సంవత్సరము వయసుగల బిడ్డకు | ... $\frac{1}{1+12}=\frac{1}{13}$ | గ్రెయిను. |
| 2 సం॥ల | ,, ... $\frac{2}{2+12}=\frac{1}{7}$ | ,, |
| 3 సం॥ల | ,, ... $\frac{3}{3+12}=\frac{1}{5}$ | ,, |
| 8 సం॥ల | ,, ... $\frac{8}{8+12}=\frac{2}{5}$ | ,, |
| 12 సం॥ల | ,, ... $\frac{12}{12+12}=\frac{1}{2}$ | ,, |

ఇందు, ఈ క్రింది సూచనాక్షరములను గమనింపనగును. డ్రా.=డ్రాము; గ్రె.= గ్రెయిను; మి.= మినిము. మొ= మొదలు. సాలిడ్ అనగా ఘనపదార్థము. లిక్విడ్ అనగా ద్రవపదార్థము.

---

## ఘనపదార్థముల తూనిక.

| | | | |
|---|---|---|---|
| 20 గ్రెయినులు | ... | ... | 1 స్క్రూపులు |
| 3 స్క్రూపులులు | ... | ... | 1 డ్రాము |
| 8 డ్రాములు | ... | ... | 1 ఔన్సు |
| 12 ఔన్సులు | ... | ... | 1 పౌను. |

## ద్రవపదార్థముల కొలత.

| | | | |
|---|---|---|---|
| 60 మినిములు | ... | ... | 1 డ్రాము |
| 8 డ్రాములు | ... | ... | 1 ఔన్సు |
| 20 ఔన్సులు | ... | ... | 1 పైంటు |
| 8 పైంట్లు | ... | ... | 1 గాలను |

ఈ క్రిందిపట్టీ వివిధవయసులయందు నుపయోగింపదగిన మోతాదులను దెలుపుచున్నది. ఘనపదార్థములకు, త్రాసును తూనికరాళ్లును ఉపయోగించవలసి యుండును. ద్రవపదార్థములయందు, గ్రెయినులకు బదులుగా మినిములు వాడవలసి యుండును. 5 మినిములకు లోపుగా నున్నయెడల చుక్కలుగా వాడవలసి యుండును.

| వయస్సునందు, యీ క్రింది వయస్సును మించియున్నప్పుడు. | పెద్దమోతాదు ఒక ఔన్సు అయియున్నప్పుడు | పెద్దమోతాదు ఒక డ్రాము అయియున్నప్పుడు | పెద్దమోతాదు 1 స్క్రూపులు అయియున్నప్పుడు |
|---|---|---|---|
| 1 నెల | 24 గెయినులు | 3 గ్రయినులు | 1 గ్రెయిను |
| 6 నెలలు | 2 స్క్రూపులులు | 5 గ్రె|| | 1¾ గ్రె|| |
| 1 సం|| | 1 డ్రాము | 8 గ్రె|| | 2½ గ్రె|| |
| 2 సం|| | 1¼ డ్రా|| | 9 గ్రె|| | 3 గ్రె|| |
| 3 సం|| | 1½ డ్రా|| | 12 గ్రె|| | 4 గ్రె|| |
| 5 సం|| | 2 డ్రా|| | 15 గ్రె|| | 5 గ్రె|| |
| 7 సం|| | 3 డ్రా|| | 20 గ్రె|| | 7 గ్రె|| |
| 10 సం|| | 4 డ్రా|| | ½ డ్రా|| | ½ స్క్రూ|| |
| 12 సం|| | 5 డ్రా|| | 40 గ్రె|| | 14 గ్రె|| |
| 15 సం|| | 6 డ్రా|| | 45 గ్రె|| | 16 గ్రె|| |
| 20 సం|| | 7 డ్రా|| | 50 గ్రె|| | 18 గ్రె|| |
| 21 సం|| | 1 ఔన్సు | 1 డ్రా|| | 1 స్క్రూ|| |

దీనినిబట్టి చూడగా 21 సం॥ల వయసుగల యొక మనిషికి పెద్ద మోతాదు ఒకఔన్సు అయియున్న ఔషధము, ఒక నెలకును అరునెలలకును మధ్యవయస్సునందున్న శిశువునకు, ఘనపదార్థ మయియున్న యెడల 24 గ్రేయినులను, ద్రవపదార్థ మయియున్న యెడల 24 మినిములును యియ్యవలయును. అదేవయసుగల యొక మనిషికి పెద్దమోతాదు 20 గ్రేయినులుగాని 20 మినిములుగాని అయియున్నయెడల అదేమందు 7 సం॥ల వయసుగల పిల్లవానికి, ఘనపదార్థమయి యున్నయెడల 7 గ్రే యినులును, ద్రవపదార్థమయియున్న యెడల 7 మినిములును, ఉపయోగించవలయును; ఒక నెలవయసునందున్న శిశువునకు ఒక గ్రేయిను గాని, ఒక చుక్కగాని యియ్యవలసి యుండును.

---

# ఔషధములు.

## వాటి లక్షణములు, గుణములు.

### గం అకేసియా Gum Acacia.

గం అకేసియా అనగా తుమ్మజిగురు. తుమ్మచెట్టుయొక్క లేతచిగుళ్లను, పంచదారతోడను నీటితోడను నూరి ఉదయమునను సాయంకాలమునను యిచ్చినయెడల దగ్గులయం దుపయోగించును.

తుమ్మబెరడుకషాయమును పిచికారీచేయుటవలన సెగరోగమునందలియు కుసుమవ్యాధి యందలియు స్రావమును నిలుపుజేసి, దురదను తగ్గించును. ఇందులకు పరిశుభ్రమయిన నీటి నుపయోగింపవలయును. ఈకషాయమును, కొరుకుసంబంధమగు పంటిచిగుళ్ల జబ్బులకు పుక్కిలించి ఉమ్మివేయుటవలన. నుపశాంతి గలుగగలదు.

లేతచిగుళ్లను నూరి, ఉడుకబెట్టి, మాలిన్యముతోగూడిన కురుపులకు నుపయోగింపనగును.

తుమ్మబెరడును చిన్న చిన్న ముక్కలుగాగొట్టి, $1\frac{1}{2}$ ఔన్సులయెత్తుగల యీ ముక్కలను పది నిముషములవఱకు ఉడుకబెట్టి, వడియగట్టి, యిట్లు తయారైన కషా

యమును ½ ఔన్సు మొదలు 2 ఔన్సుల వరకుగల మోతాదుచొప్పున దీర్ఘవ్యాపిత మగు అతివిరేచనములయం దియ్యనగును. ఇది అతిమూత్రవ్యాధియందును నుపయోగ పడును.

లేతచిగుళ్లను ముద్దగాగొట్టి అతివిరేచనముల యందును, బంకవిరేచనముల యందును, నుపయోగింతురు.

తుమ్మబెరడుయును, బాదంకాయయొక్క పైపేళ్ళను, కాల్చి, మెత్తగా పొడికొట్టి, యిందులో కొంచెము ఉప్పును గలిపినయెడల, మంచిపండ్లపొడియగును.

తుమ్మజిగురును పొడిగా గొట్టి క్వినీన్ సల్ఫేట్ పొడిలో గలిపి యిచ్చిన యెడల నతివిరేచనములతో గాని బంక విరేచనములతో గాని కూడియున్న జ్వరమున కుపయోగించును.

ఈజిగురుయొక్క పొడిని కోడిగుడ్డులోని తెలుపుతో గలిపి కాలినసలముల యం దుపయోగింతురు. ఈపొడినే నేతిలో వేగించి యిచ్చినయెడల, బలవర్ధ కౌషధ ముగను, మైథునసంబంధమగు దుర్బలత్వమును బోగొట్టునదిగను, నుపయోగింపగలదు.

మిశ్రితౌషధములయందు గలువని బిస్మత్ సబ్నైట్రస్ మొదలగు పౌడర్లను గలియునట్లు చేయుటకు యీజిగురుయొక్క పొడిని ఉపయోగింతురు.

---

## ఆసిటిక్ ఆసిడ్ గ్లేసియేల్ — **Acetic Acid Glaciale.**

నీటివర్ణము గలిగిన ద్రవము; పులుసు వాసనతోడను, మిగుల ఘాటుగను నుండును; బలమైన పొక్కు గుణము కలదు. పొక్కుట కుపయోగించిన యెడల మిగుల బాధ పెట్టును.

ఉపయోగము— లోని కియ్యరాదు. పులిపిరికాయలకు పైనరాయుటవలన నూడిపోవును.

విరుగుళ్లు—సీమసున్నమును నీళ్లను గలిపి యియ్యవలయును; పిమ్మట పాలు గాని, కోడిగ్రుడ్డులోని తెలుపుగాని, బాదంనూనెనుగాని గాని, యియ్యవలయును.

### ఆసిటిక్ ఆసిడ్ అఫిషియల్ - Acetic Acid Official.

ఉపయోగము— తామరకు పైన రాయవలయును.

## ఆసిటిక్ ఆసిడ్ డిల్యూట్- Acetic Acid Dilute.

మోతాదు— అరడ్రాము మొదలు రెండుడ్రాములవఱకు. ఒక పాలు ఆసిటిక్ ఆసిడ్ (అఫిషియల్)ను ఏడుపాళ్ల నీటితో గలిపినయెడల ఆసిటిక్ ఆసిడ్ డిల్యూట్ అగును. జ్వరగలియందు వంటిపైన రాచినయెడల జల్లగ నుండును. లోనికిచ్చినయెడల మూత్రమును ప్రకోపింపజేయును.

---

## ఉప్పు — Sodium Chloride (Common Salt).

ఉప్పునకు సంస్కృతమున లవణమందురు; ప్రకృతియందు సముద్రజలములో నూటికి 2½ చొ॥ అనగా నలుబదియవవంతు యీ యుప్పు యేర్పడుచున్నది. జీవ రాసుల కుండెడి యీ యుప్పుయొక్క యావశ్యకతను గుర్తించియే భగవంతుడు దీని నింత విరివిగా సృజించుట యందలి యుద్దేశ్యమై యుండును. సముద్రజలమును భూమిపై జేయబడిన మడులలోనికి జేర్చి దానిని యారబెట్టుట మొదలగు పనులను జేయుటచే నది తయారగును. ఇది గాక సముద్రప్రాంత స్థలములయందు గలుగు పోటుపాటుల మూలమున దానంతట నదియే గూడ నేర్పడుచుండును. ఇండియా దేశమునం దిది సర్కారుతనిఖీ క్రింద తయారు కాబడును. ప్రజ లెవ్వరును స్వతంత్రముగ దీనిని తయారు చేయరాదు.

ఇది పెద్దనైనగాని చిన్ననైనగాని పలుకులుగా నుండి తెలుపుగాని, యెరుపు గాని, నల్లమన్ను గలిసినచో గొంచెము నలుపుగాని, వర్ణమును వహించి యుండును. దీని నౌషధముగ సేవించుటయందు శుభ్రపరచవలసి యుండును. ఎట్లనగా కొంత ఉప్పును విరివైన జలములో గలిపి దానిని తేరుకొన నియ్యవలయును. ఉప్పుభాగ మంతయు నీటిలో గలిసిపోవును. అందుండెడి మన్నుపదార్థ మంతయు నడుగునకు దిగును. అద్దానిని విడిగా దీసి పారవేయవలయును. మరి యే మాలిన్యమైనను యింకను యీ మిశ్రితద్రవము నాశ్రయించి యుండిన యెడల నా నీటిని సన్నని గుడ్డద్వారా వడియగట్టుటచే నా మాలిన్యమును దొలగింపవచ్చును. ఇక మిగిలిన నీ లవణహితజలము నొక కుండలో మఱిగ గాచవలయును. నీరంతయు నావిరిగా బోయిన పిమ్మట నడుగున పరిశుద్ధమగు నుప్పు సన్నని స్ఫటికములుగ నిలుచును. దీని నొక గాజుకార్కుగల సీసాలో భద్రపరచి వలయునపు డౌషధసేవనముల కుప యోగించనగును.

ఉప్పు క్రిములకుండ జేయును. జ్వరసంబంధములగు విషముల హరింపజేయును. క్రిమిహారము; శరీర వ్యాపారములయందు గలుగు కొన్ని యాటంకముల దొల

గించును. ఈ లవణము మన శరీరనిర్మాణములోని యొక భాగమై యున్నది. శరీరమునం దంతటను సుమారు 3,000 గ్రెయినుల లవణ ముండుచున్నది. ఇందు 300 గ్రెయినులు మాత్రము స్వేదము, మూత్రము, మొదలగు వానిగుండా వెలువడుచు ఆహారపదార్థముల మూలమున భర్తీ చేయబడుచుండును. రక్తమునందలి "గ్లాబ్యులిన్" నాబడు యొక అంతర్భాగ పదార్థమును గడ్డకట్టకుండ ద్రవరూపమున నుండునట్లు చేయుటయం దిది సహాయపడుచున్నది.

స్వేదము, మూత్రము, కన్నీరు మొదలగువానిద్వారా యీయుప్పు కొంత వెలువడిపోవుచున్నది. కావున, శరీరమునందు దీనిలోపమేర్పడిన చివరకు మరణము గూడ దటస్థించును. దీనియొక్క యుపయోగమువలన జీర్ణాశయమునందు జాఠర రసోత్పత్తి (Gastric juice) అధికమగును. కాబట్టి, అజీర్ణవ్యాధివలన బాధనొందు వారు దీనిని జాగ్రతగా నుపయోగింపవలయును. స్థూలశరీరులు, సంజూవ్యాధిపీడితులు, అధికదాహబాధ నొందువారు, చర్మవ్యాధిగ్రస్తులు - దీనిని మితముగా నుపయోగించ వలయును. సముద్రజలములోని లవణములో కొంచెముగా "అయొడిన్" పదార్థ ముండియున్నది. ఇయ్యది గండమాలా (Goitre) వ్యాధియును గ్రంథులయొక్క వాపుదలయును గలుగకుండజేయును.

సముద్రమునకు దూరముననున్న అమెరికాలోని మధ్యయునైటెడ్ స్టేట్సులో గండమాలావ్యాధి పీడితు లెక్కువగనున్నారు. అచ్చటికి సముద్రము చాలదూరమున నుండియున్నది. సముద్రమధ్యముననున్న యింగ్లాండునం దీ వ్యాధిగ్రస్తులు చాల తక్కువగ నున్నారు.

కొద్దిమోతాదులలో లవణము నోటిలోనియు జీర్ణాశయములోనియు గ్రంథుల యొక్క స్రావము నధికపరచును; అది దాహమునుగల్పించి ద్రవాహారమును శరీరము నందు గ్రహింపజేయును, ఆకలిని గలిగించి, శాకాహారముయొక్క జీర్ణతను వృద్ధి పరచును; ద్రవరూపమున రక్తములో బ్రవేశించి కొన్ని ఘనపదార్థములను కరగింప జేయును.

పెద్ద మోతాదులలో నిచ్చినయెడల అంతరావయవముల యొక్క పొరలకును, స్నాయువులకును, నరములకును రేగుదలను గలుగజేయును. దీనిని విశేషముగ వైద్యుదిన యెడల నాయాస్థానములు పొక్కుదలనంది యెఱ్ఱబడును. పెద్దమోతాదు నుపయోగించినయెడల ఆమస్రావము తగ్గి, వెలువడిన స్రావములను శరీరమే మరల గ్రహించుకొనును. ఈలవణము మూత్రము ద్వారా వెలువరింపబడును. పెద్ద మోతాదు

లలో అనగా 2 డ్రాములు మొదలు 4 డ్రాములవరకు ఉప్పు వాంతికారిగ బని చేయును; ఇంకను పెద్దమోతాదులలో బలమైన విరేచనకారిగ వర్తించును.

ఉపయోగములు.

ఉప్పు:—ఇయ్యది రక్తముయొక్కయు సామాన్యముగ శరీరముయొక్కయు నొకభాగమగుటచే, ఆహారపదార్థమగుచున్నది. ఇండియా దేశమునం దూరుగాయలలో దీనిని విశేషముగ నుపయోగింతురు. లవణానందస్వామి యుప్పుయొక్క యుపయోగ మునుగూర్చి మిగుల గొనియాడుచున్నాడు. ఇంగ్లాండుదేశమునందు సంవత్సరమునకు మనిషి యొకటికి 72 పౌనులును, అమెరికాలోని యునైటెడ్ స్టేట్సు రాష్ట్రములో మనిషియొకటికి 48 పౌనులును ఉప్పు నుపయోగించుటచే నీ దేశములయందు మనిషి సకటున 45 సంవత్సరములు జీవించుచున్నాడనియు, యిండియాదేశమునందు మనిషి యొక్కంటికి 12 పౌనులు మాత్రమే యుపయోగించుటవలన నీ దేశమందు మనిషి యొక్క సకటు జీవితము 23 సంవత్సరములవరకు మాత్రమే యేర్పడియున్నదనియు నీయన చెప్పుచున్నాడు. నాసికాద్వారమును ఉప్పునీళ్ళతో గడుగుటమూలమునను, ఉప్పునీళ్ళను త్రాగుటమూలమునను, ఆరోగ్యాధిక్యత కలుగ గలదని యీయన బోధించుచున్నాడు.

మద్రాసులోని అడయారు దివ్యజ్ఞానప్రకటనాగృహమువారు యుప్పును ఆహారపదార్థముగా నెంతమాత్రము నుపయోగింపరాదని యొక ప్రకటనను గావించిరి. ఆయుర్వేద చికిత్సలో మహోదరము - జలోదరము (Dropsy) వ్యాధియం దుప్పు యొక్క యుపయోగము పూర్తిగ నిషేధింపబడియున్నది. భగవద్గీతయందు లవణాహారము "బాధ, విచారము, వ్యాధి"ని కలుగజేయునని చెప్పబడియున్నది. ఎట్లున్నను, అధికమైనట్టియు, అవ్యక్తమైనట్టియు పదార్థని దీని నుపయోగించుట మానవలసియే యున్నది. ఔషధముగా కొద్ది మోతాదులలో దీనిని బలవర్ధకౌషధముగా నుపయోగింపవచ్చును. జ్వరములయందును, అజీర్ణవ్యాధియందును, పైత్యహితమగు అతి విరేచనముల యందును, నిది యుపయోగించగలదు. ఈక్రింది ఔషధయోగమును గమనింపనగును.

| | | | |
|---|---|---|---|
| సామాన్యలవణము | ... | ... | 1 తులము |
| వాము | ... | ... | 1 తులము |
| పిప్పలికట్టె | ... | ... | 1 తులము |
| శొంఠి | ... | ... | 1 తులము |
| కరక్కాయ | ... | ... | 1 తులము |

వీనినన్నిటిని యెండబెట్టి పొడికొట్టి 20 గ్రై॥ మొదలు 60 గ్రై॥ వరకు నగు మోతాదులో దినమునకు రెండుసారులు చొప్పున జీర్ణకారిగ నుపయోగింపనగును. తేనెతో నియ్యవచ్చును.

శ్వాసను బీల్చుటయందు కష్టముతోగూడిన తీవ్రమగు అజీర్ణవ్యాధియందు పొడి యుప్పు నొకచిటికను నాలుకపై వేసికొనినయెడల నది వెంటనే కరగి గ్రంథులపై బనిచేయుటచే నోటినిండ నుమ్మిద్రవమేర్పడి - యద్దాని మ్రింగుటచే జీర్ణాశయము నందేపదార్థము జీర్ణముకాకుండినను - ముఖ్యముగా పిండిపదార్థములు - వెంటనే జీర్ణమగుటకు సహాయపడును.

టైఫాయిడ్ జ్వరమునందుప్పుయొక్క యుపయోగమునుగూర్చి "ఇండియన్ మెడికల్ రికార్డు"యను పత్రికయందొకరిట్లు వ్రాయుచున్నారు.

"టైఫాయిడ్ జ్వరములో నేను స్వస్థావస్థ నందుచున్నపుడు యీ చికిత్సవలన నా ప్రాణము రక్షింపబడినది. నే నీ పద్ధతిని గూర్చి చాలమందికి జెప్పియుంటిని. వారందువలన లాభము నందిరి. వేడినీటిలో గాని చన్నీటిలోగాని కలిపినదానికంటె పొడియుప్పు నుపయోగించుటవలన నది బాగుగా బనిచేయును. ఏలనన—నీటితో గలియుటవలన నది నోటిలోని గ్రంథులకు చురుకుదనమును బుట్టింపజాలదు."

అమెరికాదేశమునందలి జీవ-రసవాదశాస్త్రజ్ఞులు (Bio-chemists) తమ పరిశోధనల మూలమున లవణప్రయోగమువలన రక్తమునందలి యూరిక్ అమ్లము తగ్గునని కనిపెట్టి యున్నారు. ఈ యూరిక్ అమ్లవిశేషతయే కీళ్ళనొప్పివ్యాధిని గలుగజేయుచున్నది.

అట్లాంటిక్ మహాసముద్రమధ్యమున అయిదు నిలువులలోతున నున్న జలమును వ్యాధులను గుదుర్చుటయందుపయోగించుచున్నారు. పాండువ్యాధి, జీర్ణాశయ వ్రణము, జలుబు, నాడీవ్యాధి, నాడీబలక్షయము— యీ వ్యాధులయందు దద్భుతముగ బనిచేసినట్లు చెప్పబడుచున్నది.

నూటికి రెండుపాళ్లవంతున లవణమునుగలిపిన నీటి యుపయోగమువలన వాంతులు కట్టినట్లు అమెరికాలోని కొందరు గొప్ప డాక్టర్లు చేసియున్న పరిశోధనల వలన గనుగొని యున్నారు. ఉపశాంతి వెంటనే కలుగును. పట్టు యెక్కువకాల ముండక పోవచ్చును.

భోజనానంతరము వాంతి వచ్చునట్లుండుట, నొప్పి- వీనితోఁగూడిన పేగులలోని వ్రణములలోఁగూడ, ఒకగ్లాసు చల్లనినీటిలో నొక టీస్పూన్ లవణమును గలిపి యిచ్చిన యెడల-తాత్కాలికమైనను-ఉపశాంతి కలిగినట్లు తెలియుచున్నది.

చలిజ్వరచికిత్స.

చలిజ్వరములలో—ఒకటి లేక రెండు మోతాదుల సామాన్య లవణము మంచి నమ్మకమగు నౌషధముగ బనిచేయగలదని డాక్టరు బ్రూక్స్ చెప్పుచున్నాడు. దాని యొక్క యుపయోగమునకీ క్రింది పద్ధతి నాయన దెలిపియున్నాడు.

"పరిశుభ్రముగా గడిగిన యొకపెనమును పొయ్యిపైన బాగుగా గాలవేసి, అది బాగుగా కాలిన పిమ్మట పరిశుద్ధమగు లవణమును చేతికి నిండుగా వచ్చినంతదానిని ఆపెనముపైనవేసి లవణమునందలి తేమ పోవునట్లుగా గాచవలయును. పిమ్మట లవణమునకు గోధుమవర్ణము వచ్చునంతవరకును గాచవలయును. పెద్దవారలకు యీ లవణములోని ఒకఔన్సును మోతాదుగ నియ్యవలయును. ఒకగ్లాసు వేడినీటిలో నీఔన్సులవణమును గలిపి, దినము విడిచి దినమునకు జ్వరము వచ్చెడి విషయములో. జ్వరము వచ్చెడి దినమునకు వెనుకటి దినపుటుదయమున పరగడుపున (కడుపులోనికి మరేమియు నియ్యకుండ) నియ్యవలయును. ప్రతిదినమును వచ్చెడి చలిజ్వర విషయములో జ్వరము తగ్గిన పిమ్మటగాని, చలి తగ్గిన పిమ్మటగాని, పరగడుపున నియ్యవలయును. ఒక్కొక్కసారి ఒకఔన్సుకంటె నెక్కువగ నియ్యరాదు; తక్కువగ నిచ్చినను లాభములేదు.

"జీర్ణాశయమునందే యితరపదార్థమును లేకుండ దీనిని బుచ్చుకొనిననే దప్ప ప్రయోజన ముండజాలదు. కాబట్టి, తత్పూర్వము ఆహారమేగాని జలమేగాని, దేనియు నియ్యరాదు. ఈమందును బుచ్చుకొనిన వెంటనే రోగికి మిగుల దాహము కలిగినను జలముదప్ప నితరపదార్థమేదియు లోని కియ్యరాదు. మందును తేసికొనిన 24 గం టలవరకును కొంచెము వేడిగానున్న జలమునుమాత్రమే కొద్దిపరిమాణములలో వలసి నప్పుడెల్ల త్రాగుచుండవలయును. అనంతరము, ఆకలి అధికముగానుండిన యెడల తేలికగా జీర్ణమగు ద్రవాహారము దేనినైన నియ్యనగును. మందును సేవించిన 48 గం టలవరకును యితర ఆహారము నియ్యరాదు. ఈఆహారజాగ్రతను గమనించనియెడల మందువలన ప్రయోజన ముండజాలదు. ఈ కాలములో శరీరమునకు చలిగాలితగుల కుండ గాపాడవలయును." తన పదునెనిమిది సంవత్సరముల యనుభవములో పైపద్ధతుల నవలంబించుటవలన నెట్టిచలిజ్వరవిషయమందును గుదరికనందుటలో నపజయము

నందలేదని డాక్టర్ బ్రూక్స్ చెప్పుచున్నాడు. ఈపద్ధతిని చికిత్సనందిన ప్రతిరోగి యును 48 గంటల యనంతరము వ్యాధిరాహిత్యత నందియుండెనని ఆయన చెప్పుచున్నాడు. ఏరోగికిని రెండవసారి యీమందు నిచ్చు ఆవశ్యకమే కలుగలేదు. హంగరీదేశమునందును అమెరికా దేశమునందును వందలకొలది చలిజ్వరపీడితులీచికిత్స నందుచుందురు.

శస్త్రక్రియానంతరముగాని గర్భాశయ రక్తస్రావమునందుగాని, రోగి నీరసత నందుచుండినపుడు, లవణహితమగు జలమును యింజక్షనుగాని యెనీమాకుగాని యుపయోగింతురు. కలరావ్యాధియందు రాజర్సు మిక్శ్చరును యింజక్టుచేయుట శ్రేష్ఠము. ఈ మిక్శ్చరునందు, 2 డ్రాముల లవణము, 6 గ్రా॥ పొటాసియంక్లోరైడ్, 4 గ్రా॥ కాల్సియంక్లోరైడ్—20 ఔన్సుల జలముతో గలిసి యుండును.

ఇతరచికిత్సోపయోగము.

వాంతులతోడను, విరేచనములతోడను గూడిన ప్లేగ్ విషయములలో మామూలు లవణసహిత జలమును యింజక్టు చేయదగునని డాక్టర్ సేన్ చెప్పుచున్నాడు. ప్రాణాపాయస్థితిలో నున్నపుడు సామాన్యముగ నిట్టి యింజక్షనులను వైద్యులిచ్చుచునే యుందురు.

సామాన్యజనులుగూడ లవణమిశ్రిత జలమును నాసికాద్వారమునగాని, నోటి మూలమునగాని, రోగికి లోనికిచ్చిన యెడల నదేఫలితముగాని అంతకంటె మెఱుగు ఫలితముగాని కలుగవచ్చును. ఫ్రాన్సు దేశమునందు, లోతుగల సముద్రమునందలి జలమును బిడ్డలయొక్క సజీవత్వము నభివృద్ధిచేయుట కిచ్చుచుందురు. లవణసహిత జలమును సేవించుటవలనను యదేఫలితము కలుగును. ఈ లవణసహిత జలమును ముక్కుతో బీల్చుటవలన ఇన్ఫ్లూయంజావ్యాధిని, యితర శ్వాసకోశ అస్వస్థతలను, రాకుండచేయవచ్చునని యొప్పుకొనిన యంశమే యైయున్నది. లవణసహిత జలము నుపయోగించుటమూలమున న్యుమోనియావ్యాధి నడ్డగింపగలము.

బిడ్డలకు లవణసహితజలముతో ముక్కును శుభ్రపరచుట మిగులకష్టమైన పని కాదు. ఒకశేరు నీటి కొక తులముచొప్పునగాని లేక ఒకఔన్సుజలమునకు 6 గ్రైయినులచొప్పునగాని – లవణపుపొడిని గలిపి మిశ్రితజలమును సిద్ధపరచవలయును. బిడ్డయొక్క ముక్కులోను నోటిలోను కొద్ది చెమిచాల జలమును బోయవలయును. ప్రతి రక్త విషయుత స్థితియందును రక్త నీరసస్థితి యందును సామాన్య మోతాములో

గోరువెచ్చని లవణసహితజలమును నోటిద్వారా విరివిగా నియ్యనగునని డాక్టరు హెచ్. సి. సేక్ చెప్పుచున్నాడు. ఇట్టి ప్రయోగానంతరము జీర్ణాశయమునుండి వాంతి కాకుండినయెడల, యితరవిధముగా - అనగా - యింజక్షను మూలముగగాని ఎనీమా మూలముగగాని, దీని నియ్యరాదని యాయన అభిప్రాయ మిచ్చుచున్నాడు.

దీనిని యెనీమామూలమున - అనగా ఆసనముద్వారా యిచ్చినయెడల కడుపుబ్బరమును బోగొట్టి, కడుపునొప్పికి శాంతినికలుగజేసి, పెద్దపేగులలోనున్న పురుగులను (నులిపురుగులు మొదలైనవి) నశింపజేసి వెలువరింపజేయుచు, మూర్ఛయొక్క యుధృతగతిని దప్పించును.

ఉధృతమగు తలనొప్పివిషయములో దీనిని పొడుముగా బీల్చనగును. గాయములనుండి గలుగు రక్తస్రావము నాపుటకుగాను నూటికి కొకటి వంతున గలిపిన లవణమిశ్రితజలము నుపయోగింపనగును. జలుబువిషయములో దీని పొడుమును బీల్చ నగును. గొంతుసంబంధమగు దీర్ఘవ్యాపిత వ్యాధులలో దీనిని గండూషముగా నుప యోగింప నగును.

సిల్వర్ నైట్రేటును మ్రింగిన విషబాధలలో దీనిని విఱుగుడుగను, జలగను మ్రింగుట దటస్థించిన విషయము లందును, దీని నుపయోగింప నగును.

కీళ్ళనొప్పులకును, గండమాలసంబంధమగు గ్రంధుల వాపుదలయందును, వేగించబడిన యుప్పు కాపడముల కుపయోగింపబడును. ఒక పౌను లవణమును వేగించిన పిమ్మట దాని నొక వదులైన సంచిలో వేసి పొత్తికడుపుపైన 20 నిమిషములు మొదలు 30 నిమిషముల వరకు గాపడమును బెట్టినయెడల అజీర్ణమువలన గలిగిన శూలనొప్పికి గుణము గనబడును.

ముప్పదిపాళ్ళ కొకపాలు లవణముతో గలిపిన జలము, వివిధములగు చర్మ వ్యాధులకును, కీళ్ళనొప్పులు, స్నాయునొప్పులు, బెణుకులు మొదలగు వానియందు పైపూత కుపయోగింపబడును.

మిగుల బడలిక నందిన విషయములలో నీ క్రిందిపద్ధతి నొక ప్రసిద్ధ వైద్య శాస్త్రజ్ఞుడు సలహా నిచ్చుచున్నాడు.

"రెండుపైంట్ల (40 ఔన్సులు) ఉష్ణజలములో 4 ఔన్సులసముద్రలవణమును గలిపి, చల్లారునంతవరకును అట్లుంచవలయును. 8 ఔన్సుల ఆల్కహాల్ (స్వచ్ఛ

మగుసారాయి)లో విడిగా 2 ఔన్సుల స్పిరిట్స్ ఆఫ్ అమ్మోనియాను 2 ఔన్సుల స్పిరిట్స్ ఆఫ్ క్యాంఫర్‌ను గలుపవలయును. ఈ రెండవ మిశ్రితౌషధము నంతట మొదటిదానితో గలుపవలయును; కలిపినపిమ్మట బాగుగా గదలించవలయును. ఒక స్పంజిని యీ లోషనులో దడిపి యద్దానితో నొడలంతయు,దడియునట్లు బలముగా రుద్ది శరీరమునకు వేడి కలుగునట్లు చేయవలయును. బడలికయంతయు మాయమై రోగి సునాయాసమైనట్టియు ఆనందహితమైనట్టియు నిద్రినందును.'' ప్రతిదినము దంతములను శుభ్రపరచుటకుగాను లవణసహితజలము మిక్కిలి శ్రేష్ఠమని జార్జిచక్రవర్తిగారి శస్త్రవైద్యులును దంతవైద్యులునగు సర్ హ్యారీ బాల్డ్విన్‌గారు సెలవిచ్చియున్నారు.

జంతుపదార్థములగు మాంసము మొదలైనవి క్రుళ్లకుండ నుండుటకుగాను లవణమును మిశ్రిత మొనరించినయెడల వానియొక్క ఆహారపువిలువ తగ్గిపోవుచున్నది. కాబట్టి, లవణముతోగూడిన మాంసముకంటె తాజామాంసము మిగుల మంచిది.

---

## ఆర్సెనియస్ ఆసిడ్ - **Arsenious Acid.**

దీనినే ఆర్సెనిక్ (Arsenic) అనియు, వైట్ ఆర్సెనిక్ (White Arsenic) అనియు అందురు. తెలుగులో ఉల్లిపాషాణ మందురు.

మోతాదు—1/60 గ్రె॥ మొదలు 1/15 గ్రె॥ వఱకు.

నూరుపాళ్ళ నీటిలో గలిసిపోవును. పాషాణసంబంధమగు మందు లన్నియు భోజనానంతర మియ్యవలయును. దీనిని బలవర్థకౌషధముగ వాడవచ్చును; ఉచ్ఛ్వాస నిశ్వాససంబంధ మగు శక్తిని బలపరచి, ముఖమునకు వర్చస్సును గలుగజేయుననియు జెప్పబడుచున్నది. నరములకు బలమును గలుగజేయును. అతిమూత్రము నందును, పాండువ్యాధియందును గూడ పనిచేయును. చలిజ్వరమునందును, దీర్ఘవ్యాపితమగు చర్మవ్యాధుల యందును, నుపయోగింపబడుచున్నది. పాండురోగమునందు లోహ(Iron) సంబంధమగు మందులతోజేర్చి యియ్యనగును. పైన రాయుటలో దీనియందు పాక్కుగుణ మున్నది.

## లైకర్ ఆర్సెనికాలిస్ — Liquor Arsenicalis.

వర్ణము యెర్రగానుండును. పాషాణజాతియందు తఱచుగా నుపయోగింపబడెడిదిదియే. ఈ పాషాణసంబంధ మగు మందు లన్నియు ప్రారంభములో కొద్ది మోతాదులలో మొదలుపెట్టి క్రమక్రమముగ మోతాదును హెచ్చింప జేయవలయును. పెద్ద

వారలకు 2 మి|| మోతాదుతో మొదలుపెట్టి క్రమక్రమముగా 8 మి|| మోతాదుకు హెచ్చింపుచేయుట మంచిది. ఎప్పుడును దీనిని భోజనానంతరమును, విరివైన నీటిలో గలిపియును బుచ్చుకొనవలయును. అతిమూత్రవ్యాధియందు కొడీన్ (నల్లమందు సంబంధమైనది) యొక్క యుపయోగము వల్లనున్నూ, పథ్యము వల్లనున్నూ, శరీరావయవములయందు మధుపదార్థమును తగ్గించినపిమ్మట, దీనిని వాడినయెడల మిగుల గుణము నిచ్చును. అథమపక్షము మూడుమాసములైనను దీనిని వాడి చూడవలయును.

ఆర్సెనియస్ అయొడైడ్—Arsenious Iodide.

పసుపువర్ణముగల చిన్నిస్ఫటికములవలె నుండును. ఆల్టరెటివ్‌గను, బలవర్థకౌషధముగను, వాడనగును.

మోతాదు—1/20 గ్రె|| మొ|| 1/5 గ్రె|| వరకు.

లైకర్ అర్సెనియై యెట్ హైడ్రార్జిరీ అయొడైడ్

Liquor Arsenii et Hydrargyri Iodide.

దీనినే డనవన్స్ సొల్యూషన్ (Donovan's Solution) అందురు. ఆల్టరెటివ్‌గను, కొఱుకువ్యాధి నిర్మూలనమునకును, ఉపయోగింపనగును. ఇందు నూటికి ఒకపాలు పాషాణ ముండును. కొఱుకువ్యాధియందలి చర్మరోగములలో నెక్కువగా బనిచేయును.

మోతాదు—5 మి|| మొదలు 20 మి|| వఱకు.

---

## బెన్‌జాయిన్—Benzoine.

బెన్‌జాయిన్ అనగా సాంబ్రాణి. సాంబ్రాణిపొడిని సువాసనకై ఇండియా దేశమందు పొగవేయుదురు; దుర్వాసనను పోగొట్టును. కోరింతదగ్గునందు దీని పొగను వాసనచూచుటవలన గుణముగ నుండును.

బెంజాయిక్ ఆసిడ్—Benzoic Acid.

ఘనపదార్థము; నిర్వర్ణము; స్ఫటికరూపమున నుండును; కుళ్లకుండ జేయును. కఫహరము; మూత్రమును ప్రకోపింపజేయును.

మోతాదు—5 గ్రె|| మొ|| 15 గ్రె||

టింక్చర్ బెంజాయిన్ కో — Tincture Benzoin Co.

ఉపద్రవమయిన దగ్గుబాధయందు ½ డ్రాము మొదలు 1 డ్రామువఱకు పంచదారపైన వేసి యిచ్చినచో గుణ మియ్యగలదు.

చేతిలు తెగినప్పుడు మెత్తని గుడ్డముక్కను దీనిలో ముంచి కాటు చుట్టును గట్టినయెడల, గాయము మిగుల పెద్దదైననేతప్ప, ఒక్కకట్టులోనే మానుపు నంద గలదు. ఇందుల కుపయోగించుటయందు అసలు మందునే వాడవలయును; నీళ్లు కలుప గూడదు; మంటగా నుండునుగాని మిగుల పనిచేయగలదు.

స్వరపేటికయొక్క వాపుదల (Laryngitis) యందు, ఒకపైంటు ఉడుకు నీటియందు ఒక డ్రాముని వేసి ఆవిరిని బీల్చిన యెడల మిగుల నుపయోగించగలదు.

---

## బోరాక్సు — orax.

బోరాక్సు అనగా వెలిగారము. ఇది యిండియాదేశమునకు నేపాళము, టిబెట్, పర్షియా దేశములనుండి వచ్చుచున్నది. పరిశుభ్రమయిన వెలిగారము, నిర్వర్ణముగను, మెరయుచు స్ఫటికములవలెనుండి, గంధరహితమై రుచికి చల్లగను, ఉప్పగను, నుండును.

పెద్దవాళ్ళకు మోతాదు — 20 గ్రె॥ మొ॥ 40 గ్రె॥

బిడ్డలకు గలుగు సర్పివ్యాధి (నోటిలో తెల్లని చుక్కలతో గూడిన పుండ్లు) యందు, ఒకడ్రాము వెలిగారమును పొడిగాగొట్టి ఒక ఔన్సు తేనెలో గలిపి, దీనిని దినమునకు రెండుమూడుసారులు వ్రేలితో రాయవలయును. పెద్దవారలయొక్క నాలుక బీటికలు తీసినయెడల (క్షయవ్యాధి ముదరినప్పుడు యిది తటస్థించును) యిందులకు రెండు డ్రాముల వెలిగారమునకు ఒక ఔన్సు తేనెను గలిపి రాయవల యును. రససంబంధ మగు అధికమైన ఉమ్మిఊరుదలయందు అరఔన్సు వెలిగార మును 8 ఔన్సుల జలములో గలిపి గండూషముగ నుపయోగింపనగును.

స్తనాగ్రములయొక్క వాపుదలకు, ఒక డ్రాము వెలిగారమును ఒక ఔన్సు జలములో గలిపి బిడ్డకు పాలిచ్చుటకు ముందును పిమ్మటయును — పైన రాయ వలయును; ఒక డ్రాము వెలిగారమును ఒక ఔన్సు నేతితో గలిపి రాసినను రాయవచ్చును.

జననేంద్రియభాగములయందలి దురదలను (పురుషులయందును, స్త్రీలయం దునుగూడ) పోగొట్టుటకుగాను, అరఔన్సు వెలిగారమును 8 ఔన్సుల జలములో గలిపి, యీ మిశ్రితజలమునందు గుడ్డలను దడిపి, ఆ యా భాగములయం దుంచవ

యును. స్త్రీలవిషయములో దీనిని పిచికారీకూడ చేయనగును. ఎండవేడిమివలన గలుగు చిటచిట లాడుటకును, యితర సామాన్యచర్మవ్యాధులయందును గూడ, దీని నుపయోగింపనగును.

గర్భాశయము (Uterus) యొక్క శక్తి తగ్గి, పిండమును బయటకు వెడల్చుట కష్టముగ గాన్పించినప్పుడును, యీ సందర్భములయందే గర్భస్రావము తటస్థించినప్పుడును, 30 గ్రెయినుల వెలిగారమును 10 గ్రెయినులు దాల్చినచెక్క పొడితో జేర్చి, గోరువెచ్చని గంజితో గంటకు లేక రెండుగంటలకు ఒకసారిచొప్పున మూడు నాలుగు సారులు యియ్యవచ్చును. ప్రసవవేదన సంబంధమగు మూర్ఛలు గలిగినప్పుడును యీ ప్రకారము యియ్యవచ్చును ; 10 గ్రెయినుల వెలిగారపు పొడియును, 10 గ్రెయినుల దాల్చినచెక్కపొడియును జేర్చి ఋతుస్రావసంబంధ మగు నిలుపుదలయందు గాని, క్రమముదప్పుటయందుగాని, యిచ్చినచో నుపయోగముగ నుండగలదు.

కురుపులుగా దేలిన నెత్తురుగడ్డల యందును, పక్కకట్టుచున్న పుండ్లయందును ఒక పైంటు జలములో రెండు డ్రాముల వెలిగారమును గలిపి, యీ మిశ్రితద్రవముతో వాటిని శుభ్రతజేయుచుండినయెడల త్వరలో మానిపోవును,

తామరకు, ఒక డ్రాము వెలిగారమును, రెండు ఔన్సుల వినిగర్ (Vinegar) లో గలిపి పైన రాసినయెడల ఉపయోగముగ నుండునట్లు తెలియుచున్నది.

## బోరిక్ ఆసిడ్ — Boric Acid.

వెలిగారము (Borax) పైన గంధకధృతి (Sulphuric Acid) యొక్క ప్రయోగమువలన బోరిక్ ఆసిడ్ యేర్పడుచున్నది. దీనిని బొరాసిక్ ఆసిడ్ (Boracic Acid) అని కూడ అందురు. తెల్లని పొడిగ నుండును. 1కి 25 జలములోను, 1కి 3 ఉడుకునీళ్లలోను, 1కి 5 గ్లిసరీను (Glycerine) లోను, 1కి 25 రెక్టిఫయిడ్ స్పిరిట్ (Rectified Spirit) లోను, మిశ్రితమగును.

చీముపట్టు స్థలములయందు క్రుళ్ళకుండ జేయుటకుగాను పైన కట్టుకట్టుట కుపయోగింతురు ; గండూషముగ 1 ఔన్సు జలమునందు 10 మొదలు 15 గ్రెయినులు. పుసులుకట్టెడి కండ్లకలకయందు కండ్లను కడుగుటకుగాను 1 ఔన్సు జలమునందు 2 మొదలు 5 గ్రెయినుల వరకు గలుపవలయును; గొంతులో పుండు యేర్పడినపుడు 1కి 5 గ్లిసరీన్‌లో గలిపి రాయవలయును. మూత్రమార్గమును శస్త్రము చేయుటకు

ముందుగా మూత్రమునందలి జీవాణువులను నశింపజేయుటకుగాను బోరిక్ ఆసిడ్‌ను లోనికిత్తురు; ఈ ఆసిడ్‌ను లోనికిచ్చిన 12 గంటల లోపుగనే అందలి సగభాగము మూత్రముద్వారా వెలువడి పోవును; తక్కిన సగమును మూడు నాలుగు దినములు శరీరమునం దుండును; తరచుగా నిచ్చుటచే శరీరమునం దెక్కువగా నిలువయుండుట తటస్థించును. మోతాదు 5 గ్రే॥ మొ॥ 15 గ్రే॥

## బోరిక్ లింట్ — Boric Lint.

ఇది గుడ్డవలె నుండును; ఇందు సగభాగము బోరిక్ ఆసిడ్ ఉండును. దీనిని కట్టు కట్టుట కుపయోగింతురు. బోరిక్ వూల్ (Boric wool) — దీనిలో 100 కి 40 భాగములు బోరిక్ ఆసిడ్ ఉండును.

## బోరిక్ అయింట్‌మెంటు — Boric Ointment.

పారఫిన్ (Paraffin) 5 భాగములు, వాసలీన్ (Vaseline) 10 భాగములు, బోరిక్ ఆసిడ్ 3 భాగములు — వీటిలో మొదటి రెంటిని గలిపి బాగుగా కరగబెట్టి వేడిగా నున్నప్పుడే బోరిక్ ఆసిడ్‌ను గలిపి, చల్లారువరకును తరచుగా గలియబెట్టు చుండవలయును. ఇట్లు తయారయినదానిని కురుపులకు, పుండ్లకు, పగుళ్లకు, కాలిన స్థలములకు నుపయోగింప నగును.

---

## కార్బాలిక్ ఆసిడ్ — **Carbolic Acid.**

ఇది విషము. దీనికి ఫెనాల్ (Phenol) అను పేరుకూడ కలదు; స్వచ్ఛమైనట్టిది నిర్వర్ణమై స్ఫటికములవలె నుండి క్రమముగా నెరుపురంగుగాని బూడిదరంగుగాని తేలును. పదవవంతు నీళ్లుకలిసినయెడల నెల్లపుడును ద్రవముగనే యుండును, అన్నిచమురులలోను గ్లిసరీన్‌లోను, వాసలీన్ లోను, గలియును. వాసలీన్‌లో 1కి 20 వంతున గలియును.

దీనియొక్క గుణములు:—క్రుళ్లకుండ జేయుట, అంటు సంబంధమగు జీవాణువుల నశింపజేయుట, నరములను బండబారునట్లు చేయుట—అయియున్నవి. జీర్ణాశయమునందు వాయువు కూడుకొనియున్నపుడును, అతివిరేచనముల నాపుజేయుటకును, 1 గ్రేయిను మొదలు 3 గ్రేయినుల వరకును 4 ఔన్సుల జలములో గలిపి యియ్యనగును,

కార్బాలిక్ ఆసిడ్, చర్మమునకుగాని దేహములోని పొగలకుగాని తగిలినపుడు వాటిని తెల్లగజేసి ముడుచుకొనిపోవునట్లు చేయును. దీనిని విశేషించిగాని, యెక్కువ

మోతాదులుగగాని యియ్యరాదు; అట్లుచేసినచో విషముగ బనిచేయును; ఇట్టి సందర్భములందు మాత్రము ఆకుపచ్చవర్ణముగాని నల్లనివర్ణముగాని కలిగి యీ ఆసిడ్ వాసన స్పష్టముగ గనిపించును. దీనితో కట్టుకట్టుటయందు యిది శరీరమునం దావహించి విషచిహ్నములు గనిపించినచో, 1 కి 20 వంతున నీటిలో గలుపబడిన సోడియం సల్ఫేట్ (Sodium Sulphate) ను పైన ప్రయోగింపనగును; ఈ ఆసిడ్ పైన దగిలినచో పొక్కుగుణమును తగ్గించుటకు కొబ్బరినూనెను విరివిగా నుపయోగింపనగును.

విరుగుళ్లు:—ఇది విషస్థితిని కలుగజేసినపుడు మరణము లెక్కువగా దటస్థించును. గొట్టముద్వారా బహుజాగ్రతతో జీర్ణాశయమును పెక్కుసారులు పరిశుభ్రము చేయవలయును; కోడిగుడ్డులోని తెలుపును, నిరపాయమైన చమురు పెద్ద మోతాదులుగను నియ్యవగును, కఫీన్ (Caffeine) కూడ పనిచేయును; టింక్చర్ అయొడిన్ (Tincture Iodine) నిజమైన విరుగుడుగా నమ్మబడుచున్నది. దీనియొక్క మోతాదు 2 మి॥ మొ॥ 5 మి॥

నం 1 రు కార్బాలిక్ ఆసిడ్ — No 1 Carbolic Acid.

ఇది గుణమునందు వెనుకటదానివంటిదే కాని స్ఫటికాకారముగల గడ్డలవలె నుండును; శస్త్రసంబంధమగు పనులకు నీటిలో గలుపుటకు మిగుల వీలైనది.

నం 2 రు కార్బాలిక్ ఆసిడ్ లిక్విడ్ — No. 2 Carbolic Acid Liquid.

పైదానికే పదవవంతు నీటిని గలిపినయెడల యీలిక్విడ్ (ద్రవపదార్థము) అగును; సామాన్యమగు ఉష్ణస్థితియందు ద్రవముగనే యుండును; దీనిని పొక్కుమందుగ నుపయోగింతురు మోతాదుగ లోనికిచ్చుటకు 1 మి॥ మొ॥ 8 మి॥ వరకు విరివగు నీటిలో గలిపి యియ్యవగును.

నం 3 రు కార్బాలిక్ ఆసిడ్ — No. 3 Carbolic Acid

ఇది వెనుకటిదానియంత స్వచ్ఛమైనది కాదు; దీనిని 1 కి 20 మొ॥ 40 వరకు నీటిలో గలిపి రోగి పరుండియుండు గదులలో చల్లుటవలన అంటు సంబంధమగు జీవాణువుల నశింపుచేయుట కుపయోగింతురు.

నం 4 రు కార్బాలిక్ ఆసిడ్ — No. 4 Carbolic Acid.

దీనిలో 100 కి 10 వ వంతు మాత్రమే స్వచ్ఛమైన ఆసిడ్ ఉండి యుండును. జలదారులను, మూత్రవిసర్జనస్థలములను శుభ్రపరచుట కుపయోగించును. 1 కి 40 ఉడుకునీళ్లలో గలిపి వాడవలయును.

నం 5 రు కార్బాలిక్ ఆసిడ్ — No 5 Carbolic Acid.

గుర్రపు లాయములు మొదలగువాటి కుపయోగింపబడెడి నల్లని వర్ణము కలది.

క్యాంఫరేటెడ్ కార్బాలిక్ ఆసిడ్ — Camphorated Carbolic Acid.

ఫెనాల్ 12 భాగములు, పచ్చకర్పూరము 4 భాగములు, తూనికప్రకారము జలము 1 భాగము — ఈప్రకారము కలుపవలయును. నీటిలో గలియదు. పంటినొప్పి కుపయోగించును; జాగ్రతతో వాడవలయును.

గార్గరిస్మా ఆసిడ్ కార్బాలిసై—Gargarisma Acid Carbolici.

2 గ్రె॥ ఫెనాల్ను 1 ఔన్సు జలములో గలిపి దుర్వాసన సహితమై బయలు వెడలు ఊపిరితోగూడిన గొంతులోని పుండునకు నుపయోగింపనగును, దీనిని యీకతో రాయనగును.

గ్లిసరీనం ఆసిడ్ కార్బాలిసై—Glycerinum Acid Carbolici.

తూనికనుబట్టి 1 భాగము ఫెనాల్, 5 భాగములు గ్లిసరీన్, కొలనుబట్టి యీ రెంటితో సమానమైన జలమును, గలిపి దుర్వాసనతో గూడిన ఊపిరిగాలి వచ్చు స్థితియందు గండూషముగ నుపయోగింప నగును,

అయొడైజ్డ్ ఫెనాల్—Iodized Phenol

అయొడిన్ (Iodine) 1 ఔన్సు, స్వచ్ఛమైన కార్బాలిక్ ఆసిడ్ 4 ఔన్సులు— ఈరెంటిని కొంచెము వేడి కలుగునట్లుగా బాగుగా కలియ నూరవలెను. గ్రంధులు వాపుదల నందినపుడు దీనిని పైన రాసినచో బొబ్బలు (బిళ్లలు)గా తేలకుండ నుండును. దీనిని తామరకుగూడ జయప్రదముగ నుపయోగింపదగును.

కార్బాలిక్ ఆసిడ్ లోషన్—Carbolic Acid Lotion.

4 గ్రె॥ కార్బాలిక్ ఆసిడ్ను 1 ఔన్సు జలములో గలిపి దోమకాటుల కుపయోగింపనగును.

మిస్ట్యూరా ఆసిడై కార్బాలిసై—Mistura Acidi Carbolici.

1½ మి॥ కార్బాలిక్ ఆసిడ్ను 2 మి॥ టింక్చర్ అయొడిన్తో ఒకఔన్సు జలములో చేర్చి 4 గంటల కొకపర్యాయము టైఫాయిడ్ జ్వరమునం గియ్యనగును.

## కార్బాలిక్ అయిల్—Carbolic Oil.

1 భాగము ఆసిడ్‌కు 7 భాగములు కొబ్బరినూనెను కలిపి దీనిని లేపనముగ నుపయోగింపనగును.

## కార్బాలిక్ ఆసిడ్ అయింట్‌మెంట్—Carbolic Acid Ointment.

ఫెనాల్ 1, గ్లిసరీన్ 3 - యీరెంటిని గలిపి పారఫిన్ అయింట్‌మెంట్ (Paraffin Ointment) ను 21 భాగములను గలుపవలయును. కురుపులకును క్రిమిజాలములతో గూడిన చర్మవ్యాధులకును పైన లేపనముగ నుపయోగింపనగును.

---

## క్రోమిక్ ఆసిడ్—Chromic Acid.

గాలిలోని చెమ్మను బీల్చుకొని ద్రవాకారమును వహించునట్టియు, యెర్రనయినట్టియు, సూదులవలె పొడవుగానుండునట్టియు, స్ఫటికాకారములుగ నుండును; గంధరహితము; ఆల్కహాల్ (సారాయి) గ్లిసరీన్ మొదలగువాటితో గలిపినయెడల వేడిని పుట్టించి, వాటిని భిన్నపరచి, పెద్దమోత కలిగించినను గలిగింపవచ్చును; ఇట్టి ఉపద్రవము రాకుండ వాటినుండి దూరముగ నుంచవలయును. పులిపిరికాయలకు, 1 కి 4 వంతున నీటిలో గలిపి గాజుపుడక (Glass rod) తో పైన రాయవలయును. గాజుపుడకకు గంధకధృతి తగిలియుండ గూడదు.

## లైకర్ ఆసిడ్ క్రోమిక్—Liq. Acidi Chromici.

1 కి 4 వంతుల నీటిలో గలిపి పొక్కులమందుగ నుపయోగింతురు.

100 కి 5 వంతుల చొ॥ నీటిలో గలిపి కొఱుకు సంబంధమగు నాలుకపైని పొక్కులకు పైనరాయుటవలన మిగుల నుపయోగముగ నుండును.

---

## సిట్రిక్ ఆసిడ్—Citric Acid.

నిర్వర్ణమైన స్ఫటికములుగగాని తెల్లని పొడిగగాని యుండును; ఇది నిమ్మరసమునుండి చేయబడును. ఒకఔన్సు నిమ్మరసమునందు 30 గ్రె॥ మొదలు 40 గ్రె॥ వఱకు యీ ఆసిడ్ ఉండును.

జ్వరగతియందు దాహము నణచివేయును; స్కర్వీ (శీతాదము) వ్యాధియందు సిట్రిక్ ఆసిడ్ కంటె నిమ్మరస మెక్కువ పనిచేయును; మోతాదు 5 గ్రె॥ మొదలు 20 గ్రె॥ వఱకు.

కీళ్ళనొప్పులయందును పచ్చకామాల వ్యాధియందును ఉపయోగించినట్లు తెలియుచున్నది.

8½ గ్రె॥ సిట్రిక్ ఆసిడ్ చేర్పబడిన 2 ఔన్సులు జలమును పొంగువచ్చు ద్రవముగజేయుటకు అదివరకే 10 గ్రెయినుల సోడియం బైకార్బనేటు (Sodium Bicarbonate) చేర్చియుంచబడిన 2 ఔన్సుల జలమునకు జేర్పవలయును.

---

## దాల్చినచెక్క — Cinnamon.

ఇది సామాన్యముగా బజారులలో దొరకును, ఇందులో రెండురకము లుండును: చుట్టలోపల చిన్నచిన్న చుట్టలను గలిగియుండెడిది మంచిరకము, సువాసనగను, తియ్యగను, ఘాటుగను నుండును. రెండవరకపుది సాధారణముగ చుట్టలుగ లేక సాపుగ నుండి తక్కువ తియ్యగను, తక్కువ సువాసనగను, కొంతవరకు నొగరుగను, నుండును.

దీనిని జీర్ణకారిగ నుపయోగింపనగును; నలుగగొట్టబడిన 3 డ్రాముల దాల్చినచెక్కను ఒక పైంటు మసలగాచిన నీళ్లలో వేసి చల్లారువరకును నిలువయుంచి, వడియగట్టి, దీనిని ఒక ఔన్సు మొదలు రెండుఔన్సుల వఱకును, అజీర్ణియందును, కడుపునొప్పియందును, గర్భవత్సంబంధమగు వాంతులయందును, నియ్యనగును.

### సిన్నమిక్ ఆసిడ్—Cinnamic Acid.

క్షయవ్యాధియందు దీనిని రక్తములోనికి సూదిద్వారా ప్రయోగింపనగును. కాని, యిందులకు బహు సూక్ష్మమగు పనిముట్లను కొలతలను దీసికొనవలసియుండును.

---

## ఫార్మిక్ ఆసిడ్ — Formic Acid.

నిర్వర్ణమైన ద్రవము, నీటిలో గలియును. అసలైనది పొక్కుగుణమును గలిగియుండును.

పక్షవాతవ్యాధియందు స్నాయువులకు బలము నిచ్చును; స్నాయుపటుత్వమును గలుగజేసి బడలికను పోగొట్టును; కీళ్లనొప్పులయందును బనిచేయును; కాని దీనివలన తరువాత జబ్బుచేయు నని యెంచబడుచున్నది.

మోతాదు—2 మి॥ మొ॥ 10 మి॥

ఈ ఆసిడ్, ప్రారంభములో ,యెఱ్ఱచీమనుండి చేయబడుచుండెడిది. దురద గొండిఆకులో యీ ఆసిడ్ ఉన్నది. తేనెటీగలు, కుట్టుటయందు యీ ఆసిడ్‌ను వెలు వఱచును. కాబట్టియే ఇంగ్లాండు మొదలగు దేశములయందు తేనెటీగలను బెంచువారు ఈ యీగలచే దఱచుగ గుట్టబడుచుండుటచే కీళ్ళనొప్పిబాధ నెన్నడు ననుభ వించరు. తేనెటీగచే ప్రత్యేక మొకఅవయవమును గుట్టునట్లు చేయుటకు వలయు యంత్రసామగ్రి అమ్మబడును.

## సోడై ఫార్మస్ — Sodii Formas.

మోతాదు: $\frac{1}{6}$ గ్రె॥ మొ॥ 3 గ్రె॥ వఱకు నీటిలో గలిపి యియ్యనగును. న్యుమో నియావ్యాధియందు దగ్గును, కఫమును తగ్గించును.

## యెలిక్సిర్ సోడియం ఫార్మేట్ — Elixir Sodium Formate.

దీనిని యేఆసిడ్‌తోను గలిపి యియ్యగూడదు, మోతాదు 2 డ్రాములు; గుండె సంబంధమైనట్టియు మూత్రాశయసంబంధమైనట్టియు వ్యాధులయందు మూత్రమును ప్రకోపింపజేసినను, మూత్రమునందలి శ్వేతధాతువును తగ్గించును; జీర్ణమునకు భంగము కలుగజేయదు; ఆకలిని బుట్టించును; మనస్సునకును శరీరమునకును చురుకుదనమును బుట్టిం చును. సోడియం ఫార్మేట్ 15 గ్రె॥ రెండు మోతాదుల నిచ్చినతోడనే నడుము నొప్పి అంతరించిన యనేక విషయములు కలవు.

---

## గాల్స్ (మాచికాయ) — Galls.

మాచికాయ సామాన్యముగ బజారులలో దొరకును. దీనిని 10 గ్రె॥ మొ॥ 20 గ్రె॥ వఱకు పొడిగజేసి యియ్యనగును. కషాయ మెక్కువ ఉపయోగముగనుం డును, నలుగగొట్టబడిన $1\frac{1}{2}$ ఔన్సుల మాచికాయముక్కలను ఒకపైంటునీళ్లలో 10 నిమిషములవరకు నుడకబెట్టి చల్లారినపిమ్మట వడియగట్టి — దీనిని 1 ఔన్సుమొదలు 2 ఔన్సులవరకును దినమునకు మూడుసారు లియ్యనగును; దీర్ఘవ్యాపితమగు అతివిరేచ నములయందు యిది ఉపయోగముగ నుండును; విరేచనములు విశేషించి యుండినయెడల

దీనితోగూడ ఒక అరగ్రైయినును నల్లమందును జేర్చి యియ్యవగును. ఈ కషాయమును గండూషముగగూడ నుపయోగింపనగును.

మాచికాయను మెత్తనిపొడిగ నూరి, అతివిరేచనములయందు 15 గ్రై॥ మోతాదు చొప్పున దినమునకు మూడుసారులు తేనెతో గలిపి యియ్యవగును; దీనితో గొంచెముదాల్చినచెక్కపొడిని జేర్చిన బాగుండును, విరేచనము లంకశయించిన దీర్ఘవ్యాపితవిషయములలో ప్రతిమోతాదుతోడను అరగ్రైయినును నల్లమందును జేర్చి యియ్యవగును.

ఈ పైప్రకరణములు పెద్దవారలకు మాత్రమే యుపయోగింపనగును గాని బిడ్డల కుపయోగింపరాదు.

ఎక్కువ వాపుదల లేనట్టియు, నేడిమితో గూడి యుండనట్టియు, మూలశంక యందు 1½ డ్రాము మెత్తగా నూరబడిన మాచికాయపొడిని 1 ఔన్సు నేతితో జేర్చి లేపనముగ నుపయోగింపనగును; దినమునకు రెండుసారులు దీనిని పైభాగమున రాయవచ్చును.

దీర్ఘవ్యాపితమగు సెగరోగమందు 20 గ్రై॥ మాచికాయపొడిని దినమునకు రెండు లేక మూడుసారు లిచ్చినయెడల స్రావమును నిలుపుచేయుటయం దొకప్పుడు మంచిగుణమును గనబరచవచ్చును.

## గాలిక్ ఆసిడ్—Gallic Acid.

పసుపు తెలుపు వర్ణములు గలిసిన వర్ణమును వహించి పట్టువలె మెరయు నూది ఆకారములు గలిగిన ఘనపదార్థము.

అంతరావయవములయొక్క స్రావమును నిలుపుజేయుట కుపయోగించును.

మోతాదు - 5 గ్రై॥ మొ॥ 15 గ్రై॥ వఱకు.

దీనినిగాని, మాచికాయనుగాని, లోహసంబంధమగు ఔషధములతో జేర్చి యియ్యరాదు.

## బ్రాహ్మి — Hydrocotyle Asiatica.

(సరస్వతీ ఆకు)

బ్రాహ్మి అనునది సంస్కృత నామమై యున్నది. ఆంగ్లమునందు ఇండియన్ పెన్నివార్టు (Indian Pennywort) అనబడును. ఈ చిన్నితీగ యిండియా దేశమునందంతటను సామాన్యముగ బెరుగుచు, తేమనేలలయందు విశేషించి వృద్ధినందుచుండును. ఆకులు విత్తులు, వేళ్లు మొదలైనవన్నియు ఉపయోగములు. వీనియందు వేళ్లు చురుకుగా బనిచేయును. దీనికి ల్యాటిన్‌లో "హైడ్రోకొటైల్ యేషియాటికా" యందురు.

వల్లరీన్ (Vellarin) నాబడు యిందలి చమురుతోగూడిన తెల్లని పదార్థము, చురుకుగ బనిచేయునట్టిదె యున్నది. గుగ్గిలమువంటి జిగురుగలపదార్థము, చక్కెర, ఒగరుపదార్థము, లవణములు- దీని అంతర్భాగము లైయున్నవి. వల్లరీన్ బలమైన వాసనగలిగి వాడియుండని చెట్టుయొక్క చేదురుచిని కలిగియుండును.

శరీరవ్యాపారముల యందు సుగుణసహిత మగు మార్పును గలుగజేసి, మూత్రప్రకోపకారిగను, చర్మముపై నుపయోగించినయెడల స్థానికాచురుకుదనమును బుట్టించి గర్భకోశ మూత్రకోశ మార్గములయందు ప్రత్యేక ఫలితమును గనబరచును. దీని నెక్కువ మోతాదులలోగాని యెక్కువకాలమువరకుగాని యుపయోగించిన యెడల నాయాకోశమార్గములయందు రేగుదలను బుట్టించి శరీరమం దంతటయును దురదలు కలుగును. క్రిమిహరగుణము కూడ నుండియున్నది. మిగుల పెద్దమోతాదులలో తలనొప్పిని, తలతిరుగుడును, గలుగజేసి కొందరివిషయములో మూర్ఛకున్ముఖతనుగూడ గలుగజేయును. నిద్రనుగూడ దెప్పించు గుణము కలదు.

దీనితో తయారుకాబడు ఔషధములు.

(1) ఆకులయొక్క పొడి యీక్రింది విధముగ చేయబడును. ఆకులను మొక్కనుండి జాగ్రతగా దీసినపిమ్మట, నీడలో నొక చాపపైన బరచవలయును. సూర్యకిరణములుగాని వేడిమిగాని తగిలినయెడల నందలి సుగుణములు నశించును. బాగుగా నారిన పిమ్మట వానిని గాజుకార్కు సీసాలలో నిలువచేయవలయును. దీనియొక్క మోతాదు దినమునకు 3 గ్రె॥ మొదలు 5 గ్రె॥ వరకు నైయున్నది.

(2) పలాస్త్రిగగాని పిండికట్టుగగాని యుపయోగించుటకుగాను తాజా ఆకులను దెచ్చి చల్లనినీటితో పేస్టుగా నూరవలయును.

(3) 90 గ్రాములు (గ్రాము=14½ గ్రె॥) ఆకుపొడిని నాల్గవ వంతుగాలను జలములో నుడుకబెట్టి, పైంటు అగునంతవరకు గాచి, అంతట 2 ఔన్సుల చక్కె

గలిపి, షరబతుఅగునట్లు కలుపవలయును. ఇట్లగుటకు దగినంత వేడిమిని గలుగ జేయవలయును.

(4) తాజామొక్క ఆకులయొక్క స్వరసమును 1 మినిము మొదలు 5 మినిములవరకు మోతాదు నిచ్చుచు, క్రమక్రమముగా మోతాదును 15 మినిములవరకును హెచ్చింపవచ్చును.

(5) లేపనము లేక అయింటుమెంటును జేయుటకుగాను స్వరసముయొక్క యొకభాగమును 8 భాగముల వాసలీన్‌లోగాని లానొలీన్‌లోగాని గలుపనగును.

(6) కషాయమునకుగాను 1 భాగము యెండుమొక్కకు 20 భాగముల జలము నుపయోగింపనగును.

(7) చర్మవ్యాధులలో స్నానమునకుగాను 1,500 గ్రాముల తాజా మొక్కల నొక తొట్టెడు వేడినీళ్ళలో గలుపనగును.

(8) పచ్చని ఆకులు $\frac{1}{4}$ తులము మొదలు 1 తులమువరకును చింతపండుతోగాని, నిమ్మరసముతోగాని చేర్చి, లవణమును ఇతర కారపుదినుసులనుగూడ గలిపి పచ్చడిగా (చట్నీ) జేసి సేవింపవచ్చును.

(9) ఎండు ఆకుల నొక టీ స్పూనుతోదీసి తేయాకుమాదిరిగ మసల కాగిన యొక కప్పునీటిలో వేసి తేనీరువలెనే పాలతోడను చక్కెరతోడను గలిపి సేవింపవచ్చును.

ఇది సామాన్యముగ సాధు మూత్రప్రకోపకారిగను, మెదడు సంబంధమగు బలవర్ధకౌషధముగను బనిచేయును.

దీర్ఘవ్యాపితమైనట్టియు, మొండితేరినట్టియు, గండమాలావ్యాధిహితమైనట్టియు, కొరుకు సంబంధమైనట్టియు, చాలకాలమునుంచి విడువకుండ నుండెడి చర్మవ్యాధుల యందును, కుష్ఠ మొదలగు త్వక్సంబంధ రోగములయందును, గ్రంధుల వాపుదల యందును, దీర్ఘవ్యాపితమగు కీళ్లనొప్పియందును, కురుపులయందును, దీనియుపయోగ మధికముగ గొనియాడబడుచున్నది. బిడ్డలయం దజీర్ణవ్యాధియందును, ముక్కునుండి వెలువడు దుర్వాసనసహితములగు స్రావముల నారోగ్యస్థితికి దెచ్చుటయందును, దీని నుపయోగింతురు; స్త్రీలయందు ఋతుస్రావము నిలచిపోయిన విషయములందు జయప్రదముగ బనిచేసియున్నది.

లోనికిచ్చుటకుగాను, పొడిని, స్వరసమును, షరబతును, ఉపయోగింపనగును. పైన రాయుటకుగాను పొడిని, రసమును, అయింటుమెంటును (వాసలీన్‌తో గూడినది) ఉపయోగించుచు, మూలిక గలిసిన వేడినీటిస్నానమును గూడ జేయవచ్చును.

వృషణసంబంధమగు సంచియొక్క వాపుదలయందును, బిలసంబంధమగు అల్లికల యొక్క అస్వస్థతలయందును, కంసుదెబ్బలయందును, యెర్రనైయున్న వాపుదల విషయములందును, కీళ్లనొప్పి వాపులందును, అయింటిమెంటును రసమును వెలుపల నుపయోగింపుచు, ఆకురసము నొకచుక్క మొదలు 5 చుక్కలవరకును దినమునకు మూడుసారుల చొప్పున లోని కిచ్చినయెడల, నీవ్యాధిసంబంధమగు జ్వరములు కూడ హరించును.

కుష్ఠ, గండమాలావ్యాధి, కొఱుకు — యీ సంబంధములగు అస్వస్థతలయందును, వ్రణములయందును, పొడిని 3 గ్రెయినులు మొదలు 5 గ్రెయినులవరకును, దినమునకు మూడుసారుల చొప్పున నియ్యవచ్చును. దీనితోపాటు కొంత పొడిని కురుపులపై జల్లవచ్చును, లేదా — యింకను యెక్కువ మేలు కలుగుటకుగాను, ఆకులను నలుగగొట్టి పిండికట్టువలె గట్టనగును.

కుష్ఠవ్యాధిలో, కొన్ని వారములవరకు దీనిని నుపయోగించుటచే రోగి కన్నివిధములను గుణము కనబడును. కొన్నిదినము లుపయోగించిన పిమ్మట దురదలు కనుపడిన యెడల నొక వారముదినము లా యుపయోగము నాపివేసి, సాధువిరేచనకారుల నుపయోగించవలయును.

కుష్ఠరోగులవిషయములో దీని నుపయోగించిన పిమ్మట, రోగికి చర్మముపైన నొకవిధమగు వేడిమియును, దురదయును, ముఖ్యముగా చేతులపైనియును పాదములపైనియును, గలుగును. కొద్దిదినముల పిమ్మట శరీర మంతటను వేడిమి కలిగి, యొకప్పుడు భరింప నలవిగాకుండు నంతగూడ నుండవచ్చును. మరియొకవారము పిమ్మట సూక్ష్మనాళములయందు రక్తప్రచార మధికమై, చర్మమునందు మృదులత యేర్పడి, మొద్దుబారిన చర్మభాగము వీడిపోయి, చర్మము పూర్వాకార్యధర్మమును మరల గ్రహించును.

బిడ్డలయందు బంకవిరేచనములు మొదలగు పేగువ్యాధులయందు 3 లేక 4 ఆకులను పొడిచేసి జీలకర్రను చక్కెరను జేర్చి లోని కిచ్చుచు, నీటితో నూరిన ఆకులను బొడ్డుయొద్ద పట్టుగా వేయనగును. నత్తి విషయములలో చికిత్సకై 1 లేక 2

ఆకులు ప్రాతఃకాలమున నీయవచ్చును. రక్తవేడిమివలన గలుగునట్టి దద్దురును బోగొట్టుటకుగాను — యీ రసమును, కదంబ (శిశుపాల) వృక్షముయొక్క బెరడుతోడను, నేతితోడను, నల్లజీలకఱ్ఱతోడను, నూరి లేపనముగ జేసి యుపయోగింపనగును. మెదడుయొక్క దుర్బలస్థితియందును, జ్ఞాపకశక్తిని వృద్ధిపరచుకొరకును, యెండుఆకులయొక్క పొడిని పాలతో జేర్చి యియ్యవలయును.

బిడ్డలలో చర్మవ్యాధులయందును, రక్తము, మెదడు సంబంధములగు వ్యాధులయందును, సెగవ్యాధి. పచ్చకామాల, జ్వరములు — వీనియందు ఆకులయొక్క తాజారసమును, పాలతోడను, అతిమధురము (Liquorice) తోడను, జేర్చి యియ్యనగును.

బిడ్డలయొక్క పేగువ్యాధులయందును, జ్వరములయందును, యీ ఆకులను, కొంచెము మెంతులను, మసలగాచిన నీళ్ళలో వేసి 5 నిమిషములు మూతవేసి అటులనే యుంచి యిట్లు యేర్పడిన కషాయమును సుమారు ఒక అరకప్పును మోతాదుగా నేర్పరచి యియ్యవచ్చును.

దీర్ఘవ్యాపితమైనట్టియు, విడిచి విడిచి వచ్చునట్టియు, నడుమ నడుమ కొంత తగ్గుచు హెచ్చుచుండునట్టియు, చలిజ్వరసంబంధమైనట్టియు — అన్నివిధజ్వరములందును — యీ ఆకులను, తులసిఆకులను, మిరియాలను సమభాగములుగ జేర్చి, పేస్టుగా నూరి, ఉదయమున 3 గ్రెయినులను సాయంకాలము 3 గ్రెయినులను యిచ్చిన యెడల మంచిగుణముగ నుండునని చెప్పబడినది.

ఈ మొక్కతో, వసయును, కరక్కాయయును, అడ్డసరము వేళ్లును, పిప్పలికట్టెయును సమభాగములుగ జేర్చి తయారుచేసిన కషాయము. గొంతు బొంగురునకును, క్షయవ్యాధియందును, ఉపయోగించగలదు.

ఈమూలిక 5 భాగములును, కుష్ఠం (Costus) 4 భాగములును, తేనె 6 భాగములును జేర్చి 3 గ్రెయినులు మొదలు 5 గ్రెయినుల మోతాదులలో నిచ్చిన యెడల, వెఱ్ఱియందును (Lunacy) సదా రోగభీతితోగూడిన మనోవ్యాధియందును (Hypochondria) ఉపయోగముండగలదు.

**సంజీవి వంటిది.**

నూరుసంవత్సరములు జీవింపుచు, నలుబది సంవత్సరములకంటె నెక్కువ వయసు లేనివానివలె గనుపించు కెట్లో యామార్గమును దెలియ, జాలమంది జనులయొక్క జీవితాశయ మనుటకు, సందియ మెంతమాత్రమును లేదు.

ప్రపంచమునందలి వృద్ధులలో వృద్ధగు చీనాదేశ నివాసియగు లీ చింగ్ యక్ అనునాతడు తనప్రస్తుత వయస్సు 250 సంవత్సరములని వాకృచ్చుచు, నొక మూలిక నుపయోగించుటచే దీర్ఘాయువు నందవచ్చునని యీయన చెప్పుచున్నాడు. ఈ మూలిక యిండియా దేశమునందలి "హైడ్రోకోటైల్ యేషియాటికా" (సరస్వతాకు) బహుళః మైయుండును. దీనికి దీర్ఘాయువు నిచ్చు శక్తియుండినట్లు చాలకాలమునుండి ప్రతీతి యుండియున్నది. ఇది చిన్ని ఓషధిసంబంధమగు మొక్కయైయున్నది. ఇది భూమిపైన చిలగడదుంపతీగవలె బ్రాకును.

మనుజునియొక్క ఆహారపదార్థములందు ఈమొక్క ఆవశ్యకమనియు, నది లేకుండ వ్యాధిని బూర్ణముగ నెన్నడును స్వాధీనపరచుకొనుటకు మార్గము గానరా దనియు భారతదేశమునందలి యొక ఋషీశ్వరుడనదగు నందో నారాయణుడు దృఢముగ జెప్పుచున్నాడు. దీని వేరునందు నిద్రను గలుగజేయు గుణ మున్నందున, చాల వ్యాధులయందు జికిత్సజేయుట కుపయోగింపబడుచున్నది, కాని, దీనిని యితర మూలికలతోడనుగాని ఔషధములతోడనుగాని చేర్చిమాత్రమే యుపయోగింపవలయును. దీర్ఘాయువును బొందుటకు ఆకులుమాత్రమే యుపయోగింపగలవనియు, దినమున కొకటిగాని రెండుగాని ఆకు లుపయోగించిన జాలుననియును జెప్పబడుచున్నది.

ఇండియాదేశమునందలియు, సిలోన్ దేశమునందలియు జనుల కీ మొక్కను గూర్చి చాలకాలమునుండి తెలియునుగాని, పరాసు బ్రిటిష్ ప్రభుత్వములవారు ఆహారముగను ఔషధముగను దీనియొక్క ప్రయోజన మెంతవరకుండునో తెలియుటకు విచారణలను జేయుట కిటీవలనే ప్రారంభించియున్నారు.

వ్యాధిపై పట్టును బట్టును.

ఈ మొక్కను బరీక్షించిన యొక పరాసు రసాయనశాస్త్రజ్ఞుడు - మెదడు నందలి బిలములపై బలమును గలుగజేయు స్పష్టమగు నట్టి శక్తి ఈయాకులయందుండి యున్నట్లు కనుగొనియున్నాడు. ఆఫ్రికాఖండమునందలి ఆల్జీర్స్ రాజ్యములోని ఫ్రెంచివార లీ మొక్కను జయప్రదముగ బెంచుచున్నారు.

సిలోన్‌లో ఆయుర్వేదపరిశోధనలను జేయుటకై యొక కలాశాలను స్థాపించుటకుగాను బ్రిటిషుగవర్నమెంటువారు కొంతద్రవ్యమును శాంక్షనుచేసియున్నారు. అందలి ఔషధపరిశీలనలలో నీ సరస్వతీయాకును మిక్కిలి విలువైన నోషధిగ బెంచుచున్నారు.

అడవులలో నీ సరస్వతీయాకు విరివిగ బెరుగుచుండ నద్దానిని బ్రీతితో దినుట మూలముననే నడవియేనుగులు వాటి వన్యస్థితియందు దమ యౌవనమును బలమును వందలకొలది సంవత్సరములవరకు గాపాడుకొన గలుగుచున్నవని సింహళదేశ వాసులకు గట్టినమ్మకము కలదు.

ప్రకృతియందు శరీరమునకును మెదడునకును గూడ నాహార మేర్పాటు చేయ బడియున్నది. ఈ హైడ్రొకొటైల్ (సరస్వతీ ఆకు) మెదడున కేర్పడిన యాహారము లలో నొకటైయున్నది. దీనిని సేవించునపుడు క్రమమైన పథ్యమును జేయవలయును. దీనిని క్రమముగా నుపయోగించుటవలన, నరముల సంబంధమగు నస్వస్థత గలుగుటయం దపాయ మంతగా లేకుండుటయు, వ్యాధిపై నెక్కువ పట్టుచిక్కుటయు, ముదిమి కొంతవర కాపుదలకాబడుటయు — కలుగుచున్నవి.

ఈ మూలికతో నీక్రింది ఆయుర్వేదౌషధములు తయారుచేయబడుచున్నవి:— బ్రాహ్మీఘృతము, బ్రాహ్మీరసాయనము, సారస్వతారిష్టము.

డాక్టరు కోమన్ గా రిట్లు వ్రాయుచున్నారు:—

“ఆయుర్వేదవైద్యమునందలి త్రిదోషముల ననుసరించిన నే యస్వస్థతయం దైనను యీ మొక్క నుపయోగించుచున్నారు. ఆకులు మూత్రప్రకోపకారిగను, చర్మ వ్యాధులయందు - ముఖ్యముగ కుష్ఠవ్యాధియందు - గుణము నిచ్చునట్టిదిగను, బరిగణింప బడుచున్నది. కుష్ఠవ్యాధియందు, పొడినిగాని, కషాయమునుగాని, షరబతునుగాని యియ్యవచ్చును. దీర్ఘవ్యాప్తమగు సోరియేసిస్ యను చర్మవ్యాధియందు రెండు విషయములలో నీషరబతు నుపయోగించుట మూలమున కొద్దిదినములలో నా సంబంధ మగు మచ్చలలో గొంత సుగుణము కనబడెను.”

ఈ సరస్వతీయాకు చాల వ్యాధులలో మిగుల నుపయోగముగ గనిపించుచున్నది. కనుక ప్రతిమానవుడును ఈ మొక్కను బెంచుటయందు గొంత శ్రద్ధను వహించుట బాగని తోచుచున్నది. ఆంధ్రదేశమునందు పశ్చిమగోదావరిజిల్లా యందలి నరసాపురము తాలూకా పాలకొల్లు గ్రామములో నిది విశేషముగ దానంతట నది బెరుగుచుండు నట్లు తెలియుచున్నది. వలయువారలు దానిని దెప్పించుకొను ప్రయత్నమును జేయనగును.

### ఆసిడ్ హైడ్రోబ్రోమిక్ డిల్యూట్ — **Acid Hydrobromic Dilute.**

నిర్వర్ణమైన ద్రవపదార్థము; మిక్కిలి పులుసు; వాసన లేదు; మనోనిస్త్రాణను తగ్గించుటకు నుపయోగించును; క్వినీన్ సల్ఫేట్ పొడిని నీటిలో గలియునట్లు చేయుటకు 5 గ్రెయినుల క్వినీన్‌కు 8 మినిముల యీ ఔషధము నుపయోగింప నగును.

పాండువ్యాధియందు లోహమును బుచ్చుకొనుచున్నపుడు తల బరువుగ గనిపించినప్పు డట్టిబరువును బోగొట్టుట కిది ఉపయోగించును; విశేషముగ తేయాకు నీళ్లనుగాని మత్తుపదార్థములను గాని సేవించినపుడు, వాటి చెడుఫలితములను బోగొట్టును; గుండె అదరు విశేషించియుండినయెడల ఉపశాంతిని గలుగజేయును; రాత్రుల యందు దగ్గువిశేషముగ నుండినపుడును, తలనొప్పియుండి ముఖము యెఱ్ఱబారి చెవిలో ధ్వనులు కలిగినపుడును, 10 మినిముల మోతాదు చొప్పున నిచ్చిన నుపయోగించ గలదు.

మూర్ఛగతియందు సంపూర్ణమైన మోతాదు నియ్యవచ్చును; తరచుగా నియ్యనవసరము గనిపించి నప్పుడు దినమునకు మొత్తముగ 3 ఔన్సుల నిచ్చినను నియ్యవచ్చును.

మోతాదు 15 మి॥ మొ॥ 60 మి॥

---

### హైడ్రోక్లోరిక్ ఆసిడ్ — **Hydrochloric Acid.**

దాదాపుగా నిర్వర్ణమైనట్టియు, మిక్కిలి పులుసైనట్టియు, తెల్లని ఘాటయిన పొగలు వచ్చునట్టియు, పాక్షగుణము కలిగినట్టియు, ద్రావకము. దీనిని యిదే ప్రకారముగ లోని కియ్యరాదు. దీనిని తెలుగులో శంఖద్రావక మందురు.

#### ఆసిడ్ హైడ్రోక్లోరిక్ డిల్యూట్—Acid Hydrochloric Dilute.

6 భాగములు హైడ్రోక్లోరిక్ ఆసిడ్ 14 భాగముల నీటితో గలిపిన నిది యగును.

మోతాదు—5 మి॥ మొ॥ 20 మి॥

పిత్తమును ప్రకోపింప జేయును; అజీర్ణవ్యాధియందు 5 మినిముల ఆసిడ్ హైడ్రోక్లోరిక్ డిల్యూట్‌ను అరడ్రాము టింక్చర్ జన్షన్ కో (Tincture Gentian Co.) తో జేర్చి భోజనపూర్వము యియ్య నగును.

---

## హైడ్రోసియానిక్ ఆసిడ్—Hydrocyanic Acid.

దీనికే ప్రూసిక్ ఆసిడ్ అను పేరుగూడ గలదు; ఇది మిగుల బలమగు విషము; నిర్వర్ణమైన ద్రవము, బలమైన వాసనతోగూడియుండును; ఇంత తొందరగా పని చేయు విషము మరియొకటి లేదు; గుండెపైనయును, మెదడుపైనయును, నరములపైన యును, బహుత్వరితముగా బనిచేయుటచే నొకనిమిషము లోపలనే ప్రాణమును దీయును. దీనిని మందుగా నుపయోగింపరు.

### హైడ్రోసియానిక్ ఆసిడ్ డిల్యూట్ – Hydrocyanic Acid Dilute.

ఈ పేరుగల ఔషధము తయారుచేసి సప్లయి చేయబడును; బ్రిటిష్ ఫార్మ కోపియా ననుసరించి మోతాదు 2 మి॥ మొ॥ 6 మి॥ వఱకు నిర్ణయింపబడినది; కాని, ఫ్రెంచిదేశపు ఫార్మకోపియాను బట్టి ఒకేసారిగ పెద్ద మోతాదు నియ్యాలంచి నను 1½ మి॥ కంటె నెక్కువగ నియ్యగూడదని సిరపఱచబడినది; దీనిని గాజుకార్కు మూతగల సీసాయందుంచి సీసాను చీకటిలో తలక్రిందుగ నుంచవలయును; పగిలిన చర్మమునకు దగుల గూడదు; దీనిని బాధతో గూడిన అజీర్ణమునకు సోడియం బైకార్బనేట్ (Sodium Bicarbonate)తో చేర్చి యియ్యనగును; వాంతిని, దగ్గును కట్టించును.

ఇది మిగుల బలమైన విషయుతము గనుక దీనిని బహు జాగ్రతతో వాడవల యును; సామాన్యవైద్యులు వాడకుండుటయే మంచిది.

---

## ల్యాక్టిక్ ఆసిడ్ – Lactic Acid.

నిర్వర్ణమైనట్టియు, గంధరహితమైనట్టియు, షరబతువలె నుండు పుల్లని రుచి గలిగినద్రవము; నీటిలో గలియును; బిడ్డలయొక్క అతివిరేచనములయందును, అతి మూత్రమునందును, క్షయవ్యాధిలో దగ్గున కుపశాంతి గలుగజేయుటయందును, పనిచే యును; గొంతులోనియు, స్వరపేటికయొక్కయు, క్షయసంబంధమగు పుండ్లకు పైన రాయుట కుపయోగింపబడును.

ముక్కు, పెదవులు, మొదలగునవి తినివేయబడునట్టి వ్యాధులయందు యిది పైన రాయబడుటచే గుణ మియ్యగలదు. కాని మిగుల బాధను గలుగజేయును.

మోతాదు 5 మి॥ మొ॥ 20 మి॥

---

## నైట్రిక్ ఆసిడ్ – Nitric Acid.

దీనికి తెలుగులో మహాద్రావక మందురు; నిర్వర్ణమైనట్టిదియు, బరువైనట్టిదియు, నగుద్రావకము; ఘాటయిన పొగలు వెడలుచుండును; దీనిని లోని కియ్యరాదు.

### ఆసిడ్ నైట్రిక్ డిల్యూట్ – Acid Nitric Dilute.

3 ఔన్సుల 7 డ్రాముల నైట్రిక్ ఆసిడ్ ఒకపైంటు అగు వరకును నీటితో గలుపబడి నపుడు అసిడ్ నైట్రిక్ డిల్యూట్ అగుచున్నది.

బలవర్థ కౌషధముగను, పైత్యమును ప్రకోపింపజేయునదిగను, ఉపయోగించును.

మోతాదు – 5 మి॥ మొ॥ 20 మి॥

### ఆసిడ్ నైట్రోహైడ్రోక్లోర్ డిల్యూట్ – Acid Nitro - Hydrochlor Dilute.

నైట్రిక్ ఆసిడ్ 3, హైడ్రోక్లోరిక్ ఆసిడ్ 4, జలము 25—ఈపాళ్లప్రకారము జలములో రెండు అసిడ్లను ఒకదాని తరువాత నొకటి కలిపి గాజుమూత గలిగిన సీసాలో 14 దినములు నిలువయుంచిన పిమ్మట నుపయోగించవలయును, నిర్వర్ణమై, ఘాటు కలిగి, పుల్లని రుచి కలిగి, వాసనతో నుండును. కౌర్జమునకు చురుకుదనమును బుట్టించుట కుపయోగించును.

మోతాదు—5 మి॥ మొ॥ 20 మి॥

### అక్వా రీజియా—Aqua Regia.

నైట్రిక్ ఆసిడ్ 3, హైడ్రోక్లోరిక్ ఆసిడ్ 4, యీరెంటిని జేర్చిన దానికి అక్వా రీజియా అందురు. ఇందులో బంగారము కరగిపోవును; దీనిని మందుగా నుపయోగింపరు.

---

## ఆసిడ్ హైడ్రోఫ్లూరిక్ – Acid Hydrofluoric.

దీనికే ఫ్లూరిక్ ఆసిడ్ అనికూడ అందురు; దీనిని లోని కియ్యరాదు; 1 పాలు యీఆసిడ్ను 3 పాళ్ల జలములో గలిపి—యిందుపైనుండి గాలిని పీల్చుటవలన క్షయపీడితులకు మంచిగుణము కలుగునట్లు తెలియుచున్నది. ఈ ఆసిడ్, గాజు (Glass) ను తినివేయును గనుక దీనిని సీసపు బుడ్లలో గాని, గట్టా పెర్చా (Gutta

Percha) బుడ్లలో గాని, నిలువ యుంచవలెను. గట్టాపెర్చా అనబడునది రబ్బరు వంటి ఒక పదార్థము.

---

## ఆసిడ్ ఫాస్ఫారిక్ — Acid Phosphoric

నిర్వర్ణమై షర్బతువలె నుండెడి ద్రవపదార్థము: పాక్ష్యగుణము గలదు. లోనికియ్య దగదు.

ఆసిడ్ ఫాస్ఫారిక్ డిల్యూట్ — Acid Phosphoric Dilute.

పై తరగతిదానికి 3 ఔన్సుల కొలతకు 17 ఔన్సుల జలమును జేర్చిన యెడల ఆసిడ్ ఫాస్ఫారిక్ డిల్యూట్ అగును.

విరివిగ నీటితో జేర్చి త్రాగినయెడల జ్వరగతియందు చల్లదనము నిచ్చును. అతిమూత్రవ్యాధియందు దాహము నణచివేయును; నరములకు బలము నిచ్చును.

మోతాదు — 5 మి॥ మొ॥ 20 మి॥

---

## ఆసిడ్ సాలిస్సైలిక్ — Acid Salicylic.

తెల్లనై సూది ఆకారమును వహించిన స్ఫటికపు ముక్కలవలె నుండి రుచికి తియ్యగ నుండును; 1 కి 500 నీటిలో గలియును. 20 గ్రయినులను ఒకఔన్సు నీటిలో గలుపవలయునన్న 30 గ్రయినుల వెలిగారమును గూడ గలుపవలయును.

స్పిరిట్సు యీతర్ నైట్రిస్, స్పిరిట్సు అమ్మోనియా ఆరోమేటిక్, క్వినీన్ సల్ఫేట్—వీటితో నియ్యరాదు.

షరబతులు మొదలైనవి కుళ్ళకుండ దీనిని గలుపుదురు. జ్వరగతిని తగ్గించుటకు దీనిని ఉపయోగింపవచ్చును. ముఖ్యముగా తీవ్రగతియం దున్న కీళ్ళ నొప్పులకు బాగుగా పనిచేయును, ఈ స్థితి యందలి జ్వరమును గూడ తగ్గించును.

మిక్కిలి పెద్ద మోతాదులుగ నిచ్చినయెడల హృదయము పైనయును శ్వాస కోశముల పైనయును విషముగ వర్తించును. రెండు లేక మూడుగంటల కొకసారి 15 గ్ర మొ॥ 20 గ్ర॥ చొప్పున నిచ్చిన యెడల క్వినీన్ వలెనే దీనియందును నీ క్రింది దుర్గుణముల గనబరచును; — తల బరువుగా నుండుట, చెవులలో

ధ్వనులు, దృష్టియందు క్రమము దప్పుట; మోతాదును హెచ్చించుచు యింకను దఱచుగ నిచ్చిన యెడల — చెవుడు, వంకరచూపు, ఆయాసము, విశ్రాంతిలేని సంధిగుణము, నల్లని వర్ణముగల మూత్రము వెలువడుట, స్వాధీనము తప్పిన మలమూత్ర విసర్జనములు, మూర్ఛలు — యిట్టివి తటస్థమగును. ఈ స్థితి విశేషమయిన మోతాదుల నిచ్చిననే దప్ప కలుగనేరదు.

మోతాదు 5 గ్రె॥ మొ॥ 20 గ్రె॥.

ఒకేమోతాదైనచో 15 గ్రె॥ కంటె నెక్కువగ నియ్యరాదు; ఒక దినము అనగా 24 గంటల లోపల ఒక డ్రాముకు మించరాదు.

### సాలిసైలిక్ ఆయింట్మెంట్ — Salicylic Ointment.

పౌడరుగా నుండెడి సాలిసైలిక్ ఆసిడ్ 1 భాగము. తెల్లనిపారఫిన్ ఆయింటుమెంటు 49 భాగములు— వీటిని చేర్చవలయును. దీనిని ముఖముపై లేచెడి కాయలవలె నుండెడి కణుతులకును, తామరకును, అంటుసంబంధమగు పుండ్లకును నుపయోగింప నగును.

### సోడా సాలిసైలస్ — Soda Salicylas.

తెల్లగాని మెరయునట్టిదిగ గాని యుండి పొడిగా నుండును; కీళ్లనొప్పులు, తలనొప్పి, అతి విరేచనములు, తల తిరుగుట, చలిజ్వరము, అతిమూత్రము — యీ వ్యాధులయం దుపయోగించును; అదే యెత్తుగల నీటిలో గలియును.

మోతాదు 10 గ్రె॥ మొ॥ 30 గ్రె॥

ఒకే మోతాదుగ నిచ్చుటయందు 30 గ్రె॥ కంటె నెక్కువగ నియ్యరాదు; దినమున కంతయు 3 డ్రాములకు మించరాదు.

కీళ్ళనొప్పులయొక్క తీవ్రదశయందు పెద్ద మోతాదులుగ నియ్యదగును; అనగా దినమంతయు గలిపి 150 గ్రె॥ యియ్య నగును; దీనితో రెట్టింపు సోడా బైకార్బనేటును గూడ గలిపి యిచ్చినచో మూత్రముయొక్క గుణమును మార్చకుండగను, మలబద్ధము కలుగకుండగను, జేయును; సోడా బైకార్బనేట్ యొక్క ఉపయోగమువలన వాంతికూడ గలుగకుండ జేయును. దీని నెప్పుడును క్వినిన్తో జేర్చి యియ్యరాదు.

## ఆసిడ్ సల్ఫ్యూరిక్—Acid Sulphuric.

దీనికి తెలుగులో గంధకద్రుతి యందురు; పాక్యగుణము కలదు; లోనికియ్యరాదు.

## ఆసిడ్ సల్ఫ్యూరిక్ డిల్యూట్—Acid Sulphuric dilute.

40 భాగముల జలమునకు 4 భాగముల సల్ఫ్యూరిక్ ఆసిడ్‌ను కొంచెము కొంచెముగ గలుపవలయును; ఆసిడ్‌కు జలమును గలుపరాదు; చల్లారిన పిమ్మట సుమారు మరి 4½ భాగములను జలమును గలుప వలయును.

కొద్ది పరిమితిలో జేసికొను నపుడు గాజు గరాటీ (Glass funnel) గుండా బుడ్డిలో నొకదానితరువాత నొకటి పోయవచ్చును; జీర్ణకారిగ బనిచేయును.

రాచపుండును గలిగియున్నరోగికి విరివియగు నీటిలో గలిపి 20 మి॥ మోతాదును 4 గంటల కొక పర్యాయము యిచ్చినచో 12 గంటల కాలములోపుగనే అస్వస్థత భాగమునందు గుణమగు మార్పులు గనుపడ గలవు; పిమ్మట అస్వస్థతస్థానమందు కార్బాలిక్ ఆసిడ్ కలుపబడిన వాసలీన్‌ను రాయ నగును.

---

## ఆసిడ్ ట్యానిక్ – Acid Tannic.

ఇది మాచికాయ (Gall) నుండి చేయబడును; కొంచెముగా బూడిద వర్ణము కలిగి పల్చని పలుకులుగా నుండును; వాసనతో గూడి ఒగరుగా నుండును; గాలిక్ ఆసిడ్ యును ట్యానిక్ ఆసిడ్ యును ఒకేపదార్థమునుండి వేఱువేఱువిధములుగా తయారు చేయబడును; గాలిక్ ఆసిడ్ లోని కియ్యబడును; ట్యానిక్ ఆసిడ్ వాపుదల నందియున్న స్థానముల యందు ఉపశాంతిని గలుగ జేయుట కుపయోగింప బడును; గొంతుగాని నోరుగాని వాపుదల నందియున్న సందర్భములందు 1 కి 5 వంతుల గ్లిసరీనులో గలిపి రాయనగును. కొండనాలుక వాచి యున్నపుడును దీని నుపయోగింతురు. దీనిని లోపలికి దీసికొనిన యెడల గాలిక్ ఆసిడ్ పనినే చేయును, నీటిలో గలియును.

మోతాదు 2 గ్రే॥ మొ॥ 5 గ్రే॥

---

## ఆసిడ్ టార్టారిక్ — Acid Tartaric.

స్ఫటికములుగా గాని పొడిగా గాని యుండెడి తెల్లని పదార్థము; పుల్లగా నుండును. ఇండియాదేశమునందలి చింతపండులో యీ ఆసిడ్ కలదు. సిట్రిక్ ఆసిడ్ ఉపయోగములే దీనికిని గలవు.

మోతాదు— 5 గ్రె॥ మొ॥ 20 గ్రె॥

---

## ఆకొనైట్ (నాభి) — Aconite.

దీనికే వసనాభి అని కూడ వాడుకపేరు గలదు; ఇది యొకచెట్టుయొక్క వేరు; ఇండియాదేశమునందు హిమాలయపర్వతప్రాంతముల యందు యీవృక్షము పెరుగును; ఇది అనేక తరగతులు గలదిగా నుండును; సామాన్యముగా బజారునందు దొరకెడి వాటిలో తెలుపువర్ణము కలదియు, ఎరుపు బూడిదె వర్ణములు కలసినదియు, దొరకును.

తెల్లనాభియొక్క పొడి ఒకదాృమును 7 దాృముల గోదుమపిండిలో గలిపి, కల్వములో కొద్దిగా నూరి, సీసాలో వేసి నిలువ యుంచుకొన వలెను; రెండవరకపు దానినిగూడ యిదేప్రకారము తయారు చేసికొనవలెను.

తెలుపుజాతిదానిలో యీ పొడరునుండి 4 గ్రెయినుల మోతాదు చొ॥ దినమునకు మూడుసారు లియ్యనగును; రెండవజాతిదానిలో యీపొడరు నుండి 3 గ్రెయినుల మోతాదు చొప్పున దినమునకు మూడుసారు లియ్యనగును; 8 గ్రెయినుల యీ పొడరులో 1 గ్రెయిను వసనాభి యుండును.

అతిమాత్రమునందును, ఇంద్రియనష్ట మందును, మూత్రము నిలుపుచేయబడినపుడును, దీని నుపయోగింప నగును.

తల తిరుగుట, తలనొప్పి. గొంతు యెండిపోవుట—యీలక్షణములను బట్టి యీయౌషధము విషముగ బనిచేయు చున్న దని తెలిసికొని యీమందును నిలిపివేయ వలయును.

## టింక్చర్ ఆకొనైట్— Tincture Aconite.

దీనియొక్క వాడుకవలన జ్వరగతియొక్క ప్రారంభమందు నాడియొక్క తీవ్రత తగ్గును; తలనొప్పి విశేషించి యుండినయెడల తగ్గును; పెద్ద మోతాదులుగ నిచ్చిన నోటియందును ఒడ లంతటను తిమ్మిరి కలుగును; ద్రవపదార్థము.

మోతాదు 5 మి॥ మొ॥ 15 మి॥; తఱచుగా నియ్యదలంచిన యెడల 2 మి॥ మొ॥ 5 మి॥

### లినిమెంట్ అకోనైట్ — Liniment Aconite.

ఇది పైన రాయుటకు మాత్రమే ఉపయోగింపబడును; రక్తప్రచారమును దగ్గించి నొప్పిని దగ్గించును; దీనిని యెంతమాత్రమును లోని కియ్య రాదు.

---

## ఈతర్ — Aether.

ద్రవపదార్థము; దీనికి ఈతర్ సల్ఫ్యూరిక్ (Aether Sulphuric) అనికూడ అందురు; 1 కి 10 వంతుల నీటిలో గలియురు.

మోతాదు 40 మి॥ మొ॥ 60 మి॥; మరల మరల నిచ్చు నెడల 10 మి॥ మొ॥ 30 మి॥

మూర్ఛస్థితియందు బహు శీఘ్రముగా చురుకుదనమును బుట్టించును; జీర్ణకారి; ఉబ్బసమునందు ఉపశాంతిని గలుగ జేయవచ్చును.

### స్పిరిట్ ఈతరిస్ — Spirit Aetheris.

దీనిలో 3 కి 1 పాలు ఈతర్ ఉండును; పై ఉపయోగములకే వాడబడును.

మోతాదు 60 మి॥ మొ॥ 90 మి॥

### స్పిరిట్ ఈతర్ నైట్రెస్—Spirit Aether Nitras.

చెమటను వృద్ధిపఱచి, మూత్రగ్రంథులపై బని చేయుటవలన మూత్రము నభివృద్ధి చేయును; జ్వరములందు మిగుల నుపయోగముగ నుండును; చురుకుదనమును బుట్టించును; ఉబ్బసమునందలి ఆయాసమును దగ్గించును; మూత్రకృచ్ఛ్రముయొక్క వెలువడుట యందలి బాధను తగ్గించును, మూత్రకృచ్ఛ్రము అనగా మూత్ర ద్వారా రాళ్ళు వెలువడు నట్టి వ్యాధి.

మోతాదు—మరల మరల నిచ్చుటకు 20 మి॥ మొ॥ 40 మి॥ ఒకే మోతాదుగా నిచ్చుటకు 60 మి॥ మొ॥ 90 మి॥

ఆరుమాసముల బిడ్డకు 3 చుక్కలు మొదలు 5 చుక్కలవరకు నియ్యవలయును. ఒక సంవత్సరము వయసునందు 6 మొదలు 10 చుక్కల వరకు నియ్యవలయును.

---

## ఆల్కహాల్ (అసలైన) – **Alcohol Absolutum.**

దీనిలో 100 కి 1 వంతుమాత్రమే జలము ఉండును; గాలిలో నుంచినయెడల ఆవిరియై పోవును.

### ఆల్కహాల్ — Alcohol.

ఇందు అసలైన ఆల్కహాల్ 100 కి 90 వంతు లుండును; బ్రాందీ, విస్కీ, జిన్, రమ్, అనబడువాటియందు 100 కి 50 వంతులు మాత్రమే ఆల్కహాల్ ఉండును; పోరుటుౖనులో 100 కి 16 వంతులు; షెర్రివైన్ లో 100 కి 15 వంతులు; మెడీరా వైన్ లో 100 కి 14 వంతులు; క్లారెట్ వైన్ లో 100 కి 5 మొదలు 7 వంతులు.

ఆల్కహాల్ కాని ఆల్కహాల్ కలిసియున్న బ్రాందీ మొదలగునవి కాని, కొద్ది మోతాదులలో, నోటియందలి ఉమ్మిసిటినిన్ని జీర్ణాశయమునందలి జాఠర రసము (Gastric Juice)నున్నూ అధికముగ స్రవింప జేసి, జీర్ణశక్తిని బలపఱచి, గుండె యొక్క పనిని బలపఱచి, మనోబలమునకు చురుకును బుట్టించును.

పెద్దపెద్ద మోతాదులలో, ఊపిరితిత్తులయొక్కయు గుండెయొక్కయు కార్యక్రమమునకు భంగము కలిగి, మత్తు కలిగి, మూర్ఛ పుట్టి, కనుపాపలు విస్తరించి, దేహము పాలిపోయి, నాడి క్షీణత నంది, శరీరపు వేడిమి తగ్గిపోయి ఆయాసము పుట్టి మరణము తటస్థించును.

విశేషముగ త్రాగుడు అలవాటు అయిన వారలకు కొద్ది మోతాదులవలన నేమియు ఉపయోగము కనబడదు.

కొన్ని ఉద్రేకవిషయములలో దీనిని యిచ్చుటవలన గుణము కనుపడగలదు; కొన్ని విషయములలో దీని ఉపయోగమువలన ప్రాణమునే గాపాడవచ్చును; ఎప్పుడును పెద్ద మోతాదులలో నుపయోగింపరాదు.

మాత్రగ్రంధులు అస్వస్థత నంది యున్నపుడును, నరముల సంబంధమగు వ్యాధులు అనగా హిస్టీరియా మొదలగు వ్యాధులయందును, దీనిని బహు జాగ్రతతో వాడవలయును.

బ్రాందీ యొక్క మోతాదు:— సామాన్యముగ రెండు మూడు గంటల కొక సారి ఒక ఔన్సు చొప్పున నియ్యవచ్చును.

---

## ఆలోజ్ — Aloes.

దీనికే తెలుగులో కలబంద అందురు; కలబంద మట్టలను అడ్డముగా నరకి నప్పుడు వచ్చునట్టి రసమును యెండబెట్టినయెడల పలుకులుగా నగును; దీనినే మూసాంబరము అందురు; సామాన్యముగా బజారులో దొరకునట్టిది మంచిది కాదు; మట్టలపై గూడుకొనియుండు జిగురును పోగుచేసి దీనిని పళ్లెరములలో పోసి యెండబెట్టినను, లేక నిప్పు సెగపైని గాచినను, గట్టిపడి యేర్పడుదానికే మూసాంబర మందురు.

3 గ్రె॥ మొ॥ 6 గ్రె॥ మోతాదు విరేచనకారిగ బనిచేయును; దీనిని ఒక్కదానినే యిచ్చిన యెడల, నొప్పిని కలుగ జేయుటయు వాంతి వచ్చున ట్లుండజేయుటయు, దటస్థించును; కాబట్టి ఘాటయిన కొన్ని యితరపదార్థములతో దీనిని చేర్చి యిచ్చుట మంచిది.

బిడ్డలకును, మూలశంకవ్యాధిగ్రస్తులకును, గర్భిణిస్త్రీలకును, దీని నియ్యరాదు; ఋతుస్రావము యొక్క నిలుపుదలయందు గాని, ఋతుస్రావము యొక్క క్రమము దప్పుటయందు గాని, యిది బాగుగ పనిచేయును; గర్భవత్కాలమునందును ఋతుస్రావకాలమునందును యీ మందు నుపయోగించరాదు. పై సందర్భములందు ముఖ్యముగా రోగి పాలిపోయి శుష్కించి నీరసస్థితియం దున్నపుడు యీ క్రింది విధముగ నియ్యవచ్చును. మూసాంబరము 24 గ్రెయినులు, అన్నభేది (Sulphate of Iron) 24 గ్రెయినులు, దాల్చిన చెక్కపొడి 60 గ్రెయినులు — వీటి నన్నిటిని ముద్దగాజేయునంత తేనెతో గలిపి 24 మాత్రలుగా జేసి, దినమునకు రెండుమాత్రల చొప్పున నియ్యవలయును.

ఈ క్రింది ప్రకరణము, హిస్టీరియా పీడితులగు స్త్రీలకు పొత్తికడుపునందు వాయువు కూడుకొని యున్నపుడును, యీ స్థితులు మలబద్ధముతో జేరి యున్నపుడును, మిగుల నుపయోగముగ నుండును. ఋతుస్రావ మతాత్తుగ నాగిపోయి నపుడును, మూలశంక సంబంధమగు చాల దినములనుండి ఉండియున్న రక్తస్రావము నిలుపు అయినప్పుడును, గలుగు తలనొప్పి నణచి వేయుటకును యీ ఔషధయోగము పనిచేయును.

| | | |
|---|---|---|
| మూసాంబరము | ... | 20 గ్రె॥ |
| ఇంగువ | ... | 20 గ్రె॥ |

ఈ రెంటిని తేనెతో గలిపి ముద్దగా జేసి 12 మాత్రలుగా జేసి దినమునకు రెండు మాత్రలను బుచ్చుకొనవలయును. ఈపద్ధతి ననుసరించియే కొంచెముమార్పుతో యీక్రింది ఇంగ్లీషుమందు చేయబడుచున్నది.

పిల్యూలా అలోజ్ యెట్ అసాఫటిడా—**Pilula Aloes et Asafetidae.**

మోతాదు— 4 గ్రె॥ మొ॥ 8 గ్రె॥

టింక్చర్ అలోజ్—**Tincture Aloes**

దీనిలో అతిమధురము (Liquorice) కలియును; మోతాదు—మరల మరల నిచ్చుటకు అరడ్రాముమొదలు ఒకడ్రామువఱకు; ఒకేమోతాదుగ $1\frac{1}{2}$ డ్రాము మొదలు 2 డ్రాముల వఱకు.

---

## ఆలం (పటిక) — Alum.

మంచిరకపు పటిక సామాన్యముగ బజారులో దొరకును; పులుపు తీపులతో గూడిన ఒగరు రుచిని గలిగియుండును; దీనిని లోనికిచ్చినను పైన నుపయోగించినను స్నాయువులను ముడుచుకొనునట్లు చేయును.

మోతాదు 10 గ్రె॥ మొ॥ 20 గ్రె॥

బిడ్డలకు కండ్లకలక గలిగినపుడు 3 గ్రె॥ పటికను ఒకఔన్సు జలములోగలిపి దీనితో కండ్లను శుభ్రముగా దినమునకు నాలుగయిదు పర్యాయములు తప్పక కడుగ వలయును; పెద్దవారల కయినయెడల నింతకు రెట్టింపు మోతాదు నుపయోగింపవల యును.

శ్వాసకోశములు, జీర్ణాశయము, మూత్ర గ్రంథులు, గర్భాశయము, వీటినుండి రక్తస్రావము గలిగినపుడు దీని నుపయోగింప నగును; జ్వర ముండినయెడల నాపివేయ వలయును.

2 డ్రాముల పటికను ఒకపైంటు పాలలోగలిపి 10 నిమిషములవఱకు గాచి వడియ గట్టవలెను. ఋతుస్రావ మధికముగ నున్నపుడును, మూలశంకవలన స్రావ మధికముగ నుండినపుడును, దీనిని $1\frac{1}{2}$ ఔన్సులు మొదలు 2 ఔన్సుల వఱకు దినమునకు మూడుసారు లియ్యనగును.

ముక్కునుండి రక్తము స్రవించిన యెడల ఒక ఔన్సు జలములో 20 గ్రె॥ పటికను గలిపి ముక్కులోనికి పిచికారీ చేసిన యెడల స్రావము నిలిచిపోవును.

ఇరువది ఔన్సుల జలమున కొక అరఔన్సు పటికను గలిపి సెగవ్యాధియందును కుసుమవ్యాధి యందును పిచికారీ చేయుట కుపయోగించును; దీనినే గొంతునొప్పి యందు గండూషముగ నుపయోగింప నగును.

పైన చెప్పబడిన పాలతో నుడుకబెట్టబడిన పటిక అతిమూత్రవ్యాధియందు మూత్ర పరిమాణమును కొన్ని విషయములయందు తగ్గింపవచ్చును; ధాతు నష్టమునందు మూత్రముగుండ వెడలిపోవు శ్వేతధాతువుయొక్క పరిమాణమును గూడ తగ్గించునట్లు తెలియుచున్నది,

తేలుకుట్టుటకు:— పటికను తడిచేసి కుట్టినచోట అంటించినయెడల తలుచుగా వెంటనే ఉపశాంతి గలుగ జేయునని ఒకడాక్టరుగారు వ్రాయుచున్నారు.

---

## అమ్మోనియా — **Ammonia**.

అమ్మోనియా సంబంధమగు యీ క్రింది ఔషధములు సామాన్య వాడుకయం దున్నవి.

### అమ్మోనియై బెంజోస్ — Ammonii Benzoas.

నిర్వర్ణమైనట్టియు పొరలు కలిగినట్టియు పలుకులుగానుండెడి ఘనపదార్థము: **1** కి **5** వంతుల నీటిలో గలియును; మూత్రమును ప్రకోపింపజేయును; నంజువ్యాధి యందును గౌట్ వ్యాధియందును ఉపయోగించును. స్కార్లెట్ జ్వరమునందు **15** గ్రా॥ మోతాదు బాగుగ పనిచేయునట్లు తెలియుచున్నది; కార్జమునకు చురుకు దనమును బుట్టించును.

మోతాదు:— **5** గ్రా॥ మొ॥ **15** గ్రా॥ (జలములో గలిపి)

### అమ్మోనియం బ్రొమైడ్ — Ammonium Bromide,

కోరింతదగ్గుయందు కఫము వెలువడునట్లును, తెరలుగా వచ్చెడి ఆయాసమును తగ్గించుట యందును, గొంతులోనియును స్వరపేటికలోనియును పొరలయందలి రక్తనాళములను ముడుచుకొనునట్లును, చేయును; నరములపైన పొటాసియం బ్రొమైడ్ (Potassium Bromide) కంటె నిది తక్కువ నిరసత్వమును గలుగ జేయును.

మోతాదు—**5** గ్రా మొ॥ **30** గ్రా॥

### అమ్మోనియం కార్బొనేట్—Ammonium Carbonate.

బలమగు వాసనతో గూడి తెల్లని గడ్డలుగ నుండును; పెద్ద మోతాదులుగ నిచ్చిన యెడల వాంతికారిగను విరేచనకారిగను బనిచేయును; సుమారు **8** గ్రా॥

మోతాదును నీటిలో గలిపి యిచ్చినయెడల కఫహారముగను, జ్వరముయొక్క తీవ్ర దశయందలి నీరసతను దగ్గించునదిగను, బనిచేయును. పాంగువ్యాధియందు జ్వరవేడిమిని గూడ దగ్గించునట్లు కనబడుచున్నది.

కందిరీగ మొదలైనవి కుట్టిన స్థలములందు పైన రాయుటవలన బాధ అంతరించగలదు.

అమ్మోనియం క్లోరీడ్ — Ammonium Chloride.

తెల్లని పలుకులుగా నుండెడిది శ్రేష్ఠమైనది; 1 కి 3 వంతుల నీటిలో గలియును; దీర్ఘకాలమునుంచి యుండెడి రొమ్మునొప్పడిసెము (Bronchitis) నందు కఫహారముగ బనిచేయును; ఇందులకు 20 గ్రె॥ మోతాదులో నియ్యవలసి యుండును; నాడీవ్యాధి (నరముల సంబంధమైన ఉద్రేకమగు బాధ) యందు విడిగా దీనినే గాని, టింక్చర్ ఓపియం తోడను మెగ్నీసియం సల్ఫేట్ తోడను గలిపి గాని, యిచ్చిన యెడల నిశ్చయముగ నెమ్మదించునని చెప్పబడు చున్నది. దీనికి శాల్ అమ్మోనియాక్ (Sal Ammoniac) అను పేరు కూడ గలదు.

మోతాదు— 5 గ్రె॥ మొ॥ 20 గ్రె॥

లిక్కర్ అమ్మోనియా—Liquor Ammonia.

పాముకాటునకు ఉపయోగింప నగును; చురుకుదనమును బుట్టించునదిగను, మూత్రప్రకోపకారిగను, చెమటను బుట్టించునదిగను, బనిచేయును.

మోతాదు 10 మి॥ మొ॥ 20 మి॥

లిక్కర్ అమ్మోనియా ఫార్టిస్—Liquor Ammonia Fortis.

పైదాని కంటె నిది చాలా బల మైనది. ఇదియును పాముకాటున కుపయోగించును.

మోతాదు—3 మి॥ మొ॥ 6 మి॥

లిక్కర్ అమ్మోనియా బుడ్డిని దెఱచుటలో బహుజాగ్రతతో దెరవవలయును; లేనియెడల, లోని ద్రావకము పొంగి వచ్చి, ఆవిరి యయి, అఘాటునకు మనిషి స్మారకములేక పడిపోవుటయు, దటస్థింప గలదు.

లిక్కర్ అమ్మోనియా అసిటేటిస్—Liquor Ammonia Acetatis.

ఒకఔన్సు అమ్మోనియం కార్బనేట్ను, యిందులకు 10 అంతలు యెత్తుగల జలములో మిశ్రితము చేయవలయును; ఇది యెర్రటి లిట్మస్ కాగితమును నీలవర్ణ

మునకు మార్చును; ఈగుణము పోవుటకును వలసినంత అసిటిక్ ఆసిడ్‌ను గలుపవల యును; పిమ్మట యిది యంతయు 20 ఔన్సులు అగుటకు వలసినంత నీటిని గలుప వలయును; దీనిని అకుపచ్చవర్ణముగల గాజుకార్కు మూతగల సీసాలలో నుంచ వలయును.

మూత్రప్రకోపకారిగను, చెమటను బుట్టించునదిగను, బనిచేయును.

మోతాదు — 2 డ్రా॥ మొ॥ 6 డ్రా॥

స్పిరిట్స్ అమ్మోనియా అరొమేటిక్ — Spirits Ammonia Aromatic.

హిస్టీరియా, తలనొప్పి, తల త్రిప్పుట, గుండెఅదరు, మూర్ఛ, కొన్నిఅజీర్తులు, కడు పుబ్బరము—యీవ్యాధులయం దీ ఔషధము నుపయోగింప నగును.

మోతాదు—మరల మరల నిచ్చుటకు 20 మి॥ మొ॥ 40 మి॥ వరకును,ఒకటే మోతాదుగ నిచ్చునెడల 60 మి॥ మొ॥ 90 మి॥ వరకును, నియ్య నగును.

---

## అమిగ్డాలా (బాదం) — Amygdala.

ఈ బాదంవిత్తుల యందు తియ్య బాదంవిత్తు లనియు చేదుబాదం విత్తులనియు రెండు రకములు కలవు. తియ్యబాదం విత్తులు బలము నిచ్చును. చేదుబాదం విత్తులనుండి తీయబడిన చమురునందు హైడ్రోసియానిక్ ఆసిడ్ అనబడు విషము ఉండును. దీనిని లోని కిచ్చుట కుపయోగింప రాదు; తియ్యబాదం నూనెను కురుపులు మొదలగు వాటికి పైన రాచిన పిమ్మట పిండికట్లు వగైరాలను గట్టవచ్చును.

---

## అమిల్ నైట్రిస్ — Amyl Nitris.

పసుపువర్ణము గలిగి, గాలికి ఆవిరియై పోవునట్టి ఒకవిధ మగు వాసన గలిగిన ద్రవపదార్థము; ఆల్కహాల్‌లో మిళిత మగును; నీటిలో గలియదు; చల్లని ప్రదేశమం దుంచబడవలయును; గాలి తగిలిన యెడల దీనియొక్క గుణము చెడిపోవును.

తెరలతో గూడిన ఉబ్బస సంబంధమగు ఆయాసము, నొప్పితో గూడిన ఋతుస్రావవ్యాధి, ప్రసవానంతరపు రక్తస్రావము, మూర్ఛలు — వీటియం దుప యోగించును.

మోతాదు — దీనినుండి వచ్చెడి గాలిని పీల్చుటకు 2 మి॥ మొ॥ 5 మి॥; నోటిద్వారా లోనికి పుచ్చుకొనుటకు ½ మి॥ మొ॥ 1 మి॥

---

## అనీసి (సోపు గింజలు) — Anisi.

సోపుగింజలు బజారులలో దొరకునవే అయి యున్నవి; రోగముచేత దేహము నందు గలుగు యీడ్పును అణచివేయునట్టిదిగను, జీర్ణకారిగను, పనిచేయును.

### అక్వా అనీసి — Aqua Anisi.

ఒక పౌను సోపుగింజలను రెండు గాలనుల నీటితో గలిపి బట్టీ పెట్టినయెడల 1 పౌను అక్వా అనీసి తేలును.

మోతాదు — 1 డ్రాము మొదలు 2 డ్రాముల వరకు (ఒక సంవత్సరము వయసుగల బిడ్డకు); పై ఉపయోగములకే:

### ఓలియం అనీసి — Oleum Anisi.

ఇది చమురుగా చేయబడినది.

మోతాదు — ½ మి॥ మొ॥ 3 మి॥

### స్పిరిట్ అనీసి — Spirit Anisi.

1 ఔన్సు ఓలియం అనీసిని 9 ఔన్సుల ఆల్కహాల్‌తో గలిపినయెడల స్పిరిట్ అనీసి అగును; ఇదియును పై యుపయోగములకే.

మోతాదు — 5 మి॥ మొ॥ 20 మి॥; 1 సం॥ వయసు గల బిడ్డకు 3 మి॥

---

## ఆంటిమోనియం టార్టరేటం—Antimonium Tartaratum.

ఆంటిమోనియం సంబంధమగు ఔషధములలో తఱచుగా వాడుకయందుండె డిది ఆంటిమోనియం టార్టరేటం (Antimonium Tartaratum) అయియున్నది. ఆంటిమోనియం టార్టరేటంకు టార్టార్ యెమిటిక్ (Tartar Emetic) అని కూడ అందురు; నీటిలో గలియును; వాంతికారి; గుండెయొక్క కార్యక్రమమునకు దుర్బలతను గలుగజేయును; కఫము వెలువడునట్లు చేయును.

మోతాదు—వాంతికారిగ 1 గ్రే॥ మొదలు 2 గ్రే॥

ఒక సంవత్సరము వయసుగల బిడ్డకు:—

మోతాదు — $\frac{1}{6}$ గ్రె॥ ; చెమటను బుట్టించుటకు $\frac{1}{24}$ గ్రె॥ మొ॥ $\frac{1}{8}$ గ్రె॥ వఱకు; కఫహారముగ $\frac{1}{8}$ గ్రె॥ మొదలు $\frac{1}{4}$ గ్రె॥ వఱకు; నీటిలోగలిపి యియ్యనగును.

ఆంటిమోనియల్ వైన్ — Antimonial Wine.

ఆంటిమోనియం టార్ట్రేటం 40 గ్రెయినులను 1 ఔన్సు మసలగాచిన నీటిలో గలిపి, ఒక పైంటు కొలతకు సరిపోవు నట్లుగ షెర్రీ వైనును గలిపిన — ఆంటిమోని యల్ వైన్ అగుచున్నది; ఇది తెలుపు, పసుపు, బూడిదవర్ణము కలిసినదిగ నుండును; మోతాదును గొలచుటకు పైదాని కంటె నిది యెక్కువ వీలుగ నుండును.

మోతాదు — 10 మి॥ మొ॥ 30 మి॥; వాంతికారిగ రెండుడ్రాములు మొ॥ 4 డ్రాముల వఱకు నియ్యనగును.

ఒక సంవత్సరము వయసుగల బిడ్డకు:—

కఫహారముగ 3 మి॥; వాంతికారిగ 15 మి॥

జ్వరగతియందు ఒడలు వేడిగను పొడిగను నుండినచో ఆంటిమోనియం సం బంధ మగు నౌషధమును నిచ్చుటచే జెమటను బుట్టించి జ్వరమును దగ్గించును; శ్వాస కోశములతో సంబంధించిన దగ్గు ఉండి కఫము వెలువడని స్థితియందుండినచో మిగుల బనిచేయును; శ్వాసకోశములు తీవ్రమైన వాపుదల స్థితియందున్న న్యుమోనియావ్యాధి యందు గుండెకాయపై బనిచేయు గుణమును బట్టి నాడియొక్క తీవ్రతను దగ్గించి జ్వరమును గూడ కొంతవరకు శాంతిపఱచును.

కింకవాయువునందు బిడ్డలకు యీక్రింది ఔషధయోగము నియ్యనగును.

| | | | |
|---|---|---|---|
| ఆంటిమోనియం టార్ట్రేటం | ... | ... | 1 గ్రె॥ |
| వైనం ఇపికాక్ | ... | ... | 4 డ్రా॥ |
| షరబతు (రుచికరముగ నుండుటకు) | ... | ... | 1 ఔన్సు |
| జలము | ... | ... | 3 ఔన్సులు |

వీటిని బాగుగా గలిపి వాంతి కలుగు వఱకును 15 నిమిషముల కొకసారి ఒక డ్రాము నిచ్చుచుండ వలయును; పిమ్మట అవసరమును బట్టి పరిమితకాలమును దగ్గించి గంట లేక రెండుగంటలకు లేక మూడు గంటలకు ఒకసారి, యియ్యనగును.

తీవ్రమయిన సంధిగుణమందు డాక్టర్ గ్రెవ్‌జ్ అనునాయన ¼ గ్రయినుయాంటిమోనియం టార్టరేటంను అదే తూనికగల నల్లమందును గలిపి యిచ్చుటచే గుణమును గనుగొనెను.

---

## ఆక్వా (జలము) — Aqua.

జ్వరగతియందు మంచుగడ్డరూపమున నుండెడి జలము దాహము నణచివేయుట కుపయోగించును; ఇందులకు కొంచెము మంచుగడ్డ ముక్కలను నోటిలో బిల్చ వలయును, నోటిలో నుండెడి యీమంచుగడ్డయొక్క చల్లదనమువలన మెదడు నందలి రక్తప్రచార మధికము కాగలదు; మరింగక మునుపే జీర్ణాశయము నందలి జాఠరరసము యొక్క పరిమాణమును అధికమగును; జీర్ణాశయమునందు పుండుయేర్పడి నపుడును, జీర్ణాశయము రేగుదల స్థితియం దున్నపుడును, నొప్పిని తగ్గించును.

అరపైంటు మొదలు ఒకపైంటువరకు చల్లని నీళ్లను ఉదయపు భోజనమునకు పూర్వముననే పుచ్చుకొనుటవలన, పేగులనుండి వెలువడనున్న మలము యీనీటితో గలిసి పేగులలోని గ్రంథులకు చురుకుదనమును బుట్టించి, సాధువైన విరేచనకారిగ బని చేయును.

అజీర్ణి యందును మలబద్ధమునందును మిగుల వేడిగ నుండు నీళ్లను ద్రాగించుట యొక చికిత్సామార్గముగ గొందఱివలన నెంచబడు చున్నది గాని యిట్టి చికిత్స జీర్ణాశయమునందలి పొరలకు రంధ్రమును బడునట్లు చేసియున్న విషయముల దా మెఱిగియున్నట్లును, యిట్టి పద్ధతి అపాయకర మనియును, డాక్టరు విల్లాగారు చెప్పుచున్నారు.

పేగులయందు నిలువ యుండెడి మలమును వెలువడునట్లు చేయుటకుగాను 98 డిగ్రీల వేడిమిగలిగియున్న నీటిని ఆసనము ద్వారా "యెనిమా"ను యియ్యవచ్చును; ఇందులకు 3 మొ॥ 8 పైంట్లవఱకు వేడినీళ్లు నుపయోగింప వగును.

చిల్లాముదము మొదలగునవి గలిసియుండిన చల్లని నీటిని ఆసనముద్వారా "యెనిమా" యిచ్చుటకుగాను, 1 పైంటు జలము చాలును.

బలము నిచ్చువాటిని ఆసనముద్వారా "యెనిమా"నియ్యవలెనన్న నీటియొక్క పరిమాణము కొద్ది ఔన్సులకంటె యెక్కువగ నుండరాదు; ఇంతియేగాక నీటిని పల్చని

గంజివలె నుండునట్లు చేయవలయును; ఇందులో కొంచెముగా టింక్చర్ ఓపియం (Tincture Opium) ను గలిపినయెడల యిది జీర్ణ మగునంతవరకు శరీరమునందు నిలుపు చేయబడి యుండును.

జలము విశేషపరిమాణముగ దీనికొనబడినయెడల మూత్రగ్రంథులను మూత్రాశయమును గడిగి మూత్రము నధికముగ వెలువడ జేయును; వేడినీళ్లను విశేషముగ దీని కొనినయెడల వాంతికారిగ బనిచేయును.

వివిధ పరిమితుల వేడిమిగల నీటియందు స్నానమును జేయుటలో వేరువేరు గుణములు గలవు:—

కోల్డు బాత్ (చల్లని స్నానము) — Cold Bath.

జ్వరమందు 45-66 డిగ్రీలకు మధ్య నుండెడి ఫారన్‌హీట్ వేడిమిగల నీటియందు స్నానము చేయనగును, దీనికే కోల్డు బాత్ అందురు, నరముల సంబంధమగు అనేక వ్యాధులయందు మంచి బలవర్ధకౌషధముగ బనిచేయును; సముద్రస్నానమువలని బలవర్ధక ఫలితములను మనము గమనింప దగి యున్నవి.

టెపిడ్ బాత్ (గోరువెచ్చని నీళ్ల స్నానము) — Tepid Bath.

85-95 డిగ్రీలకు మధ్య నుండెడి వేడిమిగల నీటియందలి స్నానమునకు టెపిడ్ బాత్ అందురు.

వాం బాత్ — Warm Bath; హాట్ బాత్ — Hot Bath.

98-100 డిగ్రీల వేడిమిగల స్నానము వాం బాత్ అనబడును; 103-108 డిగ్రీల వేడిమిగలస్నానము హాట్ బాత్ నాబడును, ఈ రెండువిధములగు స్నానములును నంజు, మూత్రవ్యాధి, పడిసెము, కడుపునొప్పి మొదలగువాటియం దుపయోగించును.

నొప్పులు, వాపులు, రక్తము గూడుకొనుట, మొదలయిన వాటికి వేడినీటియొక్క కాపడములయొక్క ఉపయోగమును గురించి విశేషముగ వ్రాయ నక్కర లేదు.

జ్వరము ఉద్రేతగతికి నడచి 106 డిగ్రీలుగాని 108 డిగ్రీలుగాని ఉండి అటులనే నిలువబడినపుడు మరణము నిశ్చయము గనుక చల్లని నీళ్లలో స్నానము చేయించి ప్రాణమును గాపాడవచ్చును; కీళ్లనొప్పుల జ్వరమందు ముఖ్యముగ నిట్లు

చేయుటవలన బ్రాణమును రక్షింపవచ్చును. ఇట్టి రోగి 98 డిగ్రీల వేడిమిగల నీటిలో కూర్చుండ బెట్టబడి నీటియొక్క వేడిమి 70 లేక 60 డిగ్రీలవరకు తగ్గువరకు చన్నీళ్లనుగాని మంచుగడ్డనుగాని కలుపవలయును; శరీరపువేడిమి 3 మొదలు 5 డిగ్రీలవరకు తగ్గినపిమ్మట రోగి నచ్చటనుండి దీసి శుభ్రముగా దుడిచి, పరుండ బెట్టవలయును; తదనంతరము గూడ నొక యరగంటవరకు గాని, అంత కెక్కుడు పరిమితివరకుగాని, శరీరముయొక్క వేడిమి తగ్గుచునే యుండును; ఈస్నానమునకు కాలపరిమితి 5 నిమిషములు మొదలు యొక గంటవరకును పరిస్థితులను బట్టి మారుచుండును. కఠినమగు విషయములలో రెండు లేక మూడు లేక నాలుగు గంటల కొకసారి యీస్నానమును మరల మరల జేయింపవచ్చును.

టైఫాయిడ్ జ్వరమునందు శరీరపువేడిమి 102 డిగ్రీలకు మించినపు డెల్లను కోల్డు బాత్ను గాని టెపిడ్ బాత్నుగాని తప్పకుండ జేయించుటవలన నీవ్యాధి యందలి మరణములు జాలవరకు తగ్గియుండెడ మయినదని తెలియ దగును. సాధారణ విషయములలో చల్లనినీళ్లతో స్పంజి చేసినను ఉపయోగముగనే యుండును.

మహాత్మాగాంధీ యుపదేశము.

"వాయు వదృశ్యమై యుండుటచే దాని కార్యక్రమముయొక్క అద్భుతమార్గమును మనము దెలిసికొనలే కున్నాము. కాని, జలముయొక్క కార్యక్రమమును, దాని చికిత్సాఫలితములను, దేలికగ జూచి గ్రహింపగలుగుదుము.

ఆవిరిని జికిత్సాసందర్భమున నుపయోగించు విషయమై యెల్లరకును గొంతవరకును దెలిసినవిషయమే. జ్వరవిషయములందు దానిని దరుచుగ నుపయోగించుచుందుము; తీక్ష్ణతను వహించిన తలనొప్పులు దాని ఉపయోగమూలముననే తరుచుగ కుదిరిక నందగలవు. కీళ్ళయందు వాతనొప్పి విషయములలో ఆవిరి నుపయోగించి, వెంటనే చన్నీటిస్నానమును జేసినయెడల శీఘ్రశమనమును గాంచవచ్చును. కురుపులను, వ్రణములను, పట్టీలతో నయముకానివాటిని, ఆవిరిప్రయోగమువలన బూర్తిగ గుదర్చవచ్చును.

"అధికబడలిక విషయములో ఆవిరిస్నానమునుగాని ఉడుకునీటిస్నానమునుగాని చేసినపిమ్మట చన్నీటిస్నానమును జేసినయెడల మిగుల గుణముగ నుండగలదు. అదే విధముగ, నిద్ర పట్టకపోయిన విషయములందు, ఆవిరి స్నానానంతరము చన్నీటి స్నానమును జేసి, బహిర్వాయువునందు బరుండుటవలన తత్క్షణమే గుణము నిచ్చును.

"ఆవిరికి బదులుగ నెల్లప్పుడును వేడినీటి నుపయోగించవచ్చును. జీర్ణాశయమునం దుమ్రితబాధ కలిగినపుడు, నడుము చుట్టును దళమగు బట్టను జుట్టి, మసల గాచిన నీటిలో నిండియున్న సీసాతో పైన గాచినయెడల వెంటనే గుణము గనబడును. వాంత జేసికొనవలయునని యిచ్ఛకలిగినపుడు వేడినీటిని విశేషముగ ద్రాగుటవలన వమనము కాగలదు. మలబద్ధముచే బాధ నొందుచున్న వారలు, పరుండు ముందర గాని, ఉదయమున లేచిన పిమ్మట ముఖప్రక్షాళనానంతరముగాని, 8 ఔన్సుల వేడి జలమును ద్రాగినయెడల దరుచుగ మంచిగుణము నందుదురు. పరుండు ముందర యును, నిద్ర లేచిన పిమ్మటయును, ఒకగ్లాసు (8 ఔన్సులు) ఉడుకునీటిని ద్రాగు అలవాటును జేసికొనుట మూలమున దాను ప్రశస్తారోగ్యమును గలిగియుండె నని సర్ గార్డన్ స్ప్రింగ్ చెప్పియున్నాడు. ఉదయమున తేనీటిని బుచ్చుకొనినపిమ్మట నే చాలమందికి విరేచన మగును. అట్టివార లవివేకముగ తేనీటిమూలముననే విరేచన మగుచున్నదని తలంతురు. కాని, నిజమైన సంగతికి తేయాకు హానినేకలుగజేయును; అందలి ఉడుకునీరు మాత్రమే విరేచనకారిగ బనిచేయుచున్నదని తెలియవలయును.

"తరుచుగ నావిరిస్నానములకు బ్రత్యేకవిధమగు నొక మంచ ముపయోగింప బడుచున్నది; కాని, అది ముఖ్యావశ్యకము కాదు. సామాన్యమగు బెత్తపుకుర్చీక్రింద, స్పిరిట్ స్టోవ్ గాని, కిరొసైన్ ఆయిల్ స్టోవ్ గాని,కట్టెమంటగాని, బొగ్గుమంటగాని, యేర్పరచనగును. మంటపైన నొకపాత్రతో జలమునుంచి అందుపైన మూతను బెట్ట వలయును. నిప్పుయొక్క సెగ రోగికి దగులకుండునట్లు కుర్చీకి యెదుటవైపున గుడ్డ నుగాని దుప్పటినిగాని గట్టవలయును అంతట రోగిని కుర్చీలో గూర్చుండబెట్టి, చుట్టును గుడ్డలనుగాని దుప్పట్లనుగాని అమర్చవలయును. అనంతరము, పాత్రనుండి వెలువడు ఆవిరి రోగికి దగులుటకు వీలుగ నుండునట్లుగా పాత్రయొక్కమూతను దీయవలయును. రోగియొక్క శిరస్సునుగూడ మనము మూసియుంచు సామాన్యపు అలవాటు అనవసరజాగ్రతను సూచించుచున్నది. ఆవిరియొక్క వేడిమి శరీరముగుండ సరాసరి శిరస్సునకు బోయి ముఖముపైన విస్తారముగ చెమటపోయును. రోగి కూర్చుం డుట కశక్తుడుగ నుండినయెడల, సందులుగల మంచముపైన బరుండనగును; ఈసందుల గుండ ఆవి రేమియు తొలగిపోకుండ జాగ్రతను బుచ్చుకొనవలయును. రోగియొక్క బట్టలుగాని దుప్పట్లుగాని నిప్పంటుకొనకుండునట్లు గూడ దగుజాగ్రత నందవలయును. రోగియొక్క ఆరోగ్యస్థితిని బాగుగా గమనించవలసియుండును. వివేచనజ్ఞానము లేకుండ నావిరిని బ్రయోగించినయెడల హాని కలుగును. ఆవిరిస్నానానంతరము నిజముగ రోగికి నీరసముగా నుండునుగాని యీ నీరసత అధికకాల ముండనేరదు. ఆవిరిని విశేష

తరచుగ నుపయోగించుట మూలమున శరీరనిర్మాణమునకు బలహీనతను గలుగజేయును గాన, నావిరి నుపయోగించుటయందు క్రమమైన విచారణచేయుట ముఖ్యావశ్యకమై యున్నది. శరీరముయొక్క యేయొకభాగమునకైనను ఆవిరి నుపయోగింపవచ్చును. తలనొప్పివిషయములలో శరీరము నంతను ఆవిరి బట్టవలసిన అవసరము లేదు. మసలకాగుచున్న నీటితోనున్న సన్నమూతి పాత్రపైన దలను వంచి, చుట్టును గుడ్డను ముసుకుగా వేసికొనవలయును. అంతట ఆవిరి తల కెక్కునట్లుగా ముక్కుగుండా లోనికి బీలువవలయును. నాసికాద్వారము బంధించియున్నయెడల నీకార్యక్రమఫలితముగ దెరపినందును. ఇదే విధముగ శరీరమునం దేభాగమైనను వాపుదల నందియున్నయెడల దానిని మాత్రమే ఆవిరిని బట్టనగును.

"వేడినీటికంటె నధికచికిత్సావిలువను గలిగి, మిక్కిలి బలహీనులకుగూడ నుపయోగించునట్టి చన్నీటియొక్క ఉపయోగమునుగూర్చి తెలిసినవారలు కొద్దిగ నున్నారు. జ్వరము, మశూచి, చర్మవ్యాధులు—వీనిలో, గుడ్డను చన్నీటిలో దడిపి గట్టినచో అద్భుతఫలితముల నిచ్చును. ఎంతమాత్రము నపాయభయము లేకుండ నెవరైనను దీనిని బరిశోధింపవచ్చును. తల తిరుగుటయందుగాని, మగతయందుగాని, మంచునీటిలో దడిపిన గుడ్డను దలకుజుట్టిన యెడల, వెంటనే శమనము నిచ్చును. మలబద్ధముచే బాధనొందువారు మంచునీటిలో దడిపినగుడ్డను కొంతసేపు జీర్ణాశయము (పొత్తికడుపు) చుట్టు గట్టుకొనినచో దరుచుగ నెక్కుడులాభమును బొందుదురు. అప్రయత్నముగ దానంతట నది యగు నింద్రియస్ఖలనమునుగూడ నీచికిత్సాపద్ధతిని మాన్పవచ్చును. శరీరమునం దేభాగమునుండి రక్తము స్రవించినను మంచునీటిలో దడిపినగుడ్డను గట్టుటవలన నాపుచేయవచ్చును. శిరస్సుపైన చన్నీటిని బోయుటవలన నాసికారంధ్రమునుండి రక్తస్రావమును నిలుపుచేయవచ్చును. నాసికావ్యాధులు, జలుబు, తలనొప్పి—వీనియందు నాసికాద్వారముగుండ పరిశుద్ధమగు చల్లనినీటిని యెగబీల్చుటవలన—నయము నందవచ్చును. జలము నొక నాసికాద్వారమునుండి లోనికి బీల్చుచు రెండవనాసికాద్వారమునుండి వెలిబుచ్చవచ్చును; లేదా, రెండు నాసికాద్వారములనుండియు లోనికి బీల్చుచు నోటినుండి వెలువరింపవచ్చును. నాసికాద్వారములు పరిశుభ్రముగా నుండినయెడల జలము జీర్ణాశయములోనికి బోయినను హాని లేదు. నాసికాద్వారముల బరిశుభ్రముగా నుంచుట కిదియే ఉత్తమమార్గము. నాసికాద్వారములగుండ జలమును బీల్చజాలనివారలు పిచికారీ నుపయోగింపవచ్చును; కొద్ది ప్రయత్నముల పిమ్మట చాలా సులభముగా జేయవచ్చును. తలనొప్పులు, ముక్కుయందు దుర్వాసనలు, నాసికారంధ్రములయందు మురికి చేరుట—వీని కన్నిటికి నిది

మంచిచికిత్స యగుటచేతను, చాలా సులభపద్ధతి యగుటచేతను, యీ పద్ధతి నందరును నేర్చుకొనవలయును.

"చాలమంది యెనీమా (Enema) ను ఉపయోగించుటకు భయపడుదురు. అందు మూలమున శరీరము నీరసించు ననికూడ గొందరు తలంతురు. అట్టిభయమున కింతమాత్రము నాస్పదము లేదు. పేగులను బరిశుభ్రపరచుట కింతకంటె మంచిపద్ధతి యేదియును లేదు. తక్కిన ఔషధము లన్నియు నిరుపయోగములైన అనేకవ్యాధులలో నిది ప్రయోజనకారిగ నుండెను. ఇది పేగులను శుభ్రపరచి విషయుతపదార్థముయొక్క కూడిక నాటంకపరచును. కీళ్లనొప్పివ్యాధితోగాని, అజీర్ణవ్యాధితోగాని, పేగులయొక్క అనారోగ్య ఫలితమగు బాధతోగాని, యుండియున్నపుడు రెండుపానుల జలమును యెనీమాక్రింద నుపయోగించినయెడల నెంతశీఘ్రముగ గుణము నిచ్చునో చూడ నగును. దీర్ఘ అజీర్ణవ్యాధిచే బాధనొందుచు, యేమందులును ఉపయోగింపక, శుష్కించినపుడు, యెనీమా నుపయోగించుటమూలమున వెంటనే ఆకలి జనించి, కొద్దిదినములలోనే తనకు వ్యాధిరాహిత్యత గలిగెనని— యిందునుగురించి వ్రాసిన యొక గ్రంథకర్త చెప్పుచున్నాడు. ఎనిమాయొక్క ఉపయోగమువలన పచ్చకామాలవంటి వ్యాధులుకూడ కుదరిక నందగలవు. ఎనీమాను దరుచుగ నుపయోగించవలసివచ్చినయెడల జన్నీటి నుపయోగించవలయును; వేడినీటిని దరుచుగ నుపయోగించుటమూలమున శరీరమును బ్రాయశః నీరసపరచును.

"జర్మనీ వాసియగు డాక్టర్ లూయీ కుహ్నె అనేక పరిశోధనలను జేసినపిమ్మట నన్నివ్యాధులకును నీటిచికిత్స సర్వోత్తమమని చెప్పియున్నాడు. ఇండియాదేశ సహితముగ ప్రపంచమునందలి దాదాపు అన్నిభాషలలోనికిని జలచికిత్సను గూర్చిన యీయన గ్రంథములు తర్జుమా చేసియుండుటనుబట్టి యీ విషయ మెంత జనరంజకమయ్యెనో తెలిసికొననగును. అన్నివ్యాధులకును పొత్తికడుపు స్థాన మని యీయన వాదనయైయున్నది. పొత్తికడుపునం దుద్రుతవేడిమి యుండి యుండినయెడల నది జ్వరము, కీళ్ళనొప్పి, శరీరముపై పొక్కులు మొదలగు రీతిని పైకి గనబడును. కుహ్నెకి చాలా కాలము పూర్వముననే జలచికిత్సయొక్క విశేషతను జాలమంది గుర్తించియుండిరి గాని —వ్యాధుల కన్నిటికిని ఒకే ఉత్పత్తిస్థానమని మొదటగా సూచించిన దీయనయే. ఆయనయొక్క అభిప్రాయములను మనము సంపూర్ణగ నంగీకరింప నావశ్యకత లేదు గాని, ఆయనయొక్క ప్రధాన సూత్రములును, పద్ధతులును జాల వ్యాధులలో నుపయోగకరములై యుండె ననునది నిస్సంశయమై యున్నది. నా అనుభవమునందు జూచిన చాలవిషయములలో నొకటి మాత్రమే యిచ్చట చెప్పుచున్నాను. తక్కిన అన్ని

మందుల నుపయోగించినపిమ్మట నవి సంపూర్ణనిరర్థకములని తెలిసినపిదప నొక దుష్టమగు కీళ్ళనొప్పివ్యాధిలో కుహ్నిపద్ధతివలన బూర్తియైన కుదిరిక గలిగెను.

“ పొత్తికడుపు నందలి వేడిమిని చన్నీటిప్రయోగముమూలమున తగ్గింపవచ్చునని డాక్టర్ కుహ్ని అభిప్రాయ పడుచున్నాడు. ఈకారణమున పొత్తికడుపును దానిచుట్టుపట్లభాగములను సంపూర్ణముగ జల్లనినీటితో దడుపవలయునని యాయన నియమించియున్నాడు. ఇట్టి స్నానోపయోగమునకై ప్రత్యేకవిధమగు నొకసత్తురేకుతొట్టిని యాయన గనిపెట్టియున్నాడు. ఇది అంత ముఖ్యావశ్యకము కాదు. కోడి గ్రుడ్డు ఆకారముననుండి వివిధకొలతలతో మనకు బాజారులలో దొరకు తొట్టి మనకు పనికివచ్చును. తొట్టికి ముప్పాతికవరకు చన్నీటిని బోసి, రోగియొక్క పాదములును శరీరముయొక్క పైభాగమును నీటికి వెలుపలనుండి, తుంట్లవరకును శరీరముయొక్క తక్కినభాగ మంతయును నీటిలో నుండునట్లుగ, నందులో గూర్చుండవలయును. పాదముల నేదైన నెత్తుతక్కువగల పీటపైన బెట్టుకొనుట వీలుగనుండును. రోగి నీటిలో దిగంబరిగనే కూర్చుండవలయును; కాని చలిగా నున్నయెడల పాదములపైనయును పైభాగమునను దుప్పటిని గప్పవలయును. చొక్కాయిని ధరించియున్నయెడల దానిని నీటికి దాకకుండ నుంచవలయును. పరిశుభ్రమగు గాలియును, వెలుతురును గలిగినట్టిగదిలో నిట్టి స్నానమును జేయవలయును. రోగి తొట్టిలో గూర్చున్న అనంతరము 5 నిమిషములు మొదలు 30 నిమిషములవరకు పొత్తికడుపుపైన నొకముతుకగుడ్డతో దోముకొనవలయును; ఇతరులు తోమినను దోమవచ్చును. చాల విషయములలో గుణము వెంటనే కనబడును; కీళ్ళనొప్పి వ్యాధిలో జీర్ణాశయమునందలి వాయువు తేనుపుమొదలగువాని మూలముగ బయలువెడలి పోవును. జ్వరవిషయములో తెర్మామెటరునందు ఒకటి రెండు డిగ్రీలు తక్కువగ గనబడును. ఈపద్ధతివలన పేగులు త్వరితగతిని శుభ్రత ..దుచున్నవి; బడలిక ..ంతరించుచున్నది, నిద్రరాకపోవుట మాయ మగుచున్నది; ..గత సత్తువకు జోటిచ్చుచున్నది. నిద్ర రాకపోవుటయును, నిద్ర అధిక వచ్చుటయును, నొకే కారణఫలితముగ గలుగుచున్నట్లు కనబడుచున్నది. ఇట్టి ..ఫలితప్రాప్తి మన కట్లుగా గనబడునేగాని నిశ్చయమైనది కాదు. అదే విధముగ జీర్ణఫలితములగు జిగటవిరేచనములును మలబద్ధమును యీపద్ధతి మూలముననే చికిత్స చేయబడును. క్రమమగు ఆహారనియమముతోగూడ నీ తొట్టిస్నానముల జేసినచో దీర్ఘవ్యాపితమగు మూలశంకను గూడ గుదర్పవచ్చును. తఱచుగ నుమ్మివేయు నావశ్యకతతో బాధనందువార లీవిధచికిత్సను వెంటనే గావింప వలయును. ఈ చికిత్సాపద్ధతి ననుసరించుటవలన బలహీనులు దృఢశరీరు లగుదురు; దీర్ఘవ్యాపితమగు కీళ్ళ

నొప్పి వ్యాధి అందువలన గుదిరికనందెను. రక్తస్రావములు, తలనొప్పులు, రక్తము విషయుతమగుట—వీని కన్నిటికి నిది సమర్థవంతమగు చికిత్స. కోలుకుపుండువంటి వ్యాధులగుకూడ నిది అమోఘ చికిత్సగా కుహ్నె నియమించియున్నాడు. క్రమముగా నీ చికిత్స ననుసరించు గర్భిణిస్త్రీ సుఖప్రసవమగును. వేయేల! వయస్సు భేదమును స్త్రీ పురుష విచక్షతయును లేకుండ నెల్లరు నీ చికిత్సవలని ప్రయోజనము ననుభవింపవచ్చును.

" తడిగుడ్డను జుట్టుట మూలమున జేయు నింకొక విధమగు స్నానచికిత్స యున్నది. ఇది చాల వ్యాధుల కమోఘముగ బనిచేయును. ఈస్నానము నీక్రింది విధముగ జేయవలయును. రోగి పూర్ణముగా జాముకొని పండుకొనుటకు వీలుగా నుండునొక బల్లనుగాని కుర్చీనిగాని బహిరంగవాయువునం దుంచవలయును. అందుపైన నాలుగు దుప్పట్లనుగాని, వాయుగతి ననుసరించి అంతకు తక్కుడుగాని యెక్కువగాని, ప్రక్కకు వ్రేలాడుచుండునటుల పరచవలయును. రెండు తెల్లని ప్రక్కదుప్పట్లను చల్లనినీటిలో ముంచి వానిపైన పరచవలయును. ఒకవైపున దుప్పట్ల క్రింద నొక దిండు నుంచవలయును. రోగి కోరినయెడల నడుమునొద్దమాత్రము చిన్న గుడ్డను జుట్టి, తక్కిన శరీర మంతయు వస్త్రహీనముగ నుంచి, తెల్లనిదుప్పట్లపై రోగిని పరుండబెట్టి, చేతులు చంకలలో బెట్టుకొనియుండునట్లు చేయవలయును. అంతట అడుగుదుప్పట్లను పైదుప్పట్లను గూడ నొకటి తరువాత నొకటి రోగికి శరీరమునకు జుట్టవలయును; ఇట్లు చేయుటలో పాదములక్రింద వ్రేలాడుచున్న గుడ్డలను గూడ పాదములపై బాగుగా గప్పవలయును. రోగికి సూర్యరశ్మి దగులుచున్నయెడల శిరస్సు పైనయును ముఖముపైనయును దడిగుడ్డను వేయుచు నాసికాద్వారములను మాత్రము గప్పకుండ చూడవలయును. మొదటగా రోగికి గొంత చలి కలుగునుగాని, శీఘ్రముననే యిది అనుగుణమగు వేడిమిక్రింద మారును. ఈస్థితిలో రోగి **5** నిమిషములు మొదలు యొక గంటవరకుగాని హెచ్చుకాలము యుండవచ్చును. కొంతకాలమైన పిమ్మట చెమట కలుగును; ఒకప్పుడు నిద్రను కలుగవచ్చును. ఈ తడిగుడ్డలనుంచి బయటికి వచ్చిన పిమ్మట రోగి చన్నీటి స్నానము చేయవలయును. మశూచి, జ్వరము, గజ్జి మొదలగు చర్మవ్యాధులు తామర, మొటిమలు, మచ్చలు—వీని కన్నిటికి నిది శ్రేష్ఠమగు చికిత్సయై యున్నది. అటాలమ్మ, మశూచి—వీని పెద్దపాటులలోగూడ నీపద్ధతి సంపూర్ణచికిత్స నిచ్చును. ఈపద్ధతి కాంగ్లమునందు వెట్ షీట్ ప్యాక్ (Wet-sheet Pack) అందురు; అనగా, 'తడిగుడ్డలను జుట్టుట' అని అర్థము. ఈ విధమగు జికిత్సను యెవ రంతట వారు

చేసికొనుట మూలముననగాని యితరులకు జేయుట మూలముననగాని, యిందుల అద్భుత ఫలితమును గాంచవచ్చును. ఈవిధమగు స్నానచికిత్సను జేయుటయందు శరీరము యొక్క మురికంతయు గుడ్డల కంటుకొనునుగాన నాగుడ్డలను ఉడుకునీటిలో గడుగకుండ మరల నుపయోగింపరాదు,

"ఆహారము, వ్యాయామము మొదలగువాని సంబంధమున యవసరమగు నిబంధనల క్రమముగ నాచరింపకుండ నీ స్నానముల జేసిన సంపూర్ణప్రయోజన ముండ నేరదని చెప్ప నవసరము లేదు. ఇందులకు దృష్టాంతముగ నొక కీళ్ళనొప్పి వ్యాధిగ్రస్తుడు అనారోగ్యహితభోజనముజేయుచు, అపరిశుద్ధవాయువునందు నివసించుచు, శరీర సాధకము నుపేక్షచేయుచు, కుహ్నిస్నానములనుగాని, వెట్ షీట్ ప్యాక్‌నుగాని, చేసినయెడల నేమి ప్రయోజనసాధ్యత యుండగలదు? ఆరోగ్యనిర్ణయముల నన్నిటిని గ్రమముగ గమనించుచు జలచికిత్స ననుసరించినప్పుడే యది ఉపయోగముగ నుండ గలదు; అప్రకారముగ జేసినపు డందుల ఫలితములు నిశ్చితములుగను వ్యవధాన విరహితములుగను నుండును." (మహాత్ముని ఆరోగ్యదిగ్దర్శిని).

---

## మృత్తిక. – Earth.

(మహాత్ముని ఆరోగ్యదిగ్దర్శిని నుండి ఆంధ్రీకరణము)

కొన్ని విషయములలో జలముకంటె నధికముగ నద్భుతచికిత్సాఫలితముల నిచ్చునట్టి మన్నుయొక్క గుణలక్షణముల గురించి వివరింప గడంగెదము. మనశరీమే కొంత వరకు పృథివీపదార్థముతో గూడియుండు కారణమునుబట్టి—మన్నునం దట్టిస్వభావ లక్షణము లుండుటయందు మన కచ్చెరువు కలుగనక్కరలేదు. మన్నును పరిశుద్ధపరచు పదార్థముగ మన ముపయోగించుచునే యుందుము. దుర్వాసనలు పోవుటకుగాను నేలను మన్నుతో నలుకుదుము; వాయువు మాలిన్యము నందకుండుటకుగాను క్రుళ్లుపదార్థముపై మన్నును పోయుదుము; మన్నుతో మన చేతులను దోముకొందుము; రహస్యస్థానముల శుభ్రపరచుటకుగూడ నుపయోగింతుము. యోగులు దానిని శరీరముపై బూసికొందురు. కురుపులకును వ్రణములకును జికిత్సకై కొందరు మన్ను నుపయోగింతురు. శవములు క్రుళ్ళి వాయువును బాడుచేయకుండునటుల వాని భూశయనము చేయుచున్నారు. ఈసంగతుల నన్నిటినిబట్టి మన్నునకుండెడి పరిశుద్ధపరచు శక్తి యొక్కయు చికిత్సా శక్తియొక్కయు విశేషోపయోగము దెలియుచున్నది.

డాక్టర్ కుహ్నిు జలచికిత్సకు బ్రత్యేక లక్ష్యము నిచ్చినట్లుగనే,యింకొకజర్మను వైద్యశాస్త్రజ్ఞుడు మన్నుయొక్క గుణఫలితములగూర్చి ప్రత్యేకపరిశోధనా విచా

రణను జేసియున్నాడు. మిక్కిలి చిక్కుస్థితిని వహించిన వ్యాధులయొక్క చికిత్స యందుగూడ దీని నుపయోగించి జయప్రదఫలితముల గాంచవచ్చునని యీయన చెప్పుచున్నాడు, ఒక పాముకాటు విషయములో. మనిషి మృతినొందెనని తక్కిన వారందరును ఆశలు విడువగా, గొంతకాలమువరకు నాసర్పదష్టుని మన్నుతో గప్పి పునర్జీవితుని జేసెనని యీయన చెప్పియుండెను. ఈవృత్తాంతముయొక్క సత్యమును గూర్చి అనుమానించుటకు గారణము కనబడదు. శరీరమును మన్నులో బూడ్చి పెట్టుటవలన మిక్కుటమగు వేడిమి జనించునని తెలిసినవిషయమే. చికిత్సాఫలిత మెట్లు గలిగినదియు మనము సరిగ జెప్పలేకపోయినప్పటికిని విషము నాకర్షించుకొను శక్తి మన్నునం దుండియున్నదని యొప్పుకొనక తప్పదు. పాముకాటు ప్రతివిషయమునందు నీపద్ధతి ననుసరించి చూడవలసినదే. తేలుకుట్టునకును, తత్సంబంధములకును, తడి మన్ను నుపయోగించిన మిగుల బ్రయోజనకరముగ నుండగలదని నాస్వానుభవమూల మున జెప్పగలను.

"ఈక్రింది విధములగు మృచ్చికిత్సలను జయప్రదఫలితములతో నేను స్వయముగ బరిశోధించి చూచితిని. మలబద్ధము, జిగటవిరేచనములు, దీర్ఘవ్యాపితమగు కడుపునొప్పి—యీవిషయములలో రెండు లేక మూడుదినములవరకు పొత్తికడుపు పైన తడిమన్నును పిండికట్టువలె గట్టినమీదట కుదిరికనందెను. తలనొప్పివిషయములో తలచుట్టును తడిమన్ను కట్టుట మూలమున వెంటనే ఉపశాంతి కలిగియుండెను. కన్ను యెఱ్ఱపడినపుడుగూడ యీచికిత్స వినియోగించెను. వాపుదల యుండినను లేకున్నను అన్నివిధములగు గాయములును యీచికిత్సవలన నయమందెను. పూర్వదినములలో ఈనోజ్ ఫ్రూట్ సాల్ట్ మొదలగునవి లేకుండ నేను స్వస్థతగ నుండ లేకపోయెడివాడను. ఈ మృచ్చికిత్సయొక్క విలువను దెలిసికొనిన 1904 సంవత్సర మునుండి అట్టివాని నుపయోగింప నవసర మొకసారియైనను గలిగియుండలేదు. తీవ్రజ్వరగతియందు పొత్తికడుపుపైనయును శిరస్సుపైనయును తడిమన్నుకట్టును గట్టిన యెడల స్పష్టమగు గుణము కనబడును. చీమును వెలువరచునట్టి వ్రణములు మాత్రము అంతసులభముగ గుదరకపోయినను, గజ్జి, తామర మొదలగు చర్మవ్యాధులు, కురుపులు, మట్టి చికిత్సవలన గుదరికనందెను. కాల్పులు, బొబ్బలు—వీనివిషయములో నీమృచ్చికిత్సవలన వాపుదల నిలచిపోవుటయేగాక మానుదలకూడ నందును; ఈచికిత్స వలననే మూలశంకగూడ నయమగును. అతిశీతలతవలన హస్తములును పాదములును యెఱ్ఱనై వాపుదల నందినయెడల నీచికిత్స తప్పక పనిచేయును. కీళ్లలో గలుగు నొప్పికూడ యిందుమూలమున నంతరించును. ఈ మృచ్చికిత్సావిషయమున నేను జేసియున్న యీపై నుదహరింపబడినట్టియు నింక నితరములగునట్టియు బరిశోధనల

మూలమున—వ్యాధులయెడ జేయనగు గృహచికిత్సా సందర్భమున మన్ను బాగుగ నుపయోగించునని నేను నిశ్చయించుకొంటిని.

"అన్నివిధములగు మన్నును సమానఫలితము నియ్యజాలదు. పరిశుభ్రస్థలము నుండి త్రవ్వినపొడిమన్ను మిగుల ప్రయోజనకారిగ నుండినట్లు కనుగొంటిని. మన్ను మిగుల జిగురుగా నుండరాదు. ఇసుకకును బంకమన్నునకును మధ్యస్థముగా నుండెడిది బాగుండును. (ఇంటులకు పాటిమన్ను బాగుండునని తోచెడిని.) అవుపేడయును, యితరచెత్తయును గలియకుండ నుండవలయును. దానిని సన్నని జల్లెడతో జల్లించి ఉపయోగమునకు ముందర చన్నీటితో మెత్తగా బిసుకవలయును. ఈ పిసికినమన్నును పరిశుభ్రమగు మెత్తనిగుడ్డపైన బరచి పిండికట్టును గట్టినట్లుగా గట్టవలయును. ఈ బురదమన్ను ఆరుదలనందక పూర్వమే కట్టును విప్పివేయవలయును. సామాన్యముగా నిది రెండు లేక మూడు గంటలవరకు బనికివచ్చును. ఒకసారి ఉపయోగించిన మన్నును మరల నింకెప్పుడు నుపయోగించరాదు; కాని, ఒకసారి ఉపయోగించిన గుడ్డను, రక్తముగాని యితర మురికిగాని లేకపోయినయెడల, శుభ్రముగా గడిగి మరల నుపయోగించవచ్చును. ఈ మన్నుకట్టును పొత్తికడుపున కుపయోగించవలసి వచ్చినపుడు పొత్తికడుపుపైన ముందుగా వెచ్చనిగుడ్డను గప్పవలయును. అవసరము కలిగినప్పుడు మన్నుకొరకు వెదకుకొనకుండ నుండునట్లు ప్రతివాడును ఒకడబ్బానిండ మన్నును జాగ్రతచేసి యుంచుకొనవలయును. అట్లు చేసికొనకపోయినయెడల, జాల కాలమును వృథాపరచుటవలన తేలుకుట్టు మొదలగువాని విషయమున నాలస్య మధిక అపాయకరముగ నుండును."

---

## ఆర్జన్టి నైట్రస్ — **Argenti Nitras.**

దీనికి లూనార్ కాస్టిక్ (Lunar Caustic) అందురు; సిల్వర్ నైట్రేట్ అను వాడుకపేరు కూడ గలదు. దీనికి పాక్కు-గుణము కలదు.

సెగవ్యాధి యందు 2 గ్రా॥ సిల్వర్ నైట్రేట్‌ను 1 ఔన్సు జలమునందు గలిపి పిచికారీ చేయనగును.

చీముతోగూడిన కండ్లకలకలయందు ఔన్సు జలమునందు 5 గ్రా॥ సిల్వర్ నైట్రేట్‌ను గలిపి దీనిని కనురెప్పల దెఱచి, దూది చుట్టబడిన పుడకతో లోపలిభాగములలో రాయవలయును; కంటిలోపల యీలోషన్ పోయరాదు; అట్లు చేసినయెడల యీలోషన్ యిటు నటు పారలి కన్నుయొక్క తెలుపటిభాగమందు మచ్చలు పడును.

తామర, పులిపిరికాయలు, మొదలయినవాటిని నశింపజేయును.

జీర్ణాశయమునందు పుండుతో గూడియుండి అతివిరేచనము లగుచున్నయెడల దీనిని యిచ్చుటవలన నిలుపుచేయవచ్చును.

మూర్ఛ వ్యాధియందు పొటాసియం బ్రొమైడ్, అమ్మోనియం బ్రొమైడ్ యొక్క వాడుకవలన బ్రయోజనము కనుపడనపుడు దీని నుపయోగింపవచ్చును. కాని యిందువలన చర్మము నల్లబడి యెప్పటికిని అవర్ణము మారకుండ నుండు కారణమును బట్టి దీనియొక్క వాడుకకు అభ్యంతర మగు చున్నది.

మోతాదు $\frac{1}{4}$ గ్రె॥ మొ॥ $\frac{1}{2}$ గ్రె॥

ఉప్పు, సిల్వర్ నైట్రేట్‌కు విరుగుడుగ వర్తించు చున్నది గనుక యీయౌషధమును ఉప్పు గలియ నట్టి రొట్టెలో గలిపి యియ్య నగును.

---

## అసాఫటీడా (ఇంగువ) – Asafetidae.

ఒకవిధమగు చెట్లయొక్క వేళ్లను నరకుటవలన నేర్పడెడి జిగురును నిలువ యుంచినయెడల నల్లగ నగును. దీనినే ఇంగువ అందురు. ఇది చురుకుదనమును బుట్టించునదిగను శరీరమునందలి యీడ్పును బోగొట్టునదిగను బనిచేయును.

మోతాదు—5 గ్రె॥ మొ॥ 15 గ్రె॥

### పిల్యూలా ఆలోజ్ యెట్ అసాఫటీడా— Pilula Aloes et Asafetidae.

ఇది విరేచనకారిగాను, యీడ్పును పోగొట్టునదిగను, బనిచేయును.

మోతాదు — 4 గ్రె॥ మొ॥ 8 గ్రె॥

### టింక్చర్ అసాఫటీడా — Tincture Asafetidae.

4 ఔన్సుల ఇంగువను ఒక పైంటు అగునట్లుగ అల్కహాలులో జేర్చినయెడల టింక్చర్ అసాఫటీడా యేర్పడుచున్నది.

మోతాదు $\frac{1}{2}$ డ్రా॥ మొదలు 1 డ్రాము.

దీనినిగూడ పై యుపయోగములకే వాడనగును.

---

## ఆరంటీ (చేదు నారింజ) — Aurantii.

చేదునారింజ, టింక్చర్ సింకోనా కో లోను, టింక్చర్ జన్షన్ కో లోను చేరుచున్నది. ఇది యీక్రింది వాటిగ దయారు చేయబడుచున్నది.

### ఇన్ఫ్యూజన్ ఆరంటీ — Infusion Aurantii.

చేదు నారింజకాయయొక్క యెండబెట్టబడిన 1 ఔన్సు యెత్తుగల తోలు మసలగాచిన ఒక పైంటు నీళ్లలో వేయబడి అరగంటకాలము నిలువ యుంచబడిన పిమ్మట వడపోయవలెను. జీర్ణాశయముయొక్క కార్యక్రమము వృద్ధిపరచుట కుపయోగించును.

మోతాదు — అరఔన్సు మొ॥ ఒక ఔన్సు వరకు.

### టింక్చర్ ఆరంటీ—Tincture Aurantii.

5 ఔన్సుల యెత్తుగల చేదునారింజకాయయొక్క పచ్చితోలును చిన్నిచిన్ని ముక్కలుగా గోసి నలుగగొట్టి ఒక పైంటు ఆల్కహాలులోబోసి మూతబెట్టి అటులనే ఏడుదినముల వరకు నుంచి వడపోయవలయును. దీనిని యీ యేడుదినములలో మధ్యమధ్య గలియబెట్టుచుండవలయును. ఇది బలవర్ధకౌషధముగ బనిచేయును.

మోతాదు—అరడ్రాము మొ॥ 1 డ్రాము వఱకు.

### సిరప్ ఆరంటీ— Syrup Aurantii.

ఒకఔన్సు టింక్చర్ ఆరంటీని 9 ఔన్సుల సిరప్ (షరబత్)లో గలుపవలయును.

మోతాదు— ½ డ్రాము మొ॥ 1 డ్రాము.

---

## టోలూ — Tolu.

ఒకవిధమగు చెట్టుయొక్క మానుపై నరకుటవలన నేర్పడెడి సువాసన గలిగినట్టియు, మృదువైనట్టియు, తైలము. - బాల్సం ఆఫ్ టోలూ (Balsam of Tolu) అనబడుచున్నది. దీనితో జేయబడిన యీక్రింది యౌషధము (సిరప్) కఫహారములను రుచికరముగ జేయుట కుపయోగింపబడుచున్నది.

## సిరప్ టోలూ—Syrup Tolu

1¼ ఔన్సు బాల్సం ఆఫ్ టోలూను ఒకపైంటు ఆవిరిని జల్లార్చిన నీళ్ళలో కలిపి 2 పౌనుల చక్కెరనుగూడ కలిపినచో నేర్పడుదానికి సిరప్ టోలూ అందురు.

మోతాదు— ½ డ్రాము మొదలు 1 డ్రాము.

---

## బెలడోనా – Belladonna.

అట్రోపా బెలడోనా అనబడు ఒకవిధమగు చెట్టుయొక్క ఆకులనుండియు వేళ్లనుండియు చేయబడు ఔషధము; ఈసంబంధమగు ఔషధమును పైనరాసిన యెడల నాస్థాన మందలి నరములను బండబారజేయును; ఇందుమూలముననే కీళ్ల నొప్పియందును నరముల సంబంధమగు తలనొప్పియందును, యిట్టి యితర నొప్పుల యందును, గుణము నిచ్చును. సహజముగ మలబద్ధగుణముగల శరీరతత్వములకు అలోజ్ (మూసాంబరము) సంబంధమగు నౌషధముతోడను సల్ఫేట్ ఆఫ్ ఐరన్ (అన్నభేది) తోడను, కలిపి యిచ్చినయెడల, ఉపయోగముగ నుండగలదు. ఈసంబంధమగు నౌషధమును లోని కిచ్చుటచే గ్రంథులయొక్క స్రావమును తగ్గించును; స్త్రీలయందు స్తన్యమును నశింపజేయును; కాబట్టి బిడ్డకు పాలిచ్చునట్టి స్థితియందు యీవిషయమును గుర్తెఱింగి మఱియు స్త్రీల కుపయోగింపనగును; అయినను, ప్రసవించిన పిమ్మట స్తనముయొద్ద రక్తము అధికముగా గూడుకొని వాపుదలనంది కురుపుగా దేల నున్నపుడును, చీముపట్టు స్థితియం దున్నపుడును, దీని నుపయోగింపక తప్పదు గావున అట్లు చేయవలయును. కొద్దిమోతాదులయం దైనను గొంతును ఆరుదల నందింపజేయును; పెద్దమోతాదులతో సంధిగుణమును బుట్టించి, ఒడలుపై దద్దుర్లు లేచి, ముఖము యెఱ్ఱబారి, స్నాయువులయొక్క పటుత్వమును తగ్గించును.

### యక్స్ట్రాక్టు బెలడోనా (సాలిడ్) — Extract Belladonna (Solid).

ఒకవిధమగు బలమైన వాసనకలది; ఈచెట్టుయొక్క లేతాకులయొక్కయు కొమ్మలయొక్కయు రసమునుండి, యీ మెత్తనైనట్టియు ఆకుపచ్చనలుపు వర్ణములు కలిసిన రంగు గలిగినట్టియు యీ ఔషధము చేయబడుచున్నది. నరముల సంబంధమగు బాధను దగ్గించును.

మోతాదు — ¼ గ్రె॥ మొ॥ 1 గ్రె॥

స్త్రీలకు స్తనము వాపుదలనంది బాధగానున్నపుడు, యక్స్ట్రాక్టు బెలడోనా సాలిడ్ ఒక ఔన్సును 1 డ్రాము వేడినీళ్లలోను 7 డ్రాముల గ్లిసరీనులోను కలిపి పైన రాయ నగును.

యక్ట్రాక్టం బెలడోనా లిక్విడ్ — Extractum Belladonna Liquid.

దీనిని లోనికిచ్చుటకుగాని పైన రాయుటకుగాని ఉపయోగించరు; దీనిని, లినిమెంట్, ప్లాస్టర్, టింక్చర్, అయింట్మెంట్ — వీటిని జేయుటయం దుపయోగింతురు; ద్రవముగ నుండును;

లినిమెంట్ బెలడోనా — Liniment Belladonna.

ద్రవముగ నుండును; కొద్దిగా పసుపు బూడిద వర్ణములు కలసినదై యుండును; నొప్పులను దీసి వేయుటకు పైనరాయుటకు మాత్రమే ఉపయోగింపబడును; లోనికియ్యరాదు.

యంప్లాస్ట్రం బెలడోనా — Emplastrum Belladonna

గుండెయొద్ద నొప్పిగానుండి గుండెయొక్క కార్యక్రమము అస్వస్థత నంది యున్నపుడు యీ పలాస్త్రీని పట్టీగావేసినయెడల మిగుల బ్రయోజనకారిగ నుండగలదు.

టింక్చర్ బెలడోనా — Tincture Belladonna.

ఉబ్బసపుదగ్గునందు ఆయాసము కలిగినపుడును, రొమ్ముపడిసెము (Bronchitis) సంబంధమగు దగ్గునందు ఉద్రిక్తస్థితి కలిగినపుడును, మూత్రకోశముద్వారా రాళ్లు వెలువడునపుడు కలిగెడి బాధ నణగించుటకును, దీని నుపయోగింతురు.

మోతాదు — 5 మి॥ మొ॥ 15 మి॥

మూత్రము స్వాధీనము తప్పి వెలువడుటయందు దీనియొక్క నిండుమోతాదు యెడల నుపయోగముగ నుండును.

అయింట్మెంట్ బెలడోనా — Ointment Belladonna.

యక్ట్రాక్టు బెలడోనా లిక్విడ్ 2 ఔన్సుల పరిమాణమును పావుఔన్సు అగునట్లుగ గాచి, 2¼ ఔన్సుల బెంజోయేటెడ్ ల్యార్డు (Benzoated Lard)ను గలిపినయెడల, అయింట్మెంట్ బెల్లడోనా అగు చున్నది.

[1 పౌను పందియొక్క క్రొవ్వును దెచ్చి 3½ డ్రాముల బెంజాయిన్ (సాంబ్రాణి)తో గలిపి రెండుగంటల కాలము వఱకు ఉడుకునీళ్ళయొక్క వేడిమివలన గాచి, వడపోసి యుంచుకొనిన దానిని బెంజోయేటెడ్ ల్యార్డు అందురు.]

పైన జెప్పబడిన ఆయింట్ మెంట్ మూలశంకరోగముయొక్క వాపుదలస్థితి యందు ఉపశాంతిని గలుగ జేయును.

---

## బిస్మత్ — Bismuth.

బిస్మత్ సంబంధ మగు లవణములు జీర్ణాశయము నందలి పొరలతో దగిలినపుడు జీర్ణాశయమునందు కొన్ని మార్పులను గలుగ జేయుచున్నవి; ఈమార్పులయొక్క వివరము లింకను గనిపెట్టబడియుండలేదు గాని, జీర్ణాశయసంబంధ మగు నొప్పుల యందును, అజీర్ణియందును, జీర్ణాశయమునందు పుండు యేర్పడినపుడును, అనేక కారణముల వలన గలిగెడి వాంతు లగుచున్నపుడును, యీ లవణములు పనిచేయుచున్నవి. పెద్దమోతాదు అనగా ఒకడ్రాము మోతాదువలన నవి విరేచనములయందు గూడ బనిచేయు చున్నది.

### బిస్మత్ కార్బనస్—Bismuth Carbonas.

తెల్లని పొడి; నీటిలో గలియదు; జీర్ణాశయమునందు ఆమ్లస్థితి అధికముగనున్న యెడల బోగొట్టును; నొప్పిని గూడ బోగొట్టును.

మోతాదు—5 గ్రె॥ మొ॥ 20 గ్రె॥

### బిస్మత్ సాలిసైలస్—Bismuth Salicylas.

తెల్లనిపొడిగా నుండును; నీటియందు గలియదు; కొన్ని విధముల అతివిరేచనములయందును, టైఫాయిడ్ జ్వరమునందును, జలుబు పైన జీర్ణాశయ మస్వస్థత జెందియున్నపుడును, యిది ఉపయోగించును.

మోతాదు—5 గ్రె॥ మొ॥ 20 గ్రె॥

### బిస్మత్ సబ్నైట్రస్—Bismuth Subnitras.

జీర్ణాశయమునందు పుండు యేర్పడి నపుడును, గ్రహణి విరేచనములకును, అజీర్ణమునకును, అతి విరేచనములకును, నిది ఉపయోగించును; మలమును నల్లబరచును; నీటిలో దానంతట అది కలియదు కావున తుమ్మజిగురుతో కలిపినయెడల నీటిలో గలియును; ఇది బరువైన తెల్లని పొడిగ నుండును.

మోతాదు—5 గ్రె॥ మొ॥ 20 గ్రె॥

---

## బక్కు — Buchu.

చిన్న సైనట్టియు, పసుపు ఆకుపచ్చ వర్ణములు కలసిన రంగు గలిగినట్టియు, మెరయు నట్టియు, బలమైన వాసన గలిగినట్టియు, సాఫుగానుండెడి ఆకులు — దీని యొక్క ఔషధమునకు బనికివచ్చు భాగమైయున్నది; జీర్ణకారిగను, మూత్ర ప్రకోప కారిగను, బని చేయును. మూత్రాశయము యొక్క రేగుదలస్థితియందును, సెగ వ్యాధియందును, బని చేయును.

ఇన్‌ఫ్యూజన్ బక్కు—Infusion Buchu.

20 ఔన్సుల మసలగాచిన నీళ్లలో నొక ఔన్సు యీ ఆకులను వేసి ఒక సావుగంట కాలము పిమ్మట వడపోయవలెను.

మోతాదు—1 ఔన్సు మొ॥ 2 ఔన్సులు.

టింక్చర్ బక్కు—Tincture Buchu.

మోతాదు—$\frac{1}{2}$ డ్రా॥ మొ॥ 1 డ్రా॥

---

## కెఫీన్ — Caffeine.

ఒక విధమగు చెట్టుయొక్క యెండిపోయిన ఆకులనుండి గాని, యెండి పోయిన కాఫీగింజల నుండిగాని, 'కోలా' విత్తుల నుండిగాని తయారు చేయఁబడునట్టి ఔషధము. దీనిని కొద్ది మోతాదులలో అనగా రెండు లేక మూడు గ్రేయినుల మోతాదులలో నుపయోగించిన యెడల, మనస్సునకు జురుకుదనమును బుట్టించి, నిద్ర రాకుండ జేసి, మెదడునకును జురుకుదనమును గలిగించుచు దానియొక్క కార్యక్రమ ములను బలపరచును; మోతాదును మరల మరల నిచ్చినయెడల నేత్రములు మిరుమిట్ల నొంది, చెవుల యందు ధ్వనులు పుట్టి మూత్రవిసర్జనావసర మధికమయి, శరీర వేడిమియును హెచ్చును; మోతాదుల నింకను హెచ్చించిన యెడల మూర్ఛలు పుట్టి సంధిగుణము కూడ జనించును.

కొద్ది మోతాదులలో నాడియొక్క నడక తీవ్రతను వహించి, రక్తప్రచార మధికమగును. ఈ ఔషధము గుండెయొక్క స్నాయువులపై బనిచేయుటచే గుండె దెబ్బను బలపరచి చురుకుగ నడచునట్లు చేయును; గుండె అదివరకు క్రమము దప్పి నడచుచుండిన యెడల అట్టి లోపమును సరిచేయును; పెద్ద మోతాదుల నిచ్చినయెడల

నదివరకు క్రమముగ బనిచేయుచున్న గుండెయొక్క క్రమమును దప్పించును. గుండె నంజు విషయములో డిజిటాలిస్ పనిచేయని స్థితియందు దీనిని పెద్ద మోతాదులలో నిచ్చినయెడల తఱుచుగ బహు శీఘ్రముగ బనిచేయును. గుండె వ్యాధియందు యిది డిజిటాలిస్‌వలె నంత ఉపయోగకారి కాదుగాని డిజిటాలిస్‌తో దీనినిగూడ యిచ్చిన యెడల నెక్కువ ఉపయోగముగ నుండగలదు.

మూత్ర గ్రంథులయొక్క క్షీణదశ స్థితియందు దీనిని నుపయుగించినయెడల మూత్రముగుండ వెడలెడి శ్వేతధాతువును తగ్గించి మూత్రమును ప్రకోపింప జేసినట్లు తెలియుచున్నది.

మోతాదు—1 గ్రా॥ మొ॥ 5 గ్రా॥

కఫీన్ సిట్రస్—Caffeine Citras.

పొడిగా నుండును; దీనికిని కెఫీన్‌యొక్క ఉపయోగములే కలవు; పార్శ్వపు సంబంధమగు తలనొప్పికి 4 గ్రా॥ కెఫీన్ సిట్రసును 5 గ్రా॥ ఫెనాసిటిన్ (Phenacetin) తో గలిపి యిచ్చినయెడల నయము కాగలదు.

మోతాదు—2 గ్రా॥ మొ॥ 10 గ్రా॥

కఫీన్ వెలిరియానస్—Caffeine Valerianas.

పలుకులుగాగాని పొడిగాగాని ఉండును; హిస్టీరియా వ్యాధియందు వాంతిని గట్టించును.

మోతాదు—½ గ్రా॥ మొ॥ 3 గ్రా॥

---

## క్యాజిపట్ ఆయిల్ – **Cajuput Oil.**

దీనికి తెలుగులో యాలకు అరఖు అందురు; ఇది బలమైన వాసనతో గూడి యుండును; చురుకుదనమును బుట్టించునదిగను, శరీరమునందలి గూడ్పును బోగొట్టు నదిగను, బని చేయును; తలనొప్పియందు పైన రాయుటకును నుపయోగించును.

మోతాదు—½ మి॥ మొ॥ 3 మి॥

స్పిరిట్స్ క్యాజిపట్—Spirits Cajuput.

1 ఔన్సు ఆయిల్‌లో 9 ఔన్సుల అల్కహాల్‌ను గలిపినయెడల స్పిరిట్స్ క్యాజిపట్ అగుచున్నది.

మోతాదు—5 మి॥ మొ॥ 20 మి॥

---

## కాల్సియం — Calcium.

సున్నముతో సంబంధించినట్టి "కాల్సియం" నాబడు పదార్థము కలసియుండెడి ఔషధములను కొద్ది మోతాదులలో నిచ్చుటవలన శరీరమునందలి అల్లికలయందు గనుగొనబడు యొకవిధమగు వస్తువును రక్తమునందుజేర్చి బలమును కలుగజేయును; విశేషమగు మోతాదులలో నిచ్చుటవలన రక్తముయొక్కయు అల్లికలయొక్కయు అంతర్భాగములను నశింపజేయును.

### కాల్సియం క్లోరైడ్ —Calcium Chloride.

క్షయవ్యాధియందును, గ్రంథులు వాపుదల నందిన స్థితియందును, బాగుగ బని చేయును.

ఋతుస్రావకాలమునకు ముందుగా నొకవారము దినముల కాలము దినమునకు 10 గ్రె॥ మొ॥ 15 గ్రె॥ వరకు నిచ్చినయెడల విశేషించియగు స్రావము నిలుపుదల యగునట్లు తెలియుచున్నది; మూత్రగ్రంధి సంబంధమగు వ్యాధి ఉండిన యెడల యీ ఔషధమును వాడరాదు.

మోతాదు 5 గ్రె॥ మొ॥ 15 గ్రె॥

### కాల్సియై ఫాస్ఫస్—Calcii Phosphas.

ఎముగుచుండెడి యెముకలకు వలయు 'సున్నపు పదార్థము జేర్చుటయందును, సాధారణముగా శరీరమునకు బలము నిచ్చుటయందును, యిది పనిచేయును; ఇదే ఉపయోగమునకు గర్భిణీ స్త్రీలకు నియ్యబడును; బలవర్ధకౌషధము.

మోతాదు— 5 గ్రె॥ మొ॥ 15 గ్రె॥

### కాల్సియై హైపోఫాస్ఫిస్ — Calcii Hypophosphis.

ఇదియు బలవర్ధకౌషధముగ నుపయోగించును.

మోతాదు—3 గ్రె॥ మొ॥ 10 గ్రె॥

---

## కలంబా — Calumba.

ఇది యొకచెట్టుయొక్క వేళ్లతో సంబంధించినది; మిగుల వాడుకయం దుండునట్టి, చేదురుచిగల బలవర్ధకౌషధము; దీనిని లోహపుజాతి ఔషధములతో గలిపి యియ్యవచ్చును. నేలవేము (Chirata) ను యిదియు జీర్ణాశయముపై నొకేవిధముగ

బనిచేయును; నాలుకయొక్కయు నోటియొక్కయు, నరములయొక్క కొనలపై బనిచేయుటచే ఉమ్మినీటిని యెక్కువగ స్రవింపజేయుచు, జీర్ణాశయమునందును యిదే విధముగ జాఠరరసము నతిశయముగ స్రవింపజేయుచు, జీర్ణశక్తిని బలపఱచి ఆకలిని బుట్టించును.

దీనిని అజీర్ణవ్యాధియందును, వ్యాధులయొక్క స్వస్థావస్థయందును, జీర్ణమును క్రమపఱచి ఆకలిని బుట్టించును; జీర్ణాశయముయొక్కయు పేగులయొక్కయు వాపుదల నందియున్న స్థితియందు దీనిని ఉపయోగింపగూడదు.

ఇన్ ఫ్యూజన్ కలంబా — Infusion Calumba.

**1** ఔన్సు కలంబావేళ్ళను ఒకపైంటు చన్నీళ్ళలో ఒకవారము దినములవరకు నానబెట్టి, మధ్యకాలమందు అప్పుడప్పుడు కలియబెట్టుచు, పిమ్మట వడపోయవలయును.

మోతాదు — ½ ఔన్సు మొ॥ **1** ఔన్సు.

టింక్చర్ కలంబా — Tincture Calumba.

ఇదియుగూడ పైన చెప్పబడిన ఉపయోగములకే వాడబడును.

మోతాదు—½ డ్రా॥ మొ॥ **1** డ్రా॥

---

## క్యాంఫర్ (హారతికర్పూరము) — **Camphor.**

హారతికర్పూరము విశేషముగా జపాను దేశమునందు తయారుచేయబడుచున్నది. ఇందులో మంచిరకము తెల్లగానుండి మెఱయుచుండును. సువాసనగలదిగను కారముగను నుండును. ఇది లోనికిచ్చినయెడల బాధను తగ్గించునదిగను, శరీరము నందుగలిగెడి యీడ్పును అణచివేయునదిగను, జీర్ణకారిగను, కఫమును వెలువరచునదిగను, చెమటను బుట్టించునదిగను సంభోగశక్తిని నిరసపఱచు నట్టిదిగను, క్రిములను చంపునదిగను, పడిసెమును తగ్గించునదిగను, వెక్కిలిని బోగొట్టునదిగను, అతి విరేచనముల నాపుచేయునదిగను, బనిచేయుచున్నది,

మోతాదు— **2** గ్రై॥ మొ॥ **5** గ్రై॥

ఆక్వా క్యాంఫర్ — Aqua Camphor.

**12** గ్రై॥ హారతికర్పూరమును **40** మినిముల ఆల్కహాల్ లో గలిపిన పిమ్మట **24** ఔన్సుల జలమును గలుపవలయును. ఇతర ఔషధముల నిచ్చుటయందు నీటికి బదులుగా దీనిని గలుపనగును.

## లినిమెంట్ క్యాంఫర్ — Liniment Camphor.

1 ఔన్సు హారతికర్పూరమును 4 ఔన్సుల ఆలివ్ ఆయిల్‌లో గాని, కొబ్బరి నూనెలోగాని, నువ్వులనూనెలో గాని, కలిపి—కీళ్ల నొప్పులకును, నడుము నొప్పికిని, కీళ్ళయొక్క వాపుదలకును, గ్రంథులయొక్క వాపుదలకును, కంకుదెబ్బలకును, బెణుకులకును, పైన రాయుట మూలమున నుపయోగింపనగును.

## టింక్చర్ క్యాంఫర్ కో — Tincture Camphor Co.

దీనియందు ఓపియం (నల్లమందు) బెంజాయిక్ ఆసిడ్ (సాంబ్రాణి సంబంధమైనది) హారతికర్పూరము— ఈమూడును గలిసి యుండును; దగ్గు విషయములందు కఫహరముగ బాగుగ పనిచేయును.

మోతాదు— ½ డ్రా॥ మొ॥ 1 డ్రా॥

న్యూమోనియా వ్యాధియందు యీక్రింది ఔషధ యోగము బాగుగ పనిచేయునట్లు చెప్పబడుచున్నది.

| | |
|---|---|
| క్యాంఫర్ (Camphor) | 15 గ్రా॥ |
| టింక్చర్ సింకోనా (Tincture Cinchona) | 1 డ్రా॥ |
| గ్లిసరీన్ (Glycerine) | 1 డ్రా॥ |
| సిరప్ ఆఫ్ టోలు (Syrup of Tolu) | 4 ఔన్సులు |
| సిరప్ ఆఫ్ ఆరంజ్ (Syrup of Orange) | 1 ఔన్సు |
| జలము (Water) | 5 ఔన్సులు |

గంట కొక ఔన్సు చొప్పున నియ్య నగును.

---

## కనేబిస్ ఇండికా (గంజాయి)— **Cannabis Indica.**

గంజాయి చెట్లయందు పూచునట్టిగాని కాయలు కాచునట్టిగాని వాని యెండిన చిగుళ్లు—వాటియందుండెడి జిగురుపదార్థము సయితము—ఔషధముగా నుపయోగింపబడు చున్నవి. వీటియొక్క గుణములు—నొప్పిని బోగొట్టుటయు, మత్తతను గలుగజేయుటయు—అయి యున్నవి.

ఉబ్బసమునందు బనిచేయును; సంభోగశక్తిని బలపఱచును; మోతాదు అధికమగుటచే తమాషాకలలు వచ్చుటయు, సంధిగుణము జనించుటయు, గలుగును. ఋతుస్రావమునందు నొప్పికలుగు విషయములో టింక్చర్ కనేబిస్ ఇండికాను టింక్చర్

జెల్సిమియంతో కలిపి యియ్య నగును. విశేషముగు తాగుడువలన కలిగెడి సంధి గుణమునందును, క్షయవ్యాధియొక్క దగ్గునందును, కడుపునొప్పియొక్క తెరలయందును, టింక్చర్ కెనేబిస్ ఇండికాను టింక్చర్ నక్సువామికాతో కలిపి యియ్యనగును; కొద్ది మోతాదులలో దఱచుగ నియ్య నగును.

యక్స్ట్రాక్టం కెనేబిస్ ఇండికా—Extractum Cannabis Indica

నల్లమందువలెనే నొప్పిని పోగొట్టి మత్తును గలుగజేయునది; జిగురుగ నుండును.

మోతాదు— $\frac{1}{4}$ గ్రా॥ మొ॥ 1 గ్రా॥

టింక్చర్ కెనేబిస్ ఇండికా — Tincture Cannabis Indica

బాగుగా ఆకుపచ్చవర్ణము కలిగిన ద్రవపదార్థము. మోతాదు— 5 మి॥ మొ॥ 15 మి॥; వైన్‌లో గలిపి యియ్యవచ్చును.

---

## కెంథారిడీస్—Cantharidis.

దీనియందు పొక్కుగుణము కలదు; దీనిని లోనికి యిచ్చుటయందు వాడుక తగ్గిపోయినది; దీనితో జేయబడినట్టి లైకర్ యెపిస్పాస్టికస్ (Liquor Epispasticus) అనబడు ద్రవపదారము పొక్కుట కుపయోగింతురు. టింక్చర్ కెంతారిడీస్ (Tincture Cantharidis) తలనూనెలయందు వాడుదురు; తల వెండ్రుకలయొక్క కుదుళ్లకు యెక్కువ పరిమితిగల రక్తప్రచారమును గలిగించును. వెండ్రుకలు ఊడి పోవు చున్నపుడు యీక్రింది ఔషధయోగము నుపయోగింప నగును.

| | |
|---|---|
| ఆలివ్ అయిల్ (Olive Oil) | 2 ఔన్సులు |
| పొటాష్ బైకార్బనేట్ (Potash Bicarbonate) | 2 డ్రాములు |
| అమ్మోనియా సొల్యూషన్ (Ammonia solution) | 2 డ్రాములు |
| టింక్చర్ కెంతారిడీస్ (Tincture Cantharidis) | 2 డ్రాములు |

వీటి నన్నిటిని బాగుగా గలిపి, చన్నీళ్ళతో గడిగిన పిమ్మట వెండ్రుకల యొక్క కుదుళ్ళలో దీనిని బాగుగా రుద్దవలయును,

పై విధముననే యీక్రింది ప్రకరణమును గూడ నుపయోగింప నచ్చును.

| | |
|---|---|
| యూడికొలోన్ (Eaudecologne) ... | 2 ఔన్సులు |

టింక్చర్ కెంతారిడీస్ ( Tincture Cantharidis) 2 డ్రా॥
రోజ్ మెరీనా ఆయిల్ (Rosmarina Oil) 10 మి॥
లవండర్ ఆయిల్ (Lavender Oil) 10 మి॥

---

## కాప్సికం (మిరిచి) — Capsicum.

మిరిచిని నోటిలో వేసికొనినపుడు నోటియందలి గ్రంథు లెక్కువగ స్రవించును; జీర్ణాశయమునందు జేరినపుడు యిదేవిధముగ నందలి స్రావము నధికపఱచును; తరుచుగ నిచ్చుటచే సంభోగావయవములయొక్క చురుకుదనము నధికపఱచి,కొంచెముగ మత్తతగూడ గలుగజేయును; పెద్దమోతాదులలో నొకప్పుడు మూత్రప్రకోపకారిగ గూడ బనిచేయును. అజీర్ణమునందు ఉపయోగముగ నుండును. త్రాగుడు అలవాటు అయినవారలకు దీనిని నిలిపివేయుటకు — అనగా త్రాగుడునందు యిచ్ఛకలిగినప్పుడెల్లను—ఈక్రింది ఔషధయోగము నుపయోగింపనగును.

టింక్చర్ కాప్సికం (Tincture Capsicum) $2\frac{1}{2}$ డ్రాములు
స్పిరిట్స్ అమ్మోనియా అరోమేటిక్ (Spirits Ammonia Aromatic) 1 ఔన్సు
టింక్చర్ సింకోనా (Tincture Cinchona) $\frac{1}{2}$ ఔన్సు
టింక్చర్ కార్డమం కో (Tincture Cardamom Co.) $5\frac{1}{2}$ డ్రాములు
జలము $7\frac{1}{2}$ ఔన్సులు

వీటిని బాగుగా గలిపి ప్రతి రెండుగంటలకు ఒక అరఔన్సును యింకొక అర ఔన్సు జలములో గలిపి యియ్యవలయును; లేదా, త్రాగుడునందు యిచ్ఛ గలిగినపుడెల్ల నిచ్చినను నియ్యవచ్చును;

టింక్చర్ కాప్సికం—Tincture Capsicum.
మోతాదు — 5 మి॥ మొ॥ 15 మి॥

---

## కార్డమం (ఏలకులు) — Cardamom.

ఏలకులచెట్టు దక్షిణ యిండియా యందును సింహళమునందును బెంపొందుచున్నది; అల్లమువలెనే నిదియు జీర్ణాశయమునందు జీర్ణమునకు సహాయ మొనర్చును.

జాఠరరసమును (Gastric Juice) స్రవింపజేయును. ఆకలిని బుట్టించును; విరేచన కారులతో దీని నిచ్చినయెడల జీర్ణకోశముయొక్క కార్యక్రమమును సరిచేయును; రేగుదలనందిన జీర్ణాశయమునందు యిది ఔషధము నిమిడింపజేయును; దీనితో లోహ (Iron) సంబంధమగు నౌషధముల జేర్చరాదు.

టింక్చర్ కార్డమం కో—Tincture Cardamom Co.

ఏలకులతో జేయబడిన ముఖ్యౌషధ మిదియై యున్నది. పైన చెప్పబడిన గుణ ముల కుపయోగించును.

మోతాదు — $\frac{1}{2}$ డ్రా॥ మొ॥ 1 డ్రా॥

---

## కాస్కారా సాగ్రిడా — Cascara Sagrada.

ఒకవిధమగు చెట్టుయొక్క బెరడునుండి చేయబడుచున్నది; పెద్ద మోతాదు లుగ నిచ్చిన యెడల జీర్ణాశయమునుండి పేగుల చివరవరకును రేగుదలను బుట్టించును; సామాన్యమోతాదులలో, అనగా $\frac{1}{2}$ డ్రాము లిక్విడ్ యక్ట్రాక్టును యిచ్చిన యెడల, జీర్ణకోశమునందలి గ్రంథుల కన్నిటికిని జారుకుదనమును బుట్టించి, స్రావమును గొం చెముగ వృద్ధిపఱచుచు, పేగులనుండి మలము వెలువడుటయందు ఆరోగ్యహితమై నట్టియు పూర్ణమైనట్టియు విరేచన మగునట్లు చేయును. దీర్ఘవ్యాపితమగు మలబద్ధ వ్యాధి సంవత్సరములనుంచి యుండియున్నను, దీనియొక్క క్రమమయిన మోతాదు వలన స్వాభావికమైన విరేచన మగునట్లు చేయుటకు యింతకంటె మంచిమందు యిప్పటివరకు గనుగొనబడి యుండలేదు. ఈ మందువలని మంచిగుణములు నిలచి యుండగనే మోతాదును క్రమముగ తగ్గింపవచ్చును. ఈఔషధమును వాడుటయందు రోగియొక్క స్వానుభవమువలననే మోతాదు నిశ్చయపఱచుట ముఖ్యమైయున్నది. అనగా నెంత మోతాదు నుపయోగించినయెడల రోగికి సాఫయిన విరేచన మగు చున్నదో దానిని గమనించి మోతాదును నిశ్చయింపనగును; ఇట్లు చేయుటవలన మల బద్ధవ్యాధిని నిస్సంశయముగ బారదోలవచ్చును. ఈ ఔషధమును అధమపక్షము రెండుమాసములైనను సేవింపవలసియుండును. కొంతకాలమైన పిమ్మట యీమందును బూర్తిగా మానివేయవచ్చును,

యక్ట్రాక్టం కాస్కారా సాగ్రిడా (సాలిడ్)—
Extractum Cascara Sagrada Solid.

ఇది పొడిగా నుండెడిది; దీనిని మాత్రలుగా జేసి యియ్యనగును.

మోతాదు— 2 గ్రే॥ మొ॥ 8 గ్రే॥

### యక్ట్స్రాక్టం కాస్కారా సాగ్రిడా (లిక్విడ్)—Extractum Cascara Sagrada Liquid.

మోతాదు—½ డ్రా॥ మొ॥ 1 డ్రా॥

---

## కాచు (కవిరి) – Catechu.

ఇది సామాన్యముగా బజారులలో దొరకునట్టిదై యున్నది. జ్వరముతో గూడి యుండనట్టి అతివిరేచనములలో 10 లేక 15 గ్రెయినుల కాచుపొడిని సమానమైన పరిమితిగల దాల్చిన చెక్క పొడితో జేర్చి తేనెలో గలిపి దినమునకు మూడు లేక నాలుగు పర్యాయము లిచ్చినయెడల నుపయోగముగ నుండగలదు. రససంబంధమగు ఉమ్మి ఊరుటయందును, పంటిచిగుళ్లు వాపుదలనందుటయందుగాని జిగురుగనుండుట యందుగాని, కొంచెము కాచుముక్కను నోటిలో చప్పరించుటవలన గుణము కనుపడగలదు. పంటినొప్పియందు నొప్పిగల పంటియొక్క లోభాగమునందు చిన్న ముక్కను ఉంచి అది హరించువరకు నుంచినయెడల నొకప్పుడు మంచి గుణము కనుపడవచ్చును.

### టింక్చర్ కాచు—Tincture Catechu.

ద్రవపదార్థము; కాఫీవర్ణము కలిగియుండును; అతివిరేచనములయం దుప యోగింపనగును.

మోతాదు — ½ డ్రా॥ మొ॥ 1 డ్రా॥

---

## సిరియై ఆక్సాలస్ – Cerii Oxalas.

తెల్లనిపొడి; నీటిలో గలియదు; బిస్మత్ వలెనే నిదియు వాంతి గలుగకుండ జేయును; గర్భవత్సంబంధమగు వాంతుల కుపయోగింపబడుచున్నది.

మోతాదు—2 గ్రె॥ మొ॥ 10 గ్రె॥

---

## చైరేటా (నేలవేము) – Chirata.

నేలవేము చెట్టుయొక్క ప్రతిభాగమును చేదుగానుండును, ఇది బలవర్ధ కౌషధముగ నుపయోగింపబడును; నలుగగొట్టబడిన నేలవేము 1 ఔన్సును దీనికొని

1 పైంటు వేడినీళ్ళలో వేసి ఆరుగంటల కాలము నిలువయుంచి, పిమ్మట వడపోయ వలయును. దీనిని దినమునకు మూడుసారులు రెండు ఔన్సులు మొదలు మూడు ఔన్సులవఱకు నియ్యవచ్చును; దీనితో లవంగములనుగాని, దాల్చిన చెక్కనుగాని, ఏలకగింజలనుగాని, నలుగగొట్టి, యీ పొడినిగూడ జేర్చినయెడల—దీనియొక్క ఉపయోగ మధికమగును. జ్వరముల పిమ్మట నుండెడి నీరసస్థితి యందును, అజీర్ణమునందును, ఆకలి లేనట్టి స్థితియందును, యిది గుణమును గలుగజేయును.

ఇంకొక ప్రకరణము—నలుగగొట్టబడిన నేలవేము కొమ్మలు రెండు ఔన్సులను ఒక బుడ్డి షెర్రీవైనులో గలిపి దానిని వారము దినములు నిలువయుంచిన పిమ్మట, అజీర్తియందును ఆకలి నశించినస్థితియందును దినమునకొకసారిగాని రెండుసారులుగాని భోజనపూర్వ మొకగంటకు ముందుగా దీనికొనినయెడల గుణము నిచ్చును.

వాంతి గుణమున్నయెడల దీనిని బిస్మత్ సబ్ నైట్రిస్‌తో గూడ జేర్చి యియ్యనగును.

టింక్చర్ చెరేటా—Tincture Chirata.

తేయాకు నీళ్ళయొక్క రంగుగ నుండును; పై ఉపయోగములే దీనికిని గలవు.

మోతాదు—$\frac{1}{2}$ డ్రా॥ మొ॥ 1 డ్రా॥

---

## క్లోరల్ హైడ్రస్ – Chloral Hydras.

నిర్వర్ణమైన స్ఫటికములుగ నుండును; స్వాభావికముగ వచ్చునట్టి నిద్రవలెనే (కలలు లేకుండగ) 5 గంటలు మొదలు 8 గంటలవఱకు నిద్రను పుట్టించును; ఓపియం (నల్లమందు) నందు వలె దీనిని బుచ్చుకొనుటవలన బాధ నివారణ నంద జాలదు; దీనిని పెద్దమోతాదులలో బుచ్చుకొనిన యెడల బాధను నివారింప వచ్చును కాని యిట్లు చేయుటవలన హృదయము యొక్కయు శ్వాసకోశముల యొక్కయు కార్య క్రమమునకు భంగము కలుగును, చివరకు మరణమే సంభవింప వచ్చును; శరీరపు వేడిమియు చాలవరకు తగ్గిపోవును.

ఎక్కువగా బని చేసియుండుట వల్లగాని, మనసునకు వ్యాకులత గలిగి యుండుటవలన గాని, నిద్ర పట్టనపుడు దీని నుపయోగింతురు; ఇదిగాక విశేషమగు త్రాగుడువలన గలిగెడి సంధిగుణమునకు 20 గ్రా॥ మొ॥ 30 గ్రా॥ వఱకు నిచ్చుటవలన మంచి ఫలితము గనిపించినట్లు తెలియుచున్నది.

చంటిబిడ్డలకు వచ్చు మూర్ఛలయందును, ప్రసవసంబంధ మగు మూర్ఛలయందును, ఉబ్బసమునందును, పిచ్చిగుణముయొక్క తీవ్రస్థితి యందును, యిది ఉపయోగించును; కోరింతదగ్గునందు మూడుగంటలకొకపర్యాయము 2 సంవత్సరముల వయసుగల బిడ్డకు 1 గ్రె॥ మొదలు 2 గ్రె॥ వఱకు నిచ్చిన యెడల మంచిగుణము కనుపడినట్లు తెలియు చున్నది.

గుండెయందు క్రొవ్వు వహించియున్న స్థితియందు దీని నుపయోగింపరాదు. నిద్రను చెప్పించెడి దీనియొక్క గుణము మందు నుపయోగించిన యొక అరగంట లోపుగనే గనబడును; కాబట్టి యీ మందును బుచ్చుకొనుటకు ముందుగనే పరుండి నిద్రపోవుటకును సిద్ధముగ నుండవలయును.

క్షయవ్యాధి యందు గలిగెడి రాత్రిచెమటలను అణచివేయుటకు, రెండు డ్రాముల క్లోరల్ హైడ్రెస్‌ను రెండు ఔన్సుల బ్రాందిలోనును 6 ఔన్సుల జలములోనును మిశ్రితము జేసి యొడలంతకు పైన రాయవలయును.

ఒక ఔన్సు జలమునందు 5 గ్రె॥ క్లోరల్ హైడ్రెస్‌ను గలిపి తలలోని చుండునకును వెండ్రుకలు ఊడిపోవుటకు నుపయోగింపనగును.

మోతాదు — 5 గ్రె॥ మొ॥ 20 గ్రె॥

---

## క్లోరోఫారం — Chloroform.

స్వచ్ఛమైనట్టియు నిర్వర్ణమైనట్టియు ద్రవపదార్థము; శస్త్రము చేయునపుడు నొప్పిని బొందకుండుటకుగాను దీనిని రోగికి వాసనజూపుట కుపయోగింతురు; దీనిని వాసన జూచుటవలన స్మారకము తప్పిపోవును. దీనిని వాసనజూచుట యందు ప్రథమమున దగ్గుగాని, ఊపిరిని బీల్చుటయం దొకవిధమగు ఆయాసముగాని, పుట్టును; క్రమముగా నిది మతుస్థితిలోనికి దిగును, తఱచుగా నీ స్థితినుండి మారి, ముఖము నల్లబారి, నరములయొక్క నొప్పిని బొందెడి గుణము బండబారి, కనుపాపలు విస్తరింపునంది, యీస్థితినుండి వృద్ధిబొందుచు, పూర్ణమైన మగతగలిగి, మెదడునందలి చురుకుదనము బొత్తుగా క్షీణతనంది, అవయవములయందు పక్షవాతస్థితి ప్రవేశించి, నాడియొక్క బలమును చురుకుదనమును దగ్గిపోయి, కనుపాపలు ముడుచుకొనిపోవును.

ఈచివరస్థితి యందు వాసనజూపుట నింకను నడపినయెడల మరణము సంభవింపవచ్చును; మరణము సంభవించుట (1) శ్వాససంబంధ మగు నాటంకము కలుగుట

కలనగాని (2) గుండెసంబంధమగు దుర్బలత కలుగుటవలన గాని (3) శ్వాసయు గుండెయు నొక్కసారిగనే నిలచిపోవుటవలన గాని — కలుగుచున్నది.

శ్వాససంబంధ మగు క్రమత తప్పుట గలిగినప్పుడు క్లోరోఫారం యొక్క వాసన జూపుటను వెంటనే నిలుపు చేయవలయును. ఈస్థితియందు, గడ్డము ఉదరము వైపులనుండి బలవంతముగ రోగిని వెనుకకు లేవనెత్తి, నాలుకను వెలుపటికి లాగవలయును; కల్పితమైన శ్వాసకృత్యమును ప్రారంభింపవలయును.

గుండెయొక్క నిలచిపోవుట తటస్థించినయెడల రోగియొక్క తలను శరీరము కంటె తక్కువ యెత్తున నుంచవలయును. ఈస్థితియందును కల్పితమైన శ్వాసకృత్యమును బ్రారంభింపవలయును.

కల్పితశ్వాసకృత్యము — (Artificial Respiration.)

[కల్పితమైన శ్వాసకృత్యమునందు, యీ క్రిందియంశములను గమనింపవలయును. రోగియొక్క శిరమును భుజములను దిండ్లపై ఆనించి పరుండబెట్టి, మొదటగా చేతులను పైకెత్తి నిశ్చలముగాను మెల్లగాను రెండు సెకనుల కాలములో చేతులను వెనుకవైపులకు జాచవలయును; ఇందుమూలమున శ్వాసకోశములోనికి పరిశుభ్రమగు గాలి ప్రవేశించును. పిమ్మట, రోగియొక్క చేతులను ముందుకు ద్రిప్పి, మడచి, మెల్లగా రెండుసెకనుల కాలమువఱకు ఎదురురొమ్ముపై ఆనించి ఉంచవలయును. ఇందుమూలమున శ్వాసకోశములయందలి దుర్వాయువు బయటికి దోలివేయబడును. ఈ రెండు విధములగు పనులను మినిటునకు పదునైదు పర్యాయముల చొప్పున ఉచ్ఛ్వాసనిశ్వాసములు వాటంతటవి కలుగువరకును జేయవలయును.

ఈ పైపనులను జేయుచున్నపుడు స్మెలింగ్ సాల్టును వాసనజూపుట వలనను గొంతునందు యీకతో గిలిగింతపెట్టుట వలనను, ముఖమును ఎదురురొమ్మును తోముటవలనను, వాటిపై చన్నీళ్లను వేడినీళ్లను ఒకటి తరువాత నొకటి కొట్టుట వలనను, పొడిగుడ్డలతో ఒడలంతను రుద్దుట వలనను, ఎలెక్ట్రిక్ బ్యాటరీ అందుబాటునం దుండినయెడల దానిని గుండెపైనయును మెడపైనయును ప్రయోగించుటవలనను, ఉపయోగ ముండగలదు. ఈప్రకారము ఒకగంటకాలము చేసినపిమ్మట, ఉపయోగము లేకపోయిన యెడల, మరణము కలిగియున్నదని నిశ్చయింపవచ్చును.]

క్లోరోఫారంను లోని కిచ్చుటవలన జీర్ణాశయమునందు జాఠరరసమును ప్రకోపింప జేయును; మగతగూడ గలుగ జేయును; ఒక మినిము మోతాదును రెండు

ఔన్సుల నీటిలో గలిపి యిచ్చినయెడల, కడుపునొప్పిని, వాంతులను, పార్శ్వపు తల నొప్పిని—నయముచేయును; 10 మి॥ మొ॥ 20 మి॥ వఱకు నుండెడి మోతాదును యిచ్చినయెడల, వాసన జూపుటవలన గలిగెడి గుణములే కలుగును. టేపు వర్మ్ (Tape Worm) పేగులలో నుండి యున్న స్థితియందు పెద్ద మోతాదులలో దీనిని లోని కిచ్చినయెడల నశించిపోవును.

[వాసనను జూపించుటయందు $\frac{1}{4}$ గ్రె॥ మార్ఫిన్ (Morphine) ను ముందుగా లోనకు యింజక్టు (సూదితో రక్తమునందు జేర్చుట) చేయుటవలన దీనివలన గలిగెడి అపాయము తగ్గిపోవును.]

ఆక్వా క్లోరోఫారం—Aqua Chloroform

ఇతర ఔషధముల లోన కిచ్చుటయందు సహకారిగ నుపయోగించును; 30 మినిముల క్లోరోఫారమును 25 ఔన్సులు జలముతో జేర్చిన నిది యేర్పడును.

మోతాదు — $\frac{1}{2}$ ఔన్సు మొ॥ 2 ఔన్సులు.

స్పిరిట్స్ క్లోరోఫారం — Spirits Chloroform.

ఔషధములను లోనికి బుచ్చుకొనుటయందు హితవుగ నుండుటకుగాను దీనిని గలుపుదురు.

మోతాదు— మరల మరల నిచ్చుటకు 5 మి॥ మొ॥ 20 మి॥ ఒకేసారిగ నిచ్చుటకు 30 మి॥ మొ॥ 40 మి॥ జలములో గలిపి యియ్యనగును.

---

## క్రైసారోబైన్— Chrysarobin.

కొంచెము పసుపువర్ణము కలిగి ముదుగయిన పొడిగానుండును; ఇది వెలుతురునకు నిలువ యుంచబడినపుడు నలుపురంగు తేలును. ఇది చర్మవ్యాధులయం దుపయోగింపబడును; దీనిని తామరకును సోరియెసిస్ (Psoriasis) నాబడు చర్మవ్యాధికిని నుపయోగింపనగును. ఇది రాయబడిన స్థలమందు దఱుచుగా నెర్రనగునట్లు చేయును; దీనిని పైన రాయుటచే లోనికిగూడ దీనియొక్క స్పర్శ తగులును; దీనిని యొకభాగమందు రాయుటవలన రక్తముగుండా లోనికి బీల్వబడుటచే మరియొక స్థలమందలి వ్యాధి కూడా మాన్పునందును; దీనిని యెక్కువదినములు రాయుటచే పుండుపడునుగాన జాగ్రతతో నుపయోగింపనగును; ఇది నేత్రములకు తగులరాదు.

20 గ్రె॥ మొ॥ 60 గ్రె॥ వఱకు ఒక ఔన్సు వాసలీన్‌లో గలిపి దీనిని రాయ నగును.

---

## సింకోనా — Cinchona.

సింకోనావృక్షము నుండియే "క్వినీన్" అనబడెడి ఔషధము చేయబడు చున్నది; ఈవృక్షము ఇండియా దేశమునందు దక్షిణమున నీలగిరి పర్వతములయందు ను, ఉత్తరమున డార్జిలింగ్ పట్టణ ప్రాంతములందును, సింహళము, జావా, జమేకా యీ ద్వీపముల యందును, పెంపు చేయబడుచున్నది.

సింకోనా సంబంధమైన "క్వినీన్ సల్ఫేట్" (Quinine Sulphate) అనబ డెడి తెల్లనిపొడి విశేషముగ వాడబడుచున్నది. ఒకే మోతాదుగ విశేషముగాని, సామాన్య మోతాదులు - అనగా 2 గ్రె॥ మొదలు 5 గ్రె॥ వరకు - తరచుగగాని, యిచ్చుటచే శరీరమునందు చెడుగుణములు కలుగును; ఈ చెడుగుణములు కలిగిన స్థితికి "సింకోనిజం" ( Cinchonism ) అందురు. ఈస్థితి యందు యీ దుర్గుణములు పుట్టును:—చెవులలో ధ్వనులు, కొంచెముగగాని విశేషముగ గాని చెవుడు, కొంత వరకు దృష్టి నశించిపోవుట, తలనొప్పి, సంధిగుణము. వాంతి వచ్చునట్లుండుట, నిద్రరామి.

పెద్ద మోతాదులను దరచుగ నిచ్చినయెడల పై చెడుగుణములు వృద్ధినందు టకు దోడుగ యీక్రింది లక్షణములు గూడ గనబడును:—తల తిరుగుట, కను పాపలు విస్తరింపు నందుట, శ్వాసయందు ఆయాసము యేర్పడుట, మూర్ఛలు, పక్ష వాతము, మత్తు— తుదకు మరణము.

జ్వరములయందు పెద్దమోతాదుల నిచ్చుటవలన దుర్గుణములు కనుపడజాలవు. జ్వరములందు ఒకే మోతాదుగ సామాన్యముగ 10 గ్రె॥ మొ॥ 20 గ్రె॥ క్వినీన్ సల్ఫేట్ (Quinine Sulphate)ను యియ్యవచ్చును; కాని, కొన్ని విషయములందు 40 గ్రె॥ నున్నూ 1 ఔన్సు నున్నూ యిచ్చినట్లును, జయ ప్రదమగు చికిత్స నంది నట్లును, డాక్టరు విట్లాగారు చెప్పుచున్నారు; ఎటులయినను నింత పెద్దమోతాదులుగ వాడుట మంచిదికాదు.

కొద్దిమోతాదులలో (2 గ్రె॥) క్వినీన్ బలవర్ధ కౌషధముగ నుపయోగింప బడును; జీర్ణాశయమునందు ఆరంభములో స్రావముల నధిక పరచును; విశేషకాల

ముపయోగించిన యెడల గాని, మోతాదును వృద్ధిపరచిన గాని, జీర్ణశక్తి తగ్గిపోయి ఆకలి మందగించి, జీర్ణాశయమునందలి పొరలు రేగుదలస్థితి నందును.

కొద్ది మోతాదులు నాడిపైన నేవిధమైన మార్పును గలుగజేయవు. సామాన్యముగ పెద్దమోతాదు అనగా 10 గ్రె॥ మొ॥ 20 గ్రె॥ వరకు నిచ్చినయెడల నాడి యొక్క సంఖ్య అధికమయి, నాడియొక్క బలమునందు మాత్రము క్షీణత గనబడును.

ఆరోగ్య స్థితియందు క్వినీన్ శరీరవేడిమిపైన నేవిధమైన మార్పును గలుగజే యనట్లు కనబడుచున్నది. కాని, వ్యాధిస్థితియందు దీనియొక్క పూర్ణమైన మోతాదును యిచ్చినయెడల, శరీరవేడిమి సామాన్యగతికి నెక్కువగ మించి యున్నపుడు క్రమముగ తగ్గుదల నందును.

చలిజ్వరములయందు జ్వరగము కలుగుటకు మూడుగంటలకు ముందుగా 15 గ్రె॥ మొ॥ 20 గ్రె॥ వరకు క్వినీన్ సల్ఫేట్‌ను ఒకే మోతాదుగా నిచ్చిన యెడల మరల నింకొకసారి జ్వరము రాకుండ నాగిపోవచ్చును; పిమ్మట గూడ 3 గ్రె॥ మోతాదుల చొప్పున దినమునకు మూడుసారులుగా కొన్ని (నాలుగు) దినము లియ్యవలయును; ఇట్టి చికిత్సకు యే జ్వరమును లొంగకపోదు, దీర్ఘకాలము వ్యాపించియున్న జ్వరమైయుండిన యెడల యీక్రింది పద్ధతి నవలంబింప వలయునని డాక్టర్ లావిరాన్ గారు చెప్పుచున్నారు.—

దినమునకు 15 గ్రె॥ మోతాదు చొ॥ మూడుదినములు వరుసగా నియ్య వలయును; పిమ్మట నాలుగుదినముల వరకు నేమియు నియ్యనక్కరలేదు; తరువాత నింకను తగ్గిన మోతాదులలో ననగా దినమునకు 10 గ్రె॥ చొప్పున మూడుదినము లియ్యవలయు... ...తరగము నాలుగు దినముల వరకు మరల నేమియు నియ్యరాదు; అటు తరువాత నింకను తగ్గిన మోతాదులల... మూడుదినము లియ్యవలయును: అటుపిమ్మట నీమందును పూర్ణముగా నిలుపు ...వచ్చును.

ఉద్రిక్తమగు తలనొప్పి బాధవలనను, పాండువ్యాధివలనను, దీర్ఘమైన మనో వ్యాకులతవలనను, మెదడు సంబంధమగు విశేషమైన పనివలనను, బాధనందెడివారు పరుండబోవు ముందు 5 గ్రె॥ మొ॥ 10 గ్రె॥ వరకు గల మోతాదును ఓపియం యొక్క బలమగు మోతాదు సహితముగా బుచ్చుకొనిన యెడల నుపయోగముగ నుండగలదు.

వివిధవిషయముల యందును బైన మోతాదులుగ జెప్పబడినది 'క్వినీన్ సల్ఫేట్' అయియున్నది. కనుక దానియొక్క వివరముల నీక్రింద దెల్పడ మయినది.

### క్వినీన్ సల్ఫేట్ — Sulphate of Quinine.

తేలికైనట్టియు, తెల్లనైనట్టియు, పొడి; మిగుల చేదుగనుండును. జలము నందును ఆల్కహాల్ యందును కొద్దిగా మిశ్రితమగును; నీటిలో గలియ వలెనన్న ఒక్కొక్క గ్రెయిను క్వినీన్ సల్ఫేటునకు ఒక్కొక్క మినిము డైల్యూట్ సల్ఫ్యూరిక్ ఆసిడ్ ను గలుపవలయును.

### టింక్చర్ సింకోనా — Tincture Cinchona.

మోతాదు — ½ డ్రా॥ మొ॥ 1 డ్రా॥

### క్వినీన్ వెలిరియేనస్ — Quinine Valerianas.

తెల్లని పలుకుగాగాని పొడిగాగాని యుండును; నీటిలో కొద్దిగా గలియును; మాత్రిగాచని యియ్యనగును; హిస్టీరియా వ్యాధియందును నరముల సంబంధమగు తల నొప్పియందును ఉపయోగించును.

మోతాదు — 1 గ్రె॥ మొ॥ 4 గ్రె॥

### వార్బర్గ్స్ ఫీవర్ టింక్చర్ — Warburg's Fever Tincture.

ఈ టింక్చర్ నందు, క్వినీన్, మూసాంబరము, నల్లమందు, రేవల్చిన్ని, హారతి కర్పూరము, సువాసనగల వస్తువులు కొన్నియు, గలియును. దీనియొక్క మోతాదు ½ ఔన్సు అయియున్నది. ఈ ఔషధమును యిచ్చుటకు ముందుగా విరేచనకారి నిచ్చి జీర్ణకోశమును పరిశుభ్రి పరచవలయును. అంతట దీని నొక మోతాదు నిచ్చి మూడుగంటల కాలము పిమ్మట [illegible] ...యును. ఈ మధ్య ...యునుగాని యేద్రవపదార్థమును త్రాగుటకుగాని యియ్యరాదు. ...షది చలిజ్వరములందు బహు బాగుగ పనిచేయునట్టి యౌషధముగా చెప్పబడు చున్నది.

---

### కోకా — Coca.

కోకా ఆకులను కొద్దిపరిమాణములో తినినయెడల కెఫీన్ వలెనె నిదియు మెద డుయొక్క కార్యక్రమములకు వికాసమును గలిగించి, అయాసమును బోగొట్టి,

స్నాయువులకు బలమునిచ్చి, నాడికి చురుకుదనమును బుట్టించి, శరీరముయొక్క వేడిమిని వృద్ధిచేయును; పెద్ద మోతాదులలో బుచ్చుకొనిన యెడల సింకోనాయందు వలెనే దీనియందును దుర్గుణములు పుట్టును.

యక్ట్స్రాక్టం కోకా లిక్విడ్ — Extractum Coca Liquid.

బలవర్ధ కౌషధము, ఆయాసమును బోగొట్టును; మోతాదు — ½ డ్రా॥ మొ॥ 1 డ్రా॥

కోకేన్ — Cocaine

నిర్వర్ణమైన పలుకులుగ నుండును; నీటిలోగలియదు, ఆల్కహాల్ లోను, ఈతర్ లోను, గలియును. పైన రాయుటవలన నొప్పిని గలుగకుండ చేయును; శస్త్రము చేయుటయందు నొప్పి గలుగకుండు నటుల ఆయా స్థానములయం దిది రాయబడును.

---

## కోడీనా — Codeina.

నల్లమందునుండి చేయబడి స్ఫటిక రూపమును వహించి యుండును; నిద్రవచ్చు నట్లు చేయును; క్షయవ్యాధి యందలి దగ్గునందు ఉపశాంతిని గలుగజేయును; అతిమూత్ర వ్యాధియందు మూత్రము నందలి చక్కెరను తగ్గించును; దీనిని ఉపయోగించుట వలన జీర్ణశక్తికి లోపము కలుగకయును, మలబద్ధ మేర్పడకుండగను, నుండును.

మోతాదు— ¼ గ్రె॥ మొ॥ 2 గ్రె॥

కోడీనా ఫాస్ఫస్ — Codeina Phosphas.

నిద్రను గలిగించును.

మోతాదు — ¼ గ్రె॥ మొ॥ 2 గ్రె॥

---

## కాల్చికం — Colchicum.

దీనిని కొద్దిమోతాదులలో నిచ్చినయెడల, జీర్ణాశయము యొక్కయు, పేగుల యొక్కయు, కార్జము యొక్కయు, స్రావముల నధికపఱచును; పెద్దమోతాదులలో వాంతులు, విరేచనములు కలుగును; చివరకు మరణమును సంభవింపజేయును.

మూత్రప్రకోపకారిగ దీని యొక్క యుపయోగము మిగుల అనుమానింపదగి నదై యున్నది; విరేచనకారిగ నిది మిగుల బలీయముగ బనిచేయును.

గౌట్ వ్యాధియందు దీనిని దీసికొనినవెంటనే బాధ అణగిపోయి, వాపుదల తగ్గి, యొకటి రెండు మోతాదులయొక్క వాడుక పిమ్మటనే వ్యాధి అంతరించిపోవు నని కొందఱి యభిప్రాయమైయున్నది. మరికొందఱు, దీనివలన గుణముబాటునంద దనియును, అప్పటి కప్పుడు నెమ్మదించినను మఱల నాబాధ వచ్చునప్పుడు అత్యధిక ముగా వచ్చుననియును, నభిప్రాయ పడుచున్నారు.

అయినప్పటికిని, గౌట్ వ్యాధియొక్క అన్నితరగతుల యందును, గౌట్ వ్యాధిగ్రస్తుల యందు గలిగెడి దాదాపు యేజబ్బునకైనను, యీమందు ఉపయోగ ముగ నుండునని యొకఅభిప్రాయము వ్యాప్తతయం దుండియున్నది. వ్యాధి తీవ్రస్థితి యం దుండినపుడు ప్రతి 4 లేక 6 గంటలకును 15 మినిముల కాల్చికం వైన్ ను యియ్యనగును.

యక్స్ట్రాక్టు ఆఫ్ కాల్చికం—Extract of Colchicum.

మోతాదు— $\frac{1}{4}$ గ్రె॥ మొ॥ 1 గ్రె॥—మాత్రగా జేసి యియ్యవలయును.

వైనం కాల్చికం (కాల్చికం వైన్)—Colchicum Wine.

మోతాదు— 10 మి॥ 30 మి॥

---

## కలోడియం – Collodium.

నిర్వర్ణమైనట్టియు, షరబతువలెనుండు నట్టియు, ద్రవపదార్థము; దీనిని గాయ ములకు బైనరాయుటకు మాత్రమే యుపయోగింతురు; దీనిని పైన రాయగనే అందుం డెడి ఈతర్ గాలికి ఆరిపోయి గాయములపైన నొకపొరమాదిరిగ నేర్పడి గాయములోనికి గాలి చొరకుండ జేయును, ఇందువలన ద్వరగ మానుదల నందుటకు వీలుగనుండును.

ఫ్లెక్సిబిల్ కలోడియం—Flexible Collodium.

12 ఔన్సుల కలోడియం కు $\frac{1}{2}$ ఔన్సు టర్పన్టీన్ (కర్పూరతైలము)ను $\frac{1}{4}$ ఔన్సు చిట్లాముదమును గలిపినయెడల ఫ్లెక్సిబిల్ కలోడియం యేర్పడును.

దీనికిని పైదానియుపయోగమేకాని, యెండినపిమ్మట నిది విడిపోవుటకు తక్కువ అవకాశమును గలిగినదై యుండును. ఎరిసిపిలాస్ వ్యాధి యందును, స్తనాగ్రములు బీటలు తీసిన స్థితియందును, దీనిని పైన రాయనగును; మశూచివ్యాధియందు ముఖముపైన గుంటలు పడకుండునట్లు చేయుటకు దీని నుపయోగింప నగును.

బెణుకునొప్పి యందు గాయముకూడ సంభవించి యుండినపుడును, కీళ్ల నొప్పులయందు బాధ కలిగియుండి నపుడును, దీని నుపయోగింప వచ్చును.

---

## కాలోసింత్ — Colocynth.

ఇది మిగుల బలమైన విరేచనకారి; విశేషముగ పల్చని విరేచనము లగునట్లు చేయును; మిగుల నొప్పినిగూడ గలుగజేయును; పెద్ద మోతాదులలో నిచ్చినయెడల మిగుల అపాయకరము; సామాన్యముగ దీనిని విడిగా నియ్యరు; దీని నుపయోగించుట వలన పేగులకు గలిగెడి మెలివేయుటను ఆపివేయుటకుగాను, దీనిని యక్స్ట్రాక్టు ఆఫ్ హాయొశామస్ (Extract of Hyoscyamus) తో గలిపి యియ్యనగును; ఎందులకైనను యీమందు నుపయోగించుట అంత మంచిదికాదు.

**యక్స్ట్రాక్టం కాలోసింత్ కో—Extractum Colocynth Co.**

నల్లని ముద్దగా నుండును, బలమైన విరేచనకారి.

మోతాదు— 2 గ్రె॥ మొ॥ 8 గ్రె।

**పిల్యూలా కాలోసింత్ కో—Pilula Colocynth Co.**

దీర్ఘకాలము నుంచి ఉండి యున్న మలబద్ధమున కిది యుపయోగించును గాని, దీనివలనను పేగుల యందు మెలివేయు గుణము కలదు.

మోతాదు—4 గ్రె॥ మొ॥ 8 గ్రె॥

**పిల్యూలా కాలోసింత్ యెట్ హాయొశామి-Pilula Colocynth et Hyoscyami.**

ఒక ఔన్సు యక్స్ట్రాక్టు ఆఫ్ హాయొశామస్ ను రెండు ఔన్సుల పిల్యూలా కాలోసింత్ కో తో కలిపిన యెడల నిది యేర్పడును.

ఇది పైదాని యంత నొప్పిని గలుగజేయదు.

మోతాదు—4 గ్రె॥ మొ॥ 8 గ్రె॥

---

## కోనియం — Conium.

దీనికి హెమ్లాక్ ( Hemlock ) అనెడి పేరుకూడ కలదు; ఈచెట్టుయొక్క ఆకులును ఫలములును గూడ నీ యౌషధముక్రింద నుపయోగ మగుచున్నవి; విషసంబంధ మైనది.

ఈ సంబంధ మగు నౌషధములు. శ్వాసకోశసంబంధమగు అయాసము లందును ముఖ్యముగా కోరింతదగ్గు ఉబ్బసము లందును. మూర్ఛల యందును, తీవ్రస్థితియం దుండెడి ఉన్మాదమునకు శాంతి కలిగించుటకును, — వాడబడుచున్నవి.

### సక్కస్ కోనియం — Succus Conium.

కోనియం ఆకులయొక్కయు లేత కొమ్మలయొక్కయు రసమునకు అందులో మూడవభాగము అల్కహాల్ను గలుపవలయును; ఇది బూడిదవర్ణమును గలిగియుండును.

మోతాదు—1 డ్రా॥ మొ॥ 2 డ్రా॥

### కోనియం అయింట్మెంట్—Conium Ointment.

ఇది పసుపువర్ణముగా నుండును: దీనిని ఆసనమునొద్ద గలిగెడి నొప్పులకును, యితరబాధలకును, పైన రాయుటమూలమున నుపయోగింప నగును.

### టింక్చర్ కోనియై — Tincture Conii.

దీనిలో 5 వ వంతు కోనియం ఫలములయొక్క రస ముండును.

మోతాదు—½ డ్రా॥ మొ॥ 1 డ్రా॥

---

## కోపేబా — Copaiba.

కోపేబా జీర్ణాశయమునకు కొంచెముగ రేగుదలను గలుగజేయును; పెద్ద మోతాదులుగ నిచ్చినయెడల, తెగటును, వాంతులను, పేగులను మెలివేయుటను, విరేచనములను — గలుగజేయును; ఒకప్పుడు మూత్రమును బంధించుటనుగాని, రక్తవర్ణమైన మూత్రమును వెలువఱచుటనుగాని, కలుగజేయును. ఇది ముఖ్యముగా అమసంబంధ మగు పొరలపై బనిచేయును; మూత్రమార్గముపైన నిది గలుగజేయు మార్పులై యిది ముఖ్యముగ వాడుక చేయబడుచున్నది.

గనోరియా (సెగ) వ్యాధియందు యిది ముందుగ స్రావమును గొంచెముగ నధికపఱచి పిమ్మట నణచివేయును. ఈ వ్యాధియొక్క ఆరంభదశయందుగాని తీవ్రస్థితియందుగాని దీని నుపయోగించరాదు. 30 మినిములకంటె పెద్ద మోతాదు లలో నియ్యరాదు. ఈమోతాదే తఱచుగ జీర్ణాశయము నస్వస్థత పఱచును. మూత్రము నందలి జలభాగమును యిది అతిశయపఱచును; పిత్తాశయసంబంధ మగు నంజూవ్యాధి యందు మూత్రప్రకోపకారిగ నిది యొకప్పుడు ఉపయోగింపబడు చున్నది గాని, దీని యొక్క ఉపయోగమువలన మూత్రాశయమునకు రేగుదల అతిశయమయి ధాతునష్టము కలుగవచ్చును.

దీర్ఘవ్యాపిత మగు రొమ్ము పడిసెము (Bronchitis) నందు, కఫము విశేష ముగ నుండియున్న స్థితిలో, నిది తఱచుగ బహుచక్కగ బని చేయునట్లు తెలియు చున్నది. లుకోరియా (కుసుమవ్యాధి) యందుగూడ నిది యుపయోగింపబడుచున్నది. ఇతరమందు లేమియు నుపయోగించనట్టి సోరియేసిస్ (Psoriasis) వ్యాధియం దిది జక్కపఱచినట్లు తెలియుచున్నది. దీనియొక్క ఉపయోగమువలన నొకప్పుడు శరీ రముపై పొంగునంమువలె పొక్కులు కనుపడవచ్చును. దీనిని విడిగా నిచ్చినను నీయ వచ్చును; లేదా, నీటిలో గలిపి యిచ్చినను యియ్యవచ్చును. గనోరియా వ్యాధి యందు యీక్రింది ఔషధయోగము మిగుల వాడుకయం దున్నది.

| | |
|---|---|
| కోపేబా (Copaiba) ... ... | 5½ డ్రా॥ |
| లైకర్ పొటాష్ (Liquor Potass) | 4 డ్రా॥ |
| జిగురు (Gum) ... ... ... | 1 ఔన్సు |
| స్పిరిట్ ఈతర్ నైట్రస్ (Spirit Aether Nitras) | 2½ డ్రా॥ |
| ఆక్వా సిన్నమన్ (Aqua Cinnamon) | 7½ ఔన్సులు |

దీనిని ప్రతితడవయును బాగుగా గలిపి దినమునకు మూడుసారులు రెండు డ్రాముల చొప్పున నియ్యవలయును.

కోపేబాయొక్క మోతాదు — ½ డ్రా॥ మొ॥ 1 డ్రా॥

---

## కోరియాండర్ (ధనియము) — Coriander.

ఇది జీర్ణకారిగ నుపయోగించును; టింక్చర్ రీయైకో, టింక్చర్ సెన్నా కో— ఈ యౌషధములలో గలియును. అనిసీవలెనే యిదియు పనిచేయును.

## కొరియాండర్ ఆయిల్ — Coriander Oil.

పసుపువర్ణము గల నూనె; ధనియపు గింజలనుండి చేయబడునది.

మోతాదు — ½ మి॥ మొ॥ 3 మి॥

---

## క్రియసోట్ — Creosote.

నిర్వర్ణముగ గాని, కొంచెము పసుపు వర్ణమును గలిగిగాని, యుండి, యొక విథమైన వాసనను గలిగియుండును. క్రియసోట్ చాలవఱకు కార్బాలిక్ ఆసిడ్ గుణములనే కలిగియున్నది గాని, దానియంత విషకరమైనది కాదు. క్షయవ్యాధి యందిది సామాన్యముగ వాడుక చేయబడెడి ఔషధమై యున్నది. పైన రాచినయెడల పాక్కు గుణము కలది; దుర్వాసనను బోగొట్టునదియును, కుళ్లకుండ జేయునదియును, గూడ నయి యున్నది. మూత్రమునందలియు, మలమునందలియు, కుళ్ళువాసనను బోగొట్టును; ఇందులకు రెండు లేక మూడు మినిముల మోతాదులను యిచ్చిన జాలును. క్షయవ్యాధియందు కాడ్ లివర్ ఆయిల్‌తో దీనిని గలిపి యిచ్చిన యెడల నీవ్యాధియం దింత బాగుగ పని చేయునది మరి యొకటి లేదని చెప్పబడుచున్నది.

క్రియసోట్, అతిమూత్రమునందును కలరాయందును గూడ పనిచేయు నట్లు తెలియుచున్నది. దీనిని వాసన జూచుటవలన స్వరపేటిక యందును శ్వాసనాళము నందును రక్తము గూడుకొనుటను నాపివేయును.

పుప్పిపన్ను నొప్పిని గలుగజేసినప్పుడు అట్టిపన్నుయొక్క బెజ్జమునందు, పుల్లకు దూదిని చుట్టి క్రియసోట్‌లో ముంచి ప్రయోగించుటవలన, గుణముగ నుండగలదు.

మోతాదు — 1 మి॥ మొ॥ 5 మి॥

### క్రియసోట్ ఆయింట్‌మెంట్ — Creosote Ointment.

1 ఔన్సు క్రియసోట్‌ను, 4 ఔన్సుల పారఫిన్ (మైనమువలె నుండును) 5 ఔన్సుల వాసలీన్‌నును గలిపి కరగబెట్టి, చల్లారువరకు కలియ బెట్టవలయును. దీనిని తామరకును, కురుపులకును, పొగలు తేలెడి చర్మవ్యాధులకును, నుపయోగింపనగును.

---

## క్రీటా ప్రిపరేటా — Creta Preparata.

ఇది కాల్సియం (సున్నము) సంబంధమైన ద్రై యున్నది; బిడ్డలకు అతివిరేచనము లగునపుడు యిది మిగుల ఉపయోగకారిగ నుండును; జీర్ణాశయమునందు ఆమ్ల గుణమును బోగొట్టునదిగను, స్నాయువులను ముడుచుకొనునట్లు చేయునదిగను, బని చేయును.

మోతాదు — 10 గ్రా॥ మొ॥ 60 గ్రా॥

## పల్వీస్ క్రీటా అరొమేటిక్—Pulvis Creta Aromatic.

దాల్చినచెక్క 4 ఔన్సులు, జాజికాయ 3 ఔన్సులు, లవంగములు 1½ ఔన్సులు, ఏలకులు 1 ఔన్సు, చక్కెర 25 ఔన్సులు—వీటి నన్నిటిని విడిగా పొడి కొట్టి సీమసున్నపు పొడి 11 ఔన్సులలో జేర్చిన యెడల—పల్వీస్ క్రీటా అరొమేటిక్ అగుచున్నది; ఇది కొంచెముగా బూడిద వర్ణము కలిగిన పొడి.

బిడ్డలకు అతివిరేచనము లగుచున్నపుడు యీక్రింది ఔషధయోగము నుపయోగింప నగును.

| | |
|---|---|
| పల్వీస్ క్రీటా అరొమేటిక్ (Pulvis Creta Aromatic) | 1½ డ్రా॥ |
| సిరప్ సింపిల్ (Syrup Simple) ... | 1 ఔన్సు |
| స్పిరిట్స్ క్లోరొఫారం (Spirits Chloroform) | ½ డ్రా॥ |
| జలము ... ... ... | 2½ ఔన్సులు |

నాలుగు సంవత్సరముల వయసుగల బిడ్డకు యీపై ఔషధయోగమును 3 గంటల కొకసారి 2 డ్రాముల చొప్పున నియ్యవలయును.

మోతాదు—10 గ్రా॥ మొ॥ 60 గ్రా॥

## పల్వీస్ క్రీటా అరొమేటిక్ కం ఓపియం — Pulvis Creta Aromatic cum Opium.

కొంచెముగా బూడిద వర్ణము కలిగిన పొడి; తూనిక ప్రకారము యిందులో 40 వ వంతు నల్లమందు ఉండును; తక్కినది పల్వీస్ క్రీటా అరొమేటిక్ అయి యున్నది; అతి విరేచనముల యందలి నొప్పిని గూడ బోగొట్టు గుణము దీనియందు గలదు.

మోతాదు—10 గ్రా॥ మొ॥ 40 గ్రా॥

## క్రోటన్ ఆయిల్—Croton Oil.

క్రోటన్ అనగా నేపాళము. నేపాళపువిత్తులు బజారులో దొరకెడివి చాల కాలము నిలువ యుండుటచే, తఱచుగా చెడిపోయి యుండును; వలసినప్పుడు క్రొత్తగా దెచ్చుకొనుట శ్రేష్ఠము; ఈ గింజలు గుండ్రముగాను కొంచెము నాలుగు పలకలుగాను ఉండి, పైన పొప్పరగా నుండి. యీ పొప్పరలోపల కొంచెము పసుపు వర్ణముగల పప్పు ఉండును; యీ పప్పులోపల ఆకులతో గూడిన వృక్షపిండ ముండును; వాసన యేమియు లేక ఉండును; రుచికి. మొదటలో సాధువుగనుండును గాని, పిమ్మట ఒగరుగను కారముగను నుండును; దీనియొక్క స్వాభావికస్థితియందు మిగుల బలమైన విరేచనకారిగ బని చేయును: కొద్దిపరిమాణములుగ గూడ విషముగ వర్తించును.

నేపాళ విత్తులతో మాత్రను యీ క్రింది విధముగ జేయనగును:—

కొన్ని నేపాళ వి త్తనములను దీసికొని వచ్చి వాటి పైపొప్పరను దీసివేసి పాలలో మూడుసారులు ఉడుకబెట్టవలయును; పిమ్మట—పై పొరనున్ను, పప్పుయొక్క రెండు భాగముల మధ్యనుండెడి ఆకులతో గూడిన వృక్షపిండములనున్ను, దీసివేసి మిగిలిన భాగములను విడిగా నుంచ వలయును. (ఈ ఆకులతోగూడిన వృక్షపిండములను గూడ నుంచినయెడల—పేగులను మెలివేయుటయును, వాంతులను, గలుగజేయును.) ఈ ప్రకారముగ దయారు చేయబడిన 30 గ్రెయినుల వి త్తనములకు 60 గ్రెయినుల మెత్తగా బొడి కొట్టబడిన కాచు (కవిరి) పొడిని గలిపి, 2 గ్రెయినుల యెత్తుగల మాత్రలుగా జేయవలయును. దీనిలో నొకమాత్ర బలమైన విరేచనకారిగ బని చేయును; దీనిని మూర్ఛలయందును, ఉన్మాదమునందును, ఉద్రిత జ్వరములందును, బలమైన విరేచనకారి అవసరమైనపుడు మాత్రమును, పెద్దవాండ్రకు మాత్రమును, యీమాత్రల నుపయోగించవలసియుండును. పేగుల నెక్కువగ మెలివేయుటయు, వాంతులును, విశేషముగ విరేచనములును, దటస్థించిన యెడల యిందులకు విరుగుడుగ నిమ్మకాయరసమును పెద్దమోతాదుగ నియ్యవలయును; వాంతెవగైరాలు కట్టనియెడల నొక యరగంట పిమ్మట మరికొంత నిమ్మరసమును నియ్యనగును. (మాత్రలు కట్టునపుడు తేనెనుగాని జిగురునుగాని ఉపయోగింపవచ్చును.)

ఈవిత్తులనుండి దీయబడిన చమురు (Croton Oil)ను, అతిత్వరితముగ విరేచనమగుట ఆవశ్యకమయినప్పుడు—అనగా, ఉన్మాదస్థితియొక్క తీవ్రదశయందును, త్రాగుడువలన గలిగెడి సంధిగుణమందును, మెదడువ్యాధియందును. మిగులపట్టుదలతో

గూడిన మలబద్ధస్థితియందును, ఉపయోగింపవచ్చును. దీనియొక్క మోతాదు ½ మి॥ మొ॥ 1 మి॥ మాత్రగాజేసి యియ్యనగును. అంగవికృతి రోగమందు దీనిని లోనికిచ్చుటకు వీలు లేనప్పుడు, పంచదారతోగాని వెన్నతోగాని గలియజేసి నాలుకపైన బెట్టనగును.

క్రోటన్ ఆయిల్ను పైన రాచినయెడల పొక్కు గుణము కలదు.

తలపైన లేచెడి తామరకు క్రోటన్ ఆయిల్ను రాచినయెడల నయమగును గాని, యొకప్పుడు బట్టతల యేర్పడవచ్చును.

---

## క్యుబెబ్స (చలువ మిరియాలు) – Cubebs.

ఇది నల్లమిరియముల పరిమాణమునే వహించియుండి, గుండ్రముగ నుండి, కారతిక్తకర్పూరపు రుచినిగలిగి, ఒకవిధమగు ఘాటును గలిగియుండును. లోపలి పప్పు గట్టిగ నుండి చమురుగలిగి తెల్లగనుండును.

చలువమిరియాలయొక్క యుపయోగము సెగవ్యాధియందు ముఖ్యమైయున్నది; కాని, యీవ్యాధియొక్క తీవ్రస్థితి గడచినపిమ్మట మాత్రమే దీని నుపయోగింపవలయును; ప్రారంభదశయందు దీని నుపయోగించినచో హాని కలుగవచ్చును. ఈ క్రింద ప్రికరణము గుణముగ నుండగలదు.

| | | |
|---|---|---|
| పొడిగొట్టబడిన చలువ మిరియాలు | ... | 2 ఔన్సులు |
| పటికపొడి | ... ... | ½ ఔన్సు |

ఈ రెంటిని బాగుగా గలిపి 9 సమాన భాగములుగ జేసి—ఒక్కొకభాగము చొప్పున దినమునకు మూడుసారు లియ్యవలయును; ఈ ఔషధమును కుసుమవ్యాధియందును స్త్రీలకు గలిగెడి యితర ఋతుస్రావము లందునుగూడ నుపయోగింపనగును.

### టింక్చర్ క్యుబెబ్ — Tincture Cubeb.

మోతాదు — ½ డ్రా॥ మొ॥ 1 డ్రా॥

---

## డిజిటాలిస్ — Digitalis.

డిజిటాలిస్ చెట్టు సంబంధమగు నౌషధములు గుండెకు నిజమైన బలవర్ధకౌషధముగ నెంచబడు చున్నది. కొద్ది మోతాదులలో నిచ్చుటవలన, గుండెయొక్క జఠరిక (Ventricle) భాగముల నెక్కువ పరిమితకాల మెక్కువ బలయుతముగ ముడుచుకొనునట్లు చేసి, రక్తప్రచారమునందు బలీయమును గనబఱచి, నాడిని నెమ్మదితో స్థిరపఱచును. సామాన్యమగు పెద్దమోతాదుల నిచ్చినయెడల నాడియొక్క కొట్టుట లధికమగును. ఇంకను పెద్దమోతాదుల నిచ్చినయెడల గుండెయొక్కయు నాడియొక్కయు క్రమత తప్పిపోవును; ఈ పెద్దమోతాదులను మఱల మఱల నిచ్చిన యెడల రక్తప్రచారము క్షీణించి గుండెయొక్క వ్యాపారమునకు భంగముకలుగును; మెదడున కట్టి అస్వస్థతయు నేర్పడక పోయినను, శ్వాసకోశ సంబంధమగు అస్వస్థత అదివఱకే యేర్పడి యుండును.

డిజిటాలిస్ యొక్క ఉపయోగమువలని ఫలితముల నీక్రింద నాలుగు గతులుగ సంగ్రహించి చెప్పవచ్చును.

1. గుండెయొక్క కొట్టుకొనుట అతిశయించుట; నాడి స్థిరతను వహించుట; రక్తప్రచారము బలమందుట.

2. నాడి చురుకుదనము నందుట; రక్తప్రచారాధిక్యత అటులనే యుండుట; మూత్రము అధిక మగుట,

3. గుండెయొక్కయు నాడియొక్కయు క్రమము తప్పుట.

4. గుండెయొక్కయు నాడియొక్కయు క్రమత తప్పుట ఆధిక్యమగుట; రక్తప్రచారబలిమి క్షీణించుట; గుండె యొక్కయు శ్వాసయొక్కయు కృత్యములు నిలుపుదల నందుట; తుదకు మరణము.

వ్యాధిచికిత్సయందు యీ ఔషధముయొక్క వాడుక పై నుదహరింపబడిన ప్రథమగతిని మించ నీయరాదు; రక్తప్రచారము నధికము చేయుటవలన మూత్రగ్రంధులకును నధికరక్తము ప్రవహించి మూత్ర మధికముగ వెలుబడును. ఆరోగ్యస్థితి యందు దీనియొక్క మూత్రప్రకోపగుణము కొద్దిగా నుండును గాని, గుండెవ్యాధి యం దిది స్పష్టముగ గనబడును.

నాడియొక్క క్రమత తప్పినపు డెల్లను డిజిటాలిస్‌ను ఉపయోగించ వలసిన అవశ్యకతను గ్రహించ వలసియే యుండును. గుండెయొక్క ద్వారముల (Valves)

యం దుండెడి వ్యాధి ననుసరించి యుండని గుండె అదరు, గుండెనడక యొక్క క్రమము తప్పుట—అయియున్నయెడల, తఱచుగ నీమందు నుపయోగించుట ప్రయోజనకారిగ నుండును.

**ఋతుస్రావము** నందు—అధికస్రావ మగుటగాని, తఱచుగనగుట గాని, లేక అధికకాలము వరకు అగుటగాని—యేర్పడి నపుడు దీని నిచ్చుటవలన నుపయోగముగ నుండగలదు.

వ్యాధియందు దీనియొక్క యుపయోగమువలన గలిగెడి మూత్రప్రకోపఫలితము తఱచుగ నత్యాశ్చర్యకరముగ నుండును. మూత్రగ్రంధులకు రక్తప్రచారము క్రమముగ లేక, మూత్రగతి క్షీణించియుండి, అంత్రవేష్టనరంధ్రము (Peritoneal cavity) నందుగాని, అంతరావయవముల యొక్క అల్లికలయందుగాని, రక్త ప్రచారమునకు గలిగియున్న ఆటంకమువలన గూడుకొనియున్న ద్రవభాగములను వెలువఱచుటయందు యీ ఔషధము బాగుగ పనిచేయును; ఈస్థితియందు దీనియొక్క ఉపయోగమువలన మూత్రహీనత గలనుండి—అనేక ఔన్సులను, నొకప్పుడు అనేక పైంట్లను, మూత్రమును వెలువరింపజేసిన విషయములు గలవు. ఇట్టి విషయములందు నంజుయొక్క అసలైన కారణమును దొలగించుటచే నీవ్యాధిని నశింపజేయుచున్నది.

నంజుగుణము అంతరించిన పిమ్మట యీ ఔషధమునకు మూత్రమును బ్రకోపింప జేయుట యందు బలము తగ్గిపోవును.

డిజిటాలిస్‌ను గొంతకాలమువఱకు వాడుకచేసిన పిమ్మట నకస్మాత్తుగ విషచిహ్నముల నగబఱచును; మూత్రము ద్వారా యీ ఔషధభాగము వెలువరింపబడకుండినపుడు యీస్థితి ప్రారంభమగును. రక్తప్రచారబలిమి మిగుల నతిశయించినపుడు మూత్రముయొక్క వెలువడుట నిలిచిపోయి, యీఔషధము త్వరితముగ రక్తమునందు గూడుకొని యుండును. ఈవిషమస్థితి తటస్థింపకుండ నుండుటకుగాను, రోగి నెల్లపుడును పరుండ బెట్టియేయుంచి, మూత్రపరిమాణము తగ్గుదల నందినపుడును, నాడి మిక్కిలి మాంద్యతను వహించినప్పుడును, గుండెదెబ్బ క్రమత దప్పినపుడును—ఈమందును నిలుపు చేయవలయును.

### డిజిటాలిస్ ఫోలియా (ఆకులు) —Digitalis Folia

డిజిటాలిస్ చెట్టుయొక్క యెండినఆకులను పొడిచేయవలయును; ఈపొడిని మందుగ నుపయోగింతురు. మూత్రప్రకోపకారి; గుండెకు బలవర్థకౌషధము.

మోతాదు ½ గ్రె॥ మొ॥ 2 గ్రె॥

### ఇన్ఫ్యూజన్ డిజిటాలిస్—Infusion Digitalis.

60 గ్రె॥ డిజిటాలిస్ ఆకులను ఒక పైంటు మసలగాచిన నీళ్లలోవేసి ఒక గంటకాల ముంచి తరువాత వడపోయ వలయును.

మోతాదు — 2 డ్రా॥ మొ॥ 4 డ్రా॥

### టింక్చర్ డిజిటాలిస్ — Tincture Digitalis.

నలుపును బూడిదవర్ణమును కలసిన ద్రవపదార్థము. దీనిలో 8 వ వంతు డిజిటాలిస్ ఉండును

మోతాదు — 5 మి॥ మొ॥ 15 మి॥

☞ త్రాగుడు అలవాటయినవారలయందు సంధిగుణము జనించినయెడల, 2 డ్రా॥ మొ॥ 4 డ్రా॥ వఱకు నియ్యవచ్చునని డాక్టరు విట్లాగారు చెప్పుచున్నారు.

---

## యెర్గోటా — Ergota.

ఇది కుక్కగోడుగు సంబంధమైనది; దీనిని విశేషమగు పెద్దమోతాదులలో నిచ్చినయెడల, వాంతులును, విరేచనములును, పక్షవాతమును, స్నాయువులయొక్క పట్లు దప్పిపోవుటయును, మూర్ఛలును, శరీరపువేడిమి తగ్గుటయును, చివరకు మరణమును, దటస్థించును.

సామాన్యమగు పెద్దమోతాదులలో నిచ్చినయెడల శరీరమందంతట నుండెడి స్వతంత్రస్నాయువులు (Involuntary muscular fibres) ముడుచుకొని, శుద్ధ రక్తనాళముల యొక్కయు అపరిశుద్ధ రక్తనాళముల యొక్కయు రంధ్రము బహు శీఘ్రగతిని సన్న నగును; రక్తప్రచారమునందాధిక్యత స్పష్టముగ గనబడును.

సామాన్యమోతాదుల నిచ్చినయెడల, నాడియొక్కగతి కొంచెముగ క్షీణించినను గుండెయొక్క కార్యక్రమమునందేమియు మార్పు కనబడదు. కాని, గర్భాశయముయొక్క వ్యాపారమునందు మాత్రము బలమైన మార్పు కలుగగలదు.

దగ్గునందు కఫముతో రక్తము వెలువడు విషయములందు శాంతిని గలుగజేయువరకును యక్స్ట్రాక్టు యెర్గోటా లిక్విడ్‌ను మూడుగంటలకొకపర్యాయము 20 మినిములచొప్పున నియ్య నగును; అన్నివిధములగు రక్తస్రావములందును దీని

నుపయోగింతురు గాని, గర్భాశయ సంబంధ మగు స్రావములయందు దప్ప యితర స్రావములయందు బనిచేయువిషయమై నమ్మకము లేకున్నది.

యెర్గాట్ యొక్క ప్రయోగములు ప్రసవసంబంధ మగు విషయములందు విశేషముగ నుపయోగింప బడుచున్నవి. గర్భాశయముయొక్క స్నాయువులను మిగుల బలముతో ముడుచుకొనునట్లు చేయుటవలన నది దానిలోని వస్తువులను వెలు వరచుటకు సహాయము చేయును; 30 మినిముల యక్స్ట్రాక్టు యెర్గోటా లిక్విడ్‌ను ఒకే మోతాదుగ రెండు ఔన్సుల జలములో వేసి యిచ్చినయెడల, నంతవఱకు నిశ్చలముగ నున్న గర్భాశయము పది నిమిషములలోపల చురుకుదనమును వహించును. దీనియొక్క ఉపయోగమునందు జాగ్రతను గలిగి యుండవలయును; శిరస్సుయొక్క బయటికి వచ్చుటకు నేదయిన అటంక ముండిన యెడలగాని, యిదివరకే నొప్పులు బాగుగ నుండినయెడలగాని, దీని నియ్యరాదు; ఒకప్పుడు గర్భాశయముపై నది కలుగజే యు మార్పు వలన పిండముపై నధిక యొత్తిడిని గలుగజేసి పిండముయొక్క గుండెకు బలహీనతను గలుగ జేయ వచ్చును; ఒకప్పుడు స్నాయువులయొక్క క్రమత తప్పిన చర్యవలన మావిని గర్భాశయమునందు నిలుపు చేయవచ్చును.

కొద్ది మోతాదులలో నిచ్చినయెడల అప్పు డప్పుడు గర్భాశయము కొద్దిగ ముడుచుకొనుట తటస్థించును; పెద్దమోతాదుగ నిచ్చినయెడల దీర్ఘమై నట్టియు బలమైనట్టియు ముకుళనము కలుగును. గర్భధారణముయొక్క మొదటినెలలలో నా అవయవముపై యీమందుయొక్క మార్పు కొద్దిగా నుండును; గర్భధారణకాల మతిశ యించిన కొలది యీమందుయొక్క బలము విశేషించి కనుపడును. ప్రసవించిన పిమ్మట గలిగెడి రక్తస్రావమును నిలుపు జేయుటకై లిక్విడ్‌యొక్క ఒకడ్రాము మోతాదును గూడ నియ్య వచ్చును; ప్రసవసంబంధమగు విషయములయందు ప్రసవా నంతరము యీమందును యిచ్చుటకు ముఖ్యసూత్రముగ బెట్టుకొనవలయును.

యక్స్ట్రాక్టు యెర్గోటా లిక్విడ్ — Extract Ergota Liquid.

మోతాదు—10 మి॥ మొ॥ 30 మి॥ (ఎక్కువగను నియ్యవచ్చును.)

---

## యూకలిప్టస్ — Eucalyptus.

యూకలిప్టస్ గ్లాబ్యులస్ (Eucalyptus Globulus) అనబడెడి చెట్టు యొక్క యెండుఆకులను చలిజ్వరము నందును, రొమ్ముపడిసెము నందును, నుపయో

గింతురు; ఈ ఆకులయొక్క 10 గ్రా॥ పొడిని యొక ఔన్సు మసల గాచిన నీళ్లలో వేసి చల్లారిన పిమ్మట వడపోసి యిచ్చినయెడల ఆ మూత్రవ్యాధి కుదిరిక నందినట్లు తెలియుచున్నది. గుండె సంబంధ మగు ఉబ్బసపుదగ్గు నందు యీ ఆకులతో జేసిన సిగరెట్లను గాల్చ నగును.

యూకలిప్టస్ ఆయిల్—Eucalyptus Oil.

ఈ ఆకులనుండి తీయబడిన చమురును లోని కిచ్చిన యెడల క్రుళ్ళకుండ జేయు గుణమును గలిగి, జీవాణువులను నశింపు గూడ జేయును. టర్పన్‌టీన్ కు వలె దీని యందు జారుకను బుట్టించు గుణము కలదు. రక్తమునందు మాలిన్యము ప్రవేశించి విష ఫలితములు కనుపడి నపుడు దీనివలన గుణ మియ్యగలదు, అనగా, ప్రసవానంతరము మావి సంబంధమగు పదార్థము శరీరమునందు జీర్ణించి యుండువలన జ్వరము కలిగిన విషయములందును, యిట్టి యితరజ్వరములందును, దీనివలన నుపయోగముండెగలదు. ఇది శరీరపు వేడిమిని తగ్గించును. క్షయవ్యాధియందును, సెగవ్యాధియందును నిది ఆ యా స్రావములతో గూడి శరీరమునుండి వెలువడుటవలన వాటియందలి అంటు దోషమును గొంతవరకు బోగొట్టును. క్షయవ్యాధి యందు దీనిని వాసన జూచుట వలనను గొంతవరకు గుణము కనుబడును,

దీనిని సమానపరిమాణముగల ఆలివ్ ఆయిల్ (Olive Oil)తో గూడ గలిపి కీళ్లనొప్పులకు రాయ నగును.

మోతాదు — ½ మి॥ మొ॥ 3 మి॥

యూకలిప్టస్ ఆయింట్‌మెంట్ — Eucalyptus Ointment.

హార్డ్ (గట్టి) పారఫిన్ 4 ఔన్సులు, సాఫ్ట్ పారఫిన్ 5 ఔన్సులు — యీ రెంటిని కరగి 1 ఔన్సు యూకలిప్టస్ ఆయిల్‌ను గలిపి చల్లారువరకును గలియబెట్టుచుండవలయును. దీనిని చీము పట్టకుండునట్లు కురుపులు వగైరాలకు పైనకట్టుట కుప యోగింతురు.

---

## యూనమిన్ – Euonymin.

ఒకవిధమగు చెట్టుయొక్క వేళ్ల పైబెరడు నుండిచేయబడునది. ఇది కార్జమునకు జారుకుదనమును బుట్టించి, సాఫుగ విరేచనము లగునట్లు చేయును. విశేషముగ భుజించుచుండు స్థూలశరీరు లగువారలకు కార్జము మాంద్యస్థితిని వహించియున్న పుడు

దీని ఉపయోగమువలన గుణముగ నుండగలదు. దీర్ఘవ్యాపితమగు మలబద్ధమునందు దీనిని 1 గ్రా॥ యిచ్చిన గ్రమేడల గుణము కనుపడ వచ్చును.

యక్స్ట్రాక్స్ట యూనమి సిక్కం — Extract Euonymi Siccum,

బూడిదవర్ణముగ నుండు పొడి, దీనికే యూనమిన్ అనెడి వాడుక పేరు గలదు.

మోతాదు — 1 గ్రా॥ మొ॥ 2 గ్రా॥

యక్స్ట్రాక్ట యూనమి లిక్విడ్ — Extract Euonymi Liquid.

మోతాదు — 10 మి మొ॥ 60 మి॥

---

## ఫెర్రం (లోహము) – Ferrum (Iron)

లోహము కొంతవరకు నాహారముగ నెంచుకొనబడ దగినది; ఇది ఆకలిని గొంతవరకు హెచ్చింప జేయును గాని లోహసంబంధ మగు నౌషధములలో గొన్ని వెగటును, విరేచనబద్ధమును, బుట్టించును, అన్ని విషయములలోను విరేచనము వల్లగ నేర్పడి, మూత్రికోశ మెుకప్పుడు రేగుదల నంద వచ్చును,

లోహము ముఖ్యమైన బలవర్ధకౌషధమై యున్నది. పాండువ్యాధియందు ఉపయోగకారి. దీనియొక్క కొన్నిగుణముల వలన మెుదడునకు గూడ లాభకారిగ నుండును. ముఖ్యముగా సంధ జనించియున్న విషయములలో జ్వరానంతరము దీనివలన మంచి ఫలితములను గాంచవచ్చును.

మూత్రము క్షీణగల నంది యున్న వ్యాధియందును, గుండెవ్యాధుల యందును గూడ దీని యుపయోగమును గనుగొనవచ్చును.

### సల్ఫేట్ ఆఫ్ ఐరన్ (అన్నభేది) Sulphate of Iron.

అన్నభేది, కొంచె మెచ్చు తక్కువగ స్వచ్ఛమయినది, బజారులయందు దొరకును; కొద్దిగా ఆకుపచ్చవర్ణము గలిగి, నీటిలో వేసినయెడల కరగిపోవునట్టి, పలకలు పలకలుగా నుండి పెద్దముక్కలుగా గాని చిన్న పలుకులుగా గాని యుండునట్టిది మాత్రమే మంచిదిగా నెంచబడి, ఔషధమునకై వాడదగును. పసుపువర్ణము కలిగినట్టిదియు తెలుపు పసుపు వర్ణములు కలిసి యుండునట్టియు, త్రోసివేయ బడవలయును. పావు గ్రెయిను మెుదలు రెండు గ్రెయినుల వరకు మిగుల నుపయోగ మగు బలవర్ధకౌషధముగ బనిచేయును.

త్వరితముగ వృద్ధి నందుచుండెడి. యెరీసిపిలాస్ (Erysipelas) అనబడెడి చర్మవ్యాధి యందు, అన్నభేదితో జేయబడిన సాల్యూషన్ (అనగా నొక ద్రవపదార్థముతో చేర్చబడిన పిమ్మట)ను పైన రాయుట వలన మిగుల నుపయోగముగ నుండును. ఇందులకు గాను 10 గ్రెయినుల అన్నభేదిని ఒక ఔన్సు స్పిరిట్ (సారాయి) నందు గలిపి (నీటిలో కాదు) యీ సాల్యూషనును యెర్రబడిన చర్మముపై రాసి ఆరనీయ వలయును. ఈ యెరుపుదనము తగ్గిపోవువరకు దినమున కొక్కసారి రాయుచు, గాలి తగుల కుండునట్లు శుభ్రమయిన ప్రత్తిని పైన వేసి కట్టవలయును.

[యెరీసిపిలాస్ వ్యాధియందు సామాన్యముగ ముఖముపై యెర్రబారి, అంతకు పూర్వమే, చలి, వణకు, తలనొప్పి, వెకటుతో ప్రారంభమై, పిమ్మట వాంతికలిగి ఉమ్రితజ్వరమువచ్చి, మలబద్ధ మేర్పడియుండును. ఈ యెరుపునందిన భాగము ఉబ్బుదలనొంది, మిగుల మంటబెట్టుచు, పొక్కులుగూడ యేర్పడి, పోటుకూడ కలుగవచ్చును; పుండ్లు యేర్పడిన యెడల హాని అధికమగును. ఈ వాపుదల మెదడు వఱకు వ్యాపించిన యెడల త్వరితగఁని మరణము గలుగవచ్చును.]

1. అన్నభేదిని ఉపయోగించు కాలమునందు మలము నల్లని వర్ణమును వహించి అసహ్యమగు వాసననుగూడ కలిగియుండును, కాని యీమందును ఆపివేసినప్పుడు విరేచనమునకు మామూలు రంగు కలుగును, ఈ మందును ద్రవరూపమున లోనికి దీసికొనినయెడల నాలుకకూడ నల్లగ నుండును.

2. దీనియొక్క ఉపయోగతను తెలిసికొనుటకుగాను దీనిని కొన్నివారముల వరకుగాని, యింకను దీర్ఘకాలముగాని, వాడవలసి యుండును.

3. దీనిని పెద్దమోతాదులలోనిచ్చుటవలన లాభములేదు. విరేచనము మిగులనల్లగ నుండిన యెడల, మోతాదును దగ్గించవలయుననెడి సూచనను తెలిసికొనవలయును.

4. విరేచనకారుల నుపయోగించుటవలన అన్నభేదియొక్క ఉపయోగము అధికమగును; ఈ అన్నభేదినిగాని యితరములగు లోహపదార్థములనుగాని సేవించుచున్నప్పుడు, వారమున కొకసారిగాని, పదిదినముల కొకసారిగాని, చిట్లాముదమును లేక యితరమగు తేలిక విరేచనకారులనుగాని, పుచ్చుకొనుట మంచిది. మలబద్ధ ముండిన యెడలగాని, ఆడువారలలో ఋతుబద్ధమునందుగాని, విరేచన కారుల నుపయోగించుట మిగుల ముఖ్యము.

5. ఈ ఔషధమును సేవించుకాలమునందు పులుపు వస్తువులను, పులుపుగ నుండెడి ఫలములను, త్యజించవలయును.

6. ఈ ఔషధమును బిడ్డలకును ఉపయోగింపవచ్చును; బిడ్డలకును జక్కగ బని చేయును.

7. రోగికి మలినయుతమగు నాలుక యుండినగాని, జ్వరము వచ్చుచుండిన గాని, యీఔషధమును ఎప్పుడును యియ్యరాదు.

8. లోహముతో కలిసియుండు అన్నభేదినిగాని, యితర ఔషధములనుగాని, ద్రవరూపమున లోనకు బుచ్చుకొనునపుడు, అంగిలిలో వేసికొనుటవలనను, త్రాగిన వెంటనే పండ్లను కడుగుకొనుటవలనను, పండ్లు వివర్ణములు గాకుండ నుండును.

శరీరము రక్తహీనమై, కనురెప్పల లోపలిభాగములు, నాలుక, అరచేతులు, పాలిపోయిగాని, లేక తెల్లగా నుండిన సందర్భములందుగాని, అన్నభేది మిగుల పని చేయును. దీనిని ద్రవరూపముగ నిచ్చుట కీ క్రిందివిధముగ తయారుచేయవలయును.

1. నాలుగు గ్రెయినుల అన్నభేది

2. అరు ఔన్సుల వాముదాటరు

3. అరు ఔన్సుల నేలవేము కషాయము - [నలుగగొట్టిన నేలవేముకట్టె ఒక ఔన్సును మసలకాగిన ఒకపైంటు (20 ఔన్సులు) నీళ్ళలో వేసి అరుగంటల కాలము నిలువయుంచవలయును. దీనిలో యొక ద్రాము, లవంగములుగాని, దాల్చిన చెక్కగాని, యాలకులుగాని, పొడిగొట్టి కలిపినయెడల, మిగుల ప్రయోజనకారిగ నుండుటయేగాక సువాసనయు గలిగి యుండును. ఇదియే నేలవేము కషాయ మన బడును.]

ఈ మూటిని గలిపినదానిలోనుంచి, వయసువారలకు ఒకటిన్నర ఔన్సు చొప్పునను, బిడ్డలకు ఒకద్రాముమొండి వయస్సునుబట్టి నాలుగు ద్రాముల వరకును, దినమునకు మూడుసారులు యియ్యవలయును.

అడువారలు, కుసుమవ్యాధివలనగాని, ఋతుబద్ధమువలనగాని, బాధనందుచు, పాలిపోయి యున్నయెడల అన్నభేదని యీక్రిందివిధముగ వాడుటవలన నెక్కువ ఉపయోగకారిగ నుండగలదు.

1. శుద్ధిపఱచబడిన మూసాంబరము 24 గ్రెయినులు
2. అన్నభేది 24 గ్రెయినులు
3. దాల్చినచెక్క మెత్తగ నూరబడిన పొడి 60 గ్రెయినులు

ఈమూటిని జక్కగ గలిపి, తేనెను గలుపుటవలన ముద్దగజేసి, అంతను 24 మాత్రలుగా జేయవలయును; ఉదయమున రెండుమాత్రలును సాయంకాలమున రెండు మాత్రలును, బుచ్చుకొననగును.

జ్వరము చాలదినము లుండి నెమ్మదించిన పిమ్మట గలిగిన పాండువ్యాధి సందర్భమున అన్నభేది తఱచుగ మిగుల నుపయోగకారిగ నుండును.

1. అన్నభేది 24 గ్రెయినులు
2. మిరియాలు 30 గ్రెయినులు

ఈ రెంటిని తేనెతో గలిపి ముద్దగా గొట్టి 12 మాత్రలుగా జేయవలయును. దినమునకు రెండుగాని లేక మూడుగాని మాత్రలను, పైన చెప్పబడిన ప్రకారము చేయబడిన ఒకటిన్నర ఔన్సు నేలవేము కషాయముతోగాని, లేక ఒకటిన్నర ఔన్సు తిప్పతీగ కషాయముతోగాని, యియ్యవలయును. (నలుగగొట్టబడిన ఒక ఔన్సు తిప్పతీగను పదిఔన్సుల చన్నీళ్లలో మూడుగంటలవఱకు నానబెట్టి వడియగట్టవలెను. దీనికే తిప్పతీగ కషాయ మని పేరు.)

ఈ మాత్రలను బుచ్చుకొనునప్పుడు పులుపుపదార్థములను, పులుసుతోగూడిన ఫలములను, బుచ్చుకొనగూడదు; విరేచనము క్రమముగ నగునటుల జూడవలయును. జీర్ణాశయము రేగుదలస్థితియం దుండినపుడుగాని, అతివిరేచనము లుండినపుడు గాని, యీ మాత్రలను సేవించరాదు.

పాండువ్యాధి యే జాతిదైనను లోహసంబంధమగు నౌషధముల నుపయోగింప వచ్చును.

చాలదినములవఱకు జ్వర ముండియుండుటవలన గాని, తఱచుగా జ్వరము వచ్చుచుండుటవలనగాని, యెడమప్రైపుల ప్రక్కయెముకల క్రింద నొకవిధమగు వాపుదలగాని గట్టితనముగాని యేర్పడుట సామాన్యముగ దటస్థించు చుండును. దీనికే ప్లీహము (ఒకఅవయవము) యొక్క అభివృద్ధి (Enlargement of the Spleen) యందురు. ఈవిషయములో పైన చెప్పబడిన మాత్రలనే సేవింపుచు, వారమున

కాక సారిగాని, రెండుసారులుగాని బలమైన విరేచనకారినిగూడ నిచ్చుట మిగుల నుపయోగముగ నుండ గలదు. స్థానికబాధకై కర్పూరతైలమును పైనరాచి, వేడి కాపడములను గాచుటచే, నుపశాంతి గలుగ గలదు.

తలనొప్పిగాని, నరములనొప్పిగాని, ఉండిఉండి వచ్చునప్పుడును, ముఖ్యముగా బలహీనమైనట్టియు పాలిపోయినట్టియు స్థితియం దుండినప్పుడును, అన్నభేదిని 2 లేక 3 గ్రైయినుల మోతాదులలో నిచ్చుటవలన, మిగుల ప్రయోజనకారిగ నుండ గలదు. దీనిని కొంచెము దాల్చినచెక్కపొడితోడను తేనెతోడను, మాత్రగా జేసి యియ్యవచ్చును; లేదా, నేలవేము కషాయములో గాని, తిప్పతీగ కషాయములో గాని, యియ్యవచ్చును.

లోహసంబంధ మగు నౌషధము లన్నియు భోజనానంతరము దీసికొనుటకే యేర్పాటు చేయవలయును.

### ఫెర్రయి ఆర్సెనస్ — Ferri Arsenas.

ఆకుపచ్చని వర్ణముగల పొడి; ఇందులో పాషాణము గూడ గలిసి యుండును. పాషాణమున కుండెడి గుణమే దీనికిని గలదు.

మోతాదు — $\frac{1}{16}$ గ్రై॥ మొ॥ $\frac{1}{4}$ గ్రై॥

### ఫెర్రయి కార్బనస్ సాకరేటా — Ferri Carbonas Saccharata.

తెలుపుబూడిద వర్ణములు కలిసినపొడి; ఇందులో చక్కెర గలిసి యుండును; లోహము నిచ్చుటకు నిది మంచి ప్రకరణమే అయి యున్నది.

మోతాదు — 10 గ్రై॥ మొ॥ 30 గ్రై॥

### మిస్ట్యూరా ఫెర్రయి కంపాజిటా — Mistura Ferri Composita.

మడ్డిగా నుండెడి ఆకుపచ్చవర్ణముగల ద్రవపదార్థము; ఒకఔన్సు నందు $2\frac{1}{2}$ గ్రై॥ అన్నభేది యుండును. దీనిని క్రమమయిన స్థితిలో, నరగా చెడిపోకుండ దీసికొనిన యెడల, ఋతుస్రావము నిలిచిపోయినప్పుడు గాని, ఋతుస్రావము కొద్ది పరిమాణముగ గలుగునప్పుడు గాని, పనిచేయును. మోతాదు — $\frac{1}{2}$ ఔన్సు మొ॥ 1 ఔన్సు.

ఫెర్రియి యెట్ అమ్మోనియా సిట్రస్ — Ferri et Ammonia Citras.

నలుపు యెరుపు వర్ణములు గలిసిన పలుకులుగ నుండును. నీరసస్థితి యందును పాండువ్యాధి యందును నుపయోగించును.

మోతాదు — 5 గ్రె॥ మొ॥ 10 గ్రె॥

ఫెర్రియి యెట్ క్వినిన్ సిట్రస్ — Ferri et Quinine Citras.

ఆకుపచ్చ పసుపు వర్ణములు గల పలుకులుగా నుండును; బలవర్ధకౌషధము; జ్వరహరము.

మోతాదు — 5 గ్రె॥ మొ॥ 10 గ్రె॥

సిరప్ ఫెర్రియి అయొడైడ్ — Syrup Ferri Iodide.

ఇందులో లోహమును అయొడిన్ యును గలిసి యుండును; నిర్వర్ణమైన షరబతు; 11 మినిములలో 1 గ్రె॥ లోహ ముండును.

మోతాదు — ½ డ్రా॥ మొ॥ 1 డ్రా॥

టింక్చర్ ఫెర్రియి పెర్క్లోర్ — Tincture Ferri Perchlor.

బూడిద వర్ణముగల ద్రవపదార్థము.

మోతాదు — 5 మి॥ మొ॥ 15 మి॥ — విరివిగ నీటిలో గలుపబడ వలయును.

---

## జెల్సిమియం — Gelsemium.

ఒక విధమగు చెట్టుయొక్క వేళ్ళతో సంబంధించిన ఔషధము; నాడీవ్యాధి (Neuralgia) యం దుపయోగించును.

టింక్చర్ జెల్సిమియై — Tincture Gelsemii.

మోతాదు — 5 మి॥ మొ॥ 15॥ మి॥

---

## జెన్షన్ — Gentian.

ఈ చెట్టువేళ్ళ సంబంధమగు నౌషధము చేదు రుచి గలిగి బలవర్ధకౌషధముగ బనిచేయును; కలంబా యొక్క పనినే యిదియు జేయును; కోష్ఠముపై నిది కొంచెము చురుకుదనమును బుట్టించు నని నమ్మబడుచున్నది.

### ఇన్‌ఫ్యూజన్ జన్షన్ కో — Infusion Gentian Co.

జన్షన్ వేళ్ళు $\frac{1}{4}$ ఔన్సు, ఎండిన చేదునారింజ తోలు $\frac{1}{4}$ ఔన్సు, అప్పుడే ఒలచిన నిమ్మకాయ తోలు $\frac{1}{2}$ ఔన్సు—వీటి నన్నిటిని మసలగాచిన ఒకపైంటు నీళ్ళలో వేసి చల్లార్చవలెను.

మోతాదు — $\frac{1}{2}$ డ్రా॥ మొ॥ 1 డ్రా॥

ఈక్రింది ఔషధయోగము గర్భవత్సంబంధమగు వాంతుల యందు బనిచేయును.

| | | |
|---|---|---|
| ఇన్‌ఫ్యూజన్ జన్షన్ కో | ... ... | $7\frac{1}{2}$ ఔన్సులు |
| ఆసిడ్ హైడ్రోక్లోర్ డిల్యూట్ | ... | 4 డ్రా॥ |

కొంచెము నీటిలో గలిపి 2 డ్రా॥ చొప్పున దినమునకు మూడుసారు లియ్యవలయును.

### టింక్చర్ జన్షన్ కో — Tincture Gentian Co.

దీనిలో చేదు నారింజయు, ఏలకులును గలియును; బూడిదవర్ణము గలిగి మెరయు నట్టి ద్రవపదార్థము.

మోతాదు — $\frac{1}{2}$ డ్రా॥ మొ॥ 1 డ్రా॥

---

## గ్లిసరీన్ — Glycerine.

నిర్వర్ణమైనట్టియు, చమురువలె గాన్పించునట్టియు, మురుగుగా నుండునట్టియు, తియ్యని ద్రవపదార్థము. పెద్దమోతాదులలో దీనిని దీసికొనినయెడల విరేచనకారిగ బనిచేయును; దగ్గు మందులో గలుపబడును; జీర్ణాశయమునందు వాయుపూరితమై అజీర్ణముగ నుండినపుడు దీని నుపయోగింప నగును. రెండు వంతులు లేక

మూడువంతులు నీళ్లలో గలిపి పైన రాచినయెడల చలిగాలికి చేతులు కాళ్లు పగులుటలు ఆగిపోవును. చర్మవ్యాధులకు పైనరాయుట కుపయోగించు వాటిలో ననేకములందు దీనిని గలుపుదురు. కాలిన స్థలములందు రాయుటచే మిగుల నుపయోగముగ నుండును. కాటన్ వూల్ (Cotton wool) ను గ్లిసరీన్‌లో ముంచి కాలిన స్థలముపై వేసి కట్టును గట్టవలయును.

జ్వరగతులయందు, నోరును గొంతును ఆరుదల నందిన స్థితియందు దీనిని రాయుటవలన నుపశాంతిని గలుగజేయును, గొంతుకయందు నొసగా నుండి వచ్చు దగ్గునుగూడ నిలుపుచేయును. గ్లిసరీన్‌యందుఁ కుళ్లకుండజేయు గుణముకూడ గలదు.

---

## హమామిలిస్ — Hamamelis.

ఇది యొకవిధమగు చెట్టుయొక్క బెరడు; ముక్కునుండి రక్తమును గ్రక్కుకొనుటను, జీర్ణాశయమునుండి రక్తమును గ్రక్కుకొనుటను, దగ్గునందు రక్తమును గ్రక్కుకొనుటను, మూత్రము రక్తవర్ణము వహించుటను, ఋతుస్రావమునందు అధిక స్రావమగుటను—వీటిని నిలుపుచేయును. చివరవ్యాధియందు బాధను దగ్గించుట యందును, నీరసతను తగ్గించుట యందును, విశేషగుణము కలిగియున్నట్లు చెప్పబడు చున్నది. దగ్గునందు రక్తమును గ్రక్కుకొనుటలో యెర్గొట్ కంటెను డిజిటాలిస్ కంటెను గొన్ని విషయములలో నిదెక్కువగ బనిచేసియున్నట్లు డాక్టర్ బ్రిన్‌టన్ గారు చెప్పుచున్నారు. మూలశంకయందు గలుగు రక్తస్రావవిషయము లందును నిది ఉపయోగించును.

### టింక్చర్ హమామిలిస్ — Tincture Hamamelis.

దీనిలో 10 భాగములలో నొక భాగము హమామిలిస్ ఉండును.

మోతాదు — ½ డ్రా॥ మొ॥ 1 డ్రా॥

### హమామిలిస్ అయింట్‌మెంట్ — Hamamelis Ointment.

ఈ అయింట్‌మెంటులో 10 వంతు హమామిలిస్ ఉండును; వాపుదల నందిన మూలశంకయందు లేపనముగ నుపయోగించ నగును.

## పమిగ్రినట్ బార్క్ (దానిమ్మబెరడు) — Pomegranate Bark.

దానిమ్మచెట్టు కొమ్మల యొక్కయు వేళ్ళయొక్కయు యెండిన బెరడుతో జేయబడిన కషాయము ఉష్ణదేశముల యందలి గ్రహణి విరేచనములకును, అతివిరేచనములకును, బనిచేయును. పెద్ద మోతాదులలో నిది పేగులలోనుండెడి టేప్ వరం (Tape Worm) అను పురుగును జంపును. తెల్లగా టేపువలె నుండెడి యీపురుగునకు యిదియే మంచి ఔషధమని చాలమంది చెప్పుచున్నారు. 4 ఔన్సుల యెత్తుగల దీని బెరడును 24 ఔన్సుల నీటితో గలిపి 20 ఔన్సులు అగునట్టుగా గాచవలయును. దీనిని ప్రతినాలుగు గంటలకును ½ ఔన్సు మొదలు 4 ఔన్సులవఱకు నియ్యవచ్చును.

1 భాగము బోరిక్ ఆసిడ్‌లో 3½ భాగముల గ్లిసరీన్‌ను గలిపి కురుపుల కుపయోగింపనగును.

1 భాగము కార్బాలిక్ ఆసిడ్‌ను 5 భాగముల గ్లిసరీన్‌లో గలిపి దీనిని కురుపుల కుపయోగింప నగును.

1 భాగము ట్యానిక్ ఆసిడ్‌ను 5 భాగముల గ్లిసరీన్‌లో గలిపి గొంతుసంబంధమగు వ్యాధుల కుపయోగింప నగును.

---

## లైకరిస్ (అతిమధురము) – Liquoris.

కురువిందవేరుతో సంబంధించిన దీనికి అతిమధుర మను వాడుకపేరు కూడ గలదు. దీనిని దగ్గులయందు కఫహారముగ నుపయోగింతురు. రుచికి తియ్యగనుండును. దీనియొక్క క్రొత్తగా దీయబడిన వేరు సాధువగు విరేచనకారిగ బనిచేయును. దీని వేళ్లయొక్క పొడి నౌషధముగా నుపయోగింతురు.

మోతాదు — 5 గ్రె॥ మొ॥ 20 గ్రె॥

---

## హైడ్రార్జిరం (పాదరసము) -- Hydrargyrum.

దీనికే మెర్క్యూరీ అనికూడ వాడుదురు; ఈసంబంధమగు నౌషధములు నిప్పుపైవేసి వాసనజూచుట వలనను, లోనికి బుచ్చుకొనుట వలనను, శరీరముపై రు టవలనను,

సూదితో రక్తములోనికి యింజక్టు చేయుటవలనను, — ఉపయోగింపబడుచున్నది. కొద్ది పరిమాణమేగాని, కొద్దికాలము వఱకేగాని. ఉపయోగింపబడిన యెడల రక్తమునందు యెర్రనికణము లధికమయి, రక్తప్రచార మధికమగుచు, శరీరము తూనికయందు హెచ్చునందును. ఈ కొద్దిమోతాదులే చాలాకాలమువఱకు తీసికొనబడినను, లేక మోతాదు హెచ్చింపబడినను, రక్తమునందలి యెర్రనికణములు నశించిపోయి మాలిన్య పదార్థము లధికమగును; నోటియందు చిలుమురుచి బయలుదేరును; పంటిచిగుళ్లు ఉబ్బుదల నంది నీలవర్ణముగల చారలను గలిగియుండును; పండ్లు బలహీనతను వహించును; ఉమ్మిఅధికముగ నూరును, ఊపిరిగాలి దుర్వాసన గలిగినదిగ నుండును, జిగురుగ నుండెడి పంటిచిగుళ్లు త్వరలోనే పుండ్లగును. నోటిలోని గ్రంథులు పెద్దవగును; అంతట పాదరసము, చర్మములోను, నోటిలోను, పేగులలోను, మూత్రాశయములోను, గల గ్రంథుల వెంబడి వెలువడును; నరముల సంబంధమగు వణుకుదల, పట్లు తప్పిపోవుట, ఆరంభమగును; శుష్కించుట, సొగిలబడుట, తుదకు మరణము, తటస్థించును. ఈ పై లక్షణము లన్నియు, కొద్దిమోతాదులలోనైనను రససంబంధమగు నౌషధముల జాలకాలము వాడుటచే గనబడును.

అద్దములకు కళాయి చేయుటయందు దాని ఆవిరిని లోనికి పీల్చుటచే నీ పనివారలకు నొకవిధమగు నరముల సంబంధమగు అస్వస్థత కలుగును. దీనివలన తలయును, హస్తముల యొక్కయు పాదములయొక్కయు స్నాయువులును, వణకుట పుట్టును,

రసమువలని శారీరకసంబంధ మగు మార్పులు వలయువన్న రసభస్మము (Calomel), హైడ్రార్జరి కం క్రేటా (Hydrargyri cum Creta), పిల్యూలా హైడ్రార్జరీ ( Pilula Hydrargyri) — వీటిని వాడుదురు. హైడ్రార్జరీ పెర్క్లోరీడీ (Hydrargyri Perchloride), రెడ్ ఆక్సైడ్ ఆఫ్ మెర్క్యురీ Red Oxide of Mercury)—యివి కూడ వాడబడును; కాని యివి శరీరమందు విశేషమగు రేగుదలను బుట్టించును. రససంబంధమగు లవణములు జీర్ణాశయము నందును పేగులయందును మిశ్రితమయి, రక్తమునందు బ్రవేశించి, అందునుండి మూత్రము, మలము, చెమట, పిత్తము, మూలముగా వెలువడును. రసము రక్తమునందుండగ నందలి కొఱకు వ్యాధి సంబంధమగు జీవాణువుల నశింపజేయునని యూహింపబడుచున్నది.

వ్యాధియందు రసమును అధికముగ వాడుటచే కొన్ని దుష్ఫలితములు గాన్పించునుగాని, చాలమంది యనుకొనునట్లు రసముయొక్క క్రమమగు వాడుకవలన శరీ

రమునందు అపాయకరమైన ఫలితములు కలుగునని యెంచదగదు. రససంబంధమగు నౌషధముల జాగ్రత్తతో వాడుక చేసినయెడల బిడ్డలు ఆరోగ్యస్థితి నందుటయేగాక, స్థూలతను గూడ వహించియున్నట్లు, తెలియుచున్నది.

రససంబంధ మగు నౌషధములు, లోని కిచ్చుటలో, ఈ క్రింది ఉపయోగము లకై వాడుక చేయబడు చున్నవి:—

1. తీవ్రమగు వాపుదలను అణచివేయుటకును.

2. వాపుదలవలని స్రావములు మొదలగువాటిని శరీరము జీర్ణము చేసికొను నట్లు చేయుటకును.

3. కొలుకు సంబంధమగు విషమునకు వ్యతిరేకముగ బనిచేయుటకును.

ఇంకను నితరవిధములగు వ్యాధిలక్షణములందును రససంబంధములు వాడుక చేయబడు చున్నవి. బిడ్డలయొక్క అతివిరేచనములును, మిగుల పట్టుదలతో గూడిన వాంతులును—ప్రతి గంటకును 1/10 గ్రె॥ రసభస్మము నిచ్చుటవలన దఱచుగ కుదిరిక నందునట్లు తెలియుచున్నది. పెద్దవారలయందు 'పైత్యాధికము' లేక 'పిత్తాశయత' యనబడెడి స్థితి, రసభస్మముయొక్కగాని పిల్యూలా హైడ్రార్జిరీ యొక్కగాని పూర్ణమైన మోతాదు నిచ్చినయెడల, క్రమపఱచబడును. ఈ రెంటిలో నేదియో యొకమందు నిచ్చుటవలన, పేగులయందలి రేగుదల కారణముల నన్నిటిని దొలగించి, కార్జముయొక్క భారమును దగ్గించుటనుగాని, పైత్యవాహికలయొక్క అమాధిక్యస్థితిని స్వస్థపరచుటగాని, కలుగ జేయును రసభస్మము విరేచనకారిగ బనిచేయుటకు కారణము కార్జమునకు చురుకుదనమును బుట్టించుట వలన గాదు; అది పేగులలోని మొదటిభాగమునకు రేగుదలను గలుగజేసి, పైత్యస్రావమును రక్తమునందు జీర్ణింపబడుటకు వ్యవస్థ లేకమునుపే—మలముగుండా వెలువరింప జేయును. రసభస్మము నిచ్చుట మూలమున విరేచనము లగుటచే రక్తప్రచారమునం దదివఱ కుండెడి పైత్యస్రావభాగము తగ్గుదల నొందును. రసభస్మము నిచ్చిన పిమ్మట విరేచనముయొక్క వర్ణము మారుదల నందుటకు కారణము — యీయౌషధము, పేగులయందెల్లపుడు నుండెడి జీవాణువులవలన పైత్యస్రావము కుళ్లునట్లు చేయుస్థితినుండి ఆటంకపఱచుట వలన యని తెలియనగును.

గుండెనంజునందు పెద్దమోతాదుల నిచ్చినయెడల రసభస్మము బలమైన మూత్రప్రకోపకారిగ బనిచేయును. దీనియొక్క వాడుకవలన నొకదినమునందే 10

పైంట్ల మాత్రము వెలువడినట్లు డాక్టర్ లీచ్ గారు చెప్పుచున్నారు; అయినప్పటికిని, దినమునకు 3 గ్రె॥ మోతాదులచొప్పున మూడుసారు లిచ్చుటచే రెండు దినముల పిమ్మట ఉద్రిత లక్షణములు గాన్పించినట్లు తెలియుచున్నది.

ఐరోపాఖండమునందలి డాక్టరులు టైఫాయిడ్ జ్వరముయొక్క ప్రారంభస్థితియందు రసభస్మము నుపయోగించుటవలన దాని తరువాత గలిగెడి తీవ్రస్థితిని తగ్గింప గలుగుదుమని నమ్ముచున్నారు.

కొఱుకువ్యాధియందలి విషమునకు రససంబంధములు నిజమైనట్టియు ముఖ్యావశ్యకమైనట్టియు నౌషధములుగ నమ్మబడుచున్నవి. ఈ వ్యాధిసంబంధమగు పుండు (సవాయిపాక్కు) గట్టిబడిన స్థితియందు త్వరితముగనే రససంబంధమగు మందుల నిచ్చిన యెడల నీవ్యాధియొక్క ద్వితీయగతియందు దానియొక్క స్వాభావికలక్షణములను గనపఱచ దనియును, నొకవేళ నీ లక్షణములు గనుపడినను సాధుస్థితియందు మాత్రమే కనుపడుననియును, డాక్టరు హచిన్సన్ గారు నమ్ముచున్నారు.

ఈ మధ్యకాలమునందు జేయబడిన పరిశోధనలవలన నీయౌషధము రక్తప్రచారమునందు గలిసి, కొఱుకుపుండునకును వ్యాపించి, కొఱుకువిషమునకు బ్రతిహతముగ బనిచేయునని ఋజువు చేయబడినది.

కొఱుకుసంబధమగు పుండు మెత్తని స్థితియం దుండినపుడు రససంబంధమగు నౌషధమును సేవించుట అపాయకరమై యున్నది ఈపుండు గట్టిపడిన పిమ్మట సాధ్యమైనంత త్వరలో రససంబంధౌషధమును సేవించుట బ్రారంభించి, పుండుయొక్క వాపును గట్టిదనమును అంతరించువఱకును వాడుచు నుండవలయును. నోటియందు ఉమ్మి ఊరుట మొదలగు రససంబంధమగు విషలక్షణములు కనబడకుండునట్లు మాత్రము జాగ్రతను బుచ్చుకొనుచుండవలయును. ఇందులకై రసమును, పిల్యూలా హైడ్రార్జరీ సబ్‌క్లోరీడై కంపాజిటా (Pilula Hydrargyri Subchloridi Composita) మూలమునగాని, హైడ్రార్జరీ కం క్రేటా (Hydrargyri cum Creta) మూలమునగాని, నిలుకడగా వాడెనగును. పంటిచిగుళ్లయందు మార్పుదల కలిగినపుడుగాని, నోటియందు ఉమ్మియొక్క ఊరుదల అధికమయి నపుడుగాని దీనిని నిలుపు చేయవలయును. 1 గ్రెయిను రసభస్మమును $\frac{1}{4}$ గ్రెయిను నల్లమందుతో గలిపిగాని, 2 గ్రెయినుల పిల్యూలా హైడ్రార్జరీని గాని, —దినమునకు రెండుసారు లియ్యనగును.

లోనికి మందు నిచ్చుటవలన నుపయోగించని స్థితియందు రససంబంధమగు ఆయింట్‌మెంటును శరీరముపై రుద్దుటవలన మంచి ఫలితములు కలుగవచ్చును. పొటాసియం అయొడైడ్ వలని చికిత్స ప్రయోజనకారిగ లేనట్టి స్థితియందు కొఱుకువ్యాధి యొక్క తృతీయగతియందు యీ రుద్దుటమూలమున కొన్ని విషయములలో స్థిరమైన స్వస్థత కలిగినట్లు తెలియుచున్నది.

స్పిరిట్ దీపముపై రసభస్మమును గాచి దానియొక్క పొగను శరీరమున కావహించునట్లు చేయుటవలన జేసెడి చికిత్స ఆయాసకరమైనదియు అనిశ్చయమైనదియు నై యున్నది.

$\frac{1}{8}$ గ్రా॥ బైక్లోరైడ్ ఆఫ్ మెర్క్యురీ (Bichloride of Mercury) ని $\frac{1}{2}$ డ్రామ జలములో గలిపి తుంటియొక్క స్నాయువులలోనికి వారమున కొకసారి చొప్పున 30 వారముల కాలము యింజక్టు చేసినయెడల వ్యాధి నివారణ నొందునని చెప్పబడుచున్నది. 1 గ్రా॥ యెల్లో ఆక్సైడ్ ఆఫ్ మెర్క్యురీనిగాని రసభస్మమును గాని వాసలీన్ లో గలిసి యిదే ప్రకారము చేయవచ్చును. ఈ పద్ధతు లన్నియు ఐరోపాఖండమునందు వాడుకలో నున్నవి. ఇంజక్షన్ పద్ధతివలన కురుపుగా దేలుటయు కొన్ని విషయములలో మిగుల బాధను గలుగ జేయుటయు, దటస్థ మగును గావున నీ చికిత్స అవలంబనీయము కాదు.

రససంబంధ మగు చికిత్స యొక సంవత్సర మైనను విడువకుండ ననుచరణ యందుంచవలయును. పిమ్మట నొక సంవత్సరము కాలము (మధ్య మధ్య కొంచెము అవకాశములతో) వఱకు గూడ నీచికిత్సను జేయ నగును. ఈ వ్యాధిగ్రస్తుడు మూడు లేక నాలుగు సంవత్సరముల వఱకు వివాహము చేసికొనకుండుట మిగుల మంచిది. పై జెప్పబడిన దుర్గుణములు కనుపడినప్పుడెల్లను, మందును నిలిపివేయుట మూలముగ గాని మోతాదును విశేషముగ దగ్గించుట మూలమునగాని. ఔషధసేవనమును క్రమపఱుచవలయును.

పుట్టుకతోడనే యుండియున్న కొఱుకువ్యాధికి హైడ్రార్జరీ కం క్రీటాతో సమానమైన యౌషధము వేఱొకటిలేదు: ఇట్టిబిడ్డలకు దీని నెంతమాత్రమును సంశయము లేకుండగ సేవింపవచ్చును, కొఱుకుసంబంధమగు విషము శరీరమునం దున్నంతవఱకును, యీమందు యేమియు హానిని గలుగజేయ నేరదు: ఏలయన నీమందుయొక్క బల మంతయు నావిషముపై వినియోగపఱుచబడును. బలహీనమైనట్టియు, శుష్కించినట్టియు బిడ్డలు కొఱుకువ్యాధిపీడితులై యున్నపుడు ఆమందుయొక్క పెద్దమోతాదు

లను భరింతురు; కాని, వ్యాధియొక్క తీవ్రత తగ్గినపిమ్మట మాత్రము యింత మోతాదులను భరింపజాలరు; కొంతకాల మశ్రద్ధ జేసినపిమ్మట మఱల కొఱుకులక్షణములు స్పష్టముగ గాన్పించినయెడల మఱల పెద్దమోతాదులను భరింప జాలుదురు. ఒక అర్థ సంవత్సరము వయసుగల బిడ్డకు ½ గ్రె॥ మోతాదుగల హైడ్రార్జరీ కం క్రేటాను దినమునకు మూడుసారుల చొప్పున మూడుదినము లిచ్చి, అటుపిమ్మట ప్రతి రాత్రి యును ½ గ్రె॥ చొప్పున నిచ్చుచు బిడ్డ అభివృద్ధి నొందుచున్నంత వఱకును నిట్లు యియ్య నగును.

రససంబంధ మగు హైడ్రార్జరీ పెర్‌క్లోరీడ్ — ఈ సంబంధ మగు ఔషధములలో నెల్ల మిగుల విషకరమైయున్నది, దీనిని నిర్ణయింపబడిన మోతాదునకంటె నధికముగ దీసికొనిన యెడల,విశేషమగు విరేచనములు, జీవకళ తప్పుట, కొద్ది గంటల లోనే మరణమును గలుగును. జీవాణువుల నశింప జేయుటకు, దీనియొక్క 1 గ్రెయినును 5 గాలనుల నీళ్లలో గలుప నగును. దీనితో గూడ పొటాసియం అయొడైడ్ కలిసిన నిక్రింది యౌషధయోగము కొఱుకువ్యాధి యందు బాగుగ బని చేయును.

| | | |
|---|---|---|
| హైడ్రార్జరీ పెర్‌క్లోరీడ్ (Hydrargyri Perchloride) | ... | 1½ గ్రె॥ |
| పొటాసియం అయొడైడ్ (Potassium Iodide) | ... | 1½ డ్రా॥ |
| జలము | ... | 12 ఔన్సులు |

దీనిని బాగుగా గలిపి ½ ఔన్సు మోతాదు చొప్పున దినమునకు మూడు సారులు భోజనానంతర మియ్యవలయును.

హైడ్రార్జరీ కం క్రేటా — Hydrargyri cum Creta

బూడిద నీలివర్ణములు గలిసిన వర్ణముగల పొడి; ఒక ఔన్సు పాదరసమును 2 ఔన్సుల సీమసున్నపు పొడితో గలిపి రుద్దుటవలన నేర్పడును; దీనికి గ్రే పౌడరు (Grey Powder) అని పేరు కూడ గలదు. దీనియొక్క ఉపయోగములు పైన జెప్ప బడియే యున్నవి.

మోతాదు — 1 గ్రె॥ మొ॥ 5॥ గ్రె॥; ఒక సంవత్సరము వయసుగల బిడ్డకు 1 గ్రె॥

పిల్యూలా హైడ్రార్జరీ — Pilula Hydrargyri.

దీనియందు అతిమధురము గూడ గలిసియుండును; దీనికి బ్లూ పిల్ (Blue Pill) అను వాడుక పేరు కూడగలదు.

మోతాదు — 4 గ్రె॥ మొ॥ 8 గ్రె॥

అంగ్యుయెంటం హైడ్రార్జరీ — Unguentum Hydrargyri.

దీనిని హైడ్రార్జరీ అయింట్ మెంట్ అనికూడ అందురు. ఇది నీలివర్ణమును వహించి యుండుటచే "బ్లూ అయింట్ మెంట్" అను వాడుకపేరు కూడకలదు; దీనిని యొడలిపై రుద్దుటచే రసము లోని కావహించునట్లు చేయుట కుపయోగింతురు.

అంగ్యుయెంటం హైడ్రార్జరీ కంపాజిటం — Unguentum Hydrargyri Compositum.

కొంచెముగా నీలివర్ణము కలిగి యుండును, పైన చెప్పబడిన హైడ్రార్జరీ అయింట్ మెంట్ 10 ఔన్సులును, 6 ఔన్సుల తేనెమైనమును, 6 ఔన్సుల ఆలివ్ ఆయిల్ ను, 3 ఔన్సుల హారతికర్పూరమును — గలిపి నూరిన యెడల నిది యగును.

గ్రంథులు వాపుదల నందినపుడును; కీలుకుసంబంధ మగు మోటిములు లేచినపుడును, దీనిని పైన మర్దన చేయ నగును.

హైడ్రార్జరీ అయొడైడ్ రుబ్రం — Hydrargyri Iodide Rubrum.

దీనికి మెర్క్యూరిక్ అయొడైడ్ (Mercuric Iodide) అనియు, బైనైయొడైడ్ అఫ్ మెర్క్యూరీ (Biniodide of Mercury) అనియు, పేరులు గలవు. దీనియందు పొటాసియం అయొడైడ్ కూడ కలిసి యుండును.

మోతాదు — 1/32 గ్రె॥ మొ॥ 1/16 గ్రె॥ (మాత్ర రూపముగా)

అంగ్యుయెంటం హైడ్రార్జరీ అయొడైడ్ రుబ్రం — Unguentum Hydrargyri Iodide Rubrum.

దీనికి, అయింట్ మెంట్ అఫ్ రెడ్ అయొడైడ్ అఫ్ మెర్క్యూరీ (Ointment of Red Iodide of Mercury) అను పేరు కూడ గలదు. పైన రాయుటకు మాత్రమే ఉపయోగింపనగును,

అంగ్వుయెంటం హైడ్రార్జిరీ నైట్రేటిస్ — Unguentum Hydrargyri Nitratis.

దీనికి సిట్రిన్ ఆయింట్‌మెంట్ (Citrine Ointment) అని కూడ అందురు; కొంచెము పసుపువర్ణమును వహించి యుండును. పైన రాయుటకు మాత్రమే ఉపయోగించును; స్థానిక చురుకుదనమును బుట్టించును.

అంగ్వుయెంటం హైడ్రార్జిరీ నైట్రేటిస్ డిల్యూట్ — Unguentum Hydrargyri Nitratis Dilute.

దీనికి పైనచెప్పబడినదానికే 1 ఔన్సునకు 4 ఔన్సుల వాసలీన్‌ను కలిపిన యెడల నిది యగును. దీనిని గోరుచుట్టునకు పైన రాసి పలాస్త్రిని వేసినయెడల నయ మగును.

హైడ్రార్జిరీ పెర్‌క్లోరీడ్ — Hidrargyri Perchloride.

దీనికి, పెర్‌క్లోరీడ్ ఆఫ్ మెర్క్యురీ (Perchloride of Mercury) అనియు, కరోసివ్ సబ్లిమేట్ (Corrosive Sublimate) అనియు, పేరులు గలవు. నిర్వర్ణమైన ముద్దలుగాగాని తెల్లని పొడిగాగాని యుండును. కొద్దిమోతాదులలో నైనను నిది బలమైన విషముగ బనిచేయును.

మోతాదు— 1/32 గ్రె॥ మొ॥ 1/16 గ్రె॥ (జలములో గలిపి పుచ్చుకొన నగును)

హైడ్రార్జిరీ సబ్‌క్లోరీడ్ — Hydrargyri Subchloride.

దీనికి క్యాలోమెల్ (Calomel) అను వాడుకపేరు గలదు, తెలుగులో రస భస్మ మందురు; తెల్లని వర్ణమును వహించి బరువుగా నుండును.

మోతాదు — ½ గ్రె॥ మొ॥ 5 గ్రె॥

---

## హైడ్రాస్టిస్ – Hydrastis.

ఒకవిధ మగు చెట్టుయొక్క వేళ్లతో సంబంధించి చేయబడు నీ యౌషధము, జీర్ణాశయమునందలి కార్యక్రమమును సరిచేయుటకును, ఆమమును వెలిబుచ్చునట్టి అన్నివ్యాధులయందును స్వస్థతను గలుగజేయుటకును, వాడుక చేయబడుచున్నది. కార్జము మాంద్యతను వహించి యున్నపుడును, ఋతుస్రావమునందు — నధికస్రావ మగుటగాని, తఱుచుగ నగుటగాని, లేక అధికకాలమువఱకు అగుటగాని యేర్పడి నపుడును, దీని నుపయోగింపనగును.

టింక్చర్ హైడ్రాస్టిస్ — Tincture Hydrastis.

మోతాదు — 30 మి॥ మొ॥ 60 మి॥

---

## హాయొశామి — Hyoscyami.

ఈసంబంధమగు నౌషధములు, యీచెట్టుయొక్క ఆకులు, పువ్వులు, కొమ్మలు జాగ్రత్తగ నెండబెట్టబడిన పిమ్మట, వానినుండి తయారు చేయబడును.

దీనివలన బెలడోనాయందు వలెనే—సంధిగుణము, నోటియందు ఆరుదల, కనుపాపయొక్క విస్తరింపు, నిద్ర—కలుగును.

కొద్ది మోతాదులలో గుండెకు బలవర్ధకౌషధముగ బనిచేయును. మూత్రాశయము రేగుదలస్థితియం దుండినపుడుగాని, వాపుదలనందినపుడుగాని, యిది గుణమును గలుగజేయును. ఇది కొద్దిగా మూత్రప్రకోపకారిగ బనిచేయును. మూత్రాశయము అనవసరముగ కొద్దిపరిమాణముల మూత్రమును వెలువరచుటకు దఱచుగ ముడుచుకొనుచుండెడి స్థితియం దుండినపుడు యిది ఉపయోగకారిగ నుండును.

బిడ్డలు దీనియొక్క పెద్దమోతాదులనైనను ధరింతురు, పెద్దవార లొకప్పుడు చిన్నమోతాదులనే ధరింపలేకుందురు; విరేచనకారులయొక్క పేగులను మెలివేయు గుణమును దగ్గించి, మలమును వెలువఱచుటకుగాను పేగులయొక్క కదలికలకు సహాయము చేయుచు నొప్పియుదయిన నుండినయెడల సర్దుబాటు చేయును.

యక్స్ట్రాక్ట్ హాయొశామి — Extract Hyoscyami (Viride).

మోతాదు — 2 గ్రె॥ మొ॥ 8 గ్రె॥

టింక్చర్ హాయొశామి — Tincture Hyoscyami.

ఆకుపచ్చ బూడిదరంగు గలిసిన వర్ణము కలిగి యుండును; ద్రవపదార్థము.

మోతాదు — ½ డ్రా॥ మొ॥ 1 డ్రా॥

---

## అయొడోఫారం — Iodoform.

మెరయునట్టియు, పసుపువర్ణము గలిగినట్టియు, స్ఫటికములవలెనుండు పలుకులు; చాలకాలము లోనికిచ్చుటవలనగాని, గాయ ముండిన భాగములపై గట్టుటచే శరీరమునందు బ్రవేశించుటవలనగాని, జీర్ణక్రియమునకు భంగము కలిగి, ఆకలి మందగించి, తలత్రిప్పుడు ప్రారంభమయి, నాడి తీవ్రతను వహించి, నిద్రరాకుండ నుండి, శరీరపువేడిమి అధికమయి, మెదడునకు అస్వస్థత గలిగి—యీస్థితి క్రమముగ హెచ్చి దీర్ఘమయిన మత్తతగలిగి, కొన్ని విషయములలో మరణముగూడ తటస్థమగును; ఇది విశేషప్రదేశమున ప్రయోగింపబడి యుండినయెడల యీలక్షణము లన్నియు నకస్మాత్తుగనే గనిపించవచ్చును; శరీరపువేడిమి 104 డిగ్రీలవఱకును వ్యాపించి, సంధిగుణము కనుపడి, ఉన్మాదస్థితి గలిగి, మూర్ఛ ప్రవేశించి, త్వరితముగనే మరణముకూడ గలుగవచ్చును. ఇతరపదార్థములతో జేర్చకుండ దీని నొక్కదానినే యుపయోగించినయెడల విషలక్షణములు కనుపడనేరవని డాక్టర్ మూర్‌హాఫ్‌గారు చెప్పుచున్నారు. అయొడోఫారం వలన విషఫలితములు గాన్పించినయెడల బైకార్బనేట్ ఆఫ్ పొటాష్ (Bicarbonate of Potash) ను దీనికి విరుగుడుగ లోనికియ్యవలయును.

సగమువంతు అయొడోఫారం కలిగియున్న సొల్యూషనులో జీవాణువులు విడిగానుంచబడినయెడల సజీవములుగనే యుండుననియును, మిగులదుర్బలమైన సొల్యూషనైనను శరీరపువేడిమిపై చీముతో గలసినప్పుడు జీవాణువులను మిగుల బలీయముగ నశింపజేయు ననియును, బరిశోధనలవలన దెలియుచున్నది.

అయొడోఫారమును లోనికిచ్చినపుడు, దీనిలోని భాగమైన అయొడిన్ శ్వాసకోశమార్గమునను మూత్రమార్గమునను వెలువరింపబడును; దీనివలన నాయా యవయవభాగములయం దెంతమాత్రమును రేగుదలమాత్రము గాన్పించదు. శస్త్రవిషయములయందు దీనియొక్క కుళ్ళకుండజేయు గుణమును బట్టియే యిది యుపయోగింపబడుచున్నది; మెత్తనిపొడిని బైన జల్లినయెడల, కురుపులు, పుండ్లు, బొబ్బలు మొదలైన వాటియందు కుళ్లకుండజేయుటయేగాక స్వస్థపఱచుటయందును సహాయము చేయును. కొఱుకుసంబంధమగు పుండ్లపై, దీనియొక్క 1 పాలును 12 పాళ్ల ఫ్లెక్సిబిల్ కలోడియం (Flexible Collodium) తో గలిపి పైన రాయనగును.

కర్బాలిక్ ఆసిడ్ వలెనే యిదియు ప్రయోగింపబడిన స్థలములయందు నరములను బండబారునట్లు చేయు గుణము కలదు.

ప్రేగులనుండి రక్తస్రావము కలిగినప్పుడును, కొఱుకువ్యాధియొక్క తృతీయ గతియందును, కొర్జము పరిమాణమునందు హీనగతిని వహించినస్థితియందును, ప్రేగుల యందలి టేప్ వరం (Tape worm)ను నశింపు చేయుటయందును — దీనిని లోని కిత్తురు.

మోతాదు ½ గ్రే॥ మొ॥ 3 గ్రే (మాత్రరూపముగా)

[అయొడొఫారం — 8 వంతుల ఈథర్ లోను, 14 వంతుల యూకలిప్టస్ ఆయిల్ లోను, 10 వంతుల కలోడియం లోను, 60 వంతుల వాసలీన్ లోను, 95 వంతుల ఆల్కహాల్ లోను కలియును.]

అయొడొఫారం ఆయింట్‌మెంట్ — Iodoform Ointment.

¼ ఔన్సు అయొడొఫారంను 2¼ ఔన్సుల పారఫిన్ అయింట్‌మెంట్ (యెల్లో) లో కలిపిన నిది యగును.

ఇది క్రుళ్లకుండ జేయుటకును, కొఱుకువ్యాధి యందలి పుండ్లకు బైన రాయుటకును, నుపయోగింపబడును.

అయొడొఫారం గాజ్ — Iodoform Gauze.

అయొడొఫారంతో తయారు చేయబడిన గుడ్డ 100 కి- 5 వంతులు, 10 వంతులు, 20 వంతులు. బలము కలిగినదిగ దయారు చేయబడును. దీనిని గ్లిసరీన్ లోను నీటిలోను ముంచి కాలినస్థలములయందు వేసి పైన కాటన్‌వూల్‌ను వేసి కట్ట దగును.

---

## అయొడిన్ – Iodine.

లోహసంబంధము కానట్టియు, నల్లగ నుండి మెఱయుచు పొరలుగా నుండి పలుకులుగా నుండునట్టియు, ఘనపదార్థము; ఈసంబంధ మగునది పైన రాసినయెడల తేగుదలను బోగొట్టును; గ్రంథులయొక్క వాపుదలను బోగొట్టును. వాపుదల నందియున్న స్థలములపై దీనిని రాసినయెడల చీము పట్టకుండ జేసి కురుపులు తేలకుండునట్లు చేయును; క్రుళ్లకుండ జేయుటకు యిది బలీయ మగు నౌషధముగ శించబడుచున్నది.

దీర్ఘ వ్యాపితమగు చీముతో గూడిన రొమ్ముపడిసెము సంబంధ మగు వ్యాధుల యందు అయొడిన్ యొక్క పొగను వాసనజూచుటవలన నుపయోగ ముండును. ఇందులకుగాను మామూలుగా నుపయోగించెడి క్రియ్యోవత్తులందు అయొడిన్‌ను గలిపి వెలిగించుటచే దీనియొక్క వాసన కలుగగలదు.

మూత్రాశయమునందు క్రుళ్ళుసితి యేర్పడియున్నయెడల దీనిని **1** కి **50** వంతుల జలముతో గలిపి పిచికారీ చేయుటవలన నాస్తిల నిలచిపోవును.

అయొడిన్ మిగుల బల మైనట్టియు, రేగుదలను గలుగజేయునట్టియు, విషమై యున్నది; దీనియొక్క ఉపయోగమువలన ఉన్మ్రత మగు వాంతిబాధ, విరేచనములు, తలత్రిప్పుట, మూర్ఛలు, తుదకు మరణమును గలుగును.

లోని కిచ్చుటకు అయొడిన్‌ను ఉపయోగించినయెడల జీర్ణాశయముయొక్క రేగుదల కలుగును; ఈ రేగుదల లేకుండగ దీనియొక్క ఉపయోగమును బొందుటకు గాను యిందుతో సంబంధించిన పొటాసియం అయొడైడ్ (Potassium Iodide) ను ఉపయోగింప నగును. నడుమునొప్పి యందును, స్నాయువులయొక్క నొప్పుల (Muscular Rheumatism) యందును 3 లేక 4 మినిముల టింక్చర్ అయొడిన్‌ను జిగురుతోడను నీటితోడను గలిపి యిచ్చినమీదట స్పష్టమైన గుణము గనుబడినట్లు డాక్టర్ కోట్సుగారు చెప్పియున్నారు.

లోని కిచ్చుటకుగాను సామాన్యముగ పొటాసియం అయొడైడ్ (Potassium Iodide) నుగాని, సోడియం అయొడైడ్ (Sodium Iodide) ను గాని, నియమించుదురు; కావున వాటివిషయమై కొన్ని వివరముల నిచ్చుట యుపయోగముగ నుండగలదు. ఆరోగ్యమం దున్న మనిషికి పొటాసియం అయొడైడ్‌ను కొద్దిమోతాదులలో నిచ్చినయెడల, ఆకలి అధికమై, శరీరముయొక్క తూనికయును అధిక మగును. ఇది త్వరితముగనే జీర్ణింపబడి రక్తమునందు బహుళః సోడియం అయొడైడ్ రూపమున నుండును; మోతాదును హెచ్చింప జేయుచు నెక్కువ తఱచుగ బుచ్చుకొనుట నారంభించినయెడల "అయొడిజం" అనబడు కొన్ని దుర్లక్షణములు గనిపించును. నోటియందు చిలుమురుచి ప్రారంభించి, ఉమ్మియొక్క ఊరుదల అతిశయమయి కంటియొక్కయు, ముక్కుయొక్కయు, గొంతుయొక్కయు, శ్వాసకోశములయొక్కయు, అమభాగములయందు రేగుదల లక్షణములు గనిపించి కనుఱెప్పలు ఉబ్బుదల నందును; నుదురును పండ్లును నొప్పుల నొందును; శరీరముపైన బొక్కులు లేచును; ఆకలి నశించును; వాంతి వచ్చునట్లుండి విరేచనములును గలుగును; శుష్కింపు అధికమయి,

రోగి మిగుల శోషణము నంది, నీరసత విశేషమయి, గుండెసమీపమున ననగా యిరు పైపుల నుండెడి ప్రక్కయెముకలకు మధ్యభాగమున కుర్రింగుచున్నట్టి చిత్తవృత్తి గలుగును; సంభోగశక్తి నశించిపోయి, మూత్రముయొక్క వెలువడుట అధిక మయి, మగత కలిగి, క్షయవ్యాధి గనిపించవచ్చును. శరీరము నందలి గ్రంథు లన్నియు విశేష మగు చురుకుదనమును వహించి యెదురురొమ్మును వృషణములును క్షీణత నందును.

కొందఱు రోగులు కొద్దిమోతాదులలో నైనను నీ మందును ధరింపజాలమిచే పై దుర్లక్షణములు వెంటనే గానిపించును. కొందఱు రోగులు 1 లేక 2 గ్రయినులను బుచ్చుకొనినప్పుడే మిగుల బాధను జెందియున్న విషయములలో, 4 లేక 6 లేక 8 గ్రయినులకు మోతాదును హెచ్చింప చేసినప్పు డెంతమాత్రమును ఆయాసము కలుగకుండ నుండి రని డాక్టర్ బ్రిన్‌టన్‌గారు చెప్పుచున్నారు.

శరీరమునందు కురుపులు యేర్పడియున్న స్థితియందు వెలువడునట్టి అనారోగ్యకరమగు స్రావములను జీర్ణింపజేయు శక్తి అధిక మగునటుల గాని, అట్టి స్రావములను అధికద్రవాకారము వహించునట్లు గాని, జేయుట దీనియొక్క ఉపయోగమై యున్నది. ఇందు జెప్పబడిన రెండవ ఉపయోగమునకై శ్వాసకోశసంబంధ మగు వ్యాధులయందు కఫమును వెలువడునట్లు జేయుట కీ మందు మిగుల నుపయోగించును.

శస్త్రమునకు వీలుకానట్టి అంతరావయవములయందలి రక్తనాళములయొక్క వాపుదలల యందు, పొటాసియం అయొడైడ్ పెద్ద మోతాదులలో అనగా 20 గ్రయినుల మోతాదులలో నుపయోగింపబడుచున్నది. వ్యాధిని జెందియున్న రక్తనాళముయొక్క పొరలపై నిది బనిచేయుచు రక్తముయొక్క ప్రకృతిసంబంధ మగు గుణములయందు మార్పును గలుగ జేయును.

ఐరోపాఖండములో టైఫాయిడ్‌జ్వరమునందు పొటాసియం అయొడైడ్ యొక్క ఉపయోగమువలన జయప్రద మగు చికిత్సను బొందు చున్నట్లు తెలియు చున్నది.

పాదరసమువలన గాని సీసమువలన గాని శరీరము విషయుతమై యున్నపుడు పొటాసియం అయొడైడ్ వాటికి విరుగుడుగ బనిచేయగలదు. ఇదే విధముగ కొఱుకు వ్యాధియొక్క తృతీయగతియందు కొఱుకువిషముపై నిది పనిచేసి దానిని నశింపు నొంద జేయును. కొఱుకుసంబంధమగు అస్వస్థతపై నిది త్వరితమైనట్టియు నిశ్చయ

మైనట్టియు గుణఫలితమును గనబఱచును. పంటి చిగుళ్లయొక్క వాపుదల హరించి పోవును; ఎముకలయొక్క వికారమగు పెంపుదల శీఘ్రగతిని అణగిపోవును; కాని, యిట్టి ఫలితములు కలుగుటకు గాను పొటాసియం అయొడైడ్‌ను పెద్ద మోతాదులలో ననగా 20 గ్రె॥ మొ॥ 40 గ్రె॥ వఱకు నీయ నగును. అట్టి విషయములలో గొందఱు వైద్యులు 24 గంటలలోపల నొక ఔన్సును యిచ్చిన విషయములును గలవు; 4 సం॥ లకును 8 సం॥ లకును మధ్య వయసుగల బిడ్డలకు యెట్టిదుష్ఫలితములును గలుగకుండ 2 డ్రాముల మోతాదులలో దినమునకు మూడుసారు లిచ్చినట్లు డాక్టర్ సెగూయిన్ గారు చెప్పుచున్నారు. ఇట్టి చికిత్సాపద్ధతి అమెరికాదేశమునందు వాడుకయున్నట్లు తెలియుచున్నది. ఇంత పెద్దమోతాదులు అవసరమైయున్న విషయములు బహు అరుదుగ దటస్థించును. ఈ ఔషధమువలన గుణములు బహుస్పష్టముగ గనబడినను దీనితో గూడ రససంబంధ మగు నౌషధముల సేవించిననే గాని యీ గుణములు నిలుకడగ నుండజాలవు.

పుట్టుకతోడనే నుండిన కొఱుకువ్యాధియందు, పాదరససంబంధ మగు నౌషధము వలెనే నిదియు కొఱుకువ్యాధియొక్క విషమును నశింపజేసిన పిమ్మట, శరీరము ఈఅమంగును ధరింపజాలదు. ఈ యౌషధము కొఱుకువ్యాధి యొక్క ప్రారంభ దశయం దేమియు బనిచేయజాలదు.

పొటాసియం అయొడైడ్‌ను మాత్రగా జేయుటకుగాను ముందుగా గొంచెము నీటితో గలిపి మెత్తని పేస్టువలె చేయవలయును. దీనిని పిమ్మట మాత్రయగుటకు వలసినంత అతిమధురము (Liquorice) యొక్క మెత్తనిపొడిని గలిపి మాత్రగా జేయనగును. ఆరు గ్రెయినుల పొటాసియం అయొడైడ్‌తో చేయబడిన యీ మాత్ర సామాన్య పరిమాణము గలదిగ నుండును.

## టింక్చర్ అయొడిన్ — Tincture Iodine.

మిగుల నెర్రనివర్ణముగల ద్రవపదార్థము; అయొడిన్ ½ ఔన్సు, పొటాసియం అయొడైడ్ ½ ఔన్సు, జలము ½ ఔన్సు—వీటి నన్నిటిని జేర్చి ఒక పైంటును అగునట్లుగా ఆల్కహాల్‌ను గలిపిన యెడల టింక్చర్ అయొడిన్ యేర్పడుచున్నది. వాపుదల స్థలములయందు పైన రాయనగును.

మోతాదు— 2 మి॥ మొ॥ 5 మి॥

## లినిమెంట్ అయొడిన్—Liniment Iodine.

నల్లనైనట్టియు, యెరుపు బూడిద వర్ణములు గలిగినట్టియు, రంగుగల ద్రవ పదార్థము; అయొడిన్ 1¼ ఔన్సులు, పొటాసియం అయొడైడ్ ½ ఔన్సు, జలము ½ ఔన్సు—వీటి నన్నిటిని జేర్చి ఒకపైంటు అగునట్లుగా ఆల్కహాల్ను గలిపిన యెడల లినిమెంట్ అయొడిన్ యేర్పడుచున్నది. ఇది టింక్చర్ అయొడిన్ కంటె 4½ రెట్లు అధికబలమైనది. రేగుదలను అణచివేయును. పైన రాయుటకు మాత్రమే ఉపయోగింపనగును.

## అంగ్వయెంటం అయొడిన్—Unguentum Iodine.

బూడిదవర్ణముగల ఆయింట్మెంట్; 25 భాగములలో 1 భాగము అయొడిన్ ఉండును. 20 గ్రె॥ అయొడిన్ను, 20 గ్రె॥ పొటాసియం అయొడైడ్ను, 60 గ్రె॥ గ్లిసరీన్తోడను 400 గ్రె॥ లార్డు (Lard) తోడను గలిపి నూరినయెడల ఆయింట్మెంట్ యేర్పడుచున్నది. వాపుదల భాగములను హరింపు నందజేసి, స్వస్థత పఱచుచు, రేగుదలను బుట్టించును.

## పొటాసియం అయొడైడ్ — Potassium Iodide.

దీనియొక్క గుణములు పైన చెప్పబడియే యున్నవి. కొఱుకువ్యాధియందు దీనియొక్క ఉపయోగము విశేషమైయున్నది.

మోతాదు— 2 గ్రె॥ మొ॥ 20 గ్రె॥

---

## ఇపికాక్ — Ipecac.

ఇపికాక్వానా చెట్టుయొక్క వేళ్ళతో జేయబడు నీ యౌషధము అనగా నీ వేళ్లయొక్క పొడిని పెద్దమోతాదులుగా నిచ్చినయెడల సరాసరి జీర్ణాశయమునందలి నరములపై బనిచేయుటవలన వాంతులను గలిగించును. ఏదైన విషప్రయోగమునందు వాంతకారిగ బనిచేయవలెనన్న నిది త్వరితముగ బనిచేయజాలదు గనుక దీని నుపయోగింపదగదు; కాని, బిడ్డలకు వచ్చు కింకవాయువునందును రొమ్ముపడిసెమునందును మిగుల నుపకారిగ నుండగలదు. కొద్దిమోతాదులలో (½ గ్రె॥) జీర్ణాశయమునందు స్రావము నధికపఱచి కార్జమునందలి పిత్తస్రావమునుగూడ హెచ్చింపజేసి, జీర్ణక్రమమునకు సహాయము చేయును; దీనిని సమానపరిమాణముగల పొటాసియం అయొడైడ్

తో గలిపియిచ్చినయెడల నొప్పితో గూడిన అజీర్ణవ్యాధియందు బనిచేయును. ఇంకను కొద్దిమోతాదులు అనగా 1 మినుము ఇపికాక్ వైన్ (Ipecac Wine) ను యిచ్చిన యెడల, గర్భవత్సంబంధ మగునట్టియు ౛్రాగుడు సంబంధమైనట్టియు వాంతులను గట్టించును.

పల్విస్ ఇపికాక్ కో — Pulvis Ipecac Co

దీనిలో 1 భాగము ఇపికాక్, 1 భాగము నల్లమందు, 8 భాగములు పొటాసియం సల్ఫేట్ ఉండును; కొంచెము పసుపువర్ణము గలిగిన పొడి; లోని కిచ్చుటవలన జెమటను బుట్టించి నొప్పిని బోగొట్టును, శ్వాససంబంధమగు వ్యాధులయందు తెమడను వెలిబుచ్చుటయేగాక అందుసంబంధమగు స్రావములు చక్కగ నున్నయెడల అధికముగ ద్రవపఱచి వెలువడుటకు సులభము యగును. జిగటవిరేచనములు తీవ్రస్థితి వహించియున్నపుడు యిది బహు చక్కగ బనిచేయును; కాని పెద్దమోతాదులలో 20 గ్రా॥ నియ్యవలసి యుండును; రోగి పరుండియుండి ద్రవపదార్థములను లోనికి బుచ్చుకొనుట తగ్గించినయెడల నిది జీర్ణాశయమునందు యిముడగలదు. దీని యొక్క సామాన్యమోతాదులయందు చెమటను బుట్టించి జ్వరము తగ్గునట్లు చేయు గుణము కూడా గలదు.

మోతాదు— 5 గ్రా॥ మొ॥ 15 గ్రా॥

ఇపికాక్ వైన్ — Ipecac Wine.

దీనియందు షెర్రి వైన్ కలిసి యుండును. కొంచెముగా బూడిదరంగుగ నుండెడి ద్రవపదార్థము.

మోతాదు— కఫహరముగ 10 మి॥ మొ॥ 30 మి॥; వాంతికారిగ 4 డ్రా॥ మొ॥ 6 డ్రా॥, 1 సం॥ వయసుగల బిడ్డకు వాంతికారిగ 1 డ్రా॥ నియ్య నగును.

---

## జాబరాండి — Jabarandi.

జాబరాండి నాబడు చెట్టుయొక్కఆకులతో నీసంబంధమగు యౌషధములు చేయబడును. ఈమందుయొక్క ఉపయోగమువలన చెమట అధికమయి, నోటియందు ఉమ్మి ఊరుటయు నెక్కువయి, స్త్రీలయందు స్తన్యము నధికము చేయును; పెద్దమోతాదుగ నుపయోగించినయెడల, కొంచెము కాలమయిన పిమ్మట వాంతికారిగ బనిచేసి, కనుపాపకు ముకుళనమును కలుగజేసి, కంటిచూపును దగ్గించును.

ఉబ్బసము, అతిమూత్రము, నంజు, రక్తమునందు మూత్రము గలిసినస్థితి— వీటియందు జాబరాండి ఉపయోగించును; బెలడోనా వలనను నల్లమందువలనను విషప్రయోగస్థితి సంభవించి నప్పుడిది విరుగుడుగ బని చేయును.

టింక్చర్ జాబరాండి — Tincture Jabarandi.

దీనిని తలనూనెలలో వేయుటచే వెండ్రుకలయొక్క కుదుళ్లకు జారుకను బుట్టించి వెండ్రుకల నభివృద్ధి చేయును.

మోతాదు— 30 మి॥ మొ॥ 60 మి॥; 24 గంటలలో నిచ్చుపరిమాణము ½ ఔన్సునకు మించరాదు.

---

## జాలప్ — Jalap.

ఇది యొక చెట్టుయొక్క వేళ్లతో జేయబడిన యౌషధము; ఇది బలమైన విరేచనకారి, నీళ్లవిరేచనము లగునట్లు చేయును. పేగులపైన రేగుదలను గలుగజేయుటచే విరేచనము లగునట్లు జేయును. ఈసంబంధ మగు నౌషధములందు పల్విస్ జాలప్ కో మాత్రమే పరిశుభ్రముగ బని చేయును; తక్కినవాటియందు పేగులను మెలివేయు గుణము కలదు. ఒడలంతయు నంజు గనుపడినపుడును, ఉదరభాగమునందు నంజు గనుపడినపుడును, దీని నుపయోగింప నగును. ఈ వ్యాధులయందు 1 డ్రాము మోతాదును ఒక టంబ్లరు నీళ్లలో గలిపియియ్యవచ్చును.

పల్విస్ జాలప్ కో — Pulvis Jalap Co.

వర్ణమునందు పల్విస్ ఇపికాక్ కో వలె నుండును; దీనిలో 5 భాగములు జాలప్, 9 భాగములు ఆసిడ్ పొటాసియం టార్టరేట్, 1 భాగము శొంఠి — ఉండును.

మోతాదు — 20 గ్రె॥ మొ॥ 60 గ్రె॥

---

## జూనిపర్ ఓలియం — Juniper Oleum.

నిర్వర్ణమైనట్టిగాని, కొంచెముగా పసుపువర్ణము కలిగినట్టిగాని, చమురు. కొద్ది మోతాదులలో, సాధువుగ జారుకుదనమును బుట్టించి, జీర్ణమును క్రమపరచును; ఇది త్వరితముగ రక్తమునందు బ్రవేశించి, మూత్రగ్రంథులయందు జేరి, వాటికి

మిగుల బలీయముగ జొరకును బుట్టించి, శరీరమునందు నంజు ఉండినయెడల అతిశయమైన పరిమాణమున మూత్రమును వెలువఱచును. మూత్రప్రకోపమునకై ఉపయోగించు ఔషధయోగములందు దీనినిగూడ గలిపినయెడల బాగుగ నుండును.

మోతాదు—½ మి॥ మొ॥ 3 మి॥

---

## కైనో – Kino.

ఇది బలమైన అస్ట్రింజెంట్; అతివిరేచనములయందును రక్తస్రావములందును నుపయోగించును; ఇది యొక చెట్టుయొక్క మానుపై నరుకుటచే గలిగెడి రసము నెండబెట్టుటవలన నేర్పడెడి పొడి; లోహసంబంధమైన నౌషధములతో దీని నియ్యగూడదు.

మోతాదు—5 గ్రె॥ మొ॥ 20 గ్రె॥

### పల్విస్ కైనో కో—Pulvis Kino Co.

దీనిలో కైనో పొడియును, నల్లమందును, దాల్చినచెక్కపొడియును, నుండును; దీనియందు రక్తస్రావమును నిలుపుజేయునట్టియు, నొప్పులను బోగొట్టునట్టియు, మగతను గలుగజేయునట్టియు, గుణములు గలవు.

మోతాదు—5 గ్రె॥ మొ॥ 20 గ్రె॥

---

## లవండర్ ఆయిల్ – Lavender Oil.

లవండర్ చెట్టుయొక్క పుష్పములనుండి దీయబడిన దాదాపు నిర్వర్ణమైన చమురు; జీర్ణకారిగను, శరీరమునందలి యాడ్పును బోగొట్టునదిగను, బనిచేయును. 3 మినిముల యీచమురును చక్కెరపైన వేసి లోని కిచ్చినయెడల శూలనొప్పిని బోగొట్టును.

మోతాదు— ½ మి॥ 3 మొ॥ మి॥

## లైమ్ (నిమ్మ) – Lime.

నిమ్మపండు సంబంధ మగు నూనెయును, దీనియొక్క పైతోలును, వాటియొక్కసువాసనకై యౌషధముల యందు వాడుక చేయబడును; కాని పేగులయందు

వాయుపూరితమై పేగులయందు మెలిపెట్టు నొప్పికలిగి యుండినపుడు నూనె యొక్క 3 మి॥ మొ॥ 5 మి॥ వరకుగల మోతాదుల నుపయోగించుటవలన మిగుల గుణముగ నుండగలదు.

నిమ్మపండును తోలు తీయకుండగనే ముక్కలుగా గోసి కషాయముగ గాచి దీనిని చలిజ్వరముల కుపయోగింతురు. గౌట్ వ్యాధియందును స్కర్వీవ్యాధియందును నిమ్మరసముయొక్క ఉపయోగ మమితమై యున్నది.

### లెమన్ ఆయిల్—Lemon Oil.

నిమ్మనూనె; కొంచెము పసుపువర్ణము గలిగి సువాసనను గలిగియున్న నూనె; గాలికి ఆవిరియై పోవును.

మోతాదు — ½ మి॥ మొ॥ 3 మి॥

---

## లిన్ సీడ్ — Linseed.

అగిసె (లేక అవిసె) విత్తులు మొరముగా నుండెడి పిండిగా గొట్టబడి, నీటిలో నుడుకబెట్టబడి, వేడిగా నున్నదానినే చీముపట్టియున్న కురుపులు మొదలగు వానికి గట్టవలయును. సామాన్యముగ భరింపగలిగినంత వేడిగ నుండిన దానినే గట్టవలయును గాని, మిగుల వేడిగ నున్న దానిని గట్టినయెడల బాధ అతిశయమయి ఆస్తలమును బిగదీయును.

ఉడుకబెట్టబడిన యీ పిండికట్లను యెప్పుడు కట్టవలయును? ఉదాహరణముగా గోరుచుట్టును దీసికొందము. దీనియొక్క ఆరంభమునందే యీ పిండికట్టును ప్రారంభించినయెడల గోరుచుట్టు పైకి దేలకుండగనే హరింపునొందవచ్చును. లేదా చీముపట్టుట ప్రారంభించి వాపుదల అతిశయమయి యున్న స్థితియందును యీ పిండికట్టువలన చీము పైకి వచ్చుటకు వలయు సహాయమును జేయును; కాబట్టి యిట్టి వాటియొక్క అన్నిగతుల యందును అవిసె పిండికట్లు ఉపయోగముగ నుండును.

### లిన్ సీడ్ ఆయిల్ — Linseed Oil.

లిన్ సీడ్ (అవిసె) విత్తులనుండి తీయబడెడి నూనెను శరీరముపై బిగిసిన భాగములయందు రాయుటవలన మెత్త నగును; లోని కియ్యరు.

---

## లితియం — Lithium.

లితియం సంబంధ మగు లవణములు గౌట్ వ్యాధియం దుపయోగింపబడుచున్నవి; వీటియందు లిథియా కార్బనస్ (Lithia Carbonas) ముఖ్యముగ బనిచేయునట్లు చెప్పబడుచున్నది; మూత్రకృచ్ఛ్రమునందు లిథియం లవణములను దీర్ఘకాల ముపయోగించుటవలన హరింపు నంద గల దని నమ్మబడుచున్నది.

### లిథియా కార్బనస్ — Lithia Carbonas.

తెల్లని పొడిగ గాని, స్ఫటికాకారముగల చిన్ని పలుకులుగ గాని, యుండును; మూత్ర ప్రకోపకారి; ఆమ్లసిత్తని మార్పుజేయును.

మోతాదు — 2 గ్రె॥ మొ॥ 5 గ్రె॥

### లిథియా సిట్రస్ — Lithia Citras.

ఇదియు తెల్లని పొడిగనే యుండును; కార్బనేట్ వలెనే యిదియు బని చేయును.

మోతాదు — 5 గ్రె॥ మొ॥ 10 గ్రె॥ (విరివియగు నీటిలో గలిపి)

### ఎఫర్వెసెంట్ లిథియం సిట్రేట్ — Effervescent Lithium Citrate.

ఈ తెల్లని పొడియందు — లిథియం సిట్రస్‌యును, సిట్రిక్ ఆసిడ్‌యును, టార్టారిక్ ఆసిడ్‌యును, సోడియం బై కార్బనేట్‌యును, గలియును. లితియం సంబంధ మగు నౌషధములలో నెల్ల నిది రుచి కింపైనదిగ నుండును.

మోతాదు జా 60 గ్రె॥ మొ॥ 120 గ్రె॥

---

## లోబేలియా — Lobelia.

లోబేలియా అనగా ఇండియాదేశమునందలి పొగాకుగా జెప్పబడుచున్నది. దీని సంబంధ మగు నౌషధమును పెద్ద మోతాదులలో నిచ్చిన యెడల, వాంతులు విరేచనములు కలిగి, నీరసత పుట్టి, శ్వాసకోశములయొక్క కార్యక్రమమునందు క్షీణత జనించి, గుండెయొక్క నడకయందును బలహీనత గలిగి, మరణము సంభవింప వచ్చును. ఉబ్బసమునందును రొమ్ముపడిసెము నందును దప్పు యితరవ్యాధులయం

దుపయోగింపబడును. ఇది, మిగుల బలమైన కఫహరముగను, యీడ్పును బోగొట్టు నదిగను, బని చేయును.

కొద్ది మోతాదులతో నిది యొకప్పుడు పేగులయందు మలము కూడి యుండుటచే గలిగెడి నొప్పిని తగ్గింపవచ్చును. కోరింతదగ్గునందు నిది యుపయోగింప బడుచున్నది; చెమటను బుట్టించి మూత్రప్రకోపకారిగ గూడ బని చేయును.

టింక్చర్ లొబేలియా ఈథరిస్ — Tincture Lobelia Aetheris.

ఆకుపచ్చరంగు కలిగిన ద్రవపదార్థము; ఈ సంబంధ మగు నౌషధ మిది యొక్కటే.

మోతాదు — 5 మి॥ మొ॥ 15 మి॥

---

## మెగ్నిసియం — Magnesium.

చీకటి ప్రదేశములయందుగాని రాత్రులయందుగాని ఫోటోగ్రాపులను దీయుటకు తెల్లని వెలుతురు వచ్చుటకుగాను మెగ్నీసియం లోహమును గాల్చుదురు. ఇందు సంబంధ మగు లవణములు విరేచనకారులుగ బనిచేయును.

### మెగ్నీసియా కార్బనస్ — Magnesia Carbonas.

ఇది జీర్ణాశయమునందలి అమ్లస్థితిని బోగొట్టి సాధువైన విరేచనకారిగ బని చేయును. ఇందు రెండువిధములు గలవు; ఒకటి బరువుగ నుండును; రెండవది తేలికగ నుండును. ఇందు బరువైనదియే పై యుపయోగమునకై వాడుక చేయబడును.

మోతాదు—మఱల మఱల నిచ్చుటకు 5 గ్రే॥ మొ॥ 30 గ్రే॥; ఒకే మోతాదుగ నైనయెడల 30 గ్రే॥ మొ॥ 60 గ్రే॥

### మెగ్నీసియా సిట్రిస్ — Magnesia Citras.

దీనిని నీటిలో వేయగనే పొంగును. ఒకటి లేక రెండు పెద్దచెమిచాలతో దీసి, దీనిని ఒక టంబ్లరు నీటిలో వేసి పుచ్చుకొనుటవలన, సాధువగు విరేచనకారిగ బని చేయును. నీరసస్థితిని వహించియున్న జనులు 20 చుక్కల టింక్చర్ జింజిబ్రిస్‌తో గూడ గలిపి పుచ్చుకొననగును. ఒక చిన్న చెమిచాకొలతగల దానిని నీటిలో వేసి పుచ్చు

కొనుటవలన, జ్వరగతులయందు జల్లదనమును బుట్టించును; ఈస్థితియందు 20 మినిముల స్పిరిట్ ఈతర్ నైట్రిస్‌ను గూడ గలుపవచ్చును.

మెగ్నీసియం సల్ఫేట్ — Magnesium Sulphate.

లవణసంబంధమగు విరేచనకారులలో నిది యెక్కువ నమ్మకముతో విరేచనములగునట్లు జేయును. నీళ్లవిరేచనము లగునట్లు చేయును. సీసపు సంబంధమగు విషప్రయోగములందు దీనిని విరుగుడుగ నుపయోగింపనగును.

మోతాదు—మఱల మఱల నిచ్చుటకు 30 గ్రె॥ మొ॥ 120 గ్రె॥; ఒకే మోతాదైన యెడల 2 డ్రా॥ మొ॥ 4 డ్రా॥

---

## పెప్పర్‌మింట్ ఆయిల్ – Peppermint Oil.

ఒకవిధమగు చెట్టునుండి తీయబడిన చమురు; నిర్వర్ణముగాని కొంచెము పసుపు వర్ణముగాని యుండును. ఇది బహు త్వరితముగనే జీర్ణింపబడి శరీరమునందు సాధువైన చురుకుదనమును బుట్టించును; వాంతి వచ్చున ట్లుండు స్థితిని బోగొట్టును; ఉదరమునందు వాయువు కూడుకొని యుండినయెడల తొలగింపజేయును; జీర్ణకారిగ బనిచేయును. తలనొప్పియందు పైన రాయుటకు గూడ నుపయోగింపవచ్చును.

మోతాదు — ½ మి॥ మొ॥ 3 మి॥

అక్వా మెంతా పిప్—Aqua Menthae Pip.

77 మినిముల పెప్పర్‌మింట్ ఆయిల్‌ను 1½ గాలనుల నీటిలో గలుపుటవలన నేర్పడును; 1 కి 1000 భాగముల జలములో గలియును.

మోతాదు — 1 ఔన్సు మొ॥ 2 ఔన్సులు; 1 సం॥ వయసుగల బిడ్డకు 1 డ్రా॥

---

## మెంతాల్ (పెప్పర్మింట్ పువ్వు) – Menthol.

మెంతాల్ త్రుళ్లకుండ జేయుటయందును, దానిని రాసిన స్థలములయందు నరములను బండబారునట్లు చేయుటయందును. నుపయోగించును. పిప్పిపన్ను యొక్క—

బెజ్జమునందు దీనిని ఉంచినయెడల పంటినొప్పిని బోగొట్టును; చర్మవ్యాధులయం దుపయోగించిన యెడల జీవాణువుల నశింపజేయును; లోని కిచ్చుటవలన కఫమును వెలిబుచ్చునట్టి గుణము కలదు.

మోతాదు — ½ గ్రా॥ మొ॥ 2 గ్రా॥

మెంతాల్ పలాస్త్రి — Emplastrum Menthol.

1 ఔన్సు పసుపు వర్ణముగల తేనెమైనమును 7½ ఔన్సుల రెజిన్ (Resin) తో కరగబెట్టి, 1½ ఔన్సుల మెంతాల్‌ను వేసి కలియబెట్టుటవలన పలాస్త్రివలె నగును. నొప్పులున్న స్థలములయందు దీనిని రాయుటమూలమున నుపయోగింప నగును.

---

## కాడ్ లివర్ ఆయిల్ – Cod Liver Oil

చమురులలోని కెల్ల తేలికగా జీర్ణము కాబడునది. కాడ్ లివర్ ఆయిల్ అయి యున్నది; ఇది కొంచెము పసుపువర్ణమును గలిగి యుండును; కాడ్ అనబడు చేప నుండి అప్పుడే వెలువఱచబడిన కార్జమునుండి దీయబడిన చమురు; మనిషిని శుష్కిం పజేసెడి వ్యాధులయందు, యితర ఆహారమును జీర్ణింప జేయుటలో గూడ నిది సహా యము చేయును. కఫమును వెలిబుచ్చుటయందు పని చేయును. కొఱుకు, క్షయ, మొదలగు వ్యాధులందు యిది శరీరమునకు మిగుల బలమును గలుగజేయును. నర ముల సంబంధ మగు బలహీనతయందు గూడ కాడ్ లివర్ ఆయిల్ ఆయా అస్వస్థత స్థానములకు బలమును గలుగ జేయును.

జ్వరగతులయందుగాని, జీర్ణాశయముగాని పేగులుగాని రేగుదల నందియున్న స్థితియందు గాని, దీని నుపయోగించ రాదు. క్షయవ్యాధియందు విశేష మగు శరీరపు వేడిమి ఉండియుండినపుడు దీనివలన నుపయోగము లేదు; కాని జీర్ణావయవములు స్వస్థతయం దుండినపుడు కొంచెముగా జ్వర ముండియున్నను దీనిని వాడుకచేయ వచ్చును.

దీనిని పెద్ద మోతాదులలో నిచ్చుటవలన నేమియు లాభము లేదు; అధికమైన పరిమాణము సాధువిరేచనకారిగ బనిచేయుచు, యొకప్పుడు జీర్ణాస్వస్థతను గలుగ జేసి, కార్జమునందు రక్తము గూడుకొను నట్లుగూడ జేయవచ్చును. దాని్రిము మోతా దులలో పా్రిరంభించి దినమునకు మూడు పర్యాయము లిచ్చుచు, క్రమముగా నీ మో

తాదును 4 డ్రాములకు హెచ్చింప జేయవచ్చును. మొదటి కొద్ది దినములలో నిద్ర పోవుటకు ముందుగా దీనిని వాడుక చేయనగును, పిమ్మట, భోజనానంతరము 1 లేక 2 గంటలకు దీని నియ్య నగును.

దీనియొక్క అరుచిని బోగొట్టుటకు గాను అనేక విధములుగ దీనిని మార్పు చేసిన మందులు అమ్మబడు చున్నవి గాని, అట్టి మార్పులవలన దీనియొక్క అసలైన గుణములు మార్పు నందవచ్చును గావున వాటిని మానుకొనుటయే యుచితము. మాల్టు తో గలిసిన కాడ్ లివర్ ఆయిల్ మాత్రము గుణము నిచ్చునదై యున్నది. దీనియొక్క వాసనను భరింపజాలని వారు — నీళ్లు, పాలు, కాఫీ, వైన్ — వీటిలో యిష్టము వచ్చిన దానితో దేనితోనైనను బుచ్చుకొనవచ్చును. కొందఱు రోగులు దీనిని ఆయాసము లేకుండ త్రాగ గలుగుదురు గాని, పిమ్మట గలిగెడి త్రేపులవలన మిగుల బాధ నొందుదురు. ఇట్టి విషయములలో వాసనగల పదార్థమును దేనినైనను గలుపుటవలన గుణముగ నుండు నని యెంచుట పొరబాటై యున్నది. ఇందులకుగాను, యీ ఆయిల్ ను నోటియందు పుక్కిలిబట్టి, నాలుకను నలువైపులను ద్రిప్పుటచే, నిది ఉమ్మిద్రవముతో గలిసి త్వరితముగా జీర్ణము నందును.

జీర్ణాశయమునం దిది యిముడుటకు యెట్టి మార్గమును గాన్పించనప్పుడు యీ ఆయిల్ ను మర్దన చేయుటవలన లోని కింకునట్లు చేయవలయును. వేడినీళ్ల స్నానము పిమ్మట 2 డ్రా॥ మొ॥ 4 డ్రా॥ వఱకు నొడలిపై మర్దన జేయనగును. బిడ్డలు శుష్కించుచున్న స్థితియం దిట్టి పద్ధతివలన మంచిగుణము కనుపించును.

---

## కస్తూరి — Musk.

తిబెట్ దేశమునందలి కస్తూరిమృగ మనబడెడి జంతువుయొక్క నాభియొద్ద నుండెడి యొక తిత్తినుండి స్రవించెడిదాని నెండబెట్టిన పిమ్మట, చిన్నవైనట్టియు క్రమత లేనట్టియు యెరుపు నలుపు వర్ణములు గలిగిన పలుకులుగా నేర్పడును; దీనికే కస్తూరి అనిపేరు. నరములసంబంధమైన ఉద్రేకను వహించునట్టియు, రోగిని సొగిల బడ జేయునట్టియు, మాంద్యగతి నందింపజేయునట్టియు సాధు జ్వరగతులయందును, టైఫాయిడ్ జ్వరము నందును, యిది గుణమును గలుగజేయు నని ప్రతీతి గలదు. శ్వాస సంబంధమగు మెదడునందలి మధ్యస్థానమునకు జురుకుదనమును బుట్టించును. హిస్టీరియావ్యాధియందును, మూర్ఛలుగా వచ్చెడి వివిధమగు నస్వస్థతలయందును, నిది యుపయోగింపబడుచున్నది. ఇది విశేషధరను గలిగియుండుటచేత దీనియొక్క

పూర్ణమైన గుణములను గనిపెట్టుట కంతగా నవకాశము లేకున్నది; స్వచ్ఛమైనది దొరకుటయు గష్టమై యున్నది.

మోతాదు — 5 గ్రె॥ మొ॥ 10 గ్రె॥

---

## నట్‌మెగ్ (జాజికాయ) – Nutmeg.

సువాసన గలిగిన యీ జాజికాయ జీర్ణకారిగ బనిచేయును. కొద్ది మోతాదులలో (10 గ్రె॥) నిది జీర్ణాశయమునందు జాఠరరసమును స్రవింపజేసి జీర్ణతను గలుగజేసి, ఆకలిని బుట్టించును. జీర్ణకోశముయొక్క యింకను గ్రిందిభాగమునందలి వాయువును దొలగించి శూలనొప్పి మొదలగు బాధలను నివారణ నందింపజేయును. పెద్ద మోతాదులలో నిది మిగుల మత్తును గలుగజేసి మెదడునందు విషఫలితముల గనిపింపజేసి, తల తిరుగుట, మూర్ఛ, మొదలగు దుర్గుణములను బుట్టించును.

మోతాదు—5 గ్రె॥ మొ॥ 15 గ్రె॥

---

## నక్సు వామికా (విషముష్టి) – Nux Vomica.

నక్సు వామికాయును స్ట్రిక్‌నీన్‌యును తెలుగునందు విషముష్టి యనబడెడి యొకే చెట్టుయొక్క విత్తులనుండి జేయబడును; కాని, యీ రెండవది మొదటిదానికంటె మిగుల బలీయమైనదై యున్నది.

పెద్దమోతాదు నిచ్చినయెడల నరముల సంబంధమగు అస్వస్థత యేర్పడి, స్నాయువులయందు పటుత్వము తప్పిపోయి, శ్వాసయందు ఆయాస మేర్పడి, ఉదర భాగమునందు బిగదీయుటవలనగాని శ్వాససంబంధమగు నరములయందు చచ్చుపడుటవలనగాని మరణము సంభవించును.

దీనియొక్క మితిదప్పిన ఉపయోగమువలన పరిశుద్ధరక్తనాళముల యందలి రక్తప్రచార మధికమయి, మూర్ఛలు కలుగుటమూలమున స్నాయుపరిశ్రమ మధికమయి, రక్తమునందు అంగారక్షారవాయువు (Carbonic Acid Gas) ప్రబలమయి, ధనుర్వాతమును బోలిన స్నాయువులయొక్క బిగిసికొనిపోవుట తటస్థించును. కాని ధనుర్వాతమునందువలె దవుడలు కఱచుకొనిపోవుటయందు ప్రారంభము కాకపోవుటయు, మఱియు దానికి భిన్నముగా నీ విషస్థితియందు పట్టువిడుపు లుండు

టయము, గలుగును. ఈవిషలక్షణము లొకప్పుడు మరణమును గలుగజేయవచ్చును; లేదా, శరీరమునకు తగినంత పటుత్వ మున్నయెడల నట్టిలొందరను గలుగజేయక పో వచ్చును, పెద్దమోతాదులలోనైనను మనస్సు చివరవఱకును చలింపకనే యుండును.

కొద్దిమోతాదులలో వాడుకచేసినయెడల, కొంచెముకాలముపిమ్మట నిందిృయ జ్ఞానమును బలపఱచి యింద్రియములకు అసామాన్యమైన చురుకుదనమును బుట్టించును.

విషముష్టిసంబంధమగు నౌషధములు, శరీరమున కంతకును వ్యాపించెడి నరము లకు ముఖ్యస్థానమై యున్న వెన్నుపాము (Spinal Cord) పైన జురుకుదనమును బుట్టిం చుగుణమును గలిగియుండుటచే, నరముల సంబంధమగు నస్వస్థతలయం దుపయో గింపబడుచున్నవి. పక్షవాతమున, స్నాయువులను గదుపుటయందు మాత్రమే స్వాధీనము తప్పి, గిల్లినయెడల గాని సూదితో గుృచ్చినయెడల గాని నొప్పిని బొందుటయందు శక్తి తప్పనట్టి విషయములలో, నిది ఉపయోగించును. శరీరము యొక్క సగభాగము నందే, అనగా యొక ప్రక్కనే, పక్షవాత మేర్పడిన స్థితియం దును, కిృంది భాగమునందే అనగా తుంటి కిృంద నుంచి పక్షవాత మేర్పడిన స్థితియందును, ప్రత్యేకించి కొన్ని స్థానములయందే యేర్పడిన నరములయొక్క చచ్చు పడిన స్థితియందును, స్ట్రిృక్నిన్ మిగుల బనిచేయునట్టి యౌషధ మైయున్నది; కాని, యీ కిృందివిషయములందు దీనిని వాడుక చేయగూడదు:—

1. అప్పుడే కొృత్తగా యేర్పడిన వ్యాధియందును.
2. అస్వస్థతభాగమును వంచుటకు ప్రయత్నించినయెడల వంగని స్థితియం దుండినపుడును.
3. మెదడు అస్వస్థత నొందియుండి శిరస్సుయొక్క అస్వస్థతాలక్షణములు గనబడినపుడును.
4. అస్వస్థత నొందియున్న స్నాయువులు శుష్కించి మిగుల క్షీణత నొందియున్నపుడును.
5. విద్యుచ్ఛక్తి సంబంధమగు చురుకునకు (Electric Current) స్నాయు వులు కదలిక నొందనపుడును.

జీర్ణకోశముపై స్ట్రిృక్నిన్ బహు గుణముగ బనిచేయును. పూర్ణముగ జేదైనది గనుక జీర్ణాశయముయొక్క సాృవస్థితిని వృద్ధిపఱచుచు, దానిని బలపఱచి, ఆకలిని హెచ్చుచేసి, జీర్ణము నభివృద్ధి పఱచును. పులితేృపులు వచ్చుచు నుండెడి అజీర్ణ

వ్యాధియందును, జీర్ణాశయముయొక్క పొరలు ఆమసితియం దుండినపుడును, యిది మంచి బలవర్ధకౌషధముగ బనిచేయును. పేగులయందలి మలబద్ధమునకుగాను విరేచన కారులతో గలిపి యిచ్చుటవలన నిశ్చయమైన గుణము గనబడగలదు.

అజీర్ణవ్యాధియందు గాని పక్షవాతస్థితియందు గాని యీ క్రింది యౌషధయోగము బాగుగ బని చేయగలదు.

టింక్చర్ నక్సు వామికా (Tincture Nux Vomica) ... 3 డ్రా॥

ఆసిడ్ నైట్రిక్ హైడ్రోక్లోర్ డిల్యూట్ (Acid Nitric Hydrochlor Dilute)... 5½ డ్రా॥

టింక్చర్ అరంటి (Tincture Aurantii) ... ... 4 డ్రా॥

ఇన్ఫ్యూజన్ జన్షన్ కో (Infusion Gentian Co) ... 10 ఔన్సులు

½ ఔన్సు మోతాదు చొప్పున దీనికొని 1 ఔన్సు జలములో గలిపి భోజనమునకు పూర్వము దినమునకు 3 సారు లియ్యవలయును.

మూత్రాశయమునకు స్నాయుపటుత్వము తగ్గినపుడును, సంభోగశక్తియందు నిరసత్వము కలిగినపుడును, నిది యుపయోగించ గలదు.

ప్రత్యేకస్థలములయందు నరముల యొక్క చచ్చుపడుట తటస్థించి నపుడు స్ట్రిక్నీన్ యొక్క 1/50 గ్రె॥ మొ॥ 1/20 గ్రె॥ ను సూదితో రక్తము లోనికి యింజక్టు చేయుట వలన గుణము గనబడును.

స్ట్రిక్నీన్ యొక్క వాడుకవలన మూత్రగ్రంథుల యొక్క రక్తనాళములు ముకుళనము నంది, యిది వెలువడుటకు మార్గము బంధింపబడుటచే విషమస్థితి ప్రారంభము కావచ్చును. కనుక దీనియొక్క ప్రయోగమును జాగ్రతతో గాపాడవలయును.

దీనియొక్క వాడుకను పెద్దమోతాదులతో నెన్నడును బ్రారంభించరాదు. టింక్చర్ నక్సు వామికా (Tincture Nux Vomica)ను 10 లేక 12 మినిముల తోడగాని, యక్ట్రాక్టుయొక్క ½ గ్రె॥ తోడగాని, మోతాదును యేర్పఱచనగును. నక్సు వామికాకంటె స్ట్రిక్నీన్ యెక్కువ బలీయమైనది గనుక ½ గ్రె॥ స్ట్రిక్నీన్‌తో మరణము దటస్థమయిన విషయములుగూడ గలవు.

ఇంద్రియస్థానములపైన నిది గనబఱచునట్టి శీఘ్రమైన చురుకుదనమునుబట్టి, హిస్టీరియావ్యాధియం దదివఱకే మిగుల రేగుదలను వహించియున్న యింద్రియావయవములకు మఱింత యొత్తడిని గలుగ జేయుటవలన అపాయకరము కావచ్చును గనుక, నీవ్యాధియం దిది యుపయోగించరాదు.

క్లోరల్ హైడ్రేట్‌ను, అల్కహాల్ (సారాయి)ను విశేషముగ నుపయోగించి నందువలన గలిగెడి అస్వస్థతకు స్ట్రిక్‌నీన్‌ను విరుగుడుగ నుపయోగించ వచ్చును. స్ట్రిక్‌నీన్‌వలన గలిగెడి విషమస్థితికి పెద్ద మోతాదులుగ అల్కహాల్‌ను ఉపయోగించుటయు బ్రయోజనకరముగ నుండగలదు. క్లోరల్, క్లోరొఫారం, ల వలన గలిగెడి విషమస్థితికి లైకర్ స్ట్రిక్‌నీన్ 2 లేక 3 మినిములను సూదిద్వారా రక్తము లోనికి యింజక్టు చేయనగును. దీనిని క్షారపదార్థములతోడను, ట్యానిక్ ఆసిడ్, గ్యాలిక్ ఆసిడ్లతోడను, నుపయోగించరాదు.

విషముష్టివిత్తుల పొడి యొక్క మోతాదు — 1 గ్రే॥ మొ॥ 4 గ్రే॥

యక్ట్స్ట్రాక్టు నక్సు వామికా లిక్విడ్ — Extract Nux Vomica Liquid.

బూడిద రంగుగల ద్రవపదార్థము; 110 మినిముల యందు 1½ గ్రే॥ స్ట్రిక్‌నీన్ ఉండును.

మోతాదు — 1 మి॥ మొ॥ 3 మి॥

యక్ట్రాక్టు నక్సు వామికా సాలిడ్ — Extract Nux Vomica Solid.

బూడిద రంగును వహించి మెత్తగ నుండెడి పదార్థము.

మోతాదు — ¼ గ్రే॥ మొ॥ 1 గ్రే॥

టింక్చర్ నక్సు వామికా — Tiucture Nux Vomica.

110 మినిములయందు ¼ గ్రే॥ స్ట్రిక్‌నీన్ ఉండును.

మోతాదు — 5 మి॥ మొ॥ 15 మి॥

---

## స్ట్రిక్‌నీన్ — Strychnine.

నక్సు వామికా నుండి తయారు చేయబడునట్టిదియే యగు క్షారపదార్థము ; గుణములకై నక్సు వామికా క్రింద జూడవలయును.

మోతాదు — 1/60 గ్రే॥ మొ॥ 1/15 గ్రే॥

లైకర్ స్ట్రిక్నిన్ హైడ్రోక్లోర్ — Liquor Strychnine Hydrochlor.
110 మినిములలో 1 గ్రై॥ స్ట్రిక్నిన్ ఉండును; నిర్వర్ణమైన ద్రవపదార్థము.
మోతాదు — 2 మి॥ మొ॥ 8 మి॥

---

## ఆలివ్ ఆయిల్ — Olive Oil.

ఆలివ్ ఫలములనుండి దీయబడిన పసుపువర్ణము గలిగినట్టి చమురు; ఒక ఔన్సు మోతాదులో దీనిని తీసికొనినయెడల, మెత్తనైనట్టియు బాధలేనట్టియు విరేచనము లగునట్లు చేయును; కాబట్టి మలబద్ధమునందును, ఆసనముయొద్ద పుండునందును, పేగుల యందు పుండు గలిగియున్నపుడును, యిది మిగుల నుపయోగముగ నుండ గలదు. నల్లమందు యొక్క ఉపయోగమువలన మలబద్ధ మేర్పడినపుడు దీనిని సాధు వగు విరేచనకారిగ నుపయోగింపవగును. "బ్లూపిల్" ను ఉపయోగించిన 12 గంటలపిమ్మట దీనిని 6 ఔన్సుల మోతాదుగా నుపయోగించిన యెడల పైత్యసంబంధమగు రాళ్లు (Gall Stones) వెలువడు నని తెలియుచున్నది.

దీనియొక్క మృదుత్వమును బట్టి దీనిని లినిమెంట్లు, పిండికట్లు, ఆయింట్‌మెంట్లు — వీటిలో గలుపుట కుపయోగింతురు.

మోతాదు — 2 డ్రా॥ మొ॥ 1 ఔన్సు.

---

## ఓపియం (నల్లమందు) — Opium.

నల్లమందు యొక్క సామాన్య మగు మోతాదు నోటి యొద్దనుండి ఆసనము వఱకును జీర్ణకోశ మంతటి పైనయును బనిచేయును; స్రావము తగ్గిపోవుట వలనగాని పూర్ణముగ నాగిపోవుటవలన గాని, కొద్దికాలములోనే పెదవులు, నాలుక, గొంతు, యివి యన్నియు నారుదల నొందును; జాఠరరసము యొక్క స్రవించుట నిలిచి పోయి, జీర్ణత మాంద్యమును వహించి, ఆకలి తగ్గిపోవును. పేగులయందలి స్రావ ములు గూడ వెనుకటి కంటె తగ్గుదలనొంది, కొంతకాలమునకు మలబద్ధ మేర్పడును. పరిశుద్ధరక్తనాళముల యందలి రక్తప్రచార మధికమయి, కనుపాపలు ముకుళితము లయి, నరముల సంబంధమగు కలత యేర్పడును; ప్రారంభమునందు మనశ్శక్తులకు ఆనందయుత మగు చురుకుదనము కలిగి, మనస్సునందు భావములు త్వరితగతిని బ్రవ

హించుచు, సాధువైన మగతకు సమీపించిన మనోల్లాసమును గలిగి, కొంచెము కాల మువఱకు శాంతస్థితిని వహించి, యీ స్థితినుండి మైకములోనికిని పిమ్మట నిద్రిలోనికిని నభివృద్ధి నొందును. నల్లమందు అలవాటయినవారల యందు దీని యందలి ప్రథమలక్షణము గనుబడకపోవచ్చును.

నిద్రిలేచిన పిమ్మట తలనొప్పి, చిత్తవైకల్యము, మనస్థిమితము లేకపోవుట— తఱచుగ నీగుణములు పుట్టును.

పెద్దమోతాదులలో నుపయోగించినయెడల పైలక్షణములే మిగుల నుద్రిత గతి ననుసరించి యుండును; చురుకుదనమును వహించిన గతి స్వల్పకాలము వఱకు మాత్రిమే యుండి, శీఘ్రిముగ కునుకునిద్రి ప్రివేశించి, యీగతినుండి వెంటనే పూర్ణనిద్రిలోనికి దిగి, శ్వాస క్రమతను దప్పియు మాంద్యతను వహించియు నుండి మోతాదు తగినంత పెద్దదై యుండినయెడల మూర్ఛయు దటస్థించును. విషతుల్య మగు మోతాదులలో నిద్రి బహుత్వరితముగ వచ్చి చురుకుదనముతోగూడిన ప్రారంభ గతిని దెలిసికొనుటకు వీలే యుండదు; కనుపాపలు బలముగ ముకుళనము నొందును. మొదటగా శాంతతను వహించి యున్నట్టియు గుఱకతో గూడియుండి నట్టియు శ్వాస బలహీనమై క్రమతను దప్పి యుండును. ముఖము నల్లనై యొడ లంతయు జల్లగను జెమటతో గూడినదిగను నుండును; మొదటగా పూర్ణము గను బలముగను నుండిన నాడి బలహీనమై త్వరితగతి నవలంబించును; మూర్ఛగతి మొదట నసంపూర్తిగ నుండి, కొంతకాలమువఱకు నీస్థితినుండి లేవగలిగిన స్థితి యం దుండినను, క్రమముగా నీస్థితి విజృంభమునొంది, యేవిధమైన ప్రేరేపణవలనను రోగి తెలివి నందక, ముందుగా శ్వాసయొక్క నిలుపుదలవలనను పిమ్మట గుండె యొక్క నిలుపుదలవలనను మరణము కలుగును.

నల్లమందు, చర్మమునందలియు స్తనములయందలియు గ్రింథులనుండి కలుగు స్రావములను దప్ప, శరీరమునందలి తక్కిన యన్ని స్రావములను నిలుపు చేయును.

పెద్దమోతాదులలో మెదడునందు మాత్రిమే మార్పులు కలుగును; యీపెద్ద మోతాదులను మఱల నిచ్చినయెడల మెదడు సంబంధమగు క్రిందిభాగములు కూడ మార్పుజెందును ; యీ సందర్భములం దొకప్పుడు మూత్రము బంధింపబడును ; ఒడలు నను స్పర్శశక్తి తప్పిపోవును.

నల్లమందుయొక్క వాడుకవలన గలిగెడి — ప్రథమగతి యందలి మెదడు సంబంధమగు నుద్రేకతయును, ద్వితీయగతి యందలి నిద్రియును — వేఱువేఱు

మనుష్యులయందు వేలువేలు విధములుగ నుండును; ఇంతియగాక దీనిని వాడుక చేయు పద్ధతి ననుసరించియు నుండును. ఎట్లనగా, బలహీనమైనట్టియు సులభముగా గోపము వచ్చునట్టియు స్త్రీయందు మొదటి లక్షణము మాత్రమే కాన్పించి నిద్రరాకుండ నుండవచ్చును; మఱియు, పెద్దమోతాదు నిచ్చినయెడల నిద్ర బహుత్వరితముగ నావహించి మొదటి లక్షణము గనబడకనే యుండవచ్చును; ఒకవేళ గనబడినను బహుస్వల్పకాలము మాత్రమే వ్యాపించియుండును. నల్లమందును దినువాడు (నల్లమందు భాయి!) మోతాదును క్రమపరచుటవలన ద్వితీయగతి నొందకుండ ప్రథమ ఆనందగతినే దీర్ఘపరచుటకు వీలు కలదు. ఇందువలననే యీ దురభ్యాసమును వదలజాలక "నల్లమందు పిచ్చి"ని బడి యీ భ్రాతృవర్గమువారు కొట్టుకొనుచుందురు.

నల్లమందు రక్తప్రచారమార్గమున మెదడునందలి అంతర్భాగ బిలములయందు బ్రవేశించి వాటియొక్క సహజ వ్యాపారమునందలి చురుకుదనమును దగ్గించుటవలన నిద్ర గలుగుచున్నదని యిటీవల గొందఱు డాక్టరులు అభిప్రాయము నిచ్చియున్నారు.

## నల్లమందుయొక్క ఉపయోగములు.

నిద్ర రాదగియున్న అన్ని సందర్భములయందును, ముఖ్యముగా నేదయిన బాధచే నిద్ర రాకుండ నుండినపుడును, నిద్రను గలుగజేయుటకు నల్లమందు సంబంధమైనవి మిగుల విశ్వసనీయములగు నౌషధములై యున్నవి; జ్వరగతులయందు విశ్రాంతిహీనమైన సంధిగుణము నందును, ఉన్మత్తమైన వాపుదలల యందును, త్రాగుడు సంబంధమగు సంధిగుణమునందును, మతిభ్రమణమునందును, మనోవ్యాకులతయందును, నిది ఉపయోగించనగును.

బాధను బోగొట్టుటయందు యింత నిశ్చితమైనట్టియు, నింత క్షేమకరమైనట్టియు మందు మఱొకటి లేదు. తుంటినొప్పి, తలనొప్పి, నడుమునొప్పి, కడుపునొప్పి, కొలుకు పుండునందలి నొప్పి, — వీటియందును, పైత్య సంబంధమైన రాళ్లు వెలువడునపుడును మూత్రసంబంధమగు రాళ్లు వెలువడునపుడును గలిగెడి బాధయందును, నిది ఉపయోగముగ నుండును. ఈ విషయములయందు మార్ఫియాను నోటిద్వారా లోని కిచ్చుటకంటె సూదిద్వారా లోనికి యింజక్టుచేయుటవలన నెక్కువ గుణము నిచ్చును. కాని, రోగికి యిట్లు తఱచుగ పిచికారీ చేసికొనుట అలవాటు కాకుండునట్లు జాగ్రతను బుచ్చుకొనవలయును; లేనిచో నిది దురభ్యాసము క్రింద నేర్పడును. నల్లమందును దినుట అలవాటును జేసికొనినందువలన గలిగెడి నష్టములను గూర్చి

విశేషముగ జెప్పనవసరము లేదు. ఇట్లు అలవాటు యేర్పడిన వారికి ఆ అలవాటును మాన్పుటకుగాను నల్లమందును ఆపివేసి, 2 లేక 3 లేక 4 దినముల వఱకును అల్కహాల్ ను పెద్ద మోతాదులలో నిచ్చి, నల్లమందుయొక్క మాంద్యతయును దాని యెడల తృష్ణయును అణగిపోవువఱకును దీని నిచ్చుచు క్రమముగా దీనిని గూడ మాన్పవలయును. నల్లమందు అలవాటుపోయి త్రాగుడు అలవాటు గాకుండునటుల మాత్రము జాగ్రతను బుచ్చుకొనవలయును.

నల్లమందుయొక్క ఉపయోగమువలన దగ్గును మాన్పవచ్చును. విశేషముగ తెమడ వచ్చుచుండెడి దగ్గునందు దీని నుపయోగించరాదు; తెమడ విశేషముగ వెలువడకుండ నుద్రిక్తమైన దగ్గ వచ్చుచుండెడి స్థితియందు మాత్రమిదియొక వరముగ నెంచవచ్చును.

ఉద్రిక్తమగు వాపుదల లుండియున్న స్థితియందు నిది మిగుల గుణము నిచ్చుచు అస్వస్థతాకాలపరిమాణమును గూడ తగ్గించును; కాని, దీనియొక్క ఉపయోగము వలని ఫలితమును జాగ్రతతో గమనించుచు మఱియు వాడుక చేయవలయును.

దీనియొక్క ఉపయోగమువలన పేగులయొక్క కదలిక తగ్గిపోవుటచే, పేగులయొక్క వాపుదలలయందుగాని పేగులనుండి కలుగు రక్తస్రావములందుగాని మిగుల గుణముగ నుండగలదు.

అతిస్రావములవలన పేగులయం దస్వస్థత యేర్పడిన విషయములలో, రేగుదలకు కారణ పదార్థమును విరేచనకారి నుపయోగించుట వలన దొలగింప జేసి, నల్లమందు నుపయోగించిన యెడల గుణ మియ్య గలదు; గ్రహణివిరేచనములయం దిది మిగుల నుపయోగము.

బిడ్డలకు నల్లమందు సామాన్యముగ సరిపడదు; వైద్యుడు తాను క్రొత్తగ వైద్యమును బ్రారంభించిన మొదటి కొద్ది సంవత్సరములలో సంవత్సరము లోపు వయసుగల బిడ్డలకు నల్లమందు సంబంధ మగు మందుల నియ్యకుండ నుండుట మంచిది. గౌట్ వ్యాధియందును మూత్రగ్రంథులయొక్క క్షీణదశ యందును నల్లమందును వాడుక చేయగూడ దని చెప్పుదురు; కాని, డాక్టరులయొక్క అనుభవమువలన రక్తమునందు మూత్రము గలిసియున్న స్థితియందు మార్ఫిన్ ను సూదితో రక్తములోనికి యింజక్టు చేయుటవలన నుపయోగకరముగ నుండునట్లు తెలియుచున్నది. అతిమూత్రవ్యాధియందు మూత్రముతో వెలువడు చుండెడి చక్కెరను నల్లమందుయొక్క ఉపయోగమువలన దగ్గింప నగును.

కొందఱు ప్రకృతిఫలితముగ కొద్ది మోతాదులను భరించుటకే బహు శ్రమ పడుదురు; తలనొప్పి, వాంతి వచ్చిన ట్లుండుట, ఉద్రిక్తమైన దురద— వీటి నశేక పరిమాణములుగ బొందుదురు. నల్లమందు అలవాటయినవారలు పెద్ద మోతాదులనే అనర్గళముగ నెట్టి శ్రమయును గలుగకుండ బుచ్చుకొందురు.

ఓపియం (నల్లమందు) యును, మార్ఫిన్ (Morphine) యును నొకే తరగతివి గాని యారెంటికి నుండు భేదముల నీక్రింద వివరించడ మయినది.

1. ఓపియం కంటె మార్ఫిన్ చికిత్సావిషయమున 6 రెట్లు బలీయమైనది; అనగా 1 గ్రె॥ మార్ఫిన్‌కు చికిత్సాసందర్భమున 6 గ్రె॥ ఓపియం సమానముగ నుండును.

2. స్నాయువులను ముడుచుకొనునట్లు చేయుటయందును మలబద్ధగుణమును బుట్టించుట యందును ఓపియం కంటె మార్ఫిన్ తక్కువ బల మైనది.

3. స్వేదమును బుట్టించుటయందు ఓపియం కంటె మార్ఫిన్ తక్కువ బల మైనది.

4. ఉద్రిక్తమగు వాపుదలలయందు, ముఖ్యముగా నుదరభాగమందలి వాటిలో— ఓపియం కంటె మార్ఫిన్ తక్కువ ఉపయోగమై యున్నది.

5. ఉద్రేకతను, తలనొప్పిని, వెగటును బుట్టించుటయందు ఓపియం నందు కంటె మార్ఫిన్‌యందు తక్కువ అస్పదము కలదు.

6. నిద్రను బుట్టించుట యందును, నొప్పిని బోగొట్టుట యందును, ఓపియం కంటె మార్ఫిన్ నిశ్చయముగ నెక్కువ బలమును కలిగినదై, దురదను బుట్టించుట యందును, మూత్రమును బంధించుట యందును, గూడ నెక్కువ అస్పదమును గలిగి యున్నది.

మార్ఫిన్‌ను రక్తములోనికి యింజక్టు చేయుటవలన సామాన్యముగ గలిగెడి అపాయకరచిహ్నములను దొలగించుటకుగాను దీనియొక్క ప్రతి మోతాదునకును 1/100 గ్రె॥ అట్రోపీన్ (Atropine) ను గలుప నగును; ఈ పద్ధతిని యింజక్టు చేయుట ౦ 1/6 గ్రె॥ మొ॥ 1/4 గ్రె॥ మోతాదుకంటె హెచ్చుగు మార్ఫిన్‌ను ఉపయోగించరాదు.

మందుగా నుపయోగించుటకు గాను పరిషియా దేశమునందలియు ఇండియా దేశమునందలియు ఓపియం కంటె తురుష్కస్థానమునుండి వచ్చెడి ఓపియం శ్రేష్ఠమైనదై యున్నది.

ఓపియం మోతాదు — $\frac{1}{2}$ గ్రే॥ మొ॥ 2 గ్రే॥

యక్స్ట్రాక్టు అఫ్ ఓపియం — Extract of Opium.

1 పౌను ఓపియం $\frac{1}{2}$ పౌను అగునంతవఱకును గాచబడి తయారు చేయబడి నలుపు బూడిద రంగులు గలిసిన, ఘనపదార్థము; ఇది మిగుల బలమైనది; కాని, చురుకుదనము నందు బలహీన మైనదని చెప్పబడుచున్నది.

మోతాదు — $\frac{1}{4}$ గ్రే॥ మొ॥ 1 గ్రే॥

లినిమెంట్ ఓపియం—Liniment Opium.

టింక్చర్ ఓపియం 1 భాగమును సోప్ లినిమెంట్ 1 భాగమును ఉండును; పైన రాయుటకు మాత్రమే ఉపయోగింప నగును; లోని కియ్యరాదు; నొప్పిని బోగొట్టును.

టింక్చర్ ఓపియం—Tincture Opii.

నలుపు రొుురుపు బూడిద వర్ణములు గలిసిన ద్రవపదార్థము; 15 మినిములయందు 1 గ్రే॥ ఓపియం ఉండును, దీనికే లాడనం (Laudanum) అను పేరు కూడ గలదు; అరడ్రాము మోతాదులో సామాన్యముగ నిద్రను బుట్టించును; మత్తును గలుగజేసి నొప్పినిగూడ బోగొట్టును.

మోతాదు—మఱల మఱల నిచ్చుటకు 5 మి॥ మొ॥ 15 మి॥; ఒకేమోతాదుగ నిచ్చుటకు 20 మి॥ మొ॥ 30 మి॥

పిల్యూలా ఇపికాక్ కం సిల్లా — Pilula Ipecac cum Scilla.

ఇందులో 100 కి 5 వంతులు ఓపియం ఉండును; ఘనపదార్థము; దీనియందు పిల్యూలా ఇపికాక్ కో గూడ గలిసియుండును; మత్తును గలుగ జేయుటకును, కఫమును వెలిబుచ్చుటకును, ఉపయోగించును.

మోతాదు — 4 గ్రే॥ మొ॥ 8 గ్రే॥

### పిల్యూలా ప్లంబి కం ఓపియో—Pilula Plumbi cum Opio.

బూడిద నలుపు రంగులు గలిసిన ముద్దగా నుండును; 100 కి 12½ వంతున ఓపియం యును, లెడ్ అసిటేట్ యును, గలియును; అస్ట్రింజెంట్ గను మత్తత గలుగ జేయునదిగను బని చేయును.

మోతాదు—2 గ్రె॥ మొ॥ 4 గ్రె॥

[పల్విస్ క్రీటా అరొమేటిక్ కం ఓపియం, పల్విస్ ఇపికాక్ కో, పల్విస్ కినో కో—వీటియందుగూడ ఓపియం కలియును.]

### టింక్చర్ క్యాంఫర్ కో — Tincture Camphor Co.

దీనికి ప్యారిగారిక్ (Paregoric) అనియు ప్యారిగారిక్ యెలిక్సిర్ (Paregoric Elixir) అనియు పేరులు గలవు; ఒక డ్రాము నందు ¼ గ్రె॥ ఓపియం ఉండును. నొప్పిని బోగొట్టునదిగను, కఫమును వెలిబుచ్చునదిగను, చురుకుదనమును బుట్టించునదిగను, బనిచేయును; ఎర్రని వర్ణముగల ద్రవపదార్థము.

మోతాదు — ½ డ్రా॥ మొ॥ 1 డ్రా॥ ఒక సంవత్సరము వయసుగల బిడ్డకు 4 మి॥ ఓపియం గలిసియున్న ద్రవపదార్థములలో బిడ్డలకు క్షేమకరముగ నియ్యదగిన దిది యొక్కటియే.

---

## హార్డు పేరఫిన్ – Hard Paraffin.

నిర్వర్ణమైనట్టియును, మెరయు నట్టియును, మైనమువలె గనబడునట్టియును, విశేషముగు వేడిమి (130°—135°F) కి గాని కరుగనట్టియును, ముద్దవలె నుండునది; వాసన యుండదు; నీటిలో గలియదు. ఆయింట్మెంట్లను జేయుటయందు గలుపుట కుపయోగింతురు.

### లిక్విడ్ పేరఫిన్ — Liquid Paraffin.

పరిశుభ్రమయినట్టియు, నిర్వర్ణమయినట్టియు, మెరపు లేనట్టియు, చమురువలె నుండెడి ద్రవపదార్థము; అమప్రదేశముల యందు ఆల్టరేటివ్ గను సెడేటివ్ గను బనిచేయును;

### సాఫ్టు పేరఫిన్ — Soft Paraffin.

తెల్లనై నట్టిగాని పసుపురంగు గలిగినట్టిగాని అర్ధద్రవ పదార్థము; మెరపును గలిగి, మెత్తనై యుండును. నిలువ యుంచుటవలన దుర్వాసనను బొందు

టకు తక్కువ ఆస్పదమును గలిగి యున్నది. రోగుదలను బుట్టించునట్టిగాని, మార్పు దలను జెందునట్టిగాని, గుణములు దీనియందు లేకుండుటం జేసి ఆయింట్‌మెంట్లలో నుపయోగించుటకు వీలైనదై యున్నది. కొద్దివేడిమికి మాత్రమే కరగు గుణము దీని యం దుండుటచేత నొడలిపై నుపయోగించుటవలన గరగి పెనగట్టిన గుడ్డలకు అంటు కొనును. ఇట్టి లోపము గలుగకుండ నుండుటకుగాను దీనిని హార్డుపేరఫిన్‌తో గలుప నగును. ఈ రెండును గలిసినది ఆయింట్‌మెంటునందు పరిశుభ్రముగ బనిచేయును. క్రుళ్ళకుండ జేయుట కుపయోగించు ఆయింట్‌మెంట్ల యందు (అనగా కార్బాలిక్ ఆసిడ్, బొరాసిక్ ఆసిడ్, సాలిసైలిక్ ఆసిడ్, యూకలిప్టస్, మొదలగు వాటి యందు) దీని నుపయోగింతురు.

---

## పెప్సిన్ — Pepsin.

పంది, గొఱ్ఱె, దూడ—వీటియొక్క ఆరోగ్యస్థితియం దున్న జీర్ణాశయము నందలి ఆమసంబంధమగు పొరలనుండి తీయబడిన తెలికగు-కొంచెము పసుపు బూడిద వర్ణములు కలిగిన—పొడి; ఈ పొడి యొకప్పుడు తెల్లగగూడ నుండ వచ్చును; కొంచెము వాసనగా నుండును; ఈ వాసన భరింప దగనిదిగా నుండును.

మనిషియొక్క జీర్ణాశయమునందు గలిగెడి జాఠరరసమునందు పెప్సిన్ కలిసి యుండును; ఏ కారణము వల్లనైనను యీ జాఠరరసముయొక్క స్రవింపు తగ్గి పోయిన యెడల పెప్సిన్ ను ఉపయోగింప నగును; పెప్సిన్ రకములలో పెప్సిన్ పోర్సి (Pepsin Porci) అనబడునది శ్రేష్ఠమై యున్నది; ఇది జీర్ణాశయమునందు సారజనక సంబంధమగు నాహారపదార్థములను (అనగా, మాంసము, చేపలు, గ్రుడ్లు, మీగడ, వెన్న, గోదుమలు మొదలగునవి) జీర్ణింప జేయుటయందు సహాయము చేయును. దీనిని పెద్దమోతాదులలో వాడుకచేయ నవసరములేదు; మలముపెంబడి జీర్ణముకానట్టి పదార్థములు వెలువరింప జేయబడుచు బిడ్డలకతి విరేచనము లగు చున్న యెడల నిది ఉపయోగకరముగ నుండగలదు; పూర్ణమైన జీర్ణతనొందని విషయ ములలో గలుగు వాంతుల యందును నిది ఉపయోగింప గలదు. ఆహారములయందు దీనిని గలుపుటవలన ఆహారముయొక్క రుచి చెడిపోవును. కనుక నట్టి పనిని జేయ గూడదు. 5 గ్రా॥ పెప్సిన్ కు 1 గ్రా॥ కఫీన్ ను గలిపి యిచ్చినయెడల పెప్సిన్ యొక్క చురుకుదనము బలీయమగును.

మోతాదు—5 గ్రా॥ మొ॥ 10 గ్రా॥

## పెప్సిన్ వైన్ — Pepsin Wine.

పెప్సిన్ 3 భాగములు, డైల్యూట్ హైడ్రోక్లోరిక్ ఆసిడ్ 3 భాగములు, షెర్రీ వైన్ 60 భాగములు—కలిసి యుండును; ఇవి యన్నియు 2 దినములు కలిసి యున్న పిమ్మట వడపోయ వలయును.

మోతాదు—భోజనముతో 1 డ్రా॥ మొ॥ 2 డ్రా॥

---

## ఇన్‌గ్లూవిన్ — Ingluvin.

కోడియొక్క జీర్ణాశయమునుండి తయారు చేయబడిన పెప్సిన్ వంటి పొడి; గర్భవత్సంబంధమగు వాంతులను నిలుపుచేయుటకు ఇది ముఖ్యముగా నుపయోగింపబడును.

మోతాదు—5 గ్రె॥ మొ॥ 20 గ్రె॥

---

## ఫాస్ఫరస్ — Phosphorus.

కొద్ది మోతాదులలో నిది నరములసంబంధమగు శరీరభాగమునకు బలవర్ధకౌషధముగను చురుకుదనమును బుట్టించునదిగను బనిచేయును; మనశ్శక్తులు చురుకును వహించి, రక్తపరిచార మధికమయి, నాడి తీవ్రతను గలిగియుండును; శరీరపు వేడిమి గూడ అధికమగునని చెప్పబడు చున్నది, మూత్రము నందలి వ్యర్థపదార్థము లధికమగును; ఆకలి యధికమగును. చాలకాల మయిన పిమ్మట నెముకలయందు గూడ మార్పు కలుగును; జీర్ణమైన యెముకభాగములు గట్టిపడి స్వస్థతిని బొందును.

పెద్దమోతాదులలో, వాంతులు, విరేచనములు, ధాతునష్టము, మామూలు విషచిహ్నములును గన్పించును; మోతాదును దీసికొనిన చాలసేపైన పిమ్మటనే యీ లక్షణములు గనబడ వచ్చును. ఈ దుర్లక్షణములు నిలిచిపోయి, నెమ్మది కలిగినట్లుగనే యుండి, పిమ్మట గుండెయొక్క దుర్బలత, కామాలవ్యాధి, రక్తస్రావములు, మూర్ఛలు కలిగి, మరణము తటస్థింప వచ్చును.

అస్వస్థతను జెందియున్న నరముయొక్క బలహీనతను పూర్తి పఱచుటకుగాను తలనొప్పియందు దీని నుపయోగింతురు; ఈ ఔషధము వలన నొకప్పుడు మేలు కలుగ వచ్చును; ఒకప్పుడు గుణము కనుపడకను పోవచ్చును. విశేషముగ మనఃపరి

శ్రమను జేయుటవలన మెదడునకు గలిగెడి అలసటను బోగొట్టుటకు గాను యిది మిగుల ఉపయోగ మయినది. నపుంసకస్థితియందు తత్సంబంధ మగు అవయవముల పై బనిచేయుటచే నుపయోగించును. దీనిని చర్మవ్యాధుల యందును నుపయోగింతురు.

దీర్ఘవ్యాపిత మైన పాండువ్యాధి యందు ఫాస్ఫరస్ యొకప్పుడు ఉపయోగమై యుండవచ్చును. రికెట్సు వ్యాధియందు యిది మిగుల గుణము నిచ్చునని డాక్టర్ కసోవిజ్ గారు చెప్పుచున్నారు; ఎముకలకు బలము చాలక, నిలు చుండుటకు గాని సరిగా గూర్చుండుటకు గాని శక్తిలే నట్టి బిడ్డలకు, దీని నొకటి రెండుమాసములు వాడుక చేయుటవలన పరుగెత్తుటకు గూడ శక్తి గలిగినట్లు వినుచున్నాము. 12 పానుల యెత్తుగల బిడ్డకు మోతాదు దినమునకు 1/120 గ్రె॥ మొ॥ 1/60 గ్రె॥ అయియున్నది. ఎముకలు విఱిగి యున్న విషయములలో అతుకును బొంద కున్నపుడు దీనివలన నుపయోగ ముండ గలదని కొందఱి యభిప్రాయమై యున్నది.

మొదటగా 1/80 గ్రె॥ కంటె నెక్కువగ నియ్యరాదు; దీనిని యిచ్చిన పిమ్మట దానియొక్క ఫలితములను గమనించు చుండ వలయును.

☞ ఫాస్ఫరస్ సంబంధ మగు పదార్థములు చల్లని ప్రదేశములో నుంచబడి, వెలుతురు దగుల కుండ నుంచ బడవలయును. ఫాస్ఫరస్, గాలిలో మండునట్టిది కాబట్టి దీనిని మాత్రలుగా జేయుట యందు బహు జాగ్రతను వహించి యుండ వలయును. ఫాస్ఫరస్, యెల్లో (పసుపువర్ణముగల) ఫాస్ఫరస్, రెడ్ (యెఱుపువర్ణము గల) ఫాస్ఫరస్, అని రెండువిధము లయి యున్నది. ఇందు యెల్లో ఫాస్ఫరస్ (Yellow Phosphorus) ను మాత్రలు చేయుటయం దుపయోగింతురు. ఇది గాలి తగులగనే తెల్లని పొగలు వెడలుచు మండును గావున, దీనిని నీటియం దుంచి బహు జాగ్రతతో దీసికొన వలయును. రెడ్ ఫాస్ఫరస్ (Red Phosphorus) మందులలో నుపయోగపడదు.

పిల్యూలా ఫాస్ఫొరీ (మార్టిన్ డేల్)—Pilula Phosphori (Martindale).

డాక్టర్ మార్టిన్ డేల్ గారి ప్రకరణము ననుసరించి తయారు చేయబడిన దీని యొక్క మోతాదు 1 గ్రె॥ మొ॥ 3 గ్రె॥

పిల్యూలా ఫాస్ఫొరీ (అఫీషియల్)—Pilula Phosphori (Official).

ఇంగ్లాండునందు అఫీషియల్ ఫార్మకోపియా ననుసరించి తయారు చేయబడిన దీనియొక్క మోతాదు 1 గ్రె॥ మొ॥ 2 గ్రె॥

ఫిల్యూలా ఫాస్ఫారిలో జేర్చి చేయబడు మాత్రలు అనేకములు గలవు; వాటిలో గొన్నిటిని యీక్రింద నుదహరించడ మయినది.

1. పిల్యూలా ఫాస్ఫారి కం ఫెర్రో — Pilula Phosphori cum Ferro.

పిల్యూలా ఫాస్ఫారి 1/50 గ్రే॥ లోహము (Ferrum) 3 గ్రే॥ — ఒక్కొక్క మాత్రయందు యీపాళ్లవంతున గలిసి యుండును.

2. పిల్యూలా ఫాస్ఫారి కం ఫెర్రో యెట్ నక్సు వామికా — Pilula Phosphori cum Ferro et Nux Vomica.

పైదానికి ప్రతి మాత్రకును ⅓ గ్రే॥ నక్సు వామికా యక్ట్రాక్టు కలియును.

3. పిల్యూలా ఫాస్ఫారి కం క్వినిన్—Pilula Phosphori cum Quinine.

పిల్యూలా ఫాస్ఫారి 1/50 గ్రే॥ క్వినిన్ 1 గ్రే॥

4. పిల్యూలా ఫాస్ఫారి కం క్వినిన్ యెట్ ఫెర్రో—Pilula Phosphori Cum Quinine et Ferro.

ఫిల్యూలా ఫాస్ఫారి 1/50 గ్రే॥ క్వినిన్ ½ గ్రే॥ లోహము 3 గ్రే॥

పైమాత్ర లన్నిటిని భోజనమయిన వెంటనే యొకటి చొప్పున బుచ్చుకొనవలయును.

అమ్మోనియా హైపోఫాస్ఫిస్ — Ammonia Hypophosphis.

తెల్లనైన స్ఫటికములవలెనుండి, గాలి తగులుటవలన ద్రవాకారమును వహించును; వెగటైన క్షారపదార్థముయొక్క రుచిని గలిగి యుండును; నరముల సంబంధమగు బలవర్ధకౌషధము; నీటిలో గలియును.

మోతాదు — 1 గ్రె॥ మొ॥ 6 గ్రె॥

కాల్సియై హైపోఫాస్ఫిస్ — Calcii Hypophosphis.

తెల్లనైన స్ఫటికములవలెనుండు క్షారపదార్థము; నీటిలో గలియును.

నరములకు బలవర్ధకౌషధము; సంభోగావయవములకు బలమును గలుగజేయును. క్షయవ్యాధియందు రాత్రిచెమటలను బోగొట్టును; మొటిమల నంతరింప జేయును.

మోతాను — 3 గ్రె॥ మొ॥ 6 గ్రె॥

## ఫెనాసిటిన్ — Phenacetin.

నిర్వర్ణమై నట్టిదియు, రుచిరహిత మైనట్టిదియు, వాసన లేనట్టిదియు, నై పలుకులుగ నుండును. జ్వరమును దగ్గించుటయందును నొప్పిని బొందకుండునట్లు చేయుట యందును బనిచేయును. 5 గ్రె॥ మొ॥ 10 గ్రె॥ వఱకు గల మోతాదులో జ్వరవేడిమిని క్షేమకరముగను నిశ్చితముగను తగ్గించును; దీనిని 8 గంటల కొకపర్యాయము నియ్యవచ్చును. కీళ్లనొప్పులు, తలనొప్పి, హిస్టీరియా — వీటియం దుపయోగించును. ఇన్ఫ్లూయంజా యొక్క ప్రారంభగతియం దిచ్చినయెడల తలనొప్పిని బోగొట్టి కాళ్ళయొక్కయు చేతులయొక్కయు నొప్పులను దగ్గించును. జ్వరగతియందలి జ్వరవేడిమిని సుమారు నాలుగుగంటల వఱకు తగ్గుదలయం దుంచును.

మోతాదు — 5 గ్రె॥ మొ॥ 10 గ్రె॥

---

## ప్లంబి ఆసిటస్ — Plumbi Acetas.

తెల్లనైనట్టియు, స్ఫటికాకారమును వహించినట్టియు, గుబురులుగా నుండును; దీనికి షుగర్ ఆఫ్ లెడ్ (Sugar of Lead)అను పేరుకూడగలదు. దీనికే అసిటేట్ ఆఫ్ లెడ్ (Acetate of Lead) అని కూడ అందురు. దీనియొక్క బలమైన సొల్యూషను క్రొత్త గాయముపైన గాని పుండుపైనగాని రాసినయెడల నిది పైన యొక పొరగా నేర్పడును; దీనియొక్క సాధువైన సొల్యూషనును పైన రాసినయెడల నచ్చటి రక్తనాళములను ముడుచుకొనునట్లు చేయును; ఈముడుచుకొనుటవలన యాస్థానమునకు రక్తప్రచారము హీనమై కురుపులు గాయములు బొబ్బలు మొదలగు వాటిలో నధిక స్రావములను దగ్గింపజేయును; ఈప్రకారము దురద తగ్గిపోవును. ఔన్సుజలమునకు 5 గ్రె॥ అసిటేట్ ఆఫ్ లెడ్ చేర్పబడిన సొల్యూషనును గనోరియావ్యాధియందు పిచికారీచేయుట కుపయోగింతురు.

లోనికి బుచ్చుకొనుటవలన శ్వాసకోశసంబంధ మగు స్రావములను దగ్గింపజేయును. దగ్గుటయందు రక్తమును గ్రక్కుకొను స్థితియందును, అతివిరేచనములయందును, గూడ బనిచేయును. ఇట్టి అస్వస్థతలయందు, ప్రతి రెండు లేక మూడు గంటలకు 2 గ్రే॥ మొ॥ 5 గ్రే॥ వఱకు నియ్యవచ్చును.

మోతాదు — 1 గ్రె మొ॥ 5 గ్రె॥ (సొల్యూషనుగా గాని మాత్రగా గాని).

☞ ప్లంబం (Plumbum) అనగా లెడ్ (సీసము) సంబంధమగు నౌషధములను విశేషముగ లోని కిచ్చుట వలనగాని గాయములు మొదలగు వానిపై నెక్కువగ బ్రయోగించుట వలనగాని యొకప్పుడు యింయ సంబంధమగు విషస్థితి సంభవింపవచ్చును; ఆకలి మందగించి, శుష్కించి, పాలిపోయి, మలబద్ధమేర్పడి, నాడి క్షీణత నంది, గుండెదెబ్బ నెమ్మదిని వహించి, ఉద్రితమైన శూలనొప్పి కలిగి, స్నాయువుల యందు నొప్పి ప్రవేశించి, యొకప్పుడు గ్రుడ్డితనము, చెవుడు, మత్తు, మూర్ఛ కూడ గలుగవచ్చును. పండ్లసమీపమున చిగుళ్లపై నీలవర్ణము గల గీర కనుపడ వచ్చును. దీనియొక్క విషస్థితివలన గర్భిణీస్త్రీలకు తఱచుగ గర్భస్రావము కలుగును.

దీనికి విరుగుళ్లుగ వాంతికారుల నిచ్చుచు, విరేచన మగుటకు మెగ్నీసియం సల్ఫేట్‌ను గాని సోడా సల్ఫేట్‌ను గాని యిచ్చుచు, చురుకుదనమును బుట్టించు ఔషధములను గూడ నియ్యవలయును.

---

## పోడాఫైలీ రెజైనా — Podophylli Resina.

ఈచెట్టుయొక్క యెండిన వేళ్లనుండి దీయబడిన జిగురుగలిగినట్టి పదార్థము; ఒడలిపైన దాకినయెడల రేగుదలను బుట్టించును; దీనిని నూరు నప్పుడు గలిగాడిధూళి యొడలిపై దగిలి పుండ్లను గలుగజేసి నేత్రములకు దురదను బుట్టించును.

దీనిని లోనికి బుచ్చుకొనుటవలన సాఫయిన నీళ్లవిరేచనములను గలుగ జేయును. పేగులయందలి గ్రంథులనుండి స్రావముల నధికపఱచును.

సామాన్యముగ విరేచనకారిగ బనిచేయు మోతాదు (1/8 గ్రె॥ మొ॥ 1/2 గ్రె॥) బహు నెమ్మదిగ బనిచేయును. ఒకప్పుడు 1/4 గ్రె॥ మాత్రమే కొద్ది గంటలలో విరేచనకారిగ బనిచేసి, మఱియొకరిలో 1/2 గ్రె॥ యిచ్చినను 10 మొదలు 14 గంటలవఱకును బనిచేయక, యింకొకరిలో అసలే పని చేయకపోవుటయు దటస్థించును. ఎర్రనికాంతి గలిగిన శరీరము గలవారలయందు యీ ఔషధము త్వరితముగ బనిచేయునట్లు చెప్పబడు చున్నది. పొడాఫైలిన్ యొక్క ఉపయోగమునందు — ముఖ్యముగా పరిశుభ్రమైనది కానట్టి రకము నుపయోగించుట వలన — మిగుల బాధను గలుగజేయును; సామాన్యలవణము (Common Salt) ను జేర్చుటవలన విరేచన గుణము బలీయమగును.

ఈఔషధము కార్జముపైనయును పేగులపైనయును గలుగజేయునట్టి గుణమును బట్టి, కార్జముయొక్కయు పేగులయొక్కయు అనేకము లగు నస్వస్థతలయం దిది యుపయోగించబడు చున్నది; కార్జము మాంద్యస్థితిని వహించి యున్న స్థితియందును, పట్టుదలతోగూడిన మలబద్ధమునందును, ½ గ్రె॥ చక్కగ బనిచేయును; దీనిని పెద్దమోతాదులలో నుపయోగించిన యెడల కార్జముపై బనిచేయదు; కార్జముయొక్క కార్యక్రమమునందు మార్పును గలుగజేయ వలె నన్న చిన్నమోతాదును మాత్రమే ఉపయోగించ వలయును. దీనియొక్క ఉపయోగము వలన గలిగెడి పేగులను మెలివేయు గుణమును బోగొట్టుటకుగాను దీనిని యక్ట్రాక్టు ఆఫ్ బెల డోనా తోగాని యక్ట్రాక్టు ఆఫ్ హాయొశామస్ తో గాని కలిపి యియ్యనగును.

మోతాదు — ¼ గ్రె॥ మొ॥ 1 గ్రె॥ (కాలోసింత్, అలోజ్ మొద లగు వాటితో సామాన్యముగ గలిపి యియ్యబడును.)

---

## పొటాసియం — Potassium.

పొటాసియం సంబంధమగు లవణము లన్నియు పెద్దమోతాదులలో నియ్యబడిన యెడల నిజమైన విషములుగ బనిచేయును. శ్వాసావయవములు, సుషుమ్న (Spinal Cord) నరములయొక్క మధ్యస్థానములు — వీటి నన్నిటిని బలహీనత నందజేసి గుండెయొక్క చురుకుదనమును అణగింపజేసి, దానియొక్క నడకను మాంద్యపఱచి, క్రమతనుగూడ దప్పింప జేయును; శరీరపు వేడిమియు తగ్గి ప్రచారమునందు బలము తగ్గిపోవును.

దీనియొక్క వాడుకను గొన్నిదినములవఱకు విడువకుండ నడపిన పిమ్మట, రక్తము పల్చ నయినదియు నిస్సార మైనదియు నయి, శరీరమునందు వ్యాపించి యుండెడి క్రొవ్వుపదార్థము అంతర్గ్రాహ్య మగుటచే శరీరముయొక్క బరువు తగ్గిపోయి, జీర్ణావయవములయొక్క స్వస్థత చెడిపోయి, పెద్దమోతాదు లైనచో జీర్ణాశయము యొక్కయు పేగుల యొక్కయు స్నాయుసంబంధ మగు పొరలకు పక్షవాతస్థితిని గలుగ జేయును. కొద్దిమోతాదులలో నైనచో నీ లవణములు రక్తకణముల యందలియు స్నాయువుల యందలియు జీర్ణభాగములను బూరి పఱచుటచే, శరీరమునకు బలమును గలుగజేయును. పొటాసియం సంబంధమగు నీ లవణములు దళమయిన అల్లికలయందు నిలువ యుండును; సోడియం సంబంధ మగు లవణములు శరీరమందలి ద్రవపదార్థములతో గలిసి యుండును. ఈ లవణము

లలో ననేకములు మాత్రప్రకోపకారులుగను, సూక్ష్మమగు విరేచనకారులుగను, బనిచేయును. పొటాసియం సంబంధ మగు లవణములు త్వరితముగ రక్తము నందు గలియును; సోడియం లవణములు అట్లు కానేరవు, పొటాసియం లవణములు పైత్య స్రావము నధిక పఱచును. పొటాసియం లవణములు గుండెకాయను మెద డును సిరస పఱచునట్టి గుణములు గలిగి యున్నవి గావున, దీర్ఘకాలము వాడుక జేయు నవసరము గలిగియున్న విషయములలో సోడియం లవణములనే ఉపయోగించ వలయును.

ఈ లవణములు (క్షార పదార్థములు) జీర్ణాశయమునందు జేరగనే చురుకుదన మును గలుగ జేసి, భోజనపూర్వ మియ్యబడిన విషయములయందు జాఠరరసము యొక్క స్రావము నధిక పఱచవచ్చును; ఈ కారణమున తేప్పులతో గూడియున్న అజీర్ణవ్యాధియందిది ఉపయోగకారి యగుచున్నది. ఈ క్షారపదార్థము లన్నియు అమ్ల (Acid) సంబంధమగు స్రావముల నధిక పఱచి క్షారహిత మగు స్రావములను అపు చేయును.

రేగుదలతో గూడియున్న అజీర్ణవ్యాధియందు అమ్లస్రావములతో జేరి వాటి యొక్క సత్తువను బ్రతిహత పఱచుటచే మిగుల నుపశమనమును గలుగజేయును.

కాస్టిక్ పొటాష్ — Caustic Potash.

గట్టియై నట్టియు, తెల్లనై నట్టియు, గాలినుండి చెమ్మను ఆకర్షించు కొను నట్టియు, పుడకలుగా గాని బిళ్లలుగా గాని యుండును. దీనిని బ్రయోగించిన స్థల మందు అచ్చటి అల్లికలను నాశనము చేసి పక్కును గట్టునట్లు చేయును. ఇది లోతైన నట్టియు విశాలమై నట్టియు ప్రదేశమునకు వ్యాపించు గుణమును గలిగియున్నది. కావున దీనిని సున్నితమై నట్టిగాని జీవాధారమైనట్టిగాని అవయవములకు సమీప మున బ్రయోగించుట మంచిది కాదు. దీనియందు ప్రాకుదల నొందు గుణము కలదు. కావున దీనిని వేయదలచుకున్న స్థానమునకు చుట్టును పలాస్త్రీని దేని నైనను వేసి యిది ప్రయోగింపబడు స్థానమును ముందుగా నిర్ధారణ పఱచుకొనుట మంచిదై యున్నది.

ఏదైనను ఉపరిభాగము మాత్రమే నశింపు నందజేయవలె నన్న నీ కణికను కొద్దిసేపు మాత్రమే అంటించి చెమ్మను లాగి వేయుటకుగాను పైన అద్దుడు కాగిద మును దగిలించవలయును; లేనిచో ననుకొనిన దానికంటె నెక్కువ లోతుగ నీ పక్కు గట్టుట యేర్పడగలదు. అనారోగ్యకర మగు నానుడు కురుపులకు దీనిని బ్రయోగిం చుటవలన గుణ మియ్యగలదు. దీనిని లోని కిచ్చుట కుపయోగించరు.

## లైకర్ పొటాస్—Liquor Potassae.

ద్రవపదార్థము; 1 ఔన్సునందు 27 గ్రెయినుల కాస్టిక్ పొటాష్ ఉండును; నిర్వర్ణమై యుండును; దీనిని నీటిలో గలుప కుండ లోని కిచ్చినయెడల నది తాకినట్టి భాగములయందు పొక్కునట్లు చేయును. సోరియేసిస్ మొదలగు చర్మ వ్యాధులయందు దీనిని 8 రెట్లు నీటిలో గలిపి పైన రాయనగును; దురదతో గూడి యున్న చర్మవ్యాధులయందును దురదను అణచివేయుటకును నుపయోగింతురు.

లైకర్ పొటాస్‌ను లోనికి దీసికొనినప్పుడు ఇది త్వరితముగనే రక్తమునందు బ్రవేశించును; కాని, యింతకు పూర్వమే జీర్ణాశయమునందలి ఆమ్లస్రావమునకు బ్రతిహతముగ బనిచేసి ఆమ్లస్థితిని బోగొట్టును.

ఆమ్లస్థితిని బోగొట్టునట్టి దీనియొక్క గుణమును బట్టియే రేగుదల నందియున్న అజీర్ణవ్యాధియందు గాని మూత్రముయొక్క ఆమ్లస్థితియందుగాని, యుపయోగింతురు; కాని యీ ఆమ్లస్థితులను దగ్గింపు నందునట్లు చేయుటకు వలయు మోతాదుల నిచ్చుటవలన జీర్ణాశయము కలతనొందుట యేర్పడును గాన, నిందులకై పొటాసియం బైకార్బనేట్‌ను గాని పొటాసియం సిట్రేట్‌ను గాని యిచ్చినయెడల జీర్ణాశయము వీటిని తక్కువ శ్రమతో భరింపజాలును. రొమ్ముపడిసెము (Bronchitis) నందలి స్రావము నధికపఱచుట యందును ద్రవపఱచుట యందును లైకరు పొటాస్ పని చేయును; ఇంతియకాక కీళ్లనొప్పుల యందును, గౌట్ వ్యాధి యందును దీనిని దఱచుగ నుపయోగింతురు. ఇది కొంతవఱకు మూత్రప్రకోపకారిగ బనిచేయును; కాని, పొటాసియం కార్బనేట్, పొటాసియం సిట్రేట్,—వలె నిది యంతగా మూత్రముయొక్క ఆమ్లస్థితిని తగ్గించుట కుపయోగించదు. అయినను మూత్రమునందలి సారజనక సంబంధమగు పదార్థములను హెచ్చింప జేయును. క్రొవ్వు పదార్థము విశేషమై యెక్కువ స్థూలశరీరులుగ నుండిన మనుష్యులకు లావు తీయుటకు గాను దీని నుపయోగింతురు.

మూత్రాశయముగాని మూత్రద్వారముగాని వాటిమార్గమున ననారోగ్యహితమగు మూత్రము ప్రవహించుట వలన బొందెడి రేగుదల నణచివేయుటకు గాను లైకర్ పొటాస్ ప్రత్యేకమైన యుపయోగ ముండినటుల గనబడు చున్నది; కాని యీ గుణము నందు పొటాస్ బైకార్బనేట్ నకును పొటాస్ సిట్రేట్ నకును యీ ఔషధము రెండవ పక్షముగ మాత్రమే యుపయోగింప నగును.

భోజనపూర్వము వృక్షసంబంధమగు బలవర్ధకౌషధములతో దీనిని చిన్న మోతాదులలో నిచ్చినయెడల జీర్ణాశయము నందలి జాఠరరసము యొక్క స్రావము నధిక పఱచును.

మోతాదు— 10 మి॥ మొ॥ 30 మి॥ (విరివిగ నీటిలో గలుపబడి)

పొటాస్ అసిటస్; పొటాస్ సిట్రస్; పొటాస్ టార్టరస్ — Potass Acetas, Potass Citras, Potass Tartras.

ఈలవణములు సామాన్యమోతాదులలో (షుమారు 30 గ్రె॥) రక్తమునందు త్వరితములో మిశ్రిత మగును. పొటాసియం లవణములను గలిగియుండెడి అన్ని అల్లికలకును స్నాయువులకును రక్తప్రచారమార్గమున నీ లవణములు వ్యాపింప జేయబడి వాటికి బలమును గలుగ జేయును; మూత్రగ్రంథులకు జేరుటలో నధికభాగము మూత్రముగుండ వెలువరింపబడును. ఈలవణములు మూత్రమునుండి వెలువరింపబడుటకు పూర్వము మూత్రము యొక్క ఆమ్లస్థితిని బోగొట్టును. ఈలవణములకు అంతర్భాగములను పాడ్యనట్లు చేయు గుణము లేదు కావున విరివియగు మోతాదులలో నుపయోగించినను నుపయోగించ వచ్చును.

ఈవిధముగ మూత్రము ననేకవారముల వఱకునుగూడ క్షారసహితముగ నుండునటుల జేయుటవలన, మూత్రకృచ్ఛ్రములను గరగింప జేయుటనుగాని లేక వాటిని పరిమాణమునందు తగ్గింప జేయుట వలన మూత్రద్వారము గుండ వెలువరింప జేయుటనుగాని, చేయును. ఆరోగ్యస్థితియందు ఈ లవణములు మూత్రము యొక్క పరిమాణమును వృద్ధి నందింప జాలవు.

పెద్ద మోతాదులలో (2 డ్రా॥ మొ॥ 4 డ్రా॥) నీ లవణములు నీటిలో గలిపి పుచ్చుకొనబడినయెడల సాధువిరేచనకారులుగ బనిచేయును. ఈమోతాదులలో చెమటను బుట్టించి జ్వరమునుగూడ తగ్గించును. జ్వరస్థితియందు రక్తము నందలి యేలోపమువలన జ్వరము కలుగుచున్నదో అట్టి కారణలోపమును తొలగింప జేయుట యందుగాని సాధుపఱచుట యందుగాని యీలవణములు బహుశః పనిచేయు చున్నవని కొందఱిచే నమ్మబడు చున్నది.

కీళ్లనొప్పులు తీవ్రస్థితియం దుండినపుడు యీలవణములు గుణసహితములై యున్నవి; రక్తముయొక్క క్షారస్థితిని అధికపఱచుటచే కీళ్లనొప్పుల సంబంధ మగు విషము యొక్క ఫలితములను నివారింపజేసి, యీ విధముగ శరీరపువేడిమిని తగ్గించియు వ్యాధియొక్క స్వస్థతను గలుగజేసియు, బనిచేయును. ఈలవణముల యొక్క

ఆమ్లవ్యతిరేకమగు గుణములనుబట్టి మాత్రమే యీవ్యాధియందు హితము గలుగుచున్న దని యెంచరాదు. ఇంతవఱకు తెలియరాని, యీలవణములవలన గలుగు నెవ్వియో యితరమార్పుల వలనను, నీవ్యాధియందు సుగుణము గలుగుచున్నదని తెలియదగి యున్నది.

పైనజెప్పబడిన మూడు పొటాసియం లవణముల యందును, పొటాసియం అసిటేట్ యెక్కువ నిశ్చితముగ చెమటను బుట్టించి జ్వరమును దగ్గించును; పొటాసియం సిట్రేట్ యెక్కువ నమ్మకమైన మూత్రప్రకోపకారియై యున్నది; పొటాసియం టార్టరేట్ నిర్ణీతముగ జెప్పదగు విరేచనకారియై యున్నది. జీర్ణాశయము రేగుదల నంది యున్న స్థితియందు, పొటాసియం కార్బనేట్‌ను గాని పొటాసియం బైకార్బనేట్‌ను గాని నీటిలోఁ గలిపి, దీనికి నిమ్మరసమును జేర్చి, పొంగుచున్న నీద్రవపదార్థమును ద్రాగిన మీదట, శాంతి కలుగును; ఇట్లు త్రాగిన మీదట నిందుమూలమున జీర్ణాశయమునందు పొటాసియం సిట్రేట్ యేర్పడును; ఈరీతిని యియ్యబడిన పొటాసియం సిట్రేట్ జీర్ణాశయమునందు స్వస్థతను గలుగ జేయును. ఇంతియేగాక, నిందువలన నుద్భవించెడి అంగారక్షార వాయువు జీర్ణాశయమునందు రేగుదల నంది యున్న ఆమసంబంధ మగు పొరలయొక్క నొనసరములపై దాకుటవలన గొంతవఱకు గుణమును గలుగజేసి యుండును. శరీరమునందు పొటాసియం లవణము యొక్క లోపము వలన గలుగు చున్నదని నమ్మబడెడి స్కర్వీవ్యాధి యందు, యీలవణముల (ముఖ్యముగా సిట్రేట్ ను) నుపయోగింప నగునని కొందఱు డాక్టరులు అభిప్రాయము నిచ్చి యున్నారు.

పైన జెప్పబడిన పొటాసియం బైకార్బనేట్ నిమ్మరసములకు కొంచెముగా లైకర్ మార్ఫియా హైడ్రోక్లోర్ ను గూడ జేర్చి యిచ్చినయెడల, శరీరము వేడిమిని వహించి ఆరుదలస్థితియం దుండి, దగ్గు ఊపిరితావస్థయందుండి, నాలుకపై అట్టకట్టి యుండిన, క్షయవ్యాధియందు మిగుల నుపయోగకారిగ నుండగలదు.

మూత్రముయొక్క ఆమ్లస్థితిని బోగొట్టి దానిని చాల కాలము క్షారసహితముగ నుంచవలసిన యెడల, పొటాసియం సిట్రేట్ నే మనము ఉపయోగించవలసి యుండును; ఏలయన, యిది రక్తమునందు నే విధ మగు లోపమును గలుగ జేయకుండ, దానియొక్క దీర్ఘోపయోగము వలన జీర్ణస్థితికిని నెట్టి భంగమును గలుగ జేయకుండ, నుండును.

పొటాస్ అసిటస్ యొక్క మోతాదు — 10 గ్రా॥ మొ॥ 60 గ్రా॥; 1 సం॥ వయస్సుగల బిడ్డకు 1 గ్రా మొ॥ 3 గ్రా (మూత్రప్రకోపకారి; సాధువిరేచనకారి)

పొటాస్ సిట్రిస్ యొక్క మోతాదు — 10 గ్రా॥ మొ॥ 40 గ్రా॥
(జ్వరమును దగ్గించి, చెమటను బుట్టించి, సాధువిరేచనకారిగ బనిచేయును.)

పొటాస్ టార్టరస్ యొక్క మోతాదు — 30 గ్రా మొ॥ 240 గ్రా॥
(నీళ్లవిరేచనము లగు నట్లు చేసి, మూత్రప్రేరోపకారిగ బనిచేయును.)

## పొటాస్ కార్బనస్ — Potash Carbonas

దీనయొక్క ఉపయోగము లైకర్ పొటాస్‌ను బోలియే యుండును; దీనిని లోనికి దీసికొనుటవలన గొంతవఱకు పాక్కగుణమును గలిగి యున్నది. ఒక పెద్ద మోతాదు నిచ్చుటవలన, కాస్టిక్ పొటాష్ వలె గాని లైకర్ పొటాస్ వలె గాని యంతగా దుష్ఫలితమును గలుగజేయకున్నను, దాని స్పర్శకు వచ్చునట్టి అల్లికల నన్నిటిని నశింపజేసి మరణమును గలుగ జేయును. దీనిని మందులలో సామాన్యముగ నుపయోగించరు. దీనియొక్క రేగుదల గుణము లేకుండగ మంచి గుణములను మాత్రమే గలిగియున్న పొటాసియం బైకార్బనేట్‌ను లోని కిచ్చుట కుపయోగింతురు.

దీనికి సాల్ట్ అఫ్ టార్టార్ (Salt of Tartar)అను పేరుకూడ గలదు. సమానమైన యెత్తుగల నీటిలో గలియును.

మోతాదు — 5 గ్రా॥ మొ॥ 20 గ్రా॥

## పొటాస్ బైకార్బనస్ — Potass Bicarbonas.

నిర్వర్ణమైన స్ఫటికముల వలె నుండును; 4 రెట్ల బరువు గల నీటిలో గలియును. పొటాసియం సంబంధ మగు నౌషధముల కన్నిటి కుండెడి గుణములు యీ లవణమునం దొక్కదానియందే యున్నవి. ఇది సాధువుగ నామ్లనివర్తిని జేయును; కొద్ది మోతాదులలో నిచ్చిన యెడల, భోజనపూర్వము జాఠరరసముయొక్క స్రావమును వృద్ధిపఱచి, త్రేపులతోగూడి యుండిన అజీర్ణములయందు బనిచేయును. బాధతో గూడిన జీర్ణాశయసంబంధ మగు నస్వస్థతలయందు, అనగా భోజనానంతరము ఆమ్లహితమైనట్టియు కారముతో గూడి నట్టియు జీర్ణాశయస్రావములు కలుగు నప్పుడు, దీనిని పెద్దమోతాదులలో వాడుక చేసినయెడల అమ్లస్వభావమును బోగొట్టి శీఘ్రమైన స్వస్థతను గలుగ జేయును; ఇట్టి సందర్భములలో దీనిని దఱచుగ నుపయోగించుటవలన నిలుకడైన లాభము గలుగు విషయమై నిశ్చయము లేకున్నది. అధిక మగు అమ్లస్రావసంబంధము కానట్టి కడుపు నొప్పియందు,

బహుశః పొటాస్ బైకార్బనస్ యొక్క విచ్ఛేదము వలన జీర్ణాశయమునం దుద్భవించెడి అంగారక్షారవాయువు యొక్క స్పర్శవలన గొంత ఉపశాంతి కలుగగలదు.

పొటాస్ బైకార్బనస్, రక్తము నధిక క్షారసహితముగచేసి, మూత్రగ్రంథులకు చురుకుదనమును బుట్టించుటచే అంగారక్షారసంబంధ మగు వ్యర్థ పదార్థములను మూత్రముగుండ వెలువరింప జేయును. ఇంద్రియమూత్రమార్గప్రదేశముల యొక్క ఆమసంబంధ మగు పొరలపై నిది గతింపు నొందుట వలన నచ్చటి నరములను బండబారునట్లు చేయుటచే, నొప్పిని దగ్గించుట వల్లనైనను, లేదా - మూత్రస్థితిని రేగుదల లేకుండ జేయుటవల్లనైనను, సెగవ్యాధి మొదలగు వాటియందలి వాపుదలప్రదేశములకు శమనమును గలుగ జేయును. మూత్ర మిదివఱకే క్షారసహితమై, క్రుళ్లు స్థితియందుండి, మూత్రాశయమునందు నవాసారమిశ్రపదార్థములను యేర్పఱచి, రేగుదలను గలుగజేయు విషయములయందు, పొటాసియం లవణముల నుపయోగించిన యెడల హానిని గలుగ జేయవచ్చును. యూరిక్ ఆమ్లము యొక్క విశేషపరిమాణము నిలువ యుండుటచే గలిగిన రేగుదల యైనచో పొటాస్ బైకార్బనస్ ఉపశాంతిని కలుగ జేయును.

ఉద్రిక్తస్థితిని వహించి యున్న కీళ్లనొప్పులయందు క్షారపదార్థము లెంతవఱకు బనిచేయు ననెడి విషయమై విశేషభిన్నాభిప్రాయ ముండి యున్నది, ఈ చికిత్సా పద్ధతివలన వ్యాధియొక్క కాలపరిమితి తగ్గింపు నందుననెడి విషయము రుజువు కాక పోయినను, యీ అస్వస్థతయందు వీటియొక్క ఉపయోగము వలన నిజమయిన ఉపశాంతి గలుగు చున్నదని యందఱును యొప్పుకొనిన యంశ మైయున్నది.

కీళ్లు వాపునందియున్న స్థితియందును, దీర్ఘవ్యాపిత మగు కీళ్లనొప్పుల యందును, సోడియం బైకార్బనేటును పొటాసియం అయొడైడ్ తో జేర్చి ఉపయోగించి నందువలన గుణము కనుపడి యున్నది.

ఈ క్షారపదార్థములను ఔషధమోతాదులయందు చాలకాలము వఱకు నుపయోగించిన యెడల రక్తముయొక్క గుణమునందు నష్టసూచక మగు మార్పు కలిగి శరీరముయొక్క తూకము తగ్గిపోవును: ఈ విధముగ, నేవ్యాధికొఱకైన యీ మందు లుపయోగింప బడినవో ఆవ్యాధి నెమ్మదించిన పిమ్మట, మాంద్యతతో గూడిన అస్వస్థతావస్థ శరీరమునందు బ్రవేశింపవచ్చును.

పొటాసియం బైకార్బనేట్ను వాడుకచేయువిధములలో నుత్తమమైన పద్ధతి 25 గ్రె॥ మొ॥ 30 వఱకుగల యీ లవణమును ½ ఔన్సు నిమ్మరసములో జేర్చి

యిచ్చుట—అయి యున్నది. నిమ్మరసమునకు బదులుగా సిట్రిక్ ఆసిడ్ ను ఉపయోగించ వచ్చును గాని, స్వాభావసిద్ధమైన యీ నిమ్మరసమే యెన్నబడ దగి యున్నది.

మోతాదు — 5 గ్రా॥ మొ॥ 30 గ్రా॥

పొటాస్ క్లోరస్—Potass Chloras.

నిర్వర్ణమైన పలుకులుగ నుండును; 16 రెట్లు తూనికగల జలములో గలియును; సామాన్య మగు పెద్ద మోతాదులో (20 గ్రా॥) నిది మూత్రగ్రంథులకు జురుకుదనమును గలుగజేసి, కొంతభాగము మూత్రముగుండా వెలువడును; విషముగ వర్తించు మోతాదులలో (1 ఔన్సు) మూత్రగంథులయందు రక్తమును గూడుకొనునట్లు చేసి, ముందుగా రక్తవర్ణమైన మూత్రమును వెలువరింపజేసి, పిమ్మట మూత్రమును బంధింపజేయును; రక్తమునందు గలుగు మార్పులచే కొద్ది గంటల కాలము లోపలనే మరణము సంప్రాప్తము కావచ్చును.

అనారోగ్యస్థితియం దున్న ఆమస్థానముల యందు యిది చేయునట్టి మంచిపనిని బట్టియే వైద్యమునం దిది ఉన్నతస్థానమును వహించు చున్నది. నోటియందును గొంతునందును తెల్లని పొక్కులు లేచియున్నస్థితిలో మెత్తనై యున్న పంటిచిగుళ్లకు దీనియొక్క సొల్యూషనును రాసినయెడల గుణము కనుపడును; గవదకాయలు వాపుదల నందియున్న స్థితియందును, సప్తపథ (Pharynx) యొక్క ఆమప్రదేశము వాపుదల నొందియున్నపుడును గూడ, పంటిచిగుళ్లకు దీనియొక్క సొల్యూషనును రాయుట వలన గుణము నిచ్చును. ఈ ఉపయోగము శారీరశాస్త్రసంబంధమగు నేమార్పులవలన గలుగు చున్నదియు జెప్పుటకు వీలుగాకున్నది. గవదకాయలయొక్క ఉమ్రత మగు వాపుదలయందు దీనిని గండూషముగ నుపయోగించిన యెడల స్వచ్ఛమైన గుణము కనుపడును; కాని, దీనిని జాలకాల ముపయోగించుట వలన నొకవిధమగు రేగుదల యేర్పడును; ఈ రేగుదలను మాన్పుటకుగాను యీ గండూషమును నిలిపివేయవలసి యుండును. దీనియొక్క ఉపయోగము వలన నోటియందలి ఉమ్మిని స్రవింప జేసెడి గ్రంథులయొక్క చురుకుదనము క్రమపఱచబడును; స్రావము తక్కువగ నుండినయెడల నధికపఱచి, అత్యధికముగ నుండినయెడల సాధుపఱచి, స్వస్థపఱచును. రససంబంధమగు ప్రయోగముల వలన గలిగెడి హానివలన ఉమ్మియం దధికస్రావము గలుగుట తటస్థించిన యెడల నిది మిగుల ఉపయోగమగు బనిని చేయునని చెప్పబడుచున్నది.

ఒక ఔన్సు జలమునందు 6 గ్రా॥ పొటాస్ క్లోరస్‌ను గలిపి అనారోగ్యహితమగు కురుపులను బుడ్లను గడుగుట కుపయోగింప నగును; మూత్రాశయము యొక్క దీర్ఘమగు వాపుదలల యందు దీనిని లోనికి యింజక్టుచేసినయెడల మంచి చురుకుదనమును బుట్టించును. చెంపలు, నాలుక, పంటిచిగుళ్లు—వీటిపై లేచెడితెల్లని పొక్కులకు యీలవణము యొక్క పొడిని బ్రయోగించిన యెడల, నయము కలుగును. స్వరపేటిక, శ్వాసనాళములు—వీటియొక్క దీర్ఘాస్వస్థతల యందు యీ లవణము యొక్క చిన్న ముక్కలను చప్పరించిన యెడల, అరోగ్యహితమగు ఆమమును స్రవింప జేసి, వెలువడునట్టి తెమడను అధికముగ ద్రవపఱచి తక్కువజిగురుగ నుండునట్లుజేసి, త్వరితముగ వెలువరింప జేయును.

ఇది శరీరమునందు జీర్ణతనంది రక్తమునందు బ్రవేశించినపిమ్మటగూడ తక్కిన ఆమప్రదేశముల యందు—ముఖ్యముగ పేగుల సంబంధ మగు ఆమప్రదేశముల యందు యిదేవిధమగు చురుకును బుట్టించునట్టియు, క్రమతను గలుగ జేయునట్టియు మార్పులను గలుగజేయును. బిడ్డలయందు జీర్ణకోశముయొక్క అనగా నోటియొద్దనుండి ఆసనము వఱకును—ఆమసంబంధ మగు పొరలు అనారోగ్యహితమగు వాపుదలల నందినప్పుడు యీ ఔషధము మిగుల నుపయోగించినట్లు డాక్టరు విట్లాగారు చెప్పుచున్నారు.

ముక్కు వెంబడి రక్తము స్రవించినపుడును, యితర రక్తస్రావములందును నిది యుపయోగించునని డాక్టర్ హార్కిన్‌గారు చెప్పుచున్నారు; పాడియావుల పైన నియన చేసియున్న శోధనలచే, దీనియొక్క ఉపయోగమువలన పాలయొక్క పరిమాణ మధికమగు ననియు నియన చెప్పుచున్నాడు.

ఈ క్రింది ఔషధయోగము బాగుగ పనిచేయును.

| | | |
|---|---|---|
| పొటాస్ క్లోరస్ | ... | 2½ డ్రా॥ |
| టింక్చర్ ఫెర్రియి పెర్ క్లోర్ | | 2 డ్రా॥ |
| గ్లిసరీన్ | ... | 5½ డ్రా॥ |
| జలము | ... | 12 ఔన్సులు. |

ఇవన్నియు బాగుగ గలిపి 1 ఔన్సుమోతాదులో దినమునకు మూడుసారు లుపయోగించబడును.

మోతాదు—5 గ్రా॥ మొ॥ 15 గ్రా॥

## పొటాస్ నైట్రిస్ — Potass Nitras.

దీనికి నైటర్ (Nitre) అనియు, సాల్టుపీటరు (Saltpetre) అనియు వేఱు నామములు గలవు. దీనికి తెలుగులో సూరేకారము అందురు. మెఱయునట్టియు పొడుగైనట్టియు, స్ఫటికములవలె నుండును. ఇది బహు చురుకైన పదార్థము; శీఘ్ర గతిని రక్తమునందు బ్రవేశించి, రక్తకణములయొక్క స్వభావమును మార్పుజేసి, వాటికి ప్రాణవాయువును గొంపోవు శక్తిని పోగొట్టును. గుండెపై నిది బనిచేయుటచే దానియొక్క నడకను నెమ్మదిపఱచును; ఇంకను నధికముగ దీని నుపయోగించిన యెడల, గుండెయొక్క దెబ్బను త్వరితపఱచి, నీరసతనుగూడ జెందజేసి, చిట్టచివరకు గుండెయొక్క కార్యక్రమమును నిలిపివేయును. దీనియొక్క అతిశయోపయోగము నందు జీర్ణకోశముపై ఉద్రిక్తమగు రేగుదలను బుట్టించి విశేషముగ వాంతులను విరేచనములను గలుగజేసి మరణముకూడ తటస్థింపవచ్చును.

మూత్రగ్రంథులగుండ నీ లవణము వెలువరింప జేయబడుటయందు మూత్ర ప్రకోపకారిగ బనిచేయును. ఇది యొడలిపై బనిచేయుటలో స్వేదమును బుట్టించుచు, పరుండబోవు ముందర దీని నుష్ణజలములో వేసి పుచ్చుకొనిన యెడల స్వేదము నధికముగ బుట్టించును. ఒక ఔన్సు బ్రాందిని 4 ఔన్సుల ఉష్ణజలముతో గలిపి, 2 డ్రాముల చక్కెరను, 30 గ్రె॥ పొటాస్ నైట్రిస్‌నుగూడ గలిపి యిచ్చినయెడల జ్వరావస్థతలయందు స్వేదము నధికపఱచి, నాడిని కొద్దిగ మాంద్యతను వహింప జేసి, శరీరవేడిమినిగూడ కొంచెముగ తగ్గింపజేయును. జీర్ణాశయముగాని పేగులుగాని మూత్రగ్రంథుల సంబంధమగు నవయవములుగాని వాపుదల నందియున్న స్థితి యందు దప్ప, దక్కిన యన్ని వాపుదలల యందును యీలవణము చెమటను బుట్టించునదిగను మూత్రప్రకోపకారిగను బనిచేయును. శ్వాససంబంధమగు నస్వస్థతల యందు, శ్వాసనాళముగాని శ్వాసమార్గమందలి పెద్దభాగము లేదైనగాని రేగుదలనుగాని వాపుదలనుగాని పొందియున్నపుడు నమ్మకముతో నియ్యదగిన కఫమును వెలిబుచ్చునట్టి యౌషధమై యున్నది. అద్దుడు కాగితమువలెనుండి బిబ్యులస్ పేపర్ (Bibulous Paper) అన బడెడి దానిని పొటాస్ నైట్రిస్ యొక్క బలమైన సొల్యూషనులో దడిపి, రోగి పరుండియుండెడి గదిలో మెల్లగా గాల్చిన యెడల దానియొక్క పొగవలన ఉబ్బసపు దగ్గునకు ఉపశాంతిగ నుండునని యెంచబడు చున్నది.

మోతాదు — 5 గ్రె॥ మొ॥ 20 గ్రె॥

---

## పొటాస్ పర్మాంగనస్ — **Potass Permanganas.**

నల్లనైనట్టియు గొంచెము యెరుపువర్ణము గలిగినట్టియు సన్ననైనట్టియు పలుకులుగా నుండెడి ఘనపదార్థము; నీటిలో గలిపినయెడల యెఱ్ఱనివర్ణము తేలును. దీనియందుండెడి ప్రాణవాయువు, దుర్వాసనగల వాయువులతోడను ద్రవపదార్థములతోడను గలిసి నిరపాయకరమగు మిశ్రపదార్థములుగ నేర్పడి, యివ్విధముగ దుర్వాసనను బోగొట్టునదిగ బని చేయుచున్నది. ఇదే విధముగ వ్యాధియొక్క అంకుర జీవములను నశింపు నందజేసి, కుళ్ళకుండ జేయునదిగ బరిణమించుచున్నది. పంటిచిగుళ్లు, నోరు, గొంతు — వీటి సమీపమున నుండు దుర్వాసనతోగూడిన పుండ్లకు నుపయోగమయినట్టియు నసహ్యము కానట్టియు గండూషముగ జేయుటకు **2** గ్రా॥ లను **10** ఔన్సుల జలములో గలిపి ఉపయోగించ నగును. చీముపట్టిన పుండ్లను గడుగుటకు గూడ దీని నుపయోగించ వచ్చును. కొఱుకు సంబంధ మగు వ్యాధులలో మాంసమును హరించు చుండు నట్టి పుండ్లయందు, దీనిని మెత్తని పొడిగా నుపయోగించుట వలనగాని, **1** డ్రాము పొటాస్ పర్మాంగనస్‌ను **6½** ఔన్సుల జలములో గలిపి యీ సొల్యూషనుతో గడుగుట వలనగాని, ఉపయోగముగ నుండును. **2** ఔన్సుల జలమునందు **1** గ్రా॥ ను గలిపి కాలినస్థలములను గడుగుట కుపయోగించును.

గనోరియా (సెగ) వ్యాధియందు దీనిని **1** ఔన్సు జలమునకు **½** గ్రా॥ నును గలిపి పిచికారీ చేయుటవలన మిగుల నుపయోగకారి యై యున్నది; ఈ వ్యాధి ముదరి ఆమసంబంధ మగు స్రావము కలుగుచున్నపుడు **1** ఔన్సు జలమునందు **1** గ్రా॥ ను గలిపి పిచికారీ చేయువలయును.

ఋతుస్రావము తగ్గుదల నంది యున్నపుడు **2** గ్రా॥ ను మాత్రగా జేసి యిచ్చుట వలన నుపయోగ ముండగలదు.

పాము కఱచి నప్పుడు, వెంటనే కఱచిన స్థలమునందు గీరి, కొంచెముగా దీని నుపయోగించిన యెడల, నెమ్మది నందగలరు.

నూతులలో నీటిని పరిశుభ్రపఱచుటకుగాను దీనిని గలుపుదురు.

దీనిని మాత్రగా జేయుటయందు బహుజాగ్రతను వహించి యుండవలయును. దీనిని మాత్రగా జేయునప్పుడు వృక్షసంబంధ మైనట్టిగాని జంతుసంబంధ మైనట్టి గాని పదార్థములతో గలియ నియ్య గూడదు; అట్లు గలిసినచో దీనియందుండెడి

ప్రాణవాయువు బయలు వెడలి దీనియొక్క యౌషధగుణము నశించిపోవును. సాఫ్టు పారఫిన్ (Soft Paraffin) హార్డు పారఫిన్ (Hard Paraffin) —మాత్రల జేయుటయందు వీటి నుపయోగింప నగును. నీమసున్నపు పొడిని పైన మాటుగ బెట్టవచ్చును.

మోతాదు 1 గ్రె॥ మొ॥ 3 గ్రె॥

పొటాసియం అయొడైడ్—Potassium Iodide.

నిర్వర్ణమై స్ఫటికములుగ నుండును. దీనియొక్క ఉపయోగమునకై అయొడిన్ క్రింద జూడవలయును. కొఱుకువ్యాధియందు దీని యుపయోగము ముఖ్యమైయున్నది.

మోతాదు—5 గ్రె॥ మొ॥ 20 గ్రె॥

లినిమెంట్ పొటాసి అయొడైడ్ కం సెపొని—Liniment Potassi Iodidi. cum Sapone.

వెన్నవలె నుండును; ఇందు గ్లిసరీన్, పొటాసియం అయొడైడ్, సోప్—కలిసి యుండును; ఇందులో 10 వ భాగము పొటాసియం అయొడైడ్ ఉండును.

కొఱుకు సంబంధ మగు చర్మవ్యాధులకు పైన రాయుట కుపయోగింప నగును; చర్మమునకు రంగు కా నియ్యదు.

అంగ్యుయెంటం పొటాసి అయొడైడ్—Unguentum Potassi Iodidi.

దీనియందు 10 వ భాగము పొటాసియం అయొడైడ్ ఉండును; దీనిలో బెంజోయేటెడ్ ల్యార్డు కలియును. తెల్లగ నుండును; దీనికిని లినిమెంట్ ఉపయోగమే అయి యున్నది.

---

## పొటాసియం బ్రొమైడ్ – **Potassium Bromide.**

నిర్వర్ణమైన స్ఫటిక రూపమున నుండును; శరీరమునందలి నరములసంబంధమగు భాగమునకు మాంద్యతను గలుగ జేయును; ఇది జీర్ణాశయములో గాని ప్రేగులలో గాని రక్తమునందు జేరి, అచ్చటినుండి రక్తప్రచారమార్గమున మెదడునకును వెన్నుపాము ననుసరించి యుండెడి నరములకును బ్రసరించి, మెదడునకు బ్రవహించెడి రక్తమును దగ్గునల నందునటుల జేయుటవలనను, సుషుమ్న (Spinal Cord)

నుండెడి సహజోద్రేకశక్తిని హీనపఱచుట వలనను, మగతను గలుగజేసి నిద్రను రప్పించును. దీనియొక్క ఉపయోగమువలన గొంతునందు వేలుపెట్టి గిలిగింత పెట్టినను దానంతట నది డోకు వచ్చుటగాని మ్రింగుడు పడుటగాని కలుగదు; ఏలయన, గొంతులోని ఆమప్రదేశముల గుండ నిలవణమునందలి అధికపదార్థము వెలువడు చుండుట చేత నాభాగములయందలి నరములు బండబారి స్పర్శశక్తియందలి బలము నందు నీరసత నందుచున్నవి.

బ్రోమైడ్ సంబంధ మగు లవణములను విశేషకాలమువఱ కుపయోగించుట చేత బ్రోమిజం (Bromism) అనబడెడి యొక విధమగు దుర్లక్షణములు గలుగు చున్నవి. పాలిపోవుట, మనోమాంద్యము, స్థిరతలేని వాలకము, స్నాయుసంబంధ మగు బలహీనత, నిస్త్రాణ, పనిచేసిన యెడల నాయాసము, సంభోగశక్తి యొక్క నశింపు, నిద్రమత్తు, నోటినుండి దుర్వాసన. శరీరమున కంతకును స్పర్శశక్తి తగ్గిపోవుట, ముఖము భుజములవైపున మొటిమలు బయలు దేరుట — ఈ దుర్లక్షణములు గనబడును. పొటాసియం బ్రోమైడ్, చర్మము, ఊపిరి, మూత్రము, మలము— వీటి వెంబటి సోడా బ్రోమైడ్‌గా మారి వెలువడి పోవును. పొటాసియం బ్రోమైడ్, సోడా బ్రోమైడ్, అమ్మోనియం బ్రోమైడ్ — ఇవి యన్నియు శరీరమునందు కొంచె మెచ్చుతక్కువగ నొకేపనిని జేయును; వీటిలో నొకదానితో మఱియొకటి చేర్చి యిచ్చినను నీయవచ్చును; అమ్మోనియం బ్రోమైడ్‌ను ముఖ్యముగా కోరింత దగ్గునందును శ్వాససంబంధ మగు మూర్ఛావస్థతల యందును నుపయోగింతురు. సోడియం బ్రోమైడ్, పొటాసియం బ్రోమైడ్ అంత చురుకుగ బనిచేయక పోయినను యీ రెండవది గుండెపైనయును రక్తప్రచారము నందును దుర్బలతను గలుగ జేయును గనుక దీర్ఘవ్యాపిత వ్యాధులయందు సోడియం బ్రోమైడ్ నే ఉపయోగింపనగును.

మూర్ఛసంబంధ మగు నవస్థతలయందు పొటాసియం బ్రోమైడ్ ఉపయోగింపబడుచున్నది. మూర్ఛలలో కఠినమైన విషయములయందు మాత్రమే పని చేయుచు కొద్దివాటిలో దఱచుగ నుపయోగింప కుండినటుల దెలియు చున్నది. పై విషయములలో 20 గ్రా॥ మొ॥ 40 గ్రా॥ వఱకు గల పెద్దమోతాదును దినమునకు మూడుసారు లియ్య వలయును; ఈమందును సేవించు చున్నంతకాలమును మాంసభక్షణమును త్యజించవలయును; లేదా, తగ్గించుట యైనను మంచిది. వ్యాధి యొక్క జాడ అంతరించిన పిమ్మట 2 లేక 3 సంవత్సరముల వఱకు గూడ నీమందును వడపుట ఉత్తమమై యున్నది. దినమునకు 1 డ్రా॥ మోతాదు చొప్పున సోడి

యం బ్రొమైడ్‌ను దీర్ఘకాలము వఱకు గూడ నుపయోగింపవచ్చును. కోరింతదగ్గు, ఉబ్బసము, త్రాగుడు సంబంధ మగు సంధిగుణమునందలి ప్రథమగతి, పిచ్చియొక్క తీవ్రస్థితి, ఋతుస్రావముయొక్క నిలుపుదలవలన గలిగెడి నరముల సంబంధ మగు నస్వస్థతలు, ఋతుస్రావమునందు అధికస్రావ మగునట్టి కాని తఱచుగ నగు నట్టిగాని లేక అధికకాలమువఱకు నగునట్టిగాని స్థితి, ఋతుస్రావమునందు నొప్పి గలిగెడి స్థితి, నిద్రావస్థయందు ఇంద్రియస్ఖలనము, — యీ వ్యాధులయం దన్నిటి యందును బ్రొమైడ్ యొక్క ఉపయోగమువలన నిశ్చయముగ గుణము కలుగ గలదు. ఈ స్థితులయందు దీనియొక్క, నరముల కుండెడి ప్రతిఫలితక్రియాగుణమును (Reflex Action) హీన పఱచుట యందలి శక్తివలన, నుపయోగమును గలుగ జేయుచున్నదని నమ్మబడు చున్నది. రక్తహీనతను వహించియున్నవారలందు కంటె శరీరదృఢతను వహించియున్నవారల యందు నిది యెక్కువగుణమును గనబఱచు నట్లు తెలియుచున్నది. తలనొప్పియందు ముఖ్యముగ నీ భేదమును గమనింపవచ్చును.

దీర్ఘమైన మనఃపరిశ్రమ వలనగాని మనోవ్యాకులతవలన గాని గలిగెడి నిద్రారామియందు బ్రొమైడ్ మిగుల నుపయోగకారియై యున్నది. పరుండబోవు ముందర పూర్ణమైన 40 గ్రె॥ మోతాదును దీసికొని, అవసరమైనయెడల 2 గంటల కాలములో అదేమోతాదును మఱియొకసారి దీసికొనినచో, అలసటను బోగొట్టునట్టి యు స్వాభావికమైనట్టియు నగునిద్రను గలుగజేయును; ఈ నిద్రను గలుగజేయుట యందు శిరస్సునందలిరక్తము పరిమాణము హీనత నందుచున్నదని గ్రహింపబడెను. పిచ్చి యందును, శిరస్సునందు రక్తము కూడుకొనినలక్షణములు గనబడినవిషయముల యందును నీ బ్రొమైడ్ యిదేవిధముగ బనిచేయుచున్నదని తెలిసికొనవలయును. ఇత రౌషధములు బనిచేయ నప్పు డొకానొకప్పుడు, మెదడు నందలి యస్వస్థతల వలన గలిగెడు వాంతులను, గర్భవత్సంబంధ మగు వాంతులను, యిది నిలుపు చేయును. ఇది, అనేకవ్యాధులయందు గలిగెడి మూర్ఛలను మాత్రము నిలుపుచేసి, అసలైన వ్యాధులను చికిత్స నొందింప లేకున్నది. అతిమూత్రవ్యాధియొక్క కొన్ని విషయ ములయం దిది మంచి ఫలితముల నిచ్చినట్లును దెలియుచున్నది.

ధనుర్వాయువునందును, స్ట్రిక్‌నిన్ విషప్రయోగమునందును, 1 డ్రా॥ మొ॥ 4 డ్రా॥ వఱకు గల మోతాదు నియ్యవలయును. దీనియొక్క ఉపయోగమువలన తఱ చుగ మొటిమలు లేవవచ్చును; ఈ మొటిమలు ముఖముపై లేచినప్పుడు మందును నిలిపివేయవలసి యుండును. ఈ క్రింద గనబఱచబడెడి యౌషధయోగమునందు

వలె కొంచెము పాషాణము (Arsenic)ను గలిపి యిచ్చిన యెడల, మొటిమలు లేవకుండ నుండును.

రక్తహీనస్థితుల యందు బ్రోమైడ్‌ను వాడుక చేయరాదు. క్లోరల్ హైడ్రేట్, ఓపియం, హాయొసామి—వీటియొక్క మత్తుస్థితియందు దీని నిచ్చిన యెడల మత్తత నధికపఱచు నని జ్ఞాపక ముంచుకొనుట మంచిదైయున్నది. నల్లమందు అలవాటు అయినవారలయొక్క యీ అలవాటును దప్పింపజేయుటకు గాను, ప్రతి రెండు గంటలకును 2 డ్రాముల బ్రోమైడు మోతాదు నిచ్చి దీర్ఘమైన నిద్ర వచ్చునట్లు జేసినయెడల, యీ నల్లమందుభాయి నిద్రలేచునప్పటికి నల్లమందు నందలి ఆసక్తి తగ్గిపోవును. మూర్ఛగతుల యందు పొటాసియం బ్రోమైడ్, సోడియం బ్రోమైడ్—యీ రెంటిని యీ క్రిందివిధముగ జేర్చి యియ్యవగును.

| | | | |
|---|---|---|---|
| పొటాసియం బ్రోమైడ్ | ... | ... | 5½ డ్రా॥ |
| సోడియం బ్రోమైడ్ | ... | ... | 5½ డ్రా॥ |
| లైకర్ ఆర్సెనికాలిస్ | ... | ... | 1½ డ్రా॥ |
| సిరప్ అరంటి | ... | ... | 1½ ఔన్సు |
| ఆక్వా క్లోరోఫారం | ... | ... | 20 ఔన్సులు. |

వీటిని బాగుగ గలిపి అరఔన్సు మోతాదు చొప్పున భోజనానంతరము దినమునకు మూడుసారులు దీసికొనవలయును.

### మెగ్నీసియం బ్రోమైడ్ — Magnesium Bromide.

హిస్టీరియాయందును మూర్ఛయందును నరములకు శాంతతను గలుగ జేయుటకు గాను 10 గ్రె॥ మొ॥ 20 గ్రె॥ వఱకు గల మోతాదులలో నియ్యబడును. నీటిలోను అల్కహాల్ లోను గలియును.

### మేంగనీజ్ బ్రోమైడ్ — Manganese Bromide.

నరములకు బలవర్ధకౌషధముగ బనిచేయును.

మోతాదు — 1 గ్రె॥ మొ॥ 3 గ్రె॥

### కాల్సియం బ్రోమైడ్ — Calcium Bromide.

మూర్ఛయందు మంచి ఫలితముల నిచ్చును.

మోతాదు — 10 గ్రె॥ మొ॥ 20 గ్రె॥

అమ్మోనియం బ్రొమైడ్ — **Ammonium Bromide.**

ఇతర బ్రొమైడ్‌ల కంటె నిది యెక్కువ బలహీనతను గలుగ జేయును.

మోతాదు — 5 గ్రె॥ మొ॥ 30 గ్రె॥

---

## రీయం – Rheum.

దీనికి రుబార్బ్ (Rhubarb) అను వాడుకపేరు గలదు, తెలుగులో రేవల చిన్ని అందురు; ఇది యొకవిధమగు చెట్టుయొక్క వేఱుతో సంబంధించినదై యున్నది; హిమాలయపర్వతప్రాంతముల యందును, కాశ్మీరము, నేపాళము, సిక్కిం, భూటాను రాజ్యములయందును దొరకును. ఈ వేళ్లయొక్క పైబెరడును దీసివేసి, యెండబెట్టి మెత్తని పొడిగజేసి, ఔషధముగ నుపయోగింతురు; వాసన యొకవిధమైన ఘాటును వహించియుండును.

దీనిని చిన్ని మోతాదులుగ (2 గ్రె॥ మొ॥ 5 గ్రె॥) నుపయోగించిన యెడల జీర్ణాశయమునందు జాఠరరసస్రావము నధిక పఱచి జీర్ణకారిగ బనిచేయుచు, ఆకలికి జొరుకుదనమును బుట్టించును. ఇందు సంబంధమగు టింక్చరు చాలకాలము నుండి బలవర్ధకౌషధముగ నుపయోగింపబడు చున్నది. ఇది త్వరితముగనే రక్తమునందు బ్రవేశించి, కార్జమునకు జొరుకును బుట్టించి పైత్యస్రావమును యెక్కువ చేయును.

పెద్దమోతాదులలో (20 గ్రె॥) వాడుక జేసిన యెడల విరేచనకారిగ బని చేయును; పేగులయందలి స్రావములను కొంచెముగ నధిక పఱచును.

ఇది కొంత వఱకు విరేచన కారిగ బనిచేసినపిమ్మట దీనియం దుండెడి ట్యానిక్ ఆసిడ్ యొక్క గుణఫలితముగ జీర్ణకోశస్రావములు తగ్గింపు నంది మలబద్ధమును గలుగజేయును; ఈకారణముచేత దీర్ఘవ్యాపిత మగు మలబద్ధము నందు దీనిని వాడుక చేయగిట్టదు.

దీనియందు బైన చెప్పబడిన గుణ ముండి యుండుటచే, అతివిరేచనవ్యాధి యందు జీర్ణకోశమునందలి రేగుదలను గలుగజేసెడి యాహారపదార్థమును దేనినైనను ముందుగ దొలగింపజేసి, పిమ్మట విరేచనములను గట్టునట్లు చేయుట కిది మంచి యౌషధమై యున్నది.

రక్తస్రావము (మూలశంక మొదలగునవి) లందు దీనివలె నుపయోగమైనవి వేఱుగ లేవని చెప్పవచ్చును; దీనియొక్క వేరును మెల్లగ నోటిలో నమలినయెడల నెక్కువ గుణము నిచ్చునని కొందఱి యభిప్రాయమై యున్నది; కాని దీనియొక్క విరేచనబద్ధగుణమును గ్రమపఱచుటకుగాను రాత్రియందు పాలపై అరఔన్సు ఆలివ్ ఆయిల్ ను వేసి పుచ్చుకొనవలయును.

పైత్యస్రావ మధికమగుటచేతను, రీయంయొక్క వర్ణగుణముచేతను, విరేచనములు మొదటగా నల్లగనుండును; పిమ్మట కొంచెముగ దెల్లనై యుండును. దీనియొక్క వర్ణపదార్థమునందు క్రైసొఫానిక్ ఆసిడ్ (Chrysophanic Acid) ఉండి యున్నది; దీనిని, చెమట యందును, పాలయందును, మూత్రమునందును—ముఖ్యముగ జివరదానియందు కనుగొన వచ్చును.

సమానభాగముగ సోడియం బైకార్బనేటును గలిపి యిచ్చినచో దీనియొక్క స్రావముల నణచివేయు గుణమును బ్రతిహతపరచుటయే గాక, రుచియందలి అసహ్యతను బోగొట్టును.

దీనిని వాడుక చేయుటలో నితరపదార్థములతో గలిసియున్న పల్విస్ రీయైకో (Pulvis Rheii Co)ను ఉపయోగించుట మంచిది; దీనిని పాలతో గలిపి యియ్యనగును; బిడ్డలకు గలిగెడి వివిధములగు జీర్ణకోశాస్వస్థతల యందు ఉపయోగకరమగు విరేచనకారిగ బనిచేయును. సిరప్ రీయై (Syrup Rheii) ధనియపు వాసనను గలిగియుండి, దీనియొక్క అసహ్యమైన వాసన నణచివేయు గుణమును గలిగియుండుటచేత, బిడ్డలకు ముఖ్యముగ దగియున్నది.

రీయం పొడియొక్క మోతాదు — మఱల మఱల నిచ్చుటకు 3 గ్రె॥ మొ॥ 10 గ్రె॥; ఒకేమోతాదు — 15 గ్రె॥ మొ॥ 30 గ్రె॥: 1 సం॥ వయసుగల బిడ్డకు 3 గ్రె॥

### యక్స్ట్రాక్టు రీయై — Extract Rheii.

బూడిదవర్ణము గలిగి అరుదలస్థితియం దుండెడిది.

మోతాదు — 2 గ్రె॥ మొ॥ 8 గ్రె॥

### ఇన్ఫ్యూజన్ రీయై — Infusion Rheii.

ఒకఔన్సు రేవలచిన్ని (Rhubarb) వేరును ముక్కలుగా గోసి 1 పైంటు మసల కాగిన నీటిలో నొక పావుగంటకాల ముంచి వడపోయవలయును.

మోతాదు—½ ఔన్సు మొ॥ 1 ఔన్సు.

పిల్యూలా రీయై కో — Pilula Rheii Co.

దీనిలో రుబార్బ్, అలోజ్, (మూసాంబరము) మెగ్నీసియా, పెప్పర్‌మింట్ ఆయిల్ — యివి కలియును.

మోతాదు — 4 గ్రా॥ మొ॥ 8 గ్రా॥

పల్విస్ రీయై కో — Pulvis Rheii Co.

దీనికి గ్రెగరీజ్ పౌడర్ (Gregory's Powder) అను పేరుకూడ కలదు. కొంచెముగా పసుపు వర్ణము కలిగినపొడి; అమ్లసిటకి ప్రతిహతముగ పనిచేసి, జీర్ణకారిగను, విరేచనకారిగను, పనిచేయును,

మోతాదు — 20 గ్రా॥ మొ॥ 60 గ్రా॥; పాలలో గలిపి యియ్యవగును; 1 సం॥ వయసుగల బిడ్డకు 5 గ్రా॥.

సిరప్ రీయై — Syrup Rheii.

2 ఔన్సుల రుబార్బ్ వేరును, 2 ఔన్సుల ధనియములను— దీని వీటితో 24 ఔన్సుల జలమును 8 ఔన్సుల ఆల్కహాల్‌ను గలిపి 14 ఔన్సులు అగునట్లుగా గాచి, పిమ్మట 24 ఔన్సుల చక్కెరను గలిపి నిప్పుసెగపైన చక్కెర గలిసి పోవునట్లుగ జేయవలయును.

మోతాదు — ½ డ్రా॥ మొ॥ 2 డ్రా॥; ఒకసంవత్సరము వయసుగల బిడ్డకు ½ డ్రా॥

టింక్చర్ రీయై కో — Tincture Rheii Co.

దీనిలో రుబార్బ్‌యును, ఏలకులును, ధనియములును, గ్లిసరీన్‌యును, గలియును.

మోతాదు — మఱల మఱల నిచ్చుటకు ½ డ్రా॥ మొ॥ 1 డ్రా; ఒకే మోతాదుగ 2 డ్రా॥ మొ॥ 4 డ్రా॥

---

## ఓలియం రిసైని (క్యాస్టర్ ఆయిల్) — Oleum Ricini (Castor Oil).

దీనికే చిట్టాముదము అను వాడుకపేరు గలదు; జిగురుగ నుండి దాదాపు వాసన లేకుండగ, నిర్వర్ణమైనట్టి చమురు; చిట్టాముదపు గింజలనుండి తీయబడినది.

ఇది సాధువిరేచనకారిగ బనిచేయును; పొత్తికడుపుపై దీనిని రుద్దుటవలనగూడ విరేచనము లగునట్లు చెప్పబడుచున్నది. పేగులయందలి గ్రంథులకు గొంచెముగా జారుకు గలుగజేయబడి, సుమారు ఆరుగంటల కాలములో మిగుల మెత్తనైన విరేచనము లగునట్లుచేయును; ఈవిరేచనము లగునపుడు అంతగా నొప్పి లేకుండగను శరీరమం దెట్టి విధమైన కలతయును గలుగకుండగను, నుండును. విరేచనములు నీళ్లవిరేచనములుగ నుండవు. ఈచమురు మలము గుండ వెలువడును; స్త్రీలకు స్తన్యముగుండ గూడ నీచమురు వెలువడును; ఇందులకు నిదర్శనముగ జిట్టాముదమును బుచ్చుకొనిన స్త్రీలకు పాలుద్రాగు బిడ్డ లుండినయెడల నట్టి బిడ్డలకు గూడ విరేచనము లగును.

ఈచమురు దీయబడు ఆముదపుగింజలు విషయుతములై యున్నవి; వీటియందు బలమైన రేగుదలను గలుగజేయు గుణము కలదు; ఇది వృక్షసంబంధమగు బలమైన విషములలో నొకటి. ఈ విషసంబంధ మేమియు ఆముదమునందు లేదు.

కొన్ని విషయములలో దీనియొక్క యుపయోగమువలన రీయం నందు వలెనే "ఆస్ట్రింజెంట్" గుణములు గనబడును. గర్భిణీస్త్రీలకు నిది క్షేమకరమైన విరేచనకారియై యున్నది; కాని, యిది క్రమముగను తఱచుగను నుపయోగింపబడుచున్నపుడు పెద్దమోతాదుల నిచ్చినగాని పనిచేయక పోవచ్చును; ఈవిషయములలో నొకప్పుడు పెద్ద మోతాదు (1 ఔన్సు) నియ్యక, 1 లేక 2 డ్రాముల నిచ్చినంతటనే యీ ఔషధమునకు సహజబలము మఱల గలిగి విరివైన విరేచనము లగుట ప్రారంభించును.

దీనియొక్క సౌమ్యగుణములను బట్టి బిడ్డలకును పసివారలకును నిది క్షేమకరమగు విరేచనకారిగ నెంచ బడుచున్నది. పసివయస్సునందు జీర్ణకోశమునం దుండెడి రేగుదల పదార్థమువలన గలిగెడి అతివిరేచనముల నాపుజేయుటకుగాను నిది మంచి ఔషధమై యున్నది.

పేగులయందు మలము పేరుకొని యున్నస్థితులయం దిది చాలకాలము మంచి పేరును వహించియున్నది. కాని, విశేషపరిమాణముగల ఉడుకునీటిని ఆసనము ద్వారా "యెనీమా"ను యియ్యకుండ ప్రత్యేకముగ దీనిపై నాధారపడి యుండ దగదు. రేగుపండ్లు మొదలగువాటి తోళ్లు పేగులలో నిలువయున్నపుడు చిట్టాముదము వల్ల నుపయోగము లేకపోవచ్చును; ఇట్టి విషయములలో రసభస్మము నియ్యవలెను.

కంటియందు అన్యమైన పదార్థ మేదైన జిక్కుకొని యున్నపుడు ఒకచుక్క చిట్టాముదమును కంటిలో వేసిన యెడల శమనముగ నుండి సంరక్షకరమైయుండును.

దీనియొక్క వెగటును, అరుచిని, బోగొట్టుటకుగాను కాఫీతోగాని, అల్లపు రసముతో గాని, దీనిని బుచ్చుకొనవచ్చును; జిగటదనమును దగ్గింప జేయుటకును, యెక్కువ ద్రవాకారమును వహించి యుండునటుల జేయుటకును, పుచ్చుకొనుముందర దీనిని గొంచెముగ వెచ్చజేయుట మంచిది. ఉదయమున 4 గంటలకును 5 గంటలకును మధ్యకాలములో నోటియందలి స్రావములు అరుదల స్థితియం దుండినపుడు దీనిని బుచ్చుకొనిన యెడల, దీనిరుచి నంతగా గ్రహించుటకు వీలుగ నుండదు గావున, నాసమయమున దీనిని సేవించుట మంచిదైయున్నది.

ప్రేగులయొక్క మెలివేయుటను అటంకపఱచుటకై ½ ఔన్సు చిట్టాముదములో 10 మి॥ మొ॥ 20 మి॥ వఱకు టింక్చర్ ఓపియంను గలుపుట మంచిది.

బిడ్డలు పెద్దమోతాదులను బాగుగ భరింతురు; అప్పుడు పుట్టిన బిడ్డలకుగూడ నసౌఖ్యకరమగు ఫలితములు లేకుండగ 1 డ్రాము చిట్టాముదము నియ్యవచ్చును. పెద్దవారలకు మొదటగా దీనిని సేవించునప్పుడు ½ ఔన్సు మోతాదుకంటె నెన్నడు హెచ్చు నియ్యగూడదు.

స్తనాగ్రములు వాపుదల నందినపుడు పైన దఱచుగ చిట్టాముదమును రాయుటవలన నుపయోగకారిగ నుండగలదు.

మోతాదు— 1 డ్రా॥ మొ॥ 8 డ్రా॥; 1 సం॥ వయసుగల బిడ్డకు 1 డ్రా॥

## ఆముదపు ఆకులు — Castor Leaves.

పాలను వృద్ధిపఱచుటకుగాను ఆముదపు ఆకులు ఈక్రింది విధముగ నుపయోగింపబడును. చేతినిండా ఆముదపు ఆకులను దీసికొని 6 మొదలు 8 పైంట్లవఱకుగల నీటిలో నుడుకబెట్టి గోరువెచ్చగ నుండెడి యీ కషాయముతో స్తనములను ఒక పావుగంటసేపు తడిపి, పిమ్మట నీ ఉడుకబెట్టిన ఆకులను స్తనములపై పరువవలయును. కొద్దిగంటల కాలములోపలనే దీనియొక్క ఫలితములు గాన్పించును. ఇంతకంటె తేలికయిన పద్ధతియైనను సమానఫలితమునే యిచ్చునట్టి యింకొకమార్గము గలదు; ఆముదపు ఆకులను నిప్పుసెగపై వెచ్చచేసి యొకదానిపై నొకటి పొరలు పొరలుగా స్తనములపై వేసినను పాలయొక్క స్రావ మధికమగును.

## రోజ్‌మెరీని ఆయిల్ — Rosmarini Oil.

నిర్వర్ణమైనట్టిగాని కొంచెముగా పసుపురంగు గలిగినట్టిగాని, రోజ్‌మెరీ పుష్పములనుండి తయారు చేయబడిన చమురు. లోనికి దీసికొనినయెడల మిగుల జారుకుదనమును బుట్టించును; పెప్పర్‌మింట్ వలెనే పనిచేయును.

పైన రాయుటవలన నట్లు రాయబడిన స్థలమునకు రక్త మధికముగ బ్రవహించి యెర్రగ నగును; బట్టతల యేర్పడిన విషయములలో దీనిని తలపై రాసినచో వెండ్రుకలయొక్క కుదుళ్లకు అధికముగ రక్తప్రచార మేర్పడి పోషణను గలుగజేయునని యెంచబడుచున్నది. దీనితో కెంతారిడీస్‌ను గలిపినయెడల నుపయోగము అధికమగును. దీనియొక్క వాసనను బట్టి దీనిని లినిమెంట్లలో దఱచుగ గలుపుదురు.

ఈక్రింది ప్రకరణము బట్టతలకు మిగుల నుపయోగమై యున్నది.

| | | | | |
|---|---|---|---|---|
| రోజ్‌మెరీని ఆయిల్ | ... | ... | ... | 4 డ్రా. |
| లైకర్ యెపిస్‌పాస్టికస్ | ... | ... | ... | 2 డ్రా. |
| ఓలియం అమిగ్డాలా డల్సిస్ (తియ్యబాదం నూనె) | | | ... | 1½ ఔన్సు. |
| స్పిరిట్ క్యాంఫర్ | ... | ... | ... | 2 ఔన్సులు. |
| బోరాక్సు (వెలిగారము) | ... | ... | ... | 2 డ్రా. |
| గ్లిసరీన్ | ... | ... | ... | 6 డ్రా. |
| రోజ్ ఆయిల్ | ... | ... | ... | 8 చుక్కలు. |
| టింక్చర్ జాబరాండి | ... | ... | ... | 1 ఔన్సు. |

వీటి నన్నిటిని బాగుగా గలిపి ప్రతిరాత్రియును వెండ్రుకలయొక్క కుదుళ్ళకు రాయనగును.

మోతాదు — ½ మి॥ మొ॥ 3 మి॥

---

## రోజ్ — Rose.

రోజ్ అనగా గులాబీ పుష్పము; దీనితో జేయబడెడి ద్రవములు సువాసనకై ఉపయోగింపబడును; దీనితో జేయబడెడి నేత్రశుభ్రకారులును గండూషములును శమనమును గలుగజేయునని కొందఱు నమ్ముచున్నారు. దీనితో జేయ

బడు ఆ త్తరునకు యింగ్లీషులో ఆటో ఆఫ్ రోజ్ (Otto of Rose) అందురు; ఇది మిగుల బలమైన వాసనను గలిగియుండును.

### రోజ్ వాటర్ — Rose Water.

దీనికే పన్నీరు అందురు; గులాబీపుష్పములను బట్టీపెట్టి దీనిని తయారు చేయుదురు. దీని నుపయోగించుటకు ముందుగా రెట్టింపునీటిలో గలుపవలయును. నేత్రములను బరిశుభ్రపఱచి చల్లదనమును గలుగజేయును.

### కన్ఫెక్షన్ ఆఫ్ రోజెస్ — Confection of Roses.

1 పౌను అప్పుడు కోసిన గులాబీ పుష్పములయొక్క రేకులను 3 పౌనుల పంచదారతో గలిపి కొట్టుటవలన నేర్పడెడి ఊదారంగుగల మెత్తని ముద్దవలె నుండెడిది. మాత్రలను జేటె నైనను దినుటకు వీలుగ నుండునటుల నుపయోగింప దగినది.

### రోజ్ సిరప్ — Rose Syrup.

దీనికే గులాబీ షరబత్ అను వాడుకపేరు గలదు. 2 ఔన్సుల యెర్రగులాబీ పుష్పములయొక్క యెండిన రేకులను 1 పైంటు మసలకాగిన నీటిలో వేసి 2 గంటలు నిలువయుంచి, దళసరిగుడ్డ గుండా పిండి, మసలగాచి, వడపోసి, 30 ఔన్సుల పంచదారను గలిపి, సన్నని నిప్పుసెగపై యీపంచదార కరగునట్లు చేయవలెను. దీనికే గులాబీ షరబత్ అందురు. దీనిని నీటిలో వేసి త్రాగినచో జలవచేయునని కొందఱి యభిప్రాయమై యున్నది.

మోతాదు — ½ డ్రా॥ మొ॥ 1 డ్రా॥

---

## సుగర్ (చక్కెర) — Sugar.

ఆహారపదార్థముగ నిది మంచిగుణములను గలిగియున్నది; శరీరమునందలి క్రొవ్వుపదార్థమునకు బోషణచేయుచు, శ్వాసకోశవ్యవహారముల కింధనముగ వర్తించుచున్నది. వైద్యుడు దీనిని ఔషధయోగములను రుచికరముగ జేయుటకై ఉపయోగింప నగును.

### మిల్క్ సుగర్ — Milk Sugar.

దీనికి ల్యాక్టోస్ (Lactose) అను పేరుకూడ గలదు; పేరబెట్టిన పాలలో పెరుగు కాగా నిలుచు నీళ్లనుండి తయారుచేయబడి, తెల్లని స్ఫటికములవలె నుండి,

తియ్యని రుచి గలది. అజీర్ణవ్యాధిగ్రస్తులకు ఆహారమును దియ్యబఱచుటకు చెఱకు పంచదారకు బదులుగా నుపయోగించబడును. ఇది మిగుల నుపయోగమగు మూత్రప్రకోపకారిగ నెంచబడుచున్నది; గుండెనంజు నందు మూత్రమును విశేషముగ నధికపరచును. ధాతునష్టమునందుగూడ మూత్రప్రకోపకారిగ బనిచేయును గాని యీ విషయమున నీగుణ మంతగా స్పష్టీకరించి కనబడదు. దీనియొక్క మోతాదునందు మిగుల వార గలదు. ఒకదినమునందు వాడదగిన మోతాదు 3 డ్రా॥ మొదలు 3 ఔన్సుల వరకు నేర్పరచబడి యున్నది.

సిరప్ — Syrup.

నిర్వర్ణమై చిక్కగనుండెడి షరబత్; 4 పౌనుల చక్కెరను 2½ పౌనుల జలములో గలిపి చేసెడిది. మందులను రుచికరముగ జేయుటకై కలుపనగును.

---

## సాలోల్ – Salol.

నీటిలో గలియనట్టియు, నిర్వర్ణమైనట్టియు, స్ఫటికములు; దీనిని లోని కిచ్చిన తరువాత జీర్ణాశయమునందు శిథిల మందక, పేగులలోనికి బ్రవేశించినవెంటనే మధు రసము (Pancreatic Juice)తో గలిసి, దానివలన సాలిసైలిక్ ఆసిడ్ క్రిందను ఫెనాల్ క్రిందను మార్పుచేయబడును; శీఘ్రముగనే దీని అంతర్భాగములు మూత్ర మునందు గనబడును. సాలోల్‌ను పెద్దమోతాదులలో నుపయోగించిన యెడల, మూత్రము ఆకుపచ్చ నలుపు వర్ణములు గలిసిన రంగును జెంది, కార్బాలిక్ ఆసిడ్, సాలిసైలిక్ ఆసిడ్‌ల వలన విషమస్థితి దటస్థించిన విషయములందు గలిగిన దుర్లక్షణములు గనబడును, అయినప్పటికిని, ఆ రెంటి యంతటి విషఫలితములను గనబరచనేరదు; దుష్ఫలితము లేమియు గలుగ కుండ జ్వరములలో 15 గ్రా॥ మొ॥ 30 గ్రా॥ వఱకు నియ్యవచ్చును. అట్టిమోతాదు నిచ్చినపిమ్మట శరీరపువేడిమి యందు 5 డిగ్రీల వఱకును తగ్గుదల గనబడవచ్చును. తీవ్రస్థితియందున్న కీళ్లనొప్పులలో నిది మిగుల నుపయోగకారిగ బనిచేయును. ఇట్టి సందర్భములో నీ వ్యాధియందు యిది సాలిసైలిక్ ఆసిడ్ వలెనే బనిచేయును, కీళ్లనొప్పులయొక్క ఉద్రిక్తావస్థయందును, దీర్ఘవ్యాపితస్థితియందును, నడుమునొప్పి, తుంటినొప్పి, తలనొప్పి, క్షయవ్యాధి—నీటియందు గుణమును గనపఱచును. మూత్రము యొక్క కుళ్లుదల స్థితియందు లోని కిచ్చుటవలన బోరిక్ ఆసిడ్ వలెనే పనిచేయుచు పిచికారీ వగైరాల ఉపయోగము నక్కఱ లేకుండ జేయును; పేగులయందు కుళ్లుదల స్థితి లేకుండజేసి పైత్యస్రావము

నధికముగ ద్రవపఱచుటచేత పైత్యసంబంధ మగు రాళ్లను హరింపజేయును; దీని యొక్క సొల్యూషనును, గండూషముగను, గాయములను శుభ్రపఱచుటకును గూడ నుపయోగింప నగును. 12 గ్రె॥ ను సామాన్య మోతాదుగ నెంచి, దీనిని 4 గంటల కొకసారి యియ్యవచ్చును. దీనిలో పేగులయందు రాళ్లుగ నేర్పడెడి గుణము కలదు గావున దీనిని బిస్మత్ సబ్నైట్రిస్ తో జేర్చి యిచ్చినయెడల నీ బాధ కలుగనేరదు. శరీరమునకు ఉపరిభాగమునం దుపయోగించుటలో నిది అయిడోఫారం వలెనే పనిచేయును; చాలమంది దీనిని అయిడోఫారంకు బదులుగా నుపయోగింప నగు నని స్థిరపఱచి యున్నారు. దీనియందు 100 కి 38 పాళ్లు కార్బాలిక్ ఆసిడ్ కలదు.

2 భాగముల హారతి కర్పూరమును 3 భాగముల సాలోల్ తో గలిపి కాచిన యెడల జిక్కని ద్రవపదార్థము యేర్పడును. దీనికి సాలోల్ క్యాంఫర్ (Salol Camphor) అందురు. చీము పట్టకుండ జేయుటకు గాను పైనరాయుట కుపయోగింతురు. 2 డ్రాముల సాలోలును, 2 డ్రాముల ఈథర్ ను, 2 ఔన్సుల కలోడియం ను— ఈమూటిని గలిపినచో జిక్కని ద్రవపదార్థ మేర్పడును. దీనిని కీళ్లనొప్పులయందు నొప్పులతో గూడిన కీళ్లకు పైన లేపనముగ నుపయోగింప వచ్చును.

మోతాదు— 5 గ్రె॥ మొ॥ 15 గ్రె॥

---

## సాండల్ వుడ్ ఆయిల్ – Sandalwood Oil.

దీనికి సామాన్య వాడుక యందు చందనీ అత్తరు అందురు; మంచిగంధపు చెక్క నుండి దీయబడిన చమురు; దళమైనట్టియు, కొంచెముగ బసుపు రంగు గలిగినట్టియు, మంచి వాసనను గలిగి నట్టియు, నూనె.

దీనియొక్క గుణమునందు కోపేబాను బోలి, గనోరియా వ్యాధియందలి చికిత్సకై ఉపయోగింపబడును. మూత్రముగుండ నిది వెలువరింపజేయ బడునపుడు మూత్రాశయముయొక్కయు మూత్రకోశముయొక్కయు ఆమసంబంధ మగు పొరలపై నిది పనిచేయును.

దీనిని 20 మినిముల మోతాదులలో నిచ్చుట వలన 60 గంటల లోపలనే గనోరియా (సెగ) సంబంధ మగు స్రావమును తగ్గుదల నందింప జేయును; ఈకాలములో సుగుణము గనబడక పోయినయెడల, దీనివలన నిక మంచిగుణము గలుగజాల దని చాలవఱకు నెంచనగును. సెగవ్యాధియొక్క జాడ పూర్తిగ నంతరించిన పిమ్మట గూడ

కొంతకాలమువఱకు దీనిని ఉపయోగించవలయును. దీర్ఘవ్యాపిత మగు రొమ్ముపడిశె మునందు, 8 చుక్కలను పంచదారపై వేసి తీసికొనువటలన, పొడిదగ్గును నెమ్మది పఱచును. 15 మినిముల మోతాదును దినమునకు 3 సారు లిచ్చుటవలనను నొకప్పుడు గనోరియా వ్యాధియందు ఉపయోగ ముండ గలదు.

మోతాదు—5 మి॥ మొ॥ 30 మి॥

లైకర్ శాంటాల్ కం బక్కు యెట్ క్యుబెబ్ —Liquor Santal cum Buchu et Cubeb.

పసుపు వర్ణముగల మంచిగంధపుచెక్క పొడి 4 భాగములు, బక్కుపొడి 1 భాగము, క్యుబెబ్ (చలువ మిరియాలు) పొడి 1 భాగము, 14 భాగములు ఆల్కహాల్— ఇవి కలియును.

గనోరియా వ్యాధియం దుపయోగింప దగినది.

మోతాదు — 1 డ్రా॥ మొ॥ 2 డ్రా॥

---

## శాంటోనీన్ – Santonine.

నిర్వర్ణమైనట్టి చిన్న పలుకులుగ నుండును; వెలుతురు దగిలినచో పసుపురంగు దేలును. ప్రేగులయం దుండెడి, నులిపురుగులను, వానపాముల వలె నుండెడి పురుగు (Round worms) లను, నశింపు నంద జేయును; క్రమమైన విధమున దీని నుపయోగించిన యెడల ఈ పురుగులను నశింపుజేయుట కిది మంచి మందై యున్నది. టేపువరం (Tape worm) పైన నిది యేవిధమైన పనిని జేయజాలదు.

దీనిని పెద్దమోతాదులలో నిచ్చిన యెడల విరేచనములను గలుగజేయుటయే గాక మెదడు సంబంధ మగు నస్వస్థతలను గూడ గలుగ జేయును. ప్రేగులలోని పురుగులను జంపుటకు, విరేచనములను గలుగచేయునట్టి కొద్దిమోతాదులే చాలును. మిక్కిలి పసిబిడ్డలయందు గొన్ని విషయములలో దీనియొక్క ఉపయోగము వలన మూర్ఛలు కలిగి మరణము గూడ దటస్థించి యున్నది.

ఒకపూట నిరాహారస్థితియం దుండిన పిమ్మటగాని, సాధువిరేచనకారి నుపయోగించిన పిమ్మటగాని, దీనిని వాడుక చేసినయెడల నెక్కువ నిశ్చితమైన గుణఫలితముల నిచ్చును. దీనిని యితరమైన విరేచనకారులతో నిచ్చుటకంటె చిట్టాముదముతో

నిచ్చుటయే శ్రేష్ఠమని, డాక్టర్ కుచిన్‌మాస్టరుగారు యొక బిడ్డల ఆసుపత్రిలో గొన్ని వేల సంఖ్యగల విషయములలో దమ అనుభవమువలన దెలిసికొని ప్రచురము చేసిన యంశమైయున్నది. ఈ యౌషధము పెద్దమోతాదులలో నియ్యబడినను అసౌఖ్యకరములగు గుణములు గనబడలేదు. చిట్టాముదము, యెట్టి దుష్ఫలితములను గలుగనియ్యకుండ, శాంటొనిన్ యొక్క అపాయగుణములను జాలవఱకు దగ్గింప జేయునట్లు కనబడుచున్నది. రెండు సంవత్సరముల వయసుగల బిడ్డకు నిద్రింపబోవు ముందర 2 గ్రె॥ శాంటొనిన్‌ను ఒకదాృము చిట్టాముదమునందు గలిపి యిచ్చి, ఉదయమున అవసరమని తోచినచో మఱికొంత చిట్టాముదము నియ్యవచ్చును. సామాన్యముగ బురుగు మరణము నందియే మలముగుండ వెలువడును; ఈమందు పురుగులందు మూర్ఛగతియందలి కదలికలను గలుగజేయుటచే పేగులయందును గదలిక గలిగి, యీపురుగులను వెలువరింప జేయును.

శాంటొనిన్ యొక్క ఉపయోగమువలన గొన్ని అపరూపమైన గుణములు గనబడును; దీనిని వాడుక చేసిన యొకగంటకాలములోపల పసుపువర్ణమును వహించిన దృష్టి కలుగవచ్చును, ప్రవస్తువుయును పసుపు వర్ణమునుగాని ఆకుపచ్చవర్ణమునుగాని వహించి యుండును; ఊదావర్ణమును గష్టముతో గుర్తింపవచ్చును. ఆఘ్రాణమునందును, రుచియందును గూడ నిట్టి వింతైన గుణములు గనబడవచ్చును. మూత్రము, పసుపు వర్ణమునుగాని, నారింజవర్ణమునుగాని, యెరుపువర్ణమునుగాని, తెలుచుగ వహించి యుండును. శాంటొనిన్ మూత్రగ్రంధులకు జొరుకుదనమును బుట్టించి మూత్రప్రకోపకారిగ బనిచేయుచు మూత్రముగుండ నిది వెలువడిపోవును; ఒకప్పుడు మూత్రాశయమునకు రేగుదలనుగూడ గలిగింపవచ్చును. గనోరియావ్యాధి ముదిరి ఆమము వెలువడు చుండెడి స్థితియందును, ధాతునష్టమునందు ధాతుపదార్థమును దగ్గించుట యందును, నిది పని చేయునని చెప్పబడుచున్నది. బ్రొమైడ్లయొక్క ఉపయోగము గనబడక పోయినపుడు మూర్ఛస్థితియందు దీని నుపయోగించుటకు గొందఱు సిఫారసు చేసియున్నారు.

చిట్టాముదముయొక్క రుచిని భరింప జాలని వారికి దీనిని గొంచెము రసభస్మము (Calomel) తో గలిపి యియ్యవచ్చును.

బిడ్డలకు వెన్నలోగాని రొట్టెలోగాని పొదిగి యిచ్చినను యియ్యవచ్చును.

మోతాదు — 2 గ్రె॥ మొ॥ 5 గ్రె॥ (చక్కెరలో)

---

## సార్సపరిల్లా (సుగంధిపాల) Sarsaparilla.

సుగంధిపాల చెట్లయొక్క వేళ్లనుండి తయారు చేయబడిన ఔషధము; ఈ ఓషధినిగూర్చి భిన్నాభిప్రాయము లుండియున్నవి. కొందఱు వైద్యశాస్త్రజ్ఞులు దీనిని బొత్తుగ నిరుపయోగమైనదని యెంచుచున్నారు; కాని చాలమందిచే నిది మాత్రి ప్రకోపకారిగను, జ్వరమును దగ్గించునదిగను, కొఱుకువ్యాధియందు ప్రయోజనకారిగను, నెంచబడుచున్నది. దీని నితర ఔషధములతో జేర్చి, దీర్ఘ వ్యాపితమగు కీళ్లనొప్పుల యందును, చర్మవ్యాధుల యందును, రక్తమును బరిశుభ్రపఱచుట యందును, నుపయోగింతురు.

### యక్స్ట్రాక్టు సార్సా లిక్విడ్ — Extract Sarsae Liquid.

కాఫీవలె బూడిదరంగును గలిగిన ద్రవపదార్థము; దీనియందు సుగంధిపాలయును, ఆల్కహాల్ యును, గ్లిసరీన్ యును, గలియును,

మోతాదు — 2 డ్రా॥ మొ॥ 4 డ్రా॥

### ఇన్ఫ్యూజన్ సార్సా — Infusion Sarsa.

అరపైంటు మసల గాగిన నీళ్లలో ఒక ఔన్సు యెత్తుగల సుగంధిపాలవేళ్లను ముక్కలుగా గొట్టివేసి, ఒకగంటసేపు నిలువయుంచి, వడపోసి, దీనిని దినమునకు 2 ఔన్సులు మొదలు 3 ఔన్సుల వఱకు బుచ్చుకొనవచ్చును. ఈ కషాయము కొంచెము వెచ్చగ నుండగనే బుచ్చుకొనుట శ్రేష్ఠము. దీనిలో గొంచెము పాలను పంచదారయును గలిపినయెడల తేయాకు నీళ్లవలె నుండును. అజీర్ణవ్యాధి, ఆకలి మందగింపు, కొఱుకుసంబంధమగు చర్మవ్యాధులు, పుండ్లు, దీర్ఘవ్యాపితమగు కీళ్ళనొప్పులు, శరీరము పాలిపోయినస్థితి— వీటియం దుపయోగింప నగును.

---

## సెనిగా — Senega.

ఒక విధమైన చెట్టుయొక్క వేళ్లతో జేయబడెడి యీ ఔషధము శ్వాసకోశములయొక్క ఆమసంబంధమగు పొరలపై బనిచేయుటచే కఫమును వెలిబుచ్చును. కఫము విశేషించి యుండి జిగురును వహించియున్న స్థితియందు నిది యియ్యబడును. దీనితో అమ్మోనియం కార్బనేట్ను గలిపి యిచ్చినయెడల దీనియొక్క ఉపయోగ మధికమగును

దీనియొక్క వేరును నమలినయెడల కారముగా నుండి నోటియందలి ఉమ్మి యొక్క స్రావము నధికపఱచును; పెద్దమోతాదులలో వాంతికారిగ బనిచేయుచు, విరేచనములను గూడ గలిగింపవచ్చును. ఆరోగ్యస్థితియందు ఇది మూత్రపరిమాణము నధిక పఱచదు; కాని, గుండెయొక్కగాని మూత్రగ్రంథుల యొక్కగాని వ్యాధి స్థితులయందు మూత్రము నధికపఱచును.

దీర్ఘవ్యాపిత మగు రొమ్ముపడిసెము (Bronchitis) నందు ఈ క్రింది ఔషధ యోగము బాగుగ బనిచేయగలదు.

| | | |
|---|---|---|
| టింక్చర్ సెనిగా (Tincture Senega) | ... ... ... | 4 డ్రా |
| టింక్చర్ క్యాంఫర్ కో (Tincture Camphor Co.) | ... | 4 డ్రా |
| అమ్మోనియా కార్బనస్ (Ammonia Carbonas) | ... ... | 1½ డ్రా |
| ఇన్ఫ్యూజన్ సెనిగా (Infusion Senega) | ... ... ... | 7 ఔన్సులు |

½ ఔన్సు మోతాదుచొప్పున మూడు గంటల కొకపర్యాయ మియ్యవల యును.

ఇన్ఫ్యూజన్ సెనిగా — Infusion Senega.

సెనిగావేళ్లు 1 ఔన్సును 1 పైంటు మసల గాగిన నీళ్ళలో వేసి యొక అర గంటకాల ముంచి వడపోయవలయును.

మోతాదు ½ ఔన్సు మొ॥ 1 ఔన్సు; దగ్గుల కుపయోగించు మందుల యందు గలుపబడును.

టింక్చర్ సెనిగా — Tincture Senega.

దీనిలో ఆల్కహాల్ గలిసి యుండును; 5 వ పాలు సెనిగా పౌడరు ఉండును.

మోతాదు — ½ డ్రా॥ మొ॥ 1 డ్రా॥

---

## సెన్నా (సునాముఖి) — **Senna.**

సునాముఖీ ఆకు దక్షిణ ఇండియా యందు ముఖ్యముగా తిరునల్వేలి జిల్లా యందు దొరకును. ఈఆకులు పూర్ణమైనవిగను, శుభ్రమైనవిగను, పెళుసు గలవి గను, కొంచెము ఆకుపచ్చవర్ణముగాని పసుపువర్ణముగాని గలవిగను, బలమైనవాసన

గలవిగను, నుండవలయును. సునాముఖీ ఆకులు 1 ఔన్సును, నలుగగొట్టిన అల్లమును లవంగములను చెరియొక అరదాౄమును, మసలగాౄగిన నీళ్లను 10 ఔన్సులను—వీటి నన్నిటిని గలిపి యొక గంటసేపు నిలువ యుంచవలయును; అప్పుడు వడపోసి 1½ ఔన్సు మొదలు 2 ఔన్సులవఱకు గలమోతాదులో నియ్యవచ్చును. బిడ్డలకు వయస్సును బట్టి తగ్గించి యియ్యవలసి యుండును. మలబద్ధముయొక్క అన్ని విధముల యందును దీని నియ్యనగును. పైవలెగాక దీనిని విడిగా నిచ్చుటవలన ప్రేగులను మెలివేయు గుణము కనబడవచ్చును. అజీర్ణవ్యాధియందుగూడ వాడుక చేయవచ్చును. బిడ్డల కిచ్చుటంతగా మంచిది కాదు; బిడ్డలకు చిట్టాముదమును వాడుటయే మంచిది.

### ఇన్ఫ్యూజన్ సెన్నా—Infusion Senna.

2 ఔన్సులు సునాముఖీ ఆకునున్నూ 55 గ్రె॥ అల్లమునున్నూ, మసల గాౄగిన నీళ్లు 1 పైంటులో 1 పావుగంటసేపు ఉంచి వడపోయవలయును.

మోతాదు— ½ ఔన్సు మొదలు 1 ఔన్సు.

### మిస్ట్యూరా సెన్నా కో — Mistura Senna Co.

దీనికి బ్లాక్ డ్రాఫ్ట్ (Black Draught) అనియు వాడుకపేరు గలదు; మెగ్నీసియం సల్ఫేట్ 5 ఔన్సులు, లిక్విడ్ యక్ట్సాౄక్టు ఆఫ్ లైకరిస్ 1 ఔన్సు, స్పిరిట్స్ అమ్మోనియా ఆరొమేటిక్ 1 ఔన్సు, టింక్చర్ కార్డమం కో 2 ఔన్సులు—యివి యన్నియు జేరినమీదట 1 పైంటు అగునట్లుగా ఇన్ఫ్యూజన్ ఆఫ్ సెన్నాను గలపవలయును. నీళ్లవిరేచనము లగునట్లు చేయును.

మోతాదు — 1 ఔన్సు మొదలు 2 ఔన్సులు.

### టింక్చర్ సెన్నా కో — Tincture Senna Co.

దీనిలో సెన్నాయును, ధనియములును, సీమ సోపువిత్తులును, — గలియును.

మోతాదు—మఱల మఱల నిచ్చుటకు ½ డ్రా॥ మొ॥ 1 డ్రా॥; ఒకేమోతాదుగ 2 డ్రా॥ మొ॥ 4 డ్రా॥

---

## సినేపిస్ (ఆవాలు) — Sinapis.

సినేపిస్కు మస్టార్డ్ (Mustard) అనెడి ఇంగ్లీషు వాడుకపేరు కూడ గలదు. ఆవాలపిండిని ఒకపెద్ద చెమిచాలో దీని ఒకటంబ్లరు ఉడుకునీళ్ళలో వేసి యిచ్చి

తరువాత ఉడుకునీటిని విరివిగ దాగుట కిచ్చినయెడల, విషప్రయోగముల యందు వాంతికారిగ బనిచేయును. దీనియొక్క స్థానికకార్యక్రమమునందు జాఠరరసము నధికముగ స్రవింప జేయకపోయినను, ఊరుగాయల యందు దీని నుపయోగించుట వలన ఆకలిని వృద్ధిపఱచునని తలపబడుచున్నది.

పైన లేపనముగ నుపయోగించి అంతరావయవముల యొక్క రేగుదలను బోగొట్టవచ్చును. ఆవాలపిండిని పట్టువేయుటకు గాను యీక్రింది అంశములను గమనింపనగును.

1. ఇది కొంచెముగా ముద్దయగునటుల చన్నటితో గలుప వలయును; వేడినీళ్లనుగాని వినిగర్ను గాని ఉపయోగించుట కూడదు.

2. ఇది బహుత్వరితముగ గాని బహుతీవ్రముగ గాని పనిచేయవలె నన్న మునగ చెట్టుయొక్క వేరు పైపొప్పరను గూడ గొంచెముగ గలుపవచ్చును.

3. సున్నిత శరీరులకును, స్త్రీలకును, బిడ్డలకును — సన్నని మజ్లిన్ గుడ్డను ముందుగా వేసి అందుపై నీ పిండిముద్దను బ్రయోగింపనగును; పరిశుభ్రతకు గూడ నీ పద్ధతి బాగుండును.

4. చర్మము యెర్రబడిన వెంటనే, బాధ ఉండినను లేకపోయినను, ఈ పిండి పట్టును దొలగింప నగును.

5. కొన్ని చర్మములు మిక్కిలి సున్నితము లగుటచే బాధ అతిశయింపగనే పట్టును దీసివేయవలయును.

6. ఒడలుపై నీ ఆవపిండిపట్టు 20 లేక 30 నిమిషము లుండినయెడల, పొక్కు పొక్కి, పుండ్లు పడును; ఈపుండ్లు మానుట కష్టమై యున్నది.

7. జ్వరముగాని తీవ్రమగు నే వ్యాధిగాని యుండిన యెడల సాయంకాల వేళకంటె నుదయపువేళ నీపట్టును వేయుట మంచిదై యున్నది.

### లినిమెంట్ సినేపిస్ — Liniment Sinapis.

ఆవాలు నూనె (Mustard Oil) 1½ డ్రాములను 5 డ్రాముల చిట్టాముదముతో గలిపి, అదివఱకే 120 గ్రా॥ హారతికర్పూరము మిశ్రితము జేయబడి యున్న

4 ఔన్సుల అల్కహాల్‌ను గూడ వీటితో గలుప వలయును. దీనిని పైన రాయుటకు మాత్రమే ఉపయోగింతురు; చురుకును బుట్టించి చర్మము యెర్రబడునట్లు చేయును.

---

## సోడియం — Sodium.

సోడియం సంబంధములగు లవణములు, రసాయనగుణము లందును వైద్యలక్షణములందును పొటాసియం లవణములను జాలవఱకు పోలియే యున్నవి గనుక నిచ్చట వేఱుగ వాటిని గుఱించి మిక్కిలి వివరములతో జెప్ప నావశ్యకము లేదు; అయినను యీ రెండువిధము లగు నా యీ సంబంధమైన లవణములకును గల భేదముల నిచ్చట వివరించుట ఉపయోగముగ నుండగలదు.

1. పైకి నుపయోగించుటలో పొటాసియం లవణములకంటె సోడా లవణములు తక్కువ పొక్కుదల గుణమును గలిగి యున్నవి,

2. గుండెపైన పొటాసియం లవణములవలె సోడాలవణము లెంతమాత్రమును బలహీనతను గలుగజేయవు గావున — పొటాసియం లవణములు విషములుగ వర్తించునట్టి దోషగుణములు సోడాలవణముల యందు లేవు.

3. సోడాలవణములు పొటాసియం లవణము లంత మూత్ర ప్రకోపగుణమును గలిగి యుండవు.

4. మూత్రమునందలి యూరిక్ అమ్లముతో సోడాలవణములు అంతగా మిశ్ర పదార్థములు కాజాలవు.

5. శరీరమునం దంతటను రక్తము సహితముగ సోడాలవణముతో నింపబడి యుండుటచేత నౌషధ మోతాదులలో వీటిని దీసికొనిన యెడల శరీరతత్వమునం దట్టి మార్పును గలుగ జాలదు.

6. సోడా లవణములు పొటాసియం లవణము లంత విరివిగా శరీరమునందు వ్యాపకము నంద జాలవు.

### సోడా టార్టరేటా — Soda Tartarata.

దీనికి, సోడియంపొటాసియం టార్టరేట్ (Sodium Potassium Tartarata) అనియు, టార్టరేటెడ్ సోడా (Tartarated Soda) అనియు వేఱు పేరులు గలవు;

నిర్వర్ణమైనట్టియు, మెరయు నట్టియు, బలుకులుగ నుండును. దీనియొక్క మూత్రప్రకోపగుణము అనుమానాస్పదము గలదై యున్నది. ప్రేగులయందలి గ్రంధులకు బలమైన చురుకుదనమును గలుగజేసి విరేచనకారిగ బనిచేయును. దీనిని కొద్దిమోతాదులలో నిచ్చిన యెడల పొటాసియం లవణము లంత నిశ్చితముగ గాకపోయినను గొంత వఱకు మూత్రము క్షారసహిత మగునదిగ జేయును.

పూర్ణమైన మోతాదు నిచ్చిననే తప్ప విరేచనకారిగ బనిచేయునని నమ్ముటకు వీలులేదు. 4 డ్రాముల నిచ్చినను నొకప్పుడు విరేచనములు గాకపోవచ్చును. 5 లేక 6 డ్రాముల నిచ్చిన యెడల విరివిగ విరేచనములు కాగలవు; నీళ్ళవిరేచనము లగును.

మోతాదు — 2 డ్రా॥ మొ॥ 4 డ్రా॥; లెమనేడ్‌లో గలిపి తీసికొనుట యందు రుచికరముగ నుండును.

పల్విస్ సోడా టార్టరేటా యెఫర్వెసెంట్ — Pulvis Soda Tartarata Effervescent.

దీనికి సెడ్లిజ్ పౌడర్ (Seidlitz Powder) అను వాడుకపేరు కలదు.

120 గ్రా॥ టార్టరేటెట్ సోడానున్నూ 40 గ్రా॥ సోడియం బైకార్బనేట్ నున్నూ 10 ఔన్సుల జలములో మిశ్రితము జేసి, దీనికి 38 గ్రా॥ టార్టారిక్ ఆసిడ్ ను గలిపి, పొంగువచ్చు చున్నపుడు త్రాగవలయును; మందటి రెండు పౌడర్లను గలిపి బ్లూకాగిదములో పొట్లము గట్టి, టార్టారిక్ ఆసిడ్‌ను గురుగా డెల్లకాగిదములో వేఱుగా గట్టవలయును; సాధువిరేచనకారిగ బనిచేయును.

సోడియం ఆర్సెనేట్ — Sodium Arsenate.

తెల్లనిపొడి; ఈలవణము గాలి తగిలిన యెడల చెమ్మను గ్రహించుకొనును గనుక దీనియందలి పాషాణ (ఆర్సెనిక్) భాగము నిర్ధారణచేయ వీలు లేకుండును. దీనిని లోని కిచ్చుటవలన లైకర్ ఆర్సెనికాలిస్ ఉపయోగములే కలుగును. ఉబ్బస వ్యాధియం దుపయోగించెడి సిగరెట్లయందు యిది ముఖ్యమైన పదార్థమై యున్నది. అతిమూత్రవ్యాధియందు, లితియా కార్బనస్ 5 గ్రా॥ ను, 1/20 గ్రా॥ సోడియం ఆర్సెనేట్‌యును గలిపిన సోడా వాటరును భోజనముతోగూడ దినమునకు 2 లేక 3 సారులు పుచ్చుకొనుటవలన నుపయోగముగ నుండగలదు.

## సోడియై బెంజోస్ — Sodii Benzoas.

తెల్లని స్ఫటికాకారమును వహించిన పొడి; జ్వరహరముగను, మూత్రగుణము నకు వ్యతిరేకముగను, బనిచేయును; కీళ్లనొప్పుల యందును, గౌట్ వ్యాధియందును గూడ నుపయోగించును; మూత్రప్రకోపకారిగను బనిచేయును.

మోతాదు — 5 గ్రా॥ మొ॥ 30 గ్రా॥

## సోడా బైకార్బనస్ – Soda Bicarbonas.

తెల్లని పొడిగనుండును; 11 రెట్ల నీటిలో గలియును; 20 పాళ్ల సోడా బైకార్బనస్‌ను ప్రతిహత పఱచుటకు 17 పాళ్ల సిట్రిక్ ఆసిడ్‌నుగాని 38 పాళ్ల టార్టారిక్ ఆసిడ్‌నుగాని ఉపయోగించవలయును, అజీర్ణవ్యాధియందు విశేషముగ వాడుక చేయబడును; అతిమూత్రవ్యాధి యందును గుణము నిచ్చును. కొంచెము సోడాపొడిని అస్వస్థత నందియున్న పంటియొక్క చిగురుపై రుద్దుటవలనగాని, పంటియొక్క బెజ్జమునందు బ్రయోగించుట వలన గాని, పంటినొప్పి నిలచిపోవును. బిడ్డలకు వాంతులు కలుగుచున్నపుడు పెద్దమోతాదుల నియ్యనగును; కాని, మధ్యకాల మెక్కువగ లేకుండగ ననగా గంటకొకసారి 10 గ్రా॥ మొ॥ 15 గ్రా॥ వఱకు నియ్యవచ్చును.

ఆమ్లవ్యతిరేకముగ గూడ బనిచేయును: 24 గ్రా॥ సోడా బైకార్బనస్‌ను ½ ఔన్సు నిమ్మరసముతో గలిపిన యెడల పొంగు వచ్చునట్టి చక్కని ద్రవపదార్థ మేర్పడును.

సోడా బైకార్బనస్, గుణములయందు పొటాస్ బైకార్బనస్‌ను (దీనిని జూడుడు) జాలవఱకు బోలియుండును. దానివలెనే ఆమ్లవ్యతిరేకముగ బనిచేయును, తక్కువ రేగుదలను గలిగియుండి విశేషముగ జీర్ణింపబడు శక్తిని గలిగియుండును. జీర్ణాశయముపై పొటాసియం లవణముకంటె నిది యెక్కుడుశమనమును గలుగజేయును. కాని, మూత్రమునం దేర్పడు మూత్రకృచ్ఛ్రము విషయమై యిది పొటాసియం లవణముతో సమానమగు పనిని చేయజాలదు; ఎందుచేత ననగా యూరిక్ ఆమ్లము (Uric Acid) తో నిది యేర్పడెడి లవణములు కొంచెముగ మాత్రమే కరగునట్టి గుణము కలవై యున్నవి. దీనియొక్క ఉపయోగమువలన గౌట్ వ్యాధియందు కీళ్ళ సమీపమున నేర్పడెడి యిందు సంబంధ మగు సోడియం యూరేట్ (Sodium-Urate) పదార్థమును బట్టి యీగుణమును మనము గ్రహింపవచ్చును. మూత్రమునందు ఫాస్ఫరస్ సంబంధమగు నిలువపదార్థము లుండియుండిన యెడల సోడా బైకార్బనస్ హానిని గలుగజేయును. జీర్ణాశయసంబంధమగు అధికామ్లగుణము (Hyperacidity) ను

బ్రతిహాత పఱచుటకై 30 గ్రె॥ మొ॥ 60 గ్రె॥ వఱకును దీని నుపయోగించుటవలన మిగుల గుణము గలుగ గలదు; దీనిని దీర్ఘకాల ముపయోగించినను నుపయోగింప వచ్చును.

కాలిన స్థలములయందు గాని ఉడుకునీళ్లు మొదలైనవి పడిన స్థలములయందు గాని సోడియం బైకార్బనస్‌ను బైన బ్రయోగించుటవలన మంత్రమువలె బని చేయును. అధికమగు వేడిమి తగిలిన వెంటనే దీని నుపయోగించినయెడల, (లేకపోతే) బొబ్బయొక్క మిగుల బాధను గలుగజేయునట్టి స్థలము- శ్రమనివారణము నంది కొద్ది గంటలకాలము లోపలనే చుట్టు నుండెడి ఆరోగ్యసహితమగు చర్మమునకు ఎంతమాత్రమును భేదము లేకుండునట్లు చేయును.

గవదకాయలు వాపుదల నంది యున్న విషయములలో దీనిని గండూషముగ నుపయోగించుట వలన గాని, వాపుదల నందియున్న గ్రంథుల పై దీనిని రాయుట వలన గాని, మంచి గుణము కలుగును.

అనేకములగు చర్మవ్యాధుల యందు, 1 పైంటు జలములో 1 ఔన్సు సోడా బైకార్బనస్‌ను గలిపి పైన నద్దిన యెడల గుణముగ నుండును; కుక్కముండ్లు (Urticaria) అనబడు చర్మవ్యాధి మొదలగు వాటియందు శమనమును గలుగ జేయును. కందిరీగ కాట్లయందలి బాధను నివారణచేయును గాని, యీవిషయములో నిది అమ్మోనియాతో సమానముగ బనిచేయ జాలదు.

మోతాదు—అమ్లబ్రతిహతకారిగ బనిచేయుటకు 5 గ్రె॥ మొ॥ 30 గ్రె॥ వఱకు నీటిలో గలిపి యివ్వవలయును.

### సోడియం బ్రొమైడ్ — Sodium Bromide.

పలుకులుగా నుండెడి తెల్లనిపొడి; రుచికి సామాన్యపు ఉప్పువలెనే యుండును. మూర్ఛయందును, నిద్రరామియందును, పిచ్చిచేష్టల యందును, హిస్టీరియా యందును, నుపయోగించును. నిండు మోతాదులతో నిచ్చిన యెడల నల్లమందు అలవాటును మాన్పవచ్చును.

ఏదైనను నొక్క దానిని విడిగా నిచ్చుట కంటె 3 విధములగు బ్రొమైడ్లను యీక్రింది విధముగ గలిపి యిచ్చినచో నెక్కువ మంచిగుణము నిచ్చునని చెప్పబడుచున్నది:—పొటాసియం బ్రొమైడ్ 2, సోడియం బ్రొమైడ్ 2, అమ్మోనియం బ్రొమైడ్ 1; ఈపాళ్లుగ మొత్తమున పైమోతాదును మించనియ్యకుండ నుండవలయును.

మోతాదు — 5 గ్రె॥ మొ॥ 30 గ్రె॥

## సోడా కార్బనస్ — Soda Carbonas.

నిర్వర్ణ మైనట్టియు, మెరయు నట్టియు, పెద్దదైన స్ఫటికములవలె నుండును; చల్లని నీటిలో కలియును. చర్మవ్యాధుల యందును, గౌట్ వ్యాధియందును, మూత్రముయొక్క ఆమ్లస్థితిని పోగొట్టుటకును, నుపయోగింపబడును. పనిముట్లు తుప్పు పట్టకుండు నట్లును, జీవాణువులనుండి రాహిత్యత (Sterilization) నందుటకును వీటిని 100 కి 1 పాలు సొల్యూషనులో గాచెదరు.

మోతాదు — 5 గ్రా॥ మొ॥ 30 గ్రా॥

## సోడియం క్లోరైడ్ — Sodium Chloride.

సామాన్యలవణమును బరిశుభ్రపఱచుటచే నేర్పడునట్టిది; శరీరమునందలి ప్రతి అల్లికయందు నుండి, దీనిని నిలుపుచేయుటవలన ప్రాణమునకే భంగము కలుగు నట్టిదై యున్నది. శరీరమునందలి రసే యవయవభాగములు పెంపొందుటకును యిది ముఖ్యాధారమై యున్నది. ఇది లేకుండినచో జంతుజాలములు — ముఖ్యముగా పెరుగుచుండెడి జంతువులు — త్వరితముగ మరణము నందును. శాకభక్షణమును మాత్రమే చేయునట్టి జంతువులయందు ఈ లవణమునకై యుండెడి తృష్ణ కిదియే కారణమగుచున్నది. శాకాహారములయం దుండెడి మిక్కుటమగు పొటాసియం లవణములు రక్తమునందలి సోడియం లవణముతో జేరి పొటాసియం మిశ్రపదార్థములతో నే సోడియం లవణము గూడ వెలువరింప జేయబడును. ఈకారణముచేత శరీరమునందు సోడియం క్లోరైడ్ మఱల నవసరమగుచున్నది. కొద్దిమోతాదులలో నిది శరీరమునకు బలము నిచ్చును. పెద్దమోతాదులలో (1 ఔన్సు మొ॥ 2 ఔన్సులు) నిది కొంచెముగ విరేచనకారిగను వాంతికారిగను బనిచేయును.

ప్రతి 2 లేక 4 గంటల కొకసారి 1 డ్రాము మోతాదులో నిచ్చినయెడల కఫమును వెలిబుచ్చునట్టి గుణము కలదు; ½ ఔన్సు సోడియం క్లోరైడ్ను 3 లేక 4 ఔన్సుల జలములో గలిపి ఆసనముగుండ "యెనిమా"ను యిచ్చిన యెడల నులిపురుగులు నశింపు నందును.

3 గాలనుల నీటిలో 1 పౌను సోడియం క్లోరైడ్ను గలిపినచో సముద్రపు నీటికి బదులుగ నుపయోగించవచ్చును; సముద్రపుస్నానమునందలి గుణమునకు నందలి యీ లవణమే కారణమై యున్నది. సముద్రస్నానమువలన కీళ్లనొప్పులవ్యాధియందు మంచిగుణము కలుగును.

గొంతులోని అమసంబంధమగు పొరలు దీర్ఘవ్యాపితమగు నస్వస్థతను జెంది యున్న విషయములలో నొకప్పుడు 1 వంతు సోడియం క్లోరీడ్‌కు 30 వంతుల జల మును గలిపి గండూషముగ నుపయోగింపనగును.

మసలగాచి చల్లారబెట్టబడిన 1 పైంటు నీటిలో 1 డ్రాము సోడియం క్లోరీడ్ నువేసి కలరావ్యాధిలో రక్తములోనికి యింజక్టు చేయుటవలన గుణము నిచ్చునని చెప్పబడుచున్నది. రక్తమునందు మూత్రము గలిసియున్న విషయముల యందును, అతి మూత్రవ్యాధిసంబంధమగు మూర్ఛలయందును, రక్తస్రావములందును, దీనిని పెద్ద మోతాదులలో లోని కిచ్చుటవలనను, రక్తము లోనికి యింజక్టు చేయుటవలనను కొన్ని ప్రాణములు రక్షింపబడియున్నట్లు కొందఱు వైద్యశాస్త్రజ్ఞులు చెప్పు చున్నారు.

విరేచనకారిగను, వాంతికారిగను, పేగులలోని నులిపురుగులను నంతరింప జేయునదిగను బనిచేయును. (ఇందు గూర్చి 9-16 పుటలు గూడ జూడుడు.)

మోతాదు — 4 డ్రా॥ మొ॥ 8 డ్రా॥

## సోడియై హైపోఫాస్ఫిస్ — Sodii Hypophosphis.

ఈలవణము తెల్లని పలుకులుగ నుండును; సమానమగు తూనికగల నీటిలో గలియును. నరములకు బలవర్ధకౌషధముగ బనిచేయుచు, క్షయవ్యాధియందు తక్కిన హైపోఫాస్ఫయిట్లవలెనే యిదియు మంచిగుణము నిచ్చును.

మోతాదు—3 గ్రా॥ మొ॥ 10 గ్రా॥

## సోడియం అయొడైడ్ — Sodium Iodide.

తెల్లని పలుకులుగ నుండెడి పొడి; దీనియొక్క కార్యక్రమము పొటాసియం అయొడైడ్‌ను బోలియే యుండును, కాని, దానికంటె పెద్దమోతాదులలో దీనికొని నను జీర్ణాశయము అస్వస్థత నంద నేరదు గావున దీని నెక్కువ లాభకరముగ నుపయో గింప వచ్చును; ఇది గుండెకును మెదడునకును పొటాసియం లవణము కంటె తక్కువ నిరసతను గలుగజేయును. ఇందునుగూర్చి తక్కిన వివరముల కొఱకై అయొడిన్ క్రింద జూడవలయును.

మోతాదు — 5 గ్రా॥ మొ॥ 20 గ్రా॥

## సోడియం నైట్రేట్—Sodium Nitrate.

తెల్లనైనదటియు, గాలి తగిలినయెడల ద్రవాకారమును వహించునదటియు పలు కులుగ నుండును; నీటిలో బహుత్వరితముగ గలిసిపోవును తెరలతో గూడిన ఉబ్బస

సంబంధమగు ఆయాసమునందు బాగుగ బనిచేయును; అమిల్ నైట్రిటిస్, నైట్రోగ్లిసరీన్—వీటియొక్క గుణములనే కలిగియున్నది గాని, అమిల్ నైట్రిటిస్ కంటె నిది నిశ్చయముగ నెక్కువ స్థిరమైన గుణమును గలుగజేయును; తెర వచ్చుటకు ముందుగనే దీనిని యిచ్చిననే తప్ప త్వరితముగ బనిచేయలేదు. మూత్రగ్రంథులయందు మర్మాంసకణములు పెరిగిన స్థితి (Granular Kidney) యందు పరిశుద్ధరక్తనాళములయొక్క అతిశయమగు బిగువుదల వ్యాపారము ప్రారంభమయినపుడు దీని యుపయోగమువలన మంచి గుణఫలితములు గనుగొనబడెను: ఈవ్యాధిలో ముఖ్యముగ గుండె బలహీనత నంది యున్న విషయమునందు ఈ మందు బాగుగ బనిచేయును.

దీనిని పెద్దమోతాదులలో (5 గ్రె॥) నుపయోగించిన యెడల, ముఖమంతయు నెర్రబారి, శిరముపైపుల దడదడ కొట్టుకొనుట కలిగి, నాడి త్వరితగతి నంది, పరిశుద్ధరక్తనాళముల యందు రక్తప్రచారబలము తగ్గిపోయి — యిట్టి దుర్లక్షణములు గనబడును.

దీనియొక్క క్రమమైన ఉపయోగమునందు ట్రినిట్రిన్ యొక్క వాడుకలో గలిగెడి యంత విశేషమగు తలనొప్పి కలుగనేరదు.

మోతాదు — 1 గ్రె॥ మొ॥ 2 గ్రె॥

## సోడియై ఫాస్ఫస్—Sodii Phosphas.

నిర్వర్ణమైనట్టియు, పెద్దదైనట్టియు, కొంచెముగ మెరయునట్టియు, పలుకులుగ నుండును; మిక్కిలి ఉపయోగమైన లవణసంబంధమగు విరేచనకారి. పేగులయొక్క అస్వస్థత యేర్పడియున్న టైఫాయిడ్ జ్వరము మొదలగు వాటియందు లవణవిరేచనకారుల నియ్యగూడని విషయములలో దీని నియ్యవచ్చునని డాక్టరు విల్లాగారు చెప్పుచున్నారు. దీనియందు అరుచి లేకయుండుటచేత సామాన్యలవణమునకు బదులుగ దీని నుపయోగించి జ్వరములయందు సాధువిరేచనము లగునట్లుల జేయవచ్చును. కొద్ది మోతాదులలో నిచ్చిన యెడల నిది తక్కిన సోడియం పొటాసియం లవణములవలెనే అమ్లవ్యతిరేకముగను, మూత్రప్రకోపకారిగను, పేగులయందలి నులిపురుగులను నశింపు నందింపజేయునదిగను, నుపయోగించును.

మోతాదు — మఱల మఱల నిచ్చుటకుగాను ½ డ్రా॥ మొ॥ 2 డ్రా॥;
ఒకే మోతాదుగ నుపయోగించుటకు 2 డ్రా॥ మొ॥ 4 డ్రా॥

## సోడా సాలిసైలస్ — Soda Salicylas.

(సాలిసైలిక్ ఆసిడ్ క్రింద జూడవలయును.)

సాలిసైలిక్ ఆసిడ్ గాని, సోడా సాలిసైలిస్ గాని, తీవ్రవస్థితియందున్న కీళ్ళ నొప్పులలో మంచి ఫలితముల నిచ్చును; సామాన్యముగ 24 గంటల లోపుగా జ్వరమును దగ్గించును. 12 గంటల లోపుగనే తఱచుగ బాధను శరీరపువేడిమిని స్పష్టముగ తగ్గుదల నందింప జేయును.

20 గ్రా॥ సాలిసైలిక్ ఆసిడ్ నుగాని, సోడా సాలిసైలస్‌ను గాని, యేదైన కషాయములో గలిపి ప్రతిరెండుగంటల కొక మోతాదు చొప్పున, బాధయొక్క యుద్రేకావస్థను బట్టియు, జ్వరముయొక్క తీవ్రదశను బట్టియు, 3 మొదలు 6 మోతాదుల వఱకు నిచ్చుట మంచి పద్ధతియై యున్నది. దినమంతయు నుపయోగించునది 2 డ్రాములకు మించ గూడదని కొందరు డాక్టరులును, 3 డ్రాములకు మించ గూడదని మఱికొందరు డాక్టరులును నభిప్రాయము నిచ్చుచున్నారు.

మొదటి మోతాదుయొక్క లేక రెండవ మోతాదుయొక్క అనంతరమే రోగికి గుణము కనుపించును; 24 లేక 48 గంటలపిమ్మట 3 డిగ్రీలు మొదలు 5 డిగ్రీలవఱకును జ్వరము తగ్గుదల నందుట అసామాన్యము కాదు. ఈకాలములో నొకప్పుడు వ్యాధియొక్క అన్నిలక్షణములును బూర్ణముగ నశింపు నందవచ్చును.

దీనియొక్క ఉపయోగము ౦, జ్వరమువలన గలిగెడి గుండె అస్వస్థతల యెడల నాస్పదము తగ్గిపోవు ననియు, యీచికిత్సచే వ్యాధయొక్క కాలగతి క్షీణత నందు ననియు, దృఢముగ జెప్పబడు చున్నది. ఈ మందును నిలిపివేసినయెడల బాధయును జ్వరమును మఱల గలుగును, కాని, మందును మఱల ప్రారంభించిన యెడల నీ గుణములు లొంగుదల నందును, జ్వరము కనుపడినది మొదలు పదిదినముల వఱకును నీమందును తక్కువ మోతాదులలో నియ్యవలయును. ఇట్టి చికిత్సచే నీవ్యాధి తప్పకుండ కుదిరిక నంచు నని డాక్టరు లాదాంగారు చెప్పుచున్నారు.

కీళ్లనొప్పుల వ్యాధియందు మిక్కిలి యెక్కువగు జ్వరము కలిగినప్పుడు జ్వరముయొక్క తగ్గుదలకు సోడా సాలిసైలస్ మీదనే నమ్మియుండుట అంతగా మంచిదికాదు. రోగికి యిటిసితియందు కోల్డుబాత్ను (50,51 పుటలు చూడుడు) యిచ్చి జ్వరమును తగ్గింపుజేయుట మంచిది. లేనిచో, అతిశయజ్వరమునం దెప్పుడును గుండెకాయకు అస్వస్థత కలుగుట కొప్పద ముండి అపాయము కలుగవచ్చును.

ఇతర వ్యాధులలో (టైఫాయిడ్ జ్వరము, న్యుమోనియా మొదలైనవి) కూడ జ్వరమును దగ్గించుట యందు సోడా సాలిసైలస్ ఉపయోగముగ కనుగొన బడెను గాని కీళ్ల నొప్పులయందు దప్ప తక్కిన వ్యాధుల యం దిది క్వైనీన్‌కు మించిన పనిని చేయజాల కున్నది.

దీనియొక్క ఉపయోగము వలన పైత్యస్రావ మధికమయి, పైత్యస్రావము యొక్క ద్రవాకారమును నధిక మగును; దీనికుండెడి ఈ గుణములచే, పైత్యస్రావ సంబంధ మగు రాళ్ళు యేర్పడినపుడు దీని నుపయోగించ వచ్చును.

తలనొప్పిని శాంతిపఱచుటకు కొద్ది మోతాదులలో దీని నుపయోగించనగును, పెద్దమోతాదులలో, పార్శ్వపునొప్పి, తుంటినొప్పి, నడుమునొప్పి—వీటియం దుప యోగించును. గర్భవతులగు స్త్రీలకు గర్భస్రావమును గలుగ జేయవచ్చును గనుక పెద్ద మోతాదులలో నుపయోగించ రాదు.

మోతాదు — 10 గ్రా॥ మొ॥ 30 గ్రా॥

సోడా సల్ఫస్ — Soda Sulphas.

పెద్దవిగను, మెరయునవిగను, నున్న పలుకులు; దీనికె గ్లాబర్సు సాల్టు (Glauber's salt) అనుపేరుగలదు. నీళ్లవిరేచనము లగునట్లు చేయును. పేగులయందలి గ్రంధు లకు జారుకుదనమును బుట్టించుటను బట్టి, దీనిని నిశ్చితమైనట్టియు క్షేమకర మైనట్టియు విరేచనకారిగ నుపయోగించవచ్చును. దీనిని ముఖ్యముగ పశువ్యాధి చికిత్సలయం దుపయోగించుచున్నారు. డాక్టర్ రూదర్‌ఫర్డ్‌గారి పరిశోధనల వలన, నిది కాగ్జ మునకు జారుకుదనమును బుట్టించుననియు, పైత్యసంబంధ మగు రాళ్లు యేర్పడినపుడు 1 డ్రాము మోతాదులో దీని నియ్యవచ్చుననియు, తెలియుచున్నది. రక్తస్రావ ములు కలుగు చున్నపుడు ప్రతిగంటకును దీనిని 2 గ్రా॥ మోతాదులో నిచ్చినయెడల రక్తమునకు గడ్డకట్టునట్టి గుణ మధికమై రక్తస్రావము నిలచిపోవును.

మోతాదు — మఱల మఱల నిచ్చుటకు 30 గ్రా॥ మొ॥ 120 గ్రా॥. ఒకే మోతాదుగ నైనచో 2 డ్రా మొ॥ 4 డ్రా॥

సోడా సల్ఫిస్ — Soda Sulphis.

దీనిని పైదానిలో బొరపడ కూడదు; ఇదియు ఘనపదార్థము; దీనియందు గొంచెముగ క్రిములకుండ జేయునట్టి గుణము గలదు; చర్మవ్యాధులలో దీని సొల్యూ

వనును బైన రాయవగును, జీర్ణాశయాస్వస్థతలయందు జీర్ణాశయములో కుళ్లుదనము గలుగకుండ జేయుటకు దీనిని లోని కియ్యవచ్చును.

మోతాదు — 5 గ్రె॥ మొ॥ 20 గ్రె॥

## స్ట్రామోనియం — Stramonium.

స్ట్రామోనియం అనగా ఉమ్మెత్త; దీనియొక్క యెండిన ఆకులు కొంచెముగ నాకుపచ్చవర్ణము కలిగి యుండును. దీనియొక్క గుణములు బెలడోనా వలెనే యుండును. రొమ్ముపడిసెము సంబంధమగు తెరలు కలుగునప్పుడును, ముఖ్యముగ నుబ్బస వ్యాధియందును, దీనియొక్క యెండినఆకులను, విడిగాగాని, పొగాకుతో గలిపిగాని, చుట్టను చుట్టి కాల్చుటవలన నుపయోగ ముండగలదు. 1 ఔన్సు ఉమ్మెత్త ఆకుల పొడుమును, ½ ఔన్సు సోపువిత్తుల (Anisi) పొడుమును, ½ ఔన్సు సూరేకారము (Nitre) ను— యీమూడిటి పొడుమును గలిపి నిప్పుమీద వేయుటవలన గలిగెడి పొగను వాసన జూచుటవలన నుబ్బసవ్యాధియందలి ఆయాసమున కుపయోగించునని డాక్టరు సాయర్ గారు చెప్పుచున్నారు. బజారులయందు విశేష మగు ఖరీదుల కమ్మెడి హిమ్‌రాడ్సు అస్తమా క్యూర్ (Himrod's Asthma Cure) మొదలగు నౌషధముల యందలి పాళ్లు కొంచె మెచ్చుతక్కువగ నిదేపద్ధతి ననుసరించి యుండును. ఉమ్మెత్త విత్తులనుండి చేయబడెడి యెక్స్ట్రాక్టును ½ గ్రె॥ మొ॥ 1 గ్రె॥ మోతాదులలో ఉబ్బసపుతెర వచ్చుటకు కొద్ది గంటలకు ముందుగా నిచ్చినయెడల నట్టి తెరను రాకుండ జేయును.

దీనియందు మగతను గలుగజేయునట్టి గుణమును, యీడుపును బోగొట్టు నట్టి గుణమును, గలవు. బెలడోనా, హాయొశామస్, స్ట్రామోనియం, దతూరా (Datura) ఇవియన్నియు నొక సముదాయము నందలివే యైయున్నవి.

### టించ్చర్ స్ట్రామోనియై—Tincture Stramonii.

దీనిలో 5 భాగములకు 1 భాగము స్ట్రామోనియం ఉండును.

మోతాదు— 5 మి॥ మొ॥ 15 మి॥ (నీటిలో గలిపి)

### యెక్స్ట్రాక్టు ఆఫ్ స్ట్రామోనియం—Extract of Stramonium.

నల్లనైన ముద్దవలె నుండును.

మోతాదు— ¼ గ్రె॥ మొ॥ 1 గ్రె॥ (మాత్ర రూపమున)

## స్ట్రొఫాంతస్ - Strophanthus.

ఆఫ్రికాఖండ సంబంధమగు నీపేరుగల చెట్టుయొక్క విత్తులకు గొన నుండెడి ముల్లును దీసివేసి, విత్తులయొక్క తక్కిన భాగమును యీ సంబంధ మగు నౌషధ ములయం దుపయోగింతురు.

దీనిని ముఖ్యముగ గుండెవ్యాధియం దుపయోగింతురు. దీనిని పెద్ద మోతా దులలో నుపయోగించిన యెడల స్నాయువులకు ముందుగ నధిక మగు చురుకుదనము ను బుట్టించి, పిమ్మట వాటికి నిరసతను గలుగజేసి, అంత్యమునకు గుండెయొక్క నడకను గూడ నిలిపి వేయును. దీనియొక్క గుణములు చాలవఱకు డిజిటాలిస్‌ను బోలి యే యుండునుగాని, గుండెపై దానికంటె నిది యెక్కువ బలీయముగ బనిచేయును; ఈకార్యక్రమమువలననే రక్తపరిణామము అధికమగును, కాని యిది డిజిటాలిస్ వలె సరాసరిగ పరిశుద్ధరక్తనాళములను ముడుచుకొనునట్లు చేయుటయందు అంతగా శక్తిగలిగి యుండలేదు.

ఇది మూత్రపరికోపకారియునై యున్నది గాని డిజిటాలిస్ యంతగా కాదు; జ్వరమును తగ్గించునదియునై యున్నట్లు చెప్పబడుచున్నది. ఎట్టి అస్వస్థత వలన జనించినట్టిదైనను గుండెవ్యాధియందు యిది పనిచేయును గాని, డిజిటాలిస్ నకు రెండవపక్షముగ మాత్రమే బనిచేయును. ఇదియు గాక, డిజిటాలిస్‌ను శరీరము భరింపజాలనట్టి స్థితులయం దున్నపుడు దీనిని వాడుక చేయవచ్చును. ఇది శరీరము నుండి వెలువరింపబడునది గాక మిగులునది కొంచెముగ మాత్రమే శరీరమునందు నిలువ యుండి, డిజిటాలిస్ కంటె దక్కువ జీర్ణాస్వస్థతను గలుగ జేయును; దీనియొక్క ఫలితము లంతగా నిలుకడగ నుండకపోయినను, డిజిటాలిస్ కంటె నిది త్వరితముగ బనిచేయును. డిజిటాలిస్‌యొక్క ఉపయోగమువలననే యస్వస్థతలైనను గన్పట్టి దానిని నిలిపివేయవలసి వచ్చినపుడు స్ట్రొఫాంతస్‌ను ఉపయోగించుట మేలై యున్నది. సామాన్యస్థితియం దుండెడి గుండెవ్యాధియందు, రెండుమాసములకాలము డిజి టాలిస్‌ను వాడుకచేసి, పిమ్మట నొకమాసము ఈస్టన్‌స్ సిరప్ (Easton's Syrup) తో గూడ స్ట్రొఫాంతస్‌ను వాడుక చేయుట వలన మిగుల సంతుష్టికరమగు ఫలిత ముల నిచ్చును.

### టింక్చర్ స్ట్రొఫాంతస్ — Tincture Strophanthus.

స్ట్రొఫాంతస్ సంబంధమగు నౌషధములలో ముఖ్యమైన దిదియే యైయున్నది.

**మోతాదు— 5 మి॥ మొ॥ 15 మి॥**

## సల్ఫొనల్—Sulphonal.

నిర్వర్ణమైనట్టియు, వాసన లేనట్టియు, రుచి లేనట్టియు, నీటిలో గలియు నట్టియు, పలుకులుగ నుండును. దీనియొక్క ఉపయోగమువలన నిద్ర కలుగును; నొప్పిని బోగొట్టునట్టి గుణము దీనియందు లేదు. నొప్పితో సంబంధము లేకుండగ గలిగెడి నిర్నిద్రావస్థయందు, క్లోరల్ హైడ్రేస్యం నుండెడి దుర్గుణములు లేకుండ, సల్ఫొనల్ యొక్క వ నిశ్చితముగ బనిచేయును. సల్ఫొనల్ యందు శరీరములో నిలువ యుండెడి గుణము కొంచెముగ నున్నను, దీనియొక్క మోతాదును హెచ్చింప జేయవలసిన అవసరము లేదు; ఇదిగాక, నల్లమందు వలె నిది అలవాటు యేర్పడిన విషయములును గనబడ జాలవు. సల్ఫొనల్ బహు నెమ్మదిగ బనిచేయును గావున నిద్ర వెంటనే రాజాలదు. ఒక్కొకప్పుడు మూడునాలుగు గంటల కాలము గూడ బట్టవచ్చును. దీనియొక్క ఉపయోగమువలన నొకప్పుడు మగత మాత్రమే కలిగి యీ మగత ఆ దినమున జాలసేపటి వఱకు వ్యాపించి యుండవచ్చును; దీనియొక్క ఉపయోగానంతరము సకాలములో పూర్ణమైనట్టి విశ్రాంతికరమగు నిద్ర రానప్పుడు, యిట్టి మగత కలుగవచ్చును; ఈ మగత తఱచుగ మరునాటి రాత్రివఱకును వ్యాపించి అప్పుడు దీనియొక్క ఫలితముగ మంచి నిద్ర కలుగవచ్చును. ఈ కారణము చేతనే, సాధునిర్నిద్ర (Simple Insomnia) యందు దినము విడిచి దినము పూర్ణమైన మోతాదుల నియ్య నగునని డాక్టరు విట్లాగారు చెప్పుచున్నారు, దీర్ఘమైన మనఃపరిశ్రమను జెందియున్న బారిస్టరుకు నిద్ర పట్టని విషయములలో పూర్ణమైన మోతాదు నిచ్చుటకు డాక్టర్ శావేజిగారు సిఫారసు చేయుచున్నారు. దీనియందు గుండెకు బలహీనతను గలుగజేయునట్టి కాని, శ్వాసకోశాస్వస్థతలను గలుగ జేయునట్టి కాని, గుణములు లేవు. ఎప్పుడైన నొకప్పుడు మాత్రము మనోవిభ్రమము, తలతిప్పుడు, చిత్తచాంచల్యము—యివి నిద్రకు బదులుగ సంప్రాప్తమై, మెలకువ గలిగిన పిమ్మటను గూడ కొంతవఱకు నిలిచి యుండును.

దీని నుపయోగించిన పిమ్మట నొకప్పుడు స్నాయుపటుత్వము తగ్గిపోయి వెఱ్ఱి ఆకారమును వహించి, పూర్ణమైన మోతాదుయొక్క ఉపయోగానంతర మైనచో త్రాగుబోతువాని స్థితిని బోలియుండును. మూత్రమందు శ్వేతధాతువు గనుపించ వచ్చును.

పరుండుటకు 1 గంట మొదలు 3 గంటల పూర్వము 30 గ్రెయినుల నియ్యవచ్చును. దీనిని బ్రాందిలో గలిపి యిచ్చునెడల బహు త్వరితముగ బని చేయును గనుక, రోగి పరుండబోవు ముందరనే యీ ప్రకార మియ్య నగును.

దీనిని మెత్తని పొడిగ జేసి, నాలుకపై వేసికొని, నీళ్ళను త్రాగుట మూలమున లోనికి బోనియ్యను వచ్చును.

ఏ విధమైన బాధయు లేకుండగ నిద్రపట్టని విషయములలో దీనిని ఉపయోగింపనగును. బిడ్డలకు నిద్రను గలిగించుట కిది మంచి యౌషధమై యున్నది.

మోతాదు—10 గ్రా॥ మొ॥ 30 గ్రా॥

---

## సల్ఫర్ (గంధకము)—Sulphur.

గంధకము 2 విధములై యున్నది.

(1) పసుపు వర్ణము కలిగినట్టి మెత్తనిపొడి; ఈ మెత్తనిపొడికి ప్రెసిపిటేటెడ్ సల్ఫర్ (Precipitated Sulphur) అందురు; దీనికి మిల్క్ ఆఫ్ సల్ఫర్ (Milk of Sulphur) అని గూడ వాడుకపేరు గలదు.

(2) సబ్లయిమ్‌డ్ సల్ఫర్ (Sublimed Sulphur) పలుకులుగ నుండును; దీనికి ఫ్లవర్స్ ఆఫ్ సల్ఫర్ (Flowers of Sulphur) అను పేరుకూడ గలదు.

సల్ఫర్‌ను పూర్ణమైన మోతాదులో (2 డ్రాములు) నిచ్చిన యెడల జీర్ణాశయమునం దెట్టి మార్పును గలుగకుండ, అనంతరము కొంత భాగము మధురసము (Pancreatic Juice) తోడను పైత్యస్రావము (Bile) తోడను గలిసి, రక్తప్రచారమునందు జేరి చెమటగుండ గంధకమిశ్రమైన జలవాయు (Sulphuretted Hydrogen) రూపమున వెలువడును; మఱికొంత భాగము మూత్ర గ్రంథులచే మూత్రముగుండ వెలువరింప జేయబడును; ఇంక గొంతభాగము శ్వాసకోశముల యొక్క అమప్రదేశములకు జారుకుదనమును బుట్టించి తదవయవములగుండ బయలు వెడలును. ప్రేగులయం దుండెడి మిగతభాగము పైత్య స్రావమూలమున మార్పుజెంది సాధువగు రేగుదలను గలుగ జేయునదిగ బనిజేయును. ఈ రేగుదలవలన మృదువైన పెద్ద విరేచనము లగును; విరేచనములు మిక్కుటముగ మాత్రము గానేరవు. పైత్యస్రావము హీనమైన విషయములలో దీని నిచ్చినయెడల పైత్యస్రావము నధికము చేసి శరీరమును క్రమస్థితిలోనికి దీసికొని వచ్చును. ఇదియును గాక, దీనియందు కుస్తీ(?) దనమును గలుగజేయకుండ నుండెడి గుణము కూడ కలదు.

రక్తస్రావముతో గూడియున్న మూలశంకవ్యాధియందు, దీని కుండెడి విరేచనకారిగుణమును బట్టి దీని నుపయోగింపనగును; ఇందువలన రక్తస్రావ గుణము తగ్గిపోయి శమనముగ నుండును.

చర్మవ్యాధులయందు విరేచనకారిగ నిది నుపయోగింపబడును గాని చర్మముపై జురుకుతో గూడిన వాపుదల యుండిన యెడల నతిశయమయి కురుపులుగ నేర్పడుట కాస్పదమును గలుగజేయును.

గంధకము నందు కఫమును వెలిబుచ్చునట్టి గుణముకూడ గలదని తెలియనగును. సల్ఫర్ లాజెంజెస్ (Sulphur Lozenges )అనగా గంధకముతో జేయబడిన మందు బిళ్లలను, ఆసనబాధలతో గూడిన దీర్ఘవ్యాపితమగు మలబద్ధము నందును, దీర్ఘవ్యాపితమగు కీళ్లనొప్పులయందును, నుపయోగించుటకు వీలుగను అనసహ్యాముగను నుండును.

గంధకమునం దుండెడి యన్ని సుగుణములును వృక్షసంబంధమగు పదార్థములలో నీరుల్లిగడ్డ (Onion) యందు (దానియందు విశేషపరిమాణముగ నుండెడి గంధకమును బట్టి) కనుగొన బడుచున్నవి. నీరుల్లిగడ్డను ఒకగంట లేక రెండుగంటల కాలమువఱకు నుడుకబెట్టి పరుండబోవు ముందర దినినయెడల, నిశ్చితమైన విరేచనకారిగ బనిచేయును. కఫమును వెలిబుచ్చుటయందుకూడ సహాయము జేయును. శ్వాసకోశనాళముల యందలి పెద్దవాటియొక్క దీర్ఘవ్యాపితమగు ఆమసంబంధమైన వాపుదలలయందు, దీనిలో నుండెడి గంధకమువలననేగాక యిం దుండెడి వాసనద్రవసహాయముచేత, నితరమగు నౌషధములకంటె గూడ హెచ్చువ బాగుగ బనిచేయునని చెప్పబడుచున్నది.

తుంటినొప్పియందు, తుంటిపై గంధకమును రుద్ది, ఆ యవయవముపై గంధకపు పొడి నొక పొరగా వేసి, అందుపై ఫ్లానల్ను గట్టి యుంచుటవలన, మంచి గుణఫలితములు కలిగియున్నట్లు తెలియబడుచున్నది. ఇట్టి పద్ధతివలన గంధకము శరీరమునందు త్వరితగతిని బ్రవేశమగును.

సల్ఫర్ సంబంధమగు కాల్సియం సల్ఫయిడ్ (Calcium Sulphide) కురుపులను నయము చేయుటయందు విశేషముగ కొన్నిక నందియుండెనుగాని డాక్టర్ విట్లాగారు యీ యౌషధముకంటె నీరుల్లిగడ్డయే యెక్కువ నిశ్చితమైనట్టియు తక్కువ దుస్స్వహమైనట్టియు గుణములను గలిగియున్నదని తమ స్వానుభవముతో గూడిన యభిప్రాయము నిచ్చియున్నారు.

గజ్జియందు పైన రాయుటకుగాను గంధకము మంచి చికిత్సయై యున్నది; వేడి నీళ్లతో పరిశుభ్రముగా గజ్జిభాగమును గడిగి, సబ్బుతోగూడ రుద్ది, పిమ్మట సల్ఫర్ ఆయింట్మెంటును పూర్ణముగ రాచినయెడల, మంచిగుణము కలుగగలదు. 4 ఔన్సుల గంధపుపొడిని 4 ఔన్సుల ఉడుకబెట్టబడిన సున్నముతో గలిపి— యీరెంటిని 40 ఔన్సుల నీటితో గలిపి ఉడుకబెట్టి, చల్లారిన పిమ్మట నీ సొల్యూషను గజ్జిప్రదేశముల రాచినచో నెక్కువ ఉపయోగకారిగ నుండునని చెప్పబడు చున్నది; దీనిని పైన తేలికగా రాయనగును. దీనిని పైనరాసినవెంటనే గంధక మిశ్రమైన జలవాయు వేర్పడి గజ్జిసంబంధమగు పురుగును నశింపజేయును. ఆయింట్మెంటునం దుండెడి జిగురు దీనియం దుండదు; ఇదిగాక. యిట్టివిషయములో ముందుగ రుద్దుట యవసరములేదు. గావున మంటను బుట్టించదు

గట్టిగనుండెడియు, కాయలవలె నుండెడియు, మొటిమలను సల్ఫర్ ఆయింటుమెంటును బాగుగ రుద్దనగును.

ప్రెసిపిటేటెడ్ సల్ఫర్ — Precipitated Sulphur.

కొంచెముగ పసుపువర్ణము గలిగి, మెత్తని పొడిగ నుండెడిది. విరేచనకారిగ బనిచేయును.

మోతాదు — 20 గ్రె॥ మొ॥ 60 గ్రె॥

సబ్లైమ్డ్ సల్ఫర్ — Suublimed Sulphur.

ఇసుకవలె నుండి ఆకుపచ్చ పసుపు వర్ణములను గలిసియున్న రంగును వహించి యుండును; విరేచనకారిగను, క్రిమిసంహారిణిగను, బనిచేయును; గజ్జిమందునందు దీని నుపయోగించవలయును.

ట్రొచిస్కస్ సల్ఫ్యూరిస్ — Trochiscus Sulphuris.

సల్ఫర్ లాజెంజెస్ అనబడున విదియే; ఒక్కొకటి 5 గ్రె॥ ఉండును; దీనియందు సల్ఫర్కు తోడుగా క్రీం అఫ్ టార్టార్ (Cream of Tartar) చక్కెర, జిగురు. టింక్చర్ అఫ్ ఆరంజ్ (Tincture of Orange) ఉండును.

మోతాదు — 1 మొదలు 6 లాజెంజెస్ (బిళ్లలు).

సల్ఫర్ ఆయింట్మెంట్ — Sulphur Ointment.

సబ్లైండ్ సల్ఫర్ 1 ఔన్సును బెంజోయేటెడ్ ల్యార్డ్ 9 ఔన్సులతో చేర్చి రుద్దుటవలన నేర్పడును; పసుపురంగును వహించి యుండును; దీనిని గజ్జియం దుపయోగింప నగును.

## సల్ఫరస్ అయొడైడ్ — Sulphurus Iodide.

4 ఔన్సుల అయొడిన్‌ను 1 ఔన్సు సబ్లైండ్ సల్ఫర్‌తో జేర్చి కాచుట వలన నేర్పడెడి, బూడిద నలుపు వర్ణములు గలిసిన మెరయునట్టి ఘనపదార్థము.

పైన రాయుటవలన అంతరావయవములలోని రేగుదలను బోగొట్టి, క్రిమి జాలములను గూడ నశింపు నంద జేయును; లోనికి బుచ్చుకొన రాదు.

---

## టామరిండ్ (చింతపండు) — Tamarind.

దీనియొక్క గుంజును సాధారణముగా విడిగా నుపయోగించరు; గింజలు తీసిన దీనిని 1 ఔన్సు మోతాదును యిచ్చిన యెడల సాధువిరేచనకారిగ వర్తించును. ఇండియా దేశమునందు అను దినమును నెద్దియో యొక రూపమున దీనిని దినుట కలవాటు పడినవార లందు యిది యెంతవఱకు బనిచేయునో అనుమానాస్పదమై యున్నది; దీనియందు జ్వరమును దగ్గించునట్టి గుణము కూడ గలదని చెప్పబడుచున్నది. మసల గాగిన 4 ఔన్సుల నీటిలో 1 ఔన్సు చింతపండును వేసి యొక అరగంట నిలువ యుంచి, వడపోసి దీనికి 20 ఔన్సుల పాలను గలిపి పుచ్చుకొనినయెడల, జ్వరమును దగ్గించు నని యెంచబడు చున్నది; దీని నొక్కసారిగ బుచ్చుకొనుట అధిక మని తోచిన యెడల, తగ్గించియు బుచ్చుకొన వచ్చును. చింతపండు నం దుండెడి సిట్రిక్ ఆసిడ్ మొదలగు వాటియొక్క అమ్లగుణములను బట్టి దీనివలన నీ ఫలితము గలుగు చున్న దని తలపబడు చున్నది.

---

## టెరిబీన్ — Terebene.

బలమైన వాసన గలిగి నిర్వర్ణమైనట్టి ద్రవపదార్థము; అయిల్ ఆఫ్ టర్పన్‌టీన్ (కర్పూర తైలము) తో సల్ఫ్యూరిక్ ఆసిడ్ ను గలిపి, ఆవిరిమార్గమున దీనిని ద్రవపఱచుటనే టెరిబీన్ యేర్పడు చున్నది.

ఇది కుళ్లకుండ జేయుటయందు మిగుల బలీయమైనదై దుర్వాసనను గూడ బోగొట్టి, సహ్యమగు మంచి వాసనను గలిగియున్నదై యున్నది. 1 పైంటు ఉడుకు నీళ్లలో, ½ డ్రా॥ చొప్పున సమాన భాగములుగ టెరిబీన్‌ను, థైమాల్ (వాము

పువ్వు) ను, కార్బాలిక్ ఆసిడ్ ను, గలిపి క్షయవ్యాధియందు వాసన జూచుట కుప యోగింతురు.

దీర్ఘవ్యాపిత మగు రొమ్మునొపడిసెము (Bronchitis) నందును, శీతకాలము నందు వచ్చుచుండెడి దగ్గు నందును, యిది జయప్రదమగు ఫలితము నిచ్చి యుండి నటుల తెలియుచున్నది.

ఏడైన షరబతునందు 10 మి॥ మొ॥ 15 మి॥ వఱకుగల మోతాదులో దినము నకు 3 సారు లియ్య వచ్చును, దీనియందు చురుకును బుట్టించి కఫమును వెలిబుచ్చు నట్టి గుణముగూడ కలదు.

మోతాదు — 5 మి॥ మొ॥ 15 మి॥

---

## ఆయిల్ ఆఫ్ టర్పన్‌టీన్ — Oil of Turpentine.

స్వచ్ఛమైనట్టియు, నిర్వర్ణ మైనట్టియు, ఆవిరిమూలముగ దయారు చేయబడు నట్టియు, చమురు; దీనికే కర్పూరతైల మందురు. బజారులలో దొరుకునట్టిదాని యందు సామాన్యముగ కిరొసెన్ ఆయిల్ ను గలుపుదురు. కావున పరిశుభ్రమైన దానిని స్వీకరింప నగును. ఇది బహుశః గుగ్గిలమునుండి తయారు చేయబడుచున్నది. నొప్పు లున్నట్టి స్థలముయందు బైన రాయ నగును. ఫ్లానల్ గుడ్డను మిగుల వేడిగల నీటిలో ముంచి, నీటిని పిండివేసి, అందుపై కర్పూరతైలమును జల్లి, అస్వస్థత నంది యున్న కురుపునకు గాని, యితర శరీరభాగమునను గాని, ప్రయోగించి బాధగా నుండ కుండునటుల దీనిని వెంట వెంటనే దీయు చుండవలయును. దీనియందు క్రిములకుండ జేయు గుణ మున్నది; క్రిమిజాలములతో గూడియున్న చర్మవ్యాధుల యందును, పక్కు కట్టుచున్నట్టి కురుపుల యందును, నిది గుణము గలుగ జేయును.

కొద్ది మోతాదులలో నిది చర్మము ననుసరించియుండెడి సూక్ష్మరంధ్రము లను ముడుచుకొనునట్లు చేయును; దీనిని వాసన జూచుటవలన నందలి ఘాటునకు శ్వాసకోశసంబంధ మగు రక్తనాళములు ముడుచుకొను నట్లు చేయబడి, అందు సంబంధ మగు స్రావము అణచివేయబడును.

పెద్ద మోతాదులలో శరీరమున కంతకును జురుకుదనమును బుట్టించును; ఇది విరేచనములను గలుగజేయుట మూలమునగాని, లేక విడిగాగాని, ప్రేగులనుండి వెలు వరింపబడక పోయినయెడల, మైకమును గలుగజేయును; మిగుల పెద్ద మోతాదులలో

నైనయెడల మెదడుయొక్క కార్యక్రియములకు బలహీనతను గలుగజేసి, రక్తప్రచార బలమును గూడ తగ్గించి, శ్వాసకోశములయొక్క పనికిగూడ క్షంగము కలుగును.

ఇది రక్తప్రచారమునందు గలిసిన పిమ్మట, చర్మముగుండ చెమటమూలము నను, శ్వాసకోశసంబంధ మగు అమప్రదేశముల గుండె కఫమూలమునను, మూత్ర గ్రంథులగుండ మూత్రమూలమునను — శరీరమునుండి వెలువడును. ఇది రొమ్ము పడిసెము నందును, పిత్తాశయసంబంధ మగు నంజు (Hepatic Dropsy) నందును, గుణమును గలుగజేయును. మూత్రము వెలువడుటయందు విశేషకష్టమును గలుగ జేయునట్టియు, మూత్రమును రక్తవర్గమును వహింపజేయునట్టియు, గుణములు దీని యందున్నవి కావున, మూత్రగ్రంథులు అస్వస్థతను జెందియున్న విషయములందు దీనిని జాగ్రతతో వాడుకచేయవలయును. ప్రేగులయందుండెడి పురుగులను జంపుట యందు దీనికి నిశ్చితమైన శక్తి కలదు; ఇందులకు పెద్ద మోతాదులలో (½ ఔన్సు) నియ్యవలయును; దీనిని చిట్టాముదముతో గలిపి యిచ్చినయెడల మూత్రసంబంధ మగు నస్వస్థతను గలుగజేయుటయం దాస్పదము తగ్గిపోవును. ఈయౌషధమును నుప యోగించిన పిమ్మట వెలువడెడి టేప్వరం (Tape - worm) మరణము నొందును.

రక్తమును గ్రక్కుకొనుచుండెడి వ్యాధియందు, రోగి పరుండియుండు గది లో కర్పూరతైలము వాసన వేయుచుండునటుల జేసిన యెడల, రక్తస్రావము నిలుపుదల యగుట యందు బనిచేయును. అంతర (రక్త) స్రావములయందు, పరిశుద్ధ రక్తనాళములను ముడుచుకొనునట్లు చేయుటయందును, రక్తము గడ్డగట్టుకొనునట్లు జేయుట యందును, పెద్దమోతాదులు పనిచేయును; టైఫాయిడ్ జ్వరమునందును, రక్తవిరేచనముల యందును, రక్తస్రావ మధికముగ నగుచున్నపుడు ప్రతిగంటకును 20 మి॥ మోతాదు చొప్పున నిచ్చుట వలన నొకప్పుడు ప్రాణమునే కాపాడ వచ్చును. జీర్ణాశయసంబంధ మగు పుండునందు వాంతిని గలుగజేయు గుణము నధిక పఱచ వచ్చును గాన యీ వ్యాధియందు దీని నుపయోగింప రాదు.

కడుపు ఉబ్బుదల నందియున్న స్థితియందు దీనిని "యెనిమా" గా నిచ్చుట వలన మంచిగుణము నియ్యగలదు; పేగులయందు నింపబడి యున్న వాయువు నంతను వెలువరింపజేయును; పైత్యసంబంధమగు రాళ్లను గలుగజేయకుండుట యందును, యిది వఱకే కలిగియున్న విషయములలో మారింపుచేయుటయందును, యిది పనిచేయవచ్చును. దీనిని లోనికి బుచ్చుకొనినచో సోరియాసిస్, యెగ్జిమా మొదలగు చర్మవ్యాధులయం పై చర్మము ననుసరించి యుండెడి సూక్ష్మరంధ్రములను ముడుచుకొనునట్లు చేయుట వలన, గుణమును గలుగజేయును; కనుపాప చుట్టునుండెడి తారామండలము (Iris)

వాపుదల నందియున్నపుడును, మూత్రాశయముయొక్క అస్వస్థతలయందును, ప్రసవానంతరము గలుగు రక్తస్రావములయందును, దీనియుపయోగము విశేషమైయున్నది. టైఫాయిడ్, టైఫస్ జ్వరముల యందు బలహీనతను వహించి యున్నవిషయములలో నిది చురుకును బుట్టించునదిగ వర్తించుచున్నది. ఇట్టివిషయములలో నీక్రింది యౌషధయోగమును వాడుక చేయవచ్చును.

| | |
|---|---|
| టర్పన్టీన్ ఆయిల్ ... ... ... ... | 3 డ్రా॥ |
| ఈథర్ ... ... ... ... ... | 3 డ్రా॥ |
| సిరప్ ఆఫ్ టోలూ ... ... ... ... | 1 ఔన్సు |
| మ్యూసిలేజ్ (జిగురు) ... ... ... ... | 1 ఔన్సు |
| ఆక్వా మెంతా పిప్ ... ... ... ... | 5 ఔన్సులు |

దీనిని అరఔన్సు మోతాదులో 3 గంటల కొకపర్యాయ మియ్యవచ్చును.

మోతాదు—2 మి॥ మొ॥ 10 మి॥; పేగులలోని క్రిమివర్గంను జంపుటకుగాను 3 డ్రా॥ మొ॥ 4 డ్రా॥ వఱకు చక్కెరతో గలిపిగాని జిగురుతో గలిపిగాని యియ్యనగును.

లినిమెంట్ టెరిబింథినీ—Liniment Terebinthinae.

1½ ఔన్సుల సాఫ్ట్ సోప్ (Soft Soap)ను దీనికొని 2 ఔన్సుల ఆవిరిని చల్లార్చిన నీటి (Distilled water)తో గలిపి విడిగా నుంచుకొనవలయును. 1 ఔన్సు క్యాంఫర్ (హారతికర్పూరము)ను, 13 ఔన్సుల Turpentine (కర్పూరతైలము)తో విడిగా గలుపవలయును; ఈరెండవదానిని మొదటిదానితో గొంచెము కొంచెముగ గలుపుచు కలియబెట్టుచుండ వలయును; ఇందుమీదట నిది దళమైనట్టియు గొంచెముగ దెలుపు పసుపు వర్ణములను వహించినట్టియు మిశ్రపదార్థమగును; చివరకు నిది యంతయు 1 పైంటు అగునట్లుగ ఆవిరిని జల్లార్చిన నీటిని గలుపవలయును. ఇదియే లినిమెంట్ టెరిబింథినీ అనబడును.

దీనిని పైన రాయుటకు మాత్రమే ఉపయోగింపనగును; అంతరావయవముల యొక్క రోగుడలకు వ్యతిరేకముగ బనిచేయునదిగ వర్తించును.

---

## తైమాల్—Thymol.

బలమైన వాసన గలిగినట్టి పలుకులుగను, గడ్డలుగను, నుండెడిది; దీనికి తెలుగులో వాముపువ్వు అను వాడుకపేరు గలదు. 2 ఔన్సుల జలములో 1 గ్రయిను

గలిపి, కుళ్ళిపోవుచున్నట్టి యే ద్రవపదార్థమునకు గలిపినను కుళ్లిపోవుటను నిలుపు చేయును; ఈ విధముగ కార్బాలిక్ ఆసిడ్ కంటెను సాలిసైలిక్ ఆసిడ్ కంటెను బలముగ బనిచేయును; క్రిమిజాలములతో గూడిన చర్మవ్యాధులయందు 1 భాగము థైమాల్‌ను 8 భాగముల వాసలీన్‌తో గలిపి రాయనగును. తలపై గాని గడ్డముపై గాని లేచినట్టి తామరకు 1 భాగము థైమాల్‌ను, 18 భాగముల పెట్రోలియంలో గాని 15 భాగముల ఈథర్‌లోగాని కలిపి రాచినయెడల వెండ్రుకల కుదుళ్లలోనికి బాగుగ నంటును.

స్వరపేటిక యొక్కయు గొంతుసంబంధ మగు నట్టియు అస్వస్థతల యందు యీ క్రిందివిధముగ దయారు చేయబడిన ఔషధమును వాసన జూచుటకుగాను లండన్ పట్టణమునందలి గొంతు ఆస్పత్రి (Throat Hospital) లో నుపయోగించు చున్నారు. 20 గ్రే॥ థైమాల్‌ను, 3 డ్రాముల స్పిరిట్‌ను, 10 గ్రే॥ మెగ్నీసియా కార్బనసుమ— యివన్నియు 3 ఔన్సులు అగునటుల జలమును జేర్చి నిలువ యుంచు కొనవలయును; దీనిలోనుంచి 1 డ్రామును దీసి 1 పైంటు ఉడుకునీటిలో వేసి వాసన జూచుటవలన నై యస్వస్థతల కుపయోగముగ నుండ గలదు.

1 భాగమునకు 1,000 భాగముల నీటిలో జేర్చి, కుసుమవ్యాధియందు పిచికారీ చేయుటకును, పుండ్లు, సోరియేసిస్, గొంతువ్యాధులు — వీటియందు గడుగుటకును లోషన్‌గా చేయనగును.

థైమాల్‌ను పెద్దమోతాదులలో నిచ్చిన యెడల టర్పన్‌టీన్ నందువలెనే విషఫలితములు గాన్పించును. థైమాల్ వలన విషఫలితము లేర్పడినపుడు, శ్వాసకోశములును మూత్రగ్రంధులును వాపుదల నందును, సామాన్యమోతాదుల నిచ్చిన పిమ్మట మూత్రము తఱముగ ఆకుపచ్చరంగును వహించును. దీనిని, టైఫాయిడ్ జ్వరము నందును, న్యూమోనియా జ్వరము నందును, పెద్ద మోతాదులలో (25 గ్రే॥ మొ॥ 45 గ్రే॥) వాడుక చేయుటవలన జ్వరము తగ్గుదల నందినట్లు తెలియు చున్నది; మూత్రవ్యాధులయందు యిట్టి పెద్దమోతాదుల నుపయోగించుటవలన నెట్టి దుష్ఫలిత ములును గాన్పించనట్లు తెలియు చున్నది. అతిమూత్రవ్యాధి యందును నిది ఉపయోగ కారిగ జెప్పబడుచున్నది.

కలరావ్యాధియందు థైమాల్‌ను ఉపయోగించెడి ఆవశ్యకతనుగూర్చి డాక్టర్ బొజోలోగారు విశేషముగ చెప్పుచున్నారు.

మోతాదు—½ గ్రే॥ మొ॥ 2 గ్రే॥

---

## థైరాయిడ్ సిక్కం — Thyroid Siccum.

గొఱ్ఱెయొక్క గొంతునుండి క్రొత్తగా దీయబడి ఆరోగ్యతను వహించియున్న థైరాయిడ్ పేరుగల యీగ్రంధినుండి తయారుచేయబడి, తేలికయినట్టియు, కొంచెముగ గోధుమవర్ణమును గలిగినట్టియు, పొడి; గాలి తగిలినయెడల నీ పొడి చెమ్మదగిలి గుణమునందుగూడ బలము తగ్గిపోవును; ఈ జంతువులను జంపిన వెంటనే యీ గ్రంధులను విడదీసి, వాటికి వెలుపల నుండెడి క్రొవ్వుపదార్థమును అల్లికలను దొలగించి, వాటిని నడుమకు గోయుదురు; అస్వాభావికముగ నున్నవాటిని దీసివేయుదురు. ఆరోగ్యతను వహించి యున్నవాటిని ముక్కలుగ గొట్టి సుమారు 100 డిగ్రీల ఫారన్‌హీట్ వేడిమికి ఆరబెట్టి, పొడిగొట్టి, అందుండెడి క్రొవ్వుపదార్థమును దొలగించుటకుగాను పెట్రోలియం స్పిరిట్‌తో గడిగి మఱల నెండ బెట్టుదురు.

[థైరాయిడ్ గ్రంధి శరీరమునందు లేకపోవుటచేత గాని, ఉండియు నస్వస్థత నందియుండుట వలనగాని, మైక్సోడీమా (Myxoedema) అనబడెడు యొక వ్యాధి ప్రవేశించును. ఈ వ్యాధియందు, నీరసత, ఆయాసము, చల్లదనము, ప్రవేశించును; ఒడలు పొడిగా నుండును; శరీరముపై నంజు కనబడును. ఈస్థితి ముఖ్యముగ ముఖముపై గనబడి, ముఖము తెలివిహీనతను వహించి, బరువైనట్టియు వికాసత లేనట్టియు వైఖరిని వహించును; కన్నుయొక్క క్రింది ఱెప్పలు సంచులవలె నుండి, పైఱెప్పలు ఉబ్బుదల నంది కనుపాపలపై వ్రాలి యుండును; చెక్కిళ్లు వ్రేలాడుచుండి, ముక్కు విశాలతనంది, పెదవులును గడ్డమును మోటుదనము గలిగియుండును; ఒడలంతయు మైనమువలె నుండు పసుపువర్ణమును వహించి యుండును; ఈ లక్షణములును, రక్తప్రచారలోపముచేత పెదవులకు నీలమైన వర్ణ మేర్పడుటయు నీ వ్యాధికి ముఖ్యమైన గుర్తులుగ నెంచ దగును. శిరము పైనియు కనురెప్పల పైనియు వెండ్రుకలు ఊడిపోవును; నంజు క్రమముగ మెడవైపులకు వ్యాపించి, కడుపును, హస్తములును, పాదములును గూడ నిస్థితిని బొందును. మనిషికి వికారస్వరూప మేర్పడి, నడకయేగాని యేకదలిక గాని వెఱ్ఱివిధముగ నుండును. స్వేదగ్రంధులు క్రమముగ బనిచేయక పోవుటచేత చెమట తగ్గిపోయి ఒడలంతయు పొడిగా నుండును. గోళ్లు పెళుసు లెక్కును; పండ్లకును పోషణ తక్కువగుటచేత వీటి కస్వస్థత కలుగును. శరీరపు వేడిమి తగ్గుదల యందుండును. జ్ఞాపకశక్తి తగ్గిపోయి, చెప్పిన విషయమును గ్రహించుట యందును జవాబిచ్చుటయందును మాంద్యత ప్రవేశించి, వేళపాళలు లేకుండ నిద్ర కలుగుచుండును; రోగి పాలిపోవుటయు గలుగును; నాడి క్షీణత నంది, గుండెయొక్క కార్యక్రమము నీరసతను గలిగియుండును; ఆకలి మందగించి, మలబద్ధము తఱచుగ గనబడును.

బిడ్డలయం దుండెడి యిదేవ్యాధికి క్రెటినిజం (Cretinism) అందురు; కొం దఱి బిడ్డలయందు పుట్టుకతోడనే యీగ్రంధి లేకుండును. ఈ కారణముచేత శరీర సంబంధమైనట్టిగాని మనస్సు సంబంధమైనట్టిగాని అభివృద్ధికి ఆటంకము కలుగును. ఇట్టి విషయమునందు బిడ్డయొక్క యెముగుదల గిడసబారి, శిరము, చేతులు, కాళ్లు, మాత్రము శరీరముయొక్క తక్కిన భాగమునకు మించిన పరిమాణమును వహించి యుండును; ముఖము విశాలమైయుండి, పెదవులు మోటుగ నుండి, ముక్కుచదునై యుండి, నాలుక వాపుదలనంది, ఒడలంతయు బోడిగా నుండి, వెండ్రుకలును కొం చెముగా నుండును. గాయిటర్ వ్యాధి వ్యాపించి యుండిన స్థలములయందు యీ పై జెప్పబడిన వ్యాధులును వ్యాపించి యుండును; ముఖ్యముగ పర్వతప్రాంతముల యందిది వ్యాప్తత నందియుండును.]

పైన నుదహరింపబడిన మైక్సోడీమా క్రెటినిజం అనబడెడి రెండు వ్యాధుల యందును తైరాయిడ్ సిక్కం (తైరాయిడ్ పొడి) ను ఉపయోగించినయెడల మంచి గుణముల నిచ్చును. దీనియొక్క ఉపయోగమువలన ఆకలి అభివృద్ధినంది, ముఖవర్చస్సు మారుదలనంది, మనోవికారతలు మాపుజెంది, రోగి తన స్నేహితులచే గూడ గుర్తింపబడ వీలులేనట్టి మంచి మార్పును బడయును; మెరుగు నందిన దంతమువలె నునుపుజెందిన శిరముపై మిక్కుటముగ వెండ్రుకలు పెరిగియున్న విషయమునుగూర్చి డాక్టరు విట్లాగారు చెప్పియున్నారు.

పూర్ణమైన మోతాదు నిచ్చుటవలనగాని, మందును యెక్కువ అసక్తితో దఱ చుగ నిచ్చుటవలన గాని, మూర్ఛ కలుగవచ్చును గాన, నిట్టి విషయములో రోగిని బరుండబెట్టియే యుంచవలయును. నిశ్చయముగ గుర్తింపదగిన నాడియొక్క తీవ్రత, శుష్కించిపోవుట, జ్వరవేడిమి, జీర్ణాస్వస్థత—యివి యన్నియు, మందును నిలుపు జేయుటకుగాని, లేక కొద్దిమోతాదులలో నిచ్చుటకుగాని, లేక దీర్ఘవ్యవధులతో నిచ్చుటకుగాని, గుర్తులుగా నెంచవలయును. లైకర్ తైరాయిడ్ (Liquor Thyroid) ను 5 మినిముల మోతాదులో దినమునకొక్కసారి యిచ్చుచు, నీప్రకారము 10 లేక 14 దినములు చేసినపిమ్మట గుణము కనబడక పోయిన యెడల, మోతాదును 10 మినిములకు హెచ్చింప జేయవచ్చును. 1 మినిము అనగా అరుదల నందిన తైరాయిడ్ గ్రంధిలోని 100 వ భాగము అయియున్నది; తైరాయిడ్ పొడియొక్క 5 గ్రై॥ సామాన్యమోతాదు అయి యున్నది. పైన జెప్పబడిన దుర్లక్షణములు అంతరించిన పిమ్మట మఱల నీమందును బ్రారంభించి రెండు దినముల కొకసారిగాని మూడుదిన ముల కొకసారిగాని, పై మోతాదులో సగముచొప్పున నియ్య నగును; ఇట్లిచ్చుట వలన నారోగ్యాభివృద్ధికి భంగము కలుగకుండ నుండును.

పుట్టుపెఱ్ఱులుగ నుండి శరీరము గిడసబారిన వారియందు పుట్టుకతోడనే తైరాయిడ్ గ్రంధి లేనిలోపముచే నిట్టిస్థితి సంభవించిన దని రుజువుగ గనుగొనబడెను; మఱియు నిట్టివారికి యీ ఔషధమును సేవించగనే అద్భుత మైనట్టియు నమ్మనటకు వీలు లేనట్టియు ఫలితములు గాన్పించినట్టు దెలియుచున్నది. ఇట్టి విషయములలో దినమునకు 1 మి॥ మొ॥ 3 మి॥ వఱకు గల మోతాదులలో లైకర్ తైరాయిడ్ను ఉపయోగింపనగును; గుణఫలితములను బట్టి మోతాదును హెచ్చించినను హెచ్చింపవచ్చును; తగ్గించినను దగ్గింపవచ్చును. దీనియొక్క ఉపయోగమువలన, సామాన్యపు పుట్టు పెఱ్ఱితనము, పిచ్చితనము — వీటియందుగూడ నయము కలిగిన విషయములు కలవు. అత్థస్థూలత యందును నిది పనిచేయును గాని యీ విషయమున దీనికి జాగ్రతతో వాడుక చేయవలసి యుండును; సోరియేసిస్, ఏనుగుగజ్జి, మొదలగు ననేక విధములగు చర్మవ్యాధుల యందును యిది పనిచేసి నట్లు చెప్పబడుచున్నది. గాయిటర్ వ్యాధి క్రొత్తగా నేర్పడిన విషయములలో బహు శీఘ్రగతిని నెమ్మదిని గలుగ చేయును.

మోతాదు — 3 గ్రే॥ మొ॥ 10 గ్రే॥

లైకర్ తైరాయిడ్ — Liquor Thyroid.

గొఱ్ఱె యొక్క శరీరమునుండి నూతనముగ దీయబడి నట్టియు, ఆరోగ్యహితమైనట్టియు, తైరాయిడ్ గ్రంధిని 34 మినిములగ్లిసరీన్ తోడను, 34 మినిముల (100 మినిముల జలములో ½ మి॥ కార్బాలిక్ ఆసిడ్ను గలిపిన) కార్బాలిక్ సొల్యూషను తోడను, నలుగ గొట్టి, గుడ్డలో వేసి పిండి, — యిది యంతయు 100 మినిములగుటకు అవసరమైన (100 మినిముల జలములో ½ మినిము కార్బాలిక్ ఆసిడ్ను గలిపిన) కార్బాలిక్ సొల్యూషనును గలిపి నిలువ యుంచుకొనవలయును. దీనిని గాజు మూత కలిగిన సీసాలో వేసి నిలువ యుంచుకొనవలయును.

మోతాదు — 5 మి॥ మొ॥ 15 మి॥

---

## ట్రినిట్రిన్ — Trinitrin.

ట్రినిట్రిన్కు మఱియొకపేరు నైట్రొగ్లిసరీన్ (Nitroglycerine) అని కలదు. ఇది అమిల్ నైట్రిస్ వలెనే పనిచేయును, కాని దీనియొక్క ఫలితములు యెక్కువ కాలమువఱకు నిలిచియుండును. ఇందు సంబంధమగు 1 గాని లేక 2 గాని బిళ్లలను దీసికొనగనే సుమారు 3 నిమిషముల కాలములో శిరస్సు బరువుగ నుండి, లోన

కొట్టుకొను చున్నట్లుగనుండి, త్వరగనే యీ చురుకుదనము శరీరమున కంతకును వ్యాపించును. నాడి త్వరితగతి నంది, ముఖము యెఱ్ఱబారును. రక్తప్రచారబలము తగ్గిపోయి, సామాన్యమోతాదులలో శరీరపు వేడిమి కొంచెముగ మాత్రమే క్షీణించి, తల తిరుగుటయును ఉదృతమగు నుదురునొప్పియును చాలకాలమువఱకు నుండును. మోతాదును హెచ్చింప జేసినయెడల, నాడియును ఉచ్ఛ్వాసనిశ్వాసములును దీవ్రగుణమును వహించును. శరీరమున కేట్టిహానియు గలుగకుండ నీయౌషధము యొక్క పెద్దమోతాదులను దీసికొనవచ్చు ననియు, ఎదురురొమ్మునొప్పి సంబంధమగు శ్వాసాస్వస్థతలయం దిది స్వస్థతను గలుగజేయకున్నంత వఱకును దఱచుగ దీని యొక్క మోతాదు చాలలేదని గ్రహింప వలయు ననియు, డాక్టర్ విట్లాగారు చెప్పు చున్నారు.

దీనియొక్క చిన్న మోతాదు (1/100 గ్రె॥) నందే యీకనబఱచుచున్నట్టి ఆశ్చర్యకర మగు చురుకుదనమునకు గారణము, యిది జీర్ణాశయమునందు యెట్టి మార్పును జెందకుండగనే రక్తమునందు గలిసిపోవుటచే, నయి యున్నదని డాక్టరు హే గారు రుజువు చేయుచున్నారు.

ఉబ్బసవ్యాధి మొదలగు వాటి సంబంధమగు శ్వాసాస్వస్థతలయందు, యిది అమిల్ నైట్రిస్ వలె నంత త్వరితముగ బనిచేయకున్నను, దీనియొక్క గుణము యెక్కువ నిలుకడను వహించియుండునని డాక్టర్ మరెల్ గారు చెప్పుచున్నారు; 3 లేక 4 గంటల కొకసారి యొక బిళ్ల నిచ్చుచు, తెర వచ్చునట్టి సమయములో 3 మొదలు 6 బిళ్లలవఱకు క్రమముగ మోతాదును హెచ్చింపజేయ నగునని యీయన యభిప్రాయము నిచ్చు చున్నాడు.

డాక్టరు విట్లాగారు, తక్కిన పద్ధతు లన్నిటికంటె నీక్రింది పద్ధతి ప్రకారము యీమందును సేవించుట మిగుల ప్రయోజనకారిగ నుండునని నమ్ముచున్నారు; ప్రతి బిళ్లను 6 గాని అంత కెక్కుడుగగాని ముక్కలుగా గొట్టి, దినమం దంతటను ఒక్కొక ముక్కను ప్రతి 15 లేక 20 నిమిషముల కొక్కొకసారి తీసికొనుచుండవలయును. ఇట్లుగా నుపయోగించుటవలన నేబాధయును గలుగదు; వ్యాధియొక్క తెరను రాకుండ జేయును; ఇట్టి యుపయోగమునందు తలనొప్పి, తలతిరుగుట, మొదలగు దుర్గుణములు కలుగజాలవు. ఈ విధముగ నుపయోగించిన విషయములందు యెప్పుడును గుణము కనబడక పోలేదు. ఈ పద్ధతి శారీరశాస్త్రసంబంధఫలితముల ననుసరించి యేర్పరచబడిన దైయున్నది. వ్యాధియొక్క తెర రానై యున్నప్పుడు పెద్దమోతాదు

నిచ్చి, ఔషధబలము తగ్గిపోకుండునటుల చిన్న మోతాదుల నిచ్చుచు శరీరస్వస్థతను గాపాడవలయును.

గుండెసంబంధమగు శ్వాసకృచ్ఛ్రము, మూర్ఛ, మూత్రగ్రంథుల యొక్క క్షీణదశ, పార్శ్వపునొప్పి, ప్రసవసంబంధమగు మూర్ఛ, ఉబ్బసము - ఈవ్యాధులయందు మంచిగుణము నిచ్చును. లైకర్ ట్రినిట్రిన్ యొక్క మోతాదును 1 మి॥ మొ॥ 3 లేక 5 మి॥ వఱకు నియ్యవచ్చును. కొద్దిమోతాదులు ఎండదెబ్బ తగులకుండ జేయును.

ట్రినిట్రిన్ టేబ్లెట్స్ — Trinitrin Tablets.

టేబ్లెట్ అనగా బిళ్ల; ఒక్కొక బిళ్ల 5 గ్రా॥ తూనికయుండి 1/100 గ్రా॥ ట్రినిట్రోగ్లిసరీన్‌ను గలిగి యుండును.

మోతాదు — 1 లేక 2 బిళ్లలు.

లైకర్ ట్రినిట్రిన్ — Liquor Trinitrin.

దీనియందు ఆల్కహాల్‌యును ట్రినిట్రిన్‌యును గలిసి యుండును; 110 మినిములలో 1 గ్రా॥ కలిసియుండును.

మోతాదు — ½ మి॥ మొ॥ 2 మి॥

---

## వెలీరియన్ - Valerian.

వెలీరియన్ చెట్టుయొక్క వేళ్లతో జేయబడిన యౌషధములు, బలవర్ధకౌషధముగను, శరీరము నందలి నరముల సంబంధమగు భాగములకు జొరుకుదనమును బుట్టించునదిగను, బనిచేయును. హిస్టీరియావ్యాధియందు యిది ముఖ్యముగ బనిచేయును. దీనియం దుండెడి యొకవిధ మగు చమురు, మెదడు సంబంధ మగునట్టి మధ్యస్థానములను సుషుమ్న (Spinal Cord) ను దుర్బల పఱచి, రక్తప్రచారబలమును దగ్గించి, నాడిని శాంత పఱచును. పెద్దమోతాదుల నుపయోగించిన యెడల, చెమటను అధికపఱచి, వెక్కిలిని గలుగ జేసి, వెగటును బుట్టించి తల తిరుగునట్లు చేసి, కొంచెముగ మనోవికలతను గలుగ జేయును.

జింక్ వెలీరియానిస్‌ను వల్లమందు తోడను క్వినీన్ తోడను జేర్చి మాత్రలను జేసి యిచ్చిన యెడల, తలనొప్పి—ముఖ్యముగా ఉండి ఉండి వచ్చునట్టిది—నయమగును. దీనిని అతిమూత్ర వ్యాధియందు గూడ నుపయోగింతురు.

**టింక్చర్ వలేరియేనా అమ్మోనియేటా—Tincture Valeriana Ammoniata.**

మిగుల నల్లనైనటిదియు, కొంచె మగు యెరుపు బూడిదరంగులను కలిగి నట్టియు, ద్రవపదార్థము; 5 వంతులను 1 వంతు వలేరియన్ ఉండును.

మోతాదు— ½ డ్రా॥ మొ॥ 1 డ్రా॥ (విరివియగు నీటితో)

ఫెర్రియి వలేరియేనస్—Ferri Valerianas.

మిక్కిలి యెర్రగ నుండెడి పొడి; నీటిలో కలియదు; వగరుగ నుండును, నరములకు జొరుకును బుట్టించును; ఋతుస్రావము నధిక పఱచును; పాండువ్యాధియందును, హిస్టీరియా యందును, ఉపయోగించును,

మోతాదు — 3 గ్రె॥ మొ॥ 15 గ్రె॥

సోడా వలేరియేనస్ — Soda Valerianas.

తెల్లని పలుకులుగ నుండును; హిస్టీరియాయందును, వెఱ్ఱియందును, నరములకు శాంతతను గలుగ జేయును.

మోతాదు — 1 గ్రె॥ మొ॥ 6 గ్రె॥

జింక్ వలేరియేనస్ — Zinc Valerianas.

తెల్లని పలుకులుగ నుండును; నరములకును, సామాన్యముగ శరీరమున కంతకును, బలవర్ధకౌషధముగ వర్తించును.

మోతాదు — 1 గ్రె॥ మొ॥ 3 గ్రె॥

---

## జింక్ — Zinc.

జింక్ సంబంధమగు లవణములు, పైన బ్రయోగించబడినయెడల రక్తనాళములను ముడుచుకొనునట్లు చేయునవిగను, ఉపరిభాగమును పొక్కునట్లు చేయునవిగను, వర్తించుచున్నవి.

ఈ లవణములను లోని కిచ్చిన యెడల రక్తమునందు త్వరితగతిని బ్రవేశించి రక్తమునందు కొద్దికాల మున్నపిదప మెల్లగా మలమార్గమునను కొంచెముగ మూత్రమార్గమునను వెలువరింపబడును. జింక్ సంబంధమగు నౌషధములను దీర్ఘకాలము

సేవించిన పిమ్మట లెడ్ సంబంధమగు విషఫలితములయందు వలెనే దీనియందును విష ఫలితములు గాన్పించవచ్చును.

### జింక్ అసిటేట్—Zinc Acetate.

పల్చ్బనైనట్టియు, మెరయు నట్టియు, నిర్వర్ణమైనట్టియు. పలుకులుగా నుండును; $2\frac{1}{2}$ రెట్లు నీటిలో గలియును.

మోతాదు — బలవర్ధకౌషధముగ 1 గ్రె॥ మొ॥ 2 గ్రె॥ ; వాంతికారిగ 15 గ్రె॥ మొ॥ 20 గ్రె॥ ; గనోరియా (సెగ) వ్యాధియందు పిచికారీ చేయుటకుగాను 1 ఔన్సు జలములో 2 గ్రె॥ ను గలుపుదురు.

### జింక్ క్లోరీడ్ — Zinc Chloride.

దీనిని గూడ గనోరియావ్యాధి యందు పిచికారీచేయుట కుపయోగింతురు; ఇందులకు 1 ఔ॥సు జలములో 1 గ్రె॥ను మాత్రమే గలుప నగును; ఇది క్రిమ్మిఘ్నదనమును బోగొట్టునదిగను వర్తించును.

### జింక్ ఆక్సైడ్ — Zinc Oxide.

దాదాపు తెలుపు వర్ణమును వహించినట్టియు, మెత్తనైనట్టియు, నీటిలో గలియ నట్టియు పొడి; నరముల సంబంధమగు నిద్దును గలుగ జేయునట్టి అస్వస్థతల యందు బలవర్ధకౌషధముగ బనిచేయును; మూర్ఛలయందు విశేషముగ నుపయోగించబడును.

పైన ఉపయోగించుటవలన రక్తనాళములను సాధువుగ ముడుచుకొనునట్లు చేయునదిగను, చెమట మొదలగునవి స్రవించు చర్మవ్యాధులయందు స్రావములను నిలుపు చేయునదిగను, బనిచేయును.

మోతాదు— 3 గ్రె॥ మొ॥ 10 గ్రె॥ (మాత్రరూపమున); రాత్రిచెమటల యందు దఱచుగ బెలడోనాతో గలిపి యియ్యబడును.

### జింక్ ఆయింట్మెంట్—Zinc Ointment.

3 ఔన్సులు జింక్ ఆక్సైడ్ను 17 ఔన్సుల కరగబెట్టబడిన బెంజోటెడ్ ల్యార్డుతో జేర్చి చల్లారువఱకును గలియబెట్టినయెడల ఆయింట్మెంట్ యేర్పడును. పసిబిడ్డలయందు గలుగు గజ్జి, తీట మొదలగు చర్మవ్యాధుల కిది ఉపయోగించును.

## జింక్ సల్ఫేట్ — Zinc Sulphate.

జింక్ (తుత్తునాగము)యొక్కయు డైల్యూట్ సల్ఫ్యూరిక్ ఆసిడ్ యొక్కయు నన్యోన్యకార్యక్రమము చేత నేర్పడినట్టి నిర్వర్ణమైన చిన్న పలుకులుగా నుండెడిది; గనోరియా వ్యాధి యందు ఔన్సు జలమునకు 2 గ్రెయినులను, ల్యూకోరియా (కుసుమ) వ్యాధియందు 3 గ్రెయినులను, కంఠక్షతములయందు 1 గ్రెయినును — కలిపి ఉప యోగింతురు.

దీనిని కోరియా వ్యాధియందు బిడ్డల కిచ్చుటవలన మిగుల గుణము నిచ్చును; మూర్ఛల యందును అతివిరేచనముల యందును గూడ దీని నుపయోగింతురు.

విషప్రయోగముల యందు 30 గ్రె॥ మోతాదులలో నిచ్చిన యెడల నిది త్వరిత ముగ బని చేయునట్టియు క్షేమకరమైనట్టియు వాంతికారి యైయున్నది; ఇపికాక్ కంటె త్వరితముగ బనిచేయును; టార్టార్ యెమిటిక్ నందువలె నీరసతను గలుగ జేయదు. జీర్ణాశయమునందలి నరములయొక్క కొనభాగములకు రేగుదలను గలుగజేసి త్వరితముగ వాంతి కలుగునట్లు చేయును. బిడ్డలకు నిది క్షేమకర మగు వాంతికారి గాదు; అయినను త్వరితముగ వాంతి కావలసి వచ్చినపుడు 1 సం॥ వయసుగల బిడ్డకు $2\frac{1}{2}$ లేక 3 గ్రె॥ మోతాదు నిచ్చి, వాంతి కాకపోయిన యెడల 15 నిమిషములలో మరల నిదే మోతాదు నియ్యవచ్చును. 5 సం॥ వయసుగల బిడ్డకు 10 గ్రెయినుల నిచ్చి వేడినీళ్లను మిక్కుటముగ దాహమున కియ్యవచ్చును.

మోతాదు — బలవర్ధకౌషధముగ 1 గ్రె॥ మొదలు 3 గ్రె॥; వాంతికారిగ 10 గ్రె॥ మొ॥ 30 గ్రె॥

---

## జింజిబర్ — Zingiber.

దీనికి ఇంగ్లీషులో జింజర్ (Ginger) అను వాడుక పేరు గలదు; జింజర్ అనగా శొంఠి; ఈ శొంఠియొక్క పై పొట్టును దీసివేసి అరుదల నందినదానిని యిందు సంబంధ మగు నౌషధములయం దుపయోగింతురు. శొంఠిపొడి జీర్ణకారిగను శరీరమునందలి యీడ్పును బోగొట్టునదిగను బనిచేయును.

మోతాదు 10 గ్రె॥ మొ॥ 20 గ్రె॥

## టింక్చర్ జింజిబరిస్ — Tincture Zingiberis.

దీనికే టింక్చర్ ఆఫ్ జింజర్ (Tincture of Ginger) అందురు. 2 ఔన్సుల శొంఠిపొడిని 1 పైంటు అల్కహాల్‌తో గలిపి తయారు చేయబడును. జీర్ణకారి; కార్మినేటివు మిక్శ్చర్ నం దుపయోగింపబడును,

మోతాదు — ½ డ్రా॥ మొ॥ 1 డ్రా॥

శొంఠియొక్క కార్యక్రమము, కాప్సికం, కార్డమం, వలెనే యుండును; శొంఠిని నమలినయెడల నోటియందలి ఉమ్మిసంబంధ మగు గ్రంథులకు జురుకుదన మును బుట్టించి ఉమ్మిద్రవము నధికపఱచును.

---

## క్యాంఫారిక్ ఆసిడ్ – Camphoric Acid.

తెల్లనైన స్ఫటికములవలె నుండెడి పదార్థము; వాసన యుండదు; క్యాంఫర్ పై నైట్రిక్ ఆసిడ్ యొక్క కార్యక్రమమువలన నేర్పడును; మూత్రము స్వాధీనము తప్పి వెలువడునపుడును, నరముల సంబంధ మగు నస్వస్థతలయందును అనగా మూర్ఛ మొదలగు వ్యాధుల యందును, 5 గ్రె॥ మొ॥ 10 గ్రె॥ వఱకుగల మోతాదులలో నియ్యబడును. క్షయవ్యాధి సంబంధ మగు నతివిరేచనముల యందును, యిదే వ్యాధి సంబంధ మగు రాత్రిచెమటల యందును, నీ యౌషధము మంచి గుణము నిచ్చును. ఈ స్థితులయం దీమందు నుపయోగించిన మరుచటినాటికే మంచి గుణము నిచ్చునని తెలియు చున్నది.

మోతాదు — 10 గ్రె॥ మొ॥ 20 గ్రె॥

---

## పిక్రిక్ ఆసిడ్ – Picric Acid.

పొగలు వచ్చుచుండెడి నైట్రిక్ ఆసిడ్ (మహాద్రావకము)తో కార్బాలిక్ ఆసిడ్‌ను మెల్లగ గలుపుటచేత నేర్పడు నట్టి పసుపు రంగుగల ఘనపదార్థము. 200 రెట్ల జలములో గలిపిన దీనియొక్క సొల్యూషనులో లింటును దడిపి, కాలినస్థలముల యందు గట్టుట వలన, మిగుల నుపయోగముగ నుండగలదు; రెండు దినముల వఱకును యీకట్టును ఊడదీయక యుంచవలయును. ఈ సొల్యూషనును అస్వస్థతభాగము లోనికి యీడ్చుకొనుట వలన గుణము కలుగును. ఎరీసిపిలాస్, యెగ్జిమా, మొదలగు చర్మవ్యాధుల యందును యిది గుణమును గలుగజేయు నని చెప్పబడు చున్నది.

1 డ్రాము పిక్రిక్ ఆసిడ్‌ను షుమారు 18 ఔన్సుల మసలగాగిన నీటిలో వేసి ప్రతిదినమును యీ ఆవిరిని 2 లేక 3 గంటల వఱకు వాసనను జూచినయెడల క్షయ వ్యాధియందు మంచిగుణము కలుగు ననియు, యొకప్పుడు కుదిరికనే కలుగజేయవచ్చు ననియు, చెప్పబడు చున్నది.

---

## ఆనాకార్డియం (జీడిమామిడి) — Anacardium.

దీనికి కాషూ నట్ (Cashew Nut) అనెడి పేరును గలదు. ఈజీడిమామిడి నూనె కుష్ఠువ్యాధియం దుపయోగించు నని చెప్పబడు చున్నది. ఈవ్యాధియందు పైన రాయుటకు మాత్రమే ఉపయోగింతురు.

---

## గోల్డ్ బ్రోమైడ్ — Gold Bromide.

బూడిదరంగుగల పొడి; 75 రెట్లు నీటిలో గలియును; మూర్ఛలయందును, హిస్టీరియా యందును, బాగుగ బనిచేయును. దీనిని బుచ్చుకొనిన మూర్ఛవ్యాధిగ్రస్తులు కొన్ని సంవత్సరముల వఱకుగూడ మరల మూర్ఛను బొందరు.

మోతాదు—1/60 గ్రై॥ మొ॥ 1/10 గ్రై॥ (నీటిలోగలిపి)

---

## ఆరి, యెట్ సోడియై క్లోరీడం — Auri et Sodii Chloridum.

నారింజవర్ణము గల పొడి; కొద్ది మోతాదులలో (1/25 గ్రై॥) నిది ఆకలిని వృద్ధిజేయును; ఇది హిస్టీరియా, మూర్ఛ, సంభోగదుర్బలత్వము, క్షయ, ఋతుస్రావముయొక్క నిలుపుదల, కొఱుకువ్యాధి యొక్క తృతీయగతి — వీటియందు పనిచేయును.

మోతాదు—1/30 గ్రై॥ మొ॥ 1/12 గ్రై॥

---

## షాల్‌మొగ్రా ఆయిల్ — Chaulmogra Oil.

గైనొకార్డియా విత్తులనుండి తీయబడి నట్టి కొంచెము పసుపు రంగు కలిగిన చమురు; ఈచమురు ఇంగ్లాండు మొదలగు చలిప్రదేశములయందు ఘనపదా

ర్థముగ నుండును; ఇండియా దేశమునందు మాత్రము ద్రవపదార్థముగ నుండును. దీనిని మాత్రరూపమున 1 గ్రె॥ మోతాదులో దినమునకు 3 సారు లిచ్చుచు, క్రమముగ మోతాదును 3 గ్రె॥ లకు హెచ్చింప జేయవచ్చును. క్షయవ్యాధియందు యీ చమురును యెదురొమ్ముపై రుద్దవచ్చును; దీర్ఘవ్యాపిత మగు కీళ్లనొప్పుల యందును అస్వస్థతను జెంది యున్న కీళ్లకును పైన దీనిని తోమవచ్చును. కుష్ఠువ్యాధి, ముక్కిడి, సోరియేసిస్, మొదలగు వ్యాధులయందును యిది మంచిగుణము నిచ్చునటుల దెలియ చున్నది. కుష్ఠువ్యాధియొక్క వివిధగతులయందును దీనిని 1 భాగము చమురునకు 2 భాగముల ల్యార్డును జేర్చి పైన రాయ నగును. ఈ వ్యాధియందు దీనియొక్క కుదిరికవిషయమై అంతగా నమ్మకము లేకపోయినను, దీనిని పైన రాయుచు, పైన జెప్పబడిన మోతాదులలో లోని కిచ్చుచుండుట వలన, కుష్ఠువ్యాధియొక్క అభివృద్ధిని అణచివేయ నగు నని మాత్రము చెప్ప నగును.

---

## డయూరిటిన్ — **Diuritin.**

సోడా సాలిసైలస్‌ను గలిసి యున్న మిశ్రపదార్థము; తెల్లని పొడిగ నుండును. ఇది నీటిలో గలియును; దీనియొక్క మంచి ఫలితముల నొంద వలయు నన్న 15 గ్రె॥ మోతాదులో దినమున కధమపక్షము నాలుగుసారు లైనను వాడుక చేయవలయును. అన్ని విధములైన నంజుల యందును యిది మంచిగుణము నిచ్చును. మూత్రగ్రంధుల యొక్క క్షీణదశయందును మంచిపనిని జేయును; అస్వస్థతాలక్షణముల నేమియు గనబఱచకుండగనే మూత్రమును బ్రకోపింప జేయును. కఫీన్ యును డిజిటాలిస్ యును గుణమును గనబఱచలేక పోయినప్పు డిది గుణము నిచ్చిన విషయములు కలవు; నరముల పై నెట్టి నీరసతయును గలుగ జేయదు. సామాన్యమగు ఉష్ణజలములో గలిపి యిచ్చిన యెడల నెక్కువ మంచిగుణము నిచ్చును.

మోతాదు—5 గ్రె॥ మొ॥ 15 గ్రె॥

---

## యూక్వినీన్ -- **Euquinine.**

పలుకులుగ నుండి, యేమియు రుచి లేకుండ నుండును; ఇది క్వినీన్ సంబంధమైనదే గాని క్వినీన్ యొక్క చేదురుచి లేకుండ నుండును; ఎట్టి జీర్ణాస్వస్థతయును గలుగజేయ నేరదు. చలిజ్వరమునందు బాగుగ బనిచేయును. చలిజ్వరము రాకుండ

జేయుటయందుగూడ దీనియందు మంచి గుణము కలదు; దీనియొక్క ఉపయోగా నంతరము చలిజ్వరము వచ్చినను, తేలికయైనగతిలో వచ్చును; ఈ విషయములో క్వినీన్ కంటె యూక్వినీన్ యొక్కువ గుణసహిత మైనదని చెప్పబడుచున్నది.

మోతాదు — 3 గ్రె॥ మొ॥ 15 గ్రె॥

---

## ఫుల్లర్స్ అర్త్ – Fuller's Earth.

ఇది మనదేశమునందలి చౌడును బోలియుండును గాని పరిశుభ్రపఱచబడి యుండును; దీనియందు గొంచెముగ లోహ ముండును; దీనియొక్క గుణములు జింక్ ఆక్సైడ్ ను బోలియుండును.

---

## గ్రిండేలియా – Grindelia.

ఉబ్బసవ్యాధియందు యిందుసంబంధమగు మందులు ఉపయోగించబడును. లొబేలియావలెనే పనిచేయుచు, కఫమును వెలిబుచ్చునట్టి గుణమును గలిగియున్నవి. ఈచెట్టుయొక్క ఆకులు సూరేకారము (Nitre)తో గలిపి, పొడిగాగాని, సిగరెట్ గ గాని, స్ట్రమోనియం వలెనే సమస్తవిధములగు ఉబ్బసములయందును ఉపయోగింప బడును.

యక్స్ట్రాక్టు ఆఫ్ గ్రిండేలియా లిక్విడ్ —Extract of Grindelia Liquid.

ద్రవపదార్థము; ఉబ్బసముయొక్క తెర వచ్చినపుడు ప్రారంభించి ప్రతి అరగంటకుగాని లేక ప్రతిగంటకుగాని యియ్యవలయును; పాలలోగాని పంచదా రను గలిపిన నీళ్లలోగాని యియ్యనగును.

మోతాదు — 10 మి॥ మొ॥ 20 మి॥

---

## గ్వైయకల్ కార్బనేట్ – Guaiacol Carbonate.

నిర్వర్ణమైన పొడి; గ్వైయకల్ సంబంధమగు వాటిలో గ్వైయకల్ కార్బనేట్ యొక్కువ ముఖ్యముగ నెంచబడుచున్నది. ఇది క్రియసోట్ లోని చురుకుదనమును వహించిన భాగమైయున్నది. దీనియొక్క ఉపయోగమువలన క్షయవ్యాధిసంబంధ మగు—దగ్గు, చెమట, జ్వరము, చలి, ఆకలి యొక్కమాంద్యత, దాహము—మొద

లగున వన్నియు అంత్యమందును. దీనియొక్క గుణములు క్రియసోట్‌ను బోలియే యుండునుగాని, జీర్ణాశయమునకు దానికంటె తక్కువ రేగుదలను గలుగజేయును. ఇది నీటిలో గలియదు. 5 గ్రె॥ మొ॥ 15 గ్రె॥ వఱకు చక్కెరతో గలిపి దినమునకు 4 పర్యాయము లియ్యవచ్చును. టైఫాయిడ్ జ్వరమునందు దీనిని వాడుక చేయుట వలన గుణము కలిగినట్లు తెలియుచున్నది.

మోతాదు — 3 గ్రె॥ మొ॥ 8 గ్రె॥

---

## గర్జన్ బాల్సం — Gurjun Balsam

దీనికి ఉడ్ ఆయిల్ (Wood Oil) అనుపేరుకూడ గలదు; తెలుగులో కర్ర నూనె అందురు. ఇండియాదేశమునందు కొన్ని ప్రదేశములలో కోపేబాకు బదులుగ దీని నుపయోగింతురుగాని, మూత్రపిండోపకారిగ కోపేబాకు నిది యెంతమాత్రమును సరి రాదు. 1 డ్రాము మోతాదులో దీనికి కఫమును వెలిబుచ్చునట్టి గుణము కలదు. కుష్ఠ వ్యాధియందు బైన రాయుచు లోనికిగూడ 2 డ్రా॥ మోతాదులలో నిచ్చినందువలన మంచి ఫలితములు గాన్పించినవి; లోని కిచ్చుటయందు 3 రెట్లు లైం వాటర్ (Lime Water)తో మర్దన చేసి యిచ్చుట వలన లోనికి బుచ్చుకొనుటకు తేలికగ నుండును.

మోతాదు — ½ డ్రా॥ మొ॥ 2 డ్రా॥

---

## ఇక్థియాల్ — Ichthyol.

తారువలె నుండెడి జిగటైన ద్రవపదార్థము; దీర్ఘ వ్యాపితమగు చర్మవ్యాధు లకు మిగుల నుపయోగముగ నుండును; క్రిమిరహితముగ, నుండునుగాక వ్యాధి ... యట్టి పుండ్ల కొరకు; దీర్ఘకాలిక చర్మవ్యాధు లకు మిగుల నుపయోగముగ నుండును; క్రిమ్లీకుండజేసి, వ్యాధిసంబంధమగు క్రిమిసం హారిణిగ బనిచేయును; దీనియందు గంధకమున కుండెడి మంచి గుణములును గలవు; దురదను బోగొట్టును. 10 రెట్ల వాసలీన్‌తో గలిపి, గాయములకు కాలిన స్థలములకు నుపయోగించ వచ్చును; సమానభాగ మగు లానొలీన్ (Lanolin) తో గలిపి, యెరీసిపిలాస్ వ్యాధి యందు రాయనగును. ఇక్థీయల్ ఆయింట్‌మెంట్‌ను, 2 మొ దలు 5 రెట్లవఱకును, లానొలీన్‌తోగాని, ఆలివ్ ఆయిల్ ల్యార్డులతో గాని, కలిపి తయారు చేయవచ్చును. ఈ ఆయింట్‌మెంటును అన్నివిధము లగు చర్మవ్యాధులకును, కురుపులకును, రాచపుండ్లకును, నుపయోగింపవచ్చును.

---

## జాంబూల్ (నేరేడు) — Jambul.

నేరేడు విత్తుల యొక్క పొడిని అతిమూత్రవ్యాధియం దుపయోగింతురు; దీని వలన కొన్ని విషయములలో నేగుణమును గనబడక పోయినను, మఱికొన్ని విషయములలో ననుకొననంత మంచి గుణము గనబడినది; 2½ గ్రా॥ మోతాదులో దినమునకు మూడు పర్యాయములు యిచ్చుట వలన మూత్రము నందలి మధుపదార్థము సగమువఱకు తగ్గిపోయినది. నేరేడు చెక్క యొక్క కషాయమును దీర్ఘవ్యాపిత మగు అతివిరేచనములను, ఆమవిరేచనములను, నాపుజేయుటకు దేశీయ వైద్యు లుపయోగింతురు.

విత్తుల నుపయోగించుటకు వీటిని గ్రొత్తవిగా దీసికొనవలసి యుండును; పై గుంజును తీసివేయ వలయును; వీటికి ఉష్ణతను దగుల నీయ రాదు.

మోతాదు — 5 గ్రా॥ మొ॥ 40 గ్రా॥

యక్ట్స్రాక్టు జాంబూల్ లిక్విడ్ — Extract Jambul Liquid.

మోతాదు — ½ డ్రా॥ మొ॥ 2 డ్రా॥ (దినమునకు 3 పర్యాయములు).

---

## కోలా — Kola.

మధ్య ఆఫ్రికాయందు బెరిగెడి యీ చెట్టు యొక్క విత్తులయందు కఫీన్ కలదు; ఆదేశీయులు దీనిని తేయాకు కాఫీ నీళ్లకు బదులుగా నుపయోగింతురు. దీని వలన నిద్ర రాదు; సంభోగావయవములకు బలమును గలుగ జేయును; మెదడునకు జురుకుదనమును బుట్టించును; మూత్రప్రకోపకారి, అతివిరేచనములయందును బనిచేయును. కొద్దిమోతాదులలో జీర్ణతను గలుగ జేసి అజీర్ణవ్యాధిని స్వస్థపఱచును.

యక్ట్స్రాక్టు కోలా లిక్విడ్ — Extract Kola Liquid.

మోతాదు — 10 మి॥ మొ॥ 20 మి॥

---

## మాల్ట్ — Malt.

బార్లే బియ్యము నుండి తయారు చేయబడునట్టిది; జీర్ణశక్తి తక్కువగా నున్నపుడు దీని నుపయోగింప నగును. దీనిని, పాలు, వైన్ (సారాయి), తేయాకు నీళ్లు వీటితో గలిపి యియ్యవచ్చును. క్షయ మొదలగు శరీరమునందు కృశింపును గలుగ జేసెడి

వ్యాధుల యం దిది బలమును గలుగ జేయును. జీర్ణాశయమునకు అమ్లస్థితి తక్కువగ నున్న విషయములలో దీనిని వాడుక చేయ నగును. దీనిని కాడ్ లివర్ ఆయిల్ తో గలిపి యిచ్చిన యెడల దీని యొక్క గుణ మధిక మగును.

---

## ప్యాపేన్ — Papain.

ఇండియాదేశము నందును అమెరికాదేశము నందును వ్యాపించి యున్న బొప్పాయిచెట్టు యొక్క పచ్చికాయలను నరకుటవలన గారెడి పాలను గూడబెట్టి యెండబెట్టిన మీదట నేర్పడెడి తెల్లనిపొడి; దీనియందు మంచి జీర్ణగుణము కలదు; జీర్ణాశయము అస్వస్థతయం దున్నపుడు, సామాన్యముగ క్షారహితముగగాని, అమ్లక్షారగుణములకు మధ్యమముగ గాని, యుండును. ఇట్టి విషయములందు పెప్సిన్ పనిచేయ జాలదు, ప్యాపేన్ బాగుగ బనిచేయును. ఇం యేగాక, పెప్సిన్ యొక్క కార్యగుణము క్షారసహిత మగు ద్రవములతో గలియగనే నిలచిపోవును; ప్యాపేన్ ప్రేగుల పొడుగునను బనిచేయుచు బాధనుగూడ దగ్గించు సుగుణమును గలిగి యున్నది. ప్రేగుల యం దుండెడి గుండ్రని పురుగులను, టేపువరంను, జంపుటయందు గూడ దీనికి శక్తికల దని చెప్పబడు చున్నది. కొందఱి డాక్టరులవలన పెప్సిన్ కంటె నిదియే యెక్కువగ బనిచేయు నని యెంచబడు చున్నది; దీనిని సోడా బైకార్బనస్ తోడను, బిస్మత్ కార్బనస్ తోడను, గలిపి యిచ్చుటవలన మంచి ఫలితములు గలిగినట్లు తెలియు చున్నది.

దీనిని గ్లిసరీన్ తో గలిపి, నాలుకపై పుండ్లుగాని, పగుళ్లుగాని యేర్పడిన విషయములందు, రాయుటవలన గుణముగ నుండును.

మోతాదు 1 గ్రె॥ మొ॥ 10 గ్రె॥

---

## పైపరజీన్ — Piperazine.

నిర్వర్ణమై నూది ఆకారమును వహించిన పలుకులుగ నుండును. పొక్కుగుణము లేక నిరపాయకరమైనది, చల్లని నీటిలో లిథియం కార్బనస్ కంటె నిది 12 రెట్లు అధికముగ యూరిక్ అమ్లము ( Uric Acid )ను కఱగి పోవు నట్లు చేయును. మూత్రమునందు యీ యూరిక్ అమ్లము అధికముగ గూడి ఘనపదార్థమేగుటవల్లనే మూత్రకృచ్ఛ్రము (మూత్రాశయమునందు రాళ్లు) కలుగుచున్నది. పైపరజీన్, శరీరము నందు యితర మార్పు లేమియు నందక యూరిక్ అమ్లముతో మాత్రమే గలిసి

మూత్రముగుండ శరీరమునుండి వెలుపడు చున్నది. మూత్రకృచ్ఛ్రవ్యాధి యందు యిది మిగుల యుపయోగమని కొంతకాలము క్రిందట యెక్కువైన నమ్మక ముండెడిది గాని మూత్రకృచ్ఛ్రములను గరగించు గుణము దీనియందు లేదని సిద్ధాంతపఱచ బడినది. దీని యం దుండెడి మూత్రప్రకోపగుణమును బట్టి గౌట్ వ్యాధియం దుపయోగ ముండి నటుల జెప్పబడు చున్నది.

మోతాదు— 4 గ్రె॥ మొ॥ 10 గ్రె॥ (నీటిలో గలిపి గాని, వీలైనచో సోడా వాటరులో గలిపి గాని).

---

## సాలిసైనం – Salicinum.

నిర్వర్ణమై, మెరయు చుండెడి పలుకులుగ నుండును; వాసన లేకుండి కొంచెముగ చేదుగ నుండును; కొది మోతాదులలో దఱచుగ వెలీరియన్ సంబంధములతో డను పిల్యాలా రీయై కో తోడను గలుపబడి, సాధుబలవర్ధకౌషధముగ నుపయోగింపబడును. ఇన్ఫ్లూయంజా వ్యాధియందు తక్కిన యే చికిత్స కంటెను యిది బహు త్వరితముగ గుణము నిచ్చును. కీళ్లనొప్పులు తీవ్రస్థితిని వహించి యున్నపుడు పెద్ద మోతాదులలో నుపయోగముగ నుండును. సాలిసైలస్ సంబంధమగు నౌషధము నీరసతను గలుగజేయ వచ్చును; సాలిసైనం యందు అట్టిగుణము లేదు కావున నిది యెక్కువ యుక్తముగ నెంచబడు చున్నది. చలిజ్వరములయందుగూడ నుపయోగింపబడుచున్నది. కొఱుకు వ్యాధియందు రససంబంధములు శరీరమునకు సరిపడనప్పుడు దీని నుపయోగింప వచ్చును.

మోతాదు— 5 గ్రె॥ మొ॥ 20 గ్రె॥ (గ్లిసరీన్ తో మాత్రగా జేసి యియ్య వచ్చును).

---

## సాలిక్సు నైగ్రా – Salix Nigra.

బ్లాక్ విల్లో ( Black Willow ) అనబడెడి ఉత్తర అమెరికాలో పెంపంబడెడి చెట్టుయొక్క బెరడు నుండి తయారు చేయబడు నట్టి ఔషధము. సంభోగసంబంధమగు ఉద్రేకతను అణచివేయుటకుగ నుపయోగించును. నిద్రలోని ఇంద్రియస్ఖలనము (వీర్యనష్టము) నందును, మూత్రద్వారసంబంధ మగు నొప్పులయందును, ఉపయోగించును; హిస్టీరియా వ్యాధియందును మంచి ఫలితము లందబడి యున్నవి. ఈ

చెట్టు యొక్క బెరడు, వేళ్లు, చిగుళ్లు— వీటినుండి లిక్విడ్ యక్స్ట్రాక్టు తయారు చేయబడు చున్నది; నీటితో గలియును; గనోరియావ్యాధి యందు గూడ నుపయోగించ బడును.

సాలిడ్ యక్స్ట్రాక్టు యొక్క మోతాదు— 1 గ్రె॥ మొ॥ 5 గ్రె॥

లిక్విడ్ యక్స్ట్రాక్టు యొక్క మోతాదు — 15 మి॥ మొ॥ 60 మి॥

---

## యురేనియై నైట్రస్ – Uranii Nitras.

పసుపురంగును వహించిన పలుకులు; నీటిలో గలియును; వగరుగ నుండును. ఇది అతిమూత్రవ్యాధియం దుపయోగింపబడు చున్నది. దాహమును దగ్గించి, మూత్రమునందలి మధుపదార్థమును హీనపఱచుచు, మూత్రపరిమాణమును గూడ తగ్గించును. ఇందువలన రోగి తెనుకటికంటె నధికబలమును వహించి తూనికయందు గూడ హెచ్చుదలను గలిగియుండును. ఆరోగ్యస్థితియందున్నవారు పెద్దమోతాదులను బుచ్చుకొనినయెడల మూత్రమునందు మధుపదార్థమును ధాతుపదార్థమును గనబడును. 3 గ్రెయినుల మోతాదును దినమునకు మూడు పర్యాయము లియ్యవచ్చునని డాక్టరు విట్లాగారు చెప్పుచున్నారు.

సామాన్య మోతాదు — ½ గ్రె॥ మొ॥ 5 గ్రె॥

---

## వైబర్నం ప్రూనిఫోలియం – Viburnum Prunifolium.

ఈచెట్టునకు బ్లాక్ హా (Black Haw) అనెడి పేరుకూడ గలదు. దీనియొక్క బెరడు నుండి ఔషధము తయారు చేయబడును; అమెరికా దేశమునందు దీని వేరు యొక్క బెరడుగూడ మందున కుపయోగింపబడును. ఋతుస్రావమునందు నొప్పిగలిగెడి విషయములందును, హిస్టీరియాయందును, ఋతుస్రావము అధికముగ నగుటగాని, తఱచుగ నగుటగాని, అధికకాలమువఱకు నగుటగాని, యేర్పడిన స్థితులయందును, దీని నుపయోగింతురు. గర్భస్రావములు తఱచుగ సంభవించు చుండెడి స్త్రీలకు దీనిని యిచ్చుటవలన గర్భస్రావము కలుగనేరదు. సామాన్యముగ గర్భస్రావము కలుగునట్టి స్త్రీలకు దీనిని కొన్ని మాసములకు ముందుగనే యిచ్చుటకు ప్రారంభించవలయును. సాలిడ్ యక్స్ట్రాక్టును దినమునకు 2 గ్రెయినుల చొప్పున యియ్యవచ్చును,

వైబర్నం ప్రూనిఫోలియో సాలిడ్ యక్స్ట్రాక్టు (Viburnum Prunifolio Solid Extract) యొక్క మోతాదు—2 గ్రా॥ మొ॥ 3 గ్రా॥

వైబర్నం ప్రూనిఫోలియో లిక్విడ్ యక్స్ట్రాక్టు (Viburnum Prunifolio Liquid Extract) యొక్క మోతాదు — 1 డ్రా॥ మొ॥ 2 డ్రా॥

---

## యోహింబీన్ – Yohimbine

పశ్చిమ ఆఫ్రికాలో నుండెడి కెమిరూన్ చెట్టుయొక్క బెరడునుండి తయారు చేయబడిన యోహింబీన్ హైడ్రోక్లోరిడ్ యొక్క 1 భాగమును 100 రెట్ల నీటిలో గలిపి సొల్యూషనుగా నుంచుకొని, దీనినుండి 5 మి॥ మొ॥ 10 మి॥ గల మోతాదు నిచ్చినయెడల సంభోగావయవములకు బలము నిచ్చును. కేవలము నరముల యొక్క బలహీనతవలన గలిగెడి నపుంసకత్వమునందు దీని నుపయోగించిన యెడల నెట్టి విధమైన హానియును గలుగజేయక ఆశ్చర్యకరమగు గుణము నిచ్చునని గొప్ప వైద్యశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. డాక్టరు విట్లాగారు తమ అనుభవమందొక విషయములో విశేషమగు గుణము కనబడినట్లు చెప్పియున్నారు. సామాన్యజనులయందిది యెట్టి గుణమును గనబడజేయదు.

యోహింబీన్ హైడ్రోక్లోరిడ్ (Yohimbine Hydrochloride)ను 1/10 గ్రా॥ మోతాదులో మాత్రగా జేసి యిచ్చినను నీయవచ్చును.

---

## డామియానా – Damiana.

ఈ సంబంధమగు చెట్టుయొక్క ఆకులనుండియు, పుష్పములనుండియు, దయారుచేయబడిన ఔషధములు, మెదడుయొక్క నిస్త్రాణయందును, ఇంద్రియ మూత్రసంబంధములగు నరములయొక్క మధ్యస్థానములు బలహీనతను వహించియున్న విషయములందును, బనిచేయును. సంభోగసంబంధమగు బలహీనతయందు బాగుగ బనిచేయును; వీర్యనష్టమును బోగొట్టును; బలవర్థకౌషధముగ బనిచేయుచు, ఆకలిని బుట్టించు విషయమున, క్వినీన్ వలెను కలంబావలెను బనిచేయును; మూత్రప్రకోప గుణమును గలిగి, సాధువిరేచనకారిగ గూడ బనిచేయును. ఫాస్ఫరస్ స్ట్రిక్నీన్ల వలె నిది విషముగ వర్తింపదు.

యక్స్ట్రాక్టు డామియానా సాలిడ్ (Extract Damiana Solid) యొక్క మోతాదు — 2 గ్రె॥ మొ॥ 10 గ్రె॥

యక్స్ట్రాక్టు డామియానా లిక్విడ్ ( Extract Damiana Liquid ) యొక్క మోతాదు — ½ డ్రా॥ మొ॥ 1 డ్రా॥

---

## బేల్ (మారేడు) – Bael.

మారేడువృక్షము ఇండియాదేశమునందు సామాన్యముగ వ్యాపించి యుండెడిదే అయి యున్నది. దీనియొక్క సగముపండిన కాయ, జీర్ణకారిగను, రక్తనాళములను ముడుచుకొనునట్లు చేయునదిగను, బనిచేయును. అవిరేచనముల యందును, ఆమవిరేచనముల యందును,యీ వ్యాధులు ముదిరిన స్థితియం దున్నను, ఇది యుపయోగించిన యెడల మంచి గుణమును గలుగ జేయును. దీని నౌషధముగ నుపయోగించుట కీ క్రింది యక్స్ట్రాక్టు మంచిదై యున్నది.

యక్స్ట్రాక్టు బేలే లిక్విడ్—Extract Belae Liquid

మోతాదు—1 డ్రా॥ మొ॥ 2 డ్రా॥

---

## ఆరికానట్ (పోకచెక్క) – Areca Nut.

ఇండియాదేశములో తాంబూలమునందు పోకచెక్క నుపయోగింతురు. ఇది, చిగుళ్ళకు బలమును గలుగ జేసి, ఊపిరిగాలిని శుభ్రపఱచి, జీర్ణావయవములకు బలమును గలుగ జేయును.

---

## బీటిల్ లీఫ్ (తమలపాకు) – Betel Leaf.

తమలపాకు యొక్క ఉపయోగమువలన నోటియందలి గ్రంధులు ఉమ్మి ద్రవము నధికముగ స్రవించును. ఇది జీర్ణమునకు సహాయ పడును.

---

## టార్ ఆయింట్‌మెంట్ — Tar Ointment.

2 ఔన్సుల పసుపురంగుగల తేనెమైనమును 5 ఔన్సుల తారు (Tar) తో గలిపి కాచి, చల్లారువఱకును గలుపుచుండ వలయును. దీనికే టార్ ఆయింట్‌మెంట్ అందురు.

దీర్ఘవ్యాపిత మగు పొట్టు ఊడునట్టి చర్మవ్యాధులయందు దీని నుపయోగింప నగును, ఆరోగ్యస్థితియం దున్న చర్మముపై దీని నుపయోగించుట వలన వాపు దలయు బాధయు బ్రవేశించును; పెండ్రిక లున్న స్థలమందు దీని నుపయోగించిన యెడల బాధ అతిశయముగ నుండును. సోరియేసిస్ వ్యాధియం దొకప్పుడు కుదిరికను గలుగజేయ వచ్చును. యెక్జిమా వ్యాధియందు మిగుల దురదతో గూడియున్న విషయములలో, దురదను బోగొట్టి వ్యాధినే నిర్మూల పఱచ వచ్చును.

---

## క్రైసోఫానిక్ ఆసిడ్ — Chrysophanic Acid.

77వ పుటయందు వివరింపబడిన క్రైసారొబైన్ నే, గోఆ పౌడర్ (Goa Powder) అనియు, క్రైసోఫానిక్ ఆసిడ్‌ను గలిగి యుండుటచే నీ పేరు ననే దానిని బిలచుటయు దటస్థించు చున్నది.

20 గ్రె॥ క్రైసోఫానిక్ ఆసిడ్‌ను 1 ఔన్సు బెంజోయేటెడ్ ల్యార్డుతో గలిపి కరగ బెట్టుచు కలియునట్లు చేయుటవలన క్రైసోఫానిక్ ఆయింట్‌మెంట్ (Chrysophanic Ointment) యేర్పడు చున్నది. దీనిని తామర, సోరియేసిస్, మొదలగు చర్మవ్యాధుల కుపయోగింప నగును.

---

## అట్రోపీన్ — Atropine.

నిర్వర్ణమైన పలుకులుగ నుండెడి క్షారపదార్థము; బెలడోనా యొక్క ఆకులు, వేళ్లు—వీటినుండి తయారు చేయబడునది.

అట్రోపిన్‌యును, యిందు సంబంధమగు లవణములును, కనుపాపను విస్తరింపు చేయుటకును, అందలి నరములను బండబారునట్లు చేసి నేత్రచికిత్సా సందర్భమున వీలును గలుగజేయుటకును, నుపయోగింప బడును.

లోని కిచ్చుటయందు, ఓపియం, మార్ఫీన్, జాబరాండీ, అకొనైట్ (నాభి) హైడ్రోసియానిక్ ఆసిడ్ — వీటికి విరుగుడుగ నుపయోగింపబడును.

మోతాదు — 1/200 గ్రె॥ మొ॥ 1/100 గ్రె॥

---

## నాఫ్తాల్ – Naphthol.

నాఫ్తాల్ అనునది బీటా నాఫ్తాల్ (Beta - Naphthol) అనియు ఆల్ఫా నాఫ్తాల్ (Alpha - Naphthol) అనియు రెండువిధములై యున్నది.

### బీటా నాఫ్తాల్ — Beta - Naphthol.

తెల్లనిపలుకులుగ గాని, పొడిగ గాని, యుండును; దీనిని టైఫాయిడ్ జ్వరము నందు పేగులయందలి క్రుళ్లుదల స్థితిని క్రిమపఱచుటకు గాను నుపయోగింతురు గాని, యొకప్పుడు జీర్ణాస్వస్థతను గలుగజేయవచ్చును. కలరావ్యాధిలో ఆరంభస్థితియందును నుపయోగింతురు.

మోతాదు — 3 గ్రె॥ మొ॥ 10 గ్రె॥

### నాఫ్తాల్ ఆయింట్మెంట్ — Naphthol Ointment.

1 డ్రాము బీటా నాఫ్తాల్ను 8 డ్రాముల ల్యార్డ్తో గలిపి నూరినయెడల నాఫ్తాల్ ఆయింట్మెంట్ యేర్పడు చున్నది. దీనిని సోరియేసిస్, యెగ్జిమా మొదలగు చర్మ వ్యాధులయం దుపయోగింతురు. ఇది టార్ ఆయింట్మెంట్ (Tar Ointment) వలెనే పనిచేయును.

### ఆల్ఫా నాఫ్తాల్ — Alpha - Naphthol.

ఇది బీటా నాఫ్తాల్ కంటె క్రుళ్లుదనమును బోగొట్టుట యం దెక్కువ బలమైన దిగ నమ్మబడు చున్నది. లోని కిచ్చినయెడల నెక్కువ రేగుదలను గలుగజేయును గనుక యిందులకై ఉపయోగించుట యంతగా శ్రేష్ఠము గానేరదు. దీనియొక్క పొడిని కురుపులు మొదలగువానిపై జల్లవచ్చును. 1 డ్రాము ఆల్ఫానాఫ్తాల్ను 10 డ్రాముల ల్యార్డుతో గలిపి నూరి ఆయింట్మెంటుగా జేయవచ్చును. దీనిని గూడ గాయములు మొదలైనవాటి కుపయోగింప వచ్చును.

లోని కిచ్చుటవలన నొకప్పుడు అపాయస్థితి సంభవింపవచ్చును గాన దీనిని గూడ లోని కుపయోగించుట మంచిదికాదు.

మోతాదు — 2 గ్రె॥ మొ॥ 5 గ్రె॥

---

## ఏ. బి. సి. లినిమెంట్ — A. B. C. Liniment.

సమానభాగములుగ, లినిమెంట్ అకొనైట్ (Liniment Aconite) ను, లినిమెంట్ బెలడోనా (Liniment Belladonna) ను, లినిమెంట్ క్లోరొఫారం (Liniment Chloroform) ను — గలిపినదానికి ఏ. బి. సి. లినిమెంట్ అందురు. దీనిని కీళ్లనొప్పి, తుంటినొప్పి, నడుమునొప్పి, — వీటియందు పైన రాయ నగును. దీనిని యేసందర్భమునను లోని కియ్యరాదు; ఇది విషమై యున్నది.

---

## ఏ సి. ఇ. మిక్శ్చర్ — A. C. E. Mixture.

శస్త్రసంబంధ మగు చికిత్సలయందు రోగి నొప్పి నొందకుండుటకు గాను క్లోరొఫారంను వాసన జూపుదురు. ఇందులకు గాను ఈ క్రిందిపాళ్ల ప్రకారమున గలుపుటవలన నేర్పడెడి ఎ. సి. ఇ. మిక్శ్చరును ఉపయోగించుట మంచి దని కొందఱు డాక్టరులు అభిప్రాయపడు చున్నారు:— 1 భాగము అబ్సల్యూట్ ఆల్కహాల్ (Absolute Alcohol), 2 భాగములు క్లోరొపారం (Chloroform) 3 భాగములు ఈతర్ (Ether).

---

## ట్రాగకంతా — Tragacantha.

వంకరైన పలుకులుగ నుండెడి తెల్లని జిగురుపదార్థము. దీనిని నీటితో గలిపిన యెడల ఉబ్బుదల నంది నీటిలో గలియని కొన్ని పదార్థములను నీటితో గలియ జేయును.

### మ్యూసిలేజ్ ట్రాగకంతా — Mucilage Tragacantha.

60॥ గ్రె॥ ట్రాగకంతా పొడిని 2 డ్రా॥ ఆల్కహాల్తో గలిపి, 10 ఔన్సులు అగువఱకును అవిరిని జల్లార్చిన నీటితో గలిపి, నిలువ యుంచుకొనిన దానికి

మ్యూసిలేజ్ ట్రాగకంతా అందురు. ఇది బ్లాక్ వాష్ (Black Wash) లో గలియును.

---

## బ్లాక్ వాష్ — Black Wash.

30 గ్రా॥ క్లోరీడ్ ఆఫ్ మెర్క్యురీని, ½ ఔన్సు గ్లిసరీన్ తోడను, 1¼ ఔన్సు మ్యూసిలేజ్ ట్రాగకంతా తోడను, గలిపి నూరి క్రిమక్రిమముగా లైమ్ సొల్యూషను (Lime Solution)ను, అంతయు 10 ఔన్సులు అగువఱకును, గలుపవలయును.

కోలుకు సంబంధ మగు పుండ్లను గడుగుటకు దీని నుపయోగింతురు; ఇందు వలన నట్టి కురుపులకు నయము గలుగును.

---

## యెల్లో ఆక్సైడ్ ఆఫ్ మెర్క్యురీ — Yellow Oxide of Mercury.

రససంబంధమగు నట్టి పసుపు రంగును వహించిన పొడి; 10 గ్రా॥ యీపొడిని 8 డ్రా॥ 10 గ్రా॥ వాసలీన్ తో గలిపి తయారగు ఆయింట్మెంట్ను, కోలుకు సంబంధ మగు పుండ్లకును, వాపుదల నందియున్న కనురెప్పలకును, నుపయోగింతురు.

---

## లైం సొల్యూషన్ — Lime Solution.

2 ఔన్సుల తడిసున్నమును 1 గాలను నీటిలో గలిపి 12 గంటల కాలము నిలువ యుంచిన పిమ్మట, పై తేటనీటిని వంచివేయ వలయును. ఈ వంచిననీటికే లైం సొల్యూషన్ అందురు. ఆమ్లప్రతిఘాతముగను, రక్తనాళములను ముడుచుకొను నట్లు చేయునదిగను, బనిచేయును.

మోతాదు—1 ఔన్సు మొదలు 4 ఔన్సులు (పాలలో గలిపి); 1 సం॥ వయసుగల బిడ్డకు ½ డ్రా॥ మొ॥ 1 డ్రా॥

---

## క్యారన్ ఆయిల్ Carron Oil.

2 ఔన్సుల లైం వాటరును, 2 ఔన్సుల కొబ్బరినూనెను, ఒకదాని తరువాత నొకటి కొంచెము కొంచెముగ కల్వములో బోసి నూరుట వలన దళమైన

తెల్లని ద్రవపదార్థ మేర్పడును. దీనికే క్యారన్ ఆయిల్ అందురు. తెలుగులో దీనికి నవనీతము అను వాడుకపేరు కలదు. కొబ్బరినూనెకు బదులుగ ఆలివ్ ఆయిల్‌ను గాని లిన్‌సీడ్ ఆయిల్‌నుగాని యుపయోగించినను ఉపయోగింప వచ్చును. కాలిన స్థలముల యందు దీనిని వెంటనే ఉపయోగించుటవలన చల్లగనుండి మంచి గుణము నిచ్చును.

## కాల్సియం సల్ఫైడ్ — Calcium Sulphide.

బూడిదరంగుగల పొడి; కురుపులు, రాచపుండ్లు, మెడ సంబంధ మగు పుండ్లు మొదలగువాటి యందు దీని నిచ్చిన యెడల, నయమగును; మాత్రిగా జేసియిత్తురు.

మోతాదు — $\frac{1}{4}$ గ్రే॥ మొ॥ 1 గ్రే॥

## గార్లిక్ (వెల్లుల్లి) — Garlic.

ఇది నీరుల్లి వలెనే పనిచేయును; పేగులలోని పాములను (Roundworm) నశింపుచేయును, విశేషించి తీసికొనినయెడల వాంతులను విరేచనములను గలుగ జేయును. దీనియొక్క చమురునందు కఫమును వెలిబుచ్చునట్టి గుణము గలదు. దీని యందు క్రిమ్యుదనమును గలుగకుండ జేయు గుణముగలదు. తక్కిన వివరములకై నీరుల్లి క్రింద జూడవలయును.

## నీమ్ (వేప) — Neem.

వేపచెట్టు నాటబడియున్న స్థలముయొక్క చుట్టుపట్ల ఆరోగ్యతకు అనుకూల ముగ నుండు ననియు, చలిజ్వరవ్యాధికి బ్రతికూలముగ నుండు ననియు, నమ్మబడు చున్నది. ఈచెట్టుయొక్క దాదాపు ప్రతిభాగమును వైద్యమునకు బనికివచ్చుచున్నది. ఈచెట్టుయొక్క వేళ్లకు సంబంధించిన బెరడు, కొమ్మలయొక్క బెరడు, పచ్చికా యలు— వీటియందు రక్తనాళములను ముడుచుకొను నట్లు చేయుగుణమును, బల వర్ధకౌషధగుణమును, చలిజ్వరరహితగుణమును, నుండి యున్నవి. బలహీనత యందును, జ్వరానంతరము స్వస్థావస్థయందును, ఆకలి మందగింపు నందును, బెరడు యొక్క పొడిని డ్రాము మోతాదులో నుపయోగింతురు. ఈపొడికంటె నీ క్రింది విధముగ దయారు చేయబడెడి కషాయ మెక్కువ యుపయోగముగ నుండును. వేళ్ల యొక్క బెరడునుగాని, కొమ్మయొక్క బెరడును గాని, ముక్కలుగా గొట్టబడిన దానిని 4 ఔన్సులను 2 పైంట్ల నీటిలో వేసి, 1 పైంటు అగునట్లుగా నిప్పుపై కాచ్చి

దిగా కాచి, వేడిగ నుండగనే వడపోయవలయును. దీనియొక్క మోతాదు 1½ ఔన్సు మొదలు 3 ఔన్సుల వరకు నయియున్నది.

ఈ చెట్టుయొక్క విత్తులనుండి తీయబడెడి పసుపురంగును గలిగిన వేపనూనెను, కార్బాలిక్ ఆయిల్ వలెనే, కురుపులు మొదలైన వాటి కుపయోగించవచ్చును. ఈ నూనెను పాల్ మొగ్రా ఆయిల్ తోగాని గర్జన్ బాల్సంతోగాని కలిపి కుష్ఠువ్యాధి యం దుపయోగింప నగును. పేగులయం దుండెడి పురుగులను నశింపు నందింప జేయుటకు 30 మి॥ మొ॥ 60 మి॥ వఱకు ఈ నూనెను లోని కియ్యవచ్చును.

పేలను జంపుటకుగాను వేపనూనెను తలకు రాయవచ్చును.

ఎండిన గింజలను నూరి నీటితో గలిపినయెడల నూనెవలెనే పనిచేయును. వేపాకును నూరి గోరువెచ్చని నీటిలో గలిపి ముద్దగా జేసి కురుపులకు బెనగట్టినచో జొరుకుదనమును బుట్టించును. వేపాకును నీళ్లలో వేసి కాచి యానీటితో గురుపులను గడుగుటయును, వాపునందిన గ్రంథులను, నలిగిన స్థలములను, బెణికిన స్థలములను—గాచుటయును, చేయవచ్చును.

బెరడునుండి వెలువడునట్టి జిగురు చురుకుదనమును బుట్టించునదిగ బనిచేయును.

వేపపువ్వు, చురుకుదనమును బుట్టించుచు, బలవర్థకౌషధముగ బనిచేయును. జీర్ణకారిగ బనిచేయుచు ఆకలిని గలిగించును.

వేపచెట్టుయొక్క మూ్రినునుండి స్రవించెడి ద్రవము బలవర్థకౌషధముగ బనిచేయు ననియు, క్షయ, దీర్ఘవ్యాపిత మగు కుష్ఠువ్యాధి, యితర చర్మవ్యాధులు—వీటియం దుపయోగముగ నుండుననియు జెప్పబడు చున్నది. ఈస్రవమును 2 ఔన్సులు మొదలు 4 ఔన్సుల వఱకు మోతాదుగ నెంచవచ్చును; ఈ మోతాదు ప్రకారము దినమునకు మూడు లేక నాలుగు పర్యాయములు పుచ్చుకొన వచ్చును.

వేపచెట్టుయొక్క చిన్న పుల్లలను పండ్లు తోముకొనుట కుపయోగించుట వలన ఆరోగ్యకరముగను, నోరు పరిశుభ్రముగను, నుండునని యెంచబడుచున్నది.

---

## సాల్యుబిల్ ఫెనైల్ — Soluble Phenyle.

తారు (Tar) నుండి తయారు చేయబడినట్టియు, నలుపు బూడిద రంగులను గలిసినట్టియు ద్రవపదార్థము; దీనిని నీటిలో గలిపిన యెడల తెల్లగ నగును. దీనిని

నీటిలో గలిపి బరిశుభ్రపఱచుటకై, కార్బాలిక్ ఆసిడ్ వలెనే, దుర్వాసనగల స్థలములయందు జల్లవచ్చును.

---

## ఈసరీన్ సల్ఫేట్ – Eserine Sulphate.

నిర్వర్ణమైనట్టిగాని, యెరుపు రంగును గలిగినట్టిగాని, పలుకులుగ నుండును. ఇది కనుపాపను ముడుచుకొనునట్లు చేయును. ఔన్సు జలమునకు 2 గ్రె॥ కలుపబడును. అట్రోపిన్‌కు వ్యతిరేకముగ నిది పనిచేయును. దీనిని కంటివైద్యమును దెలిసిన శస్త్రవైద్యులు మాత్రమే యుపయోగింతురు. ఇది బలమైన విషము.

---

## లైకర్ ఫెర్రియి డయాలిసేటస్ – Liquor Ferri Dialysatus.

స్వచ్ఛమై, నలుపు బూడిద రంగులు కలసిన వర్ణమును గలిగియుండిన ద్రవపదార్థము, ఇందు లోహము కలిసి యుండును. లోహసంబంధము లగు ఆమ్లపదార్థములను జీర్ణాశయము సహించలేకున్నపుడు దీని నుపయోగించుట వలన లోహమును శరీరమునందు యిముడునట్లు చేయవచ్చును. ఇది నీటిలో గలియదు; కాబట్టి విడిగా నియ్యవలయును; లేదా 3 రెట్లు గ్లిసరీన్‌తో గలిపి యియ్యవచ్చును.

మోతాదు — 10 మి॥ మొ॥ 30 మి॥

---

## కోడిగుడ్డు – Egg.

రెండు కోడిగుడ్లయొక్క పసుపువర్ణముగల భాగమును ½ ఔన్సు చక్కెర (Sugar)తో నూరి, దీనికి 4 ఔన్సుల బ్రాందిని 4 ఔన్సుల సినమన్ (దాల్చినచెక్క) నీటిని, గలిపి తయారు చేసిన దానికి యగ్ ఫ్లిప్ (Egg Flip) అందురు. ఇది బలమునిచ్చునదిగను, కొంచెముగ, మగతను గలుగజేయునదిగను, బనిచేయును. తేలికగ జీర్ణమగును.

కోడిగుడ్డులోని తెలుపుభాగమునందు, ధాతుపదార్థమును, ఆమ్లపదార్థమును, కొంచెముగ లవణములును ఉండియున్నవి. శరీరమునందలి విశేషముగు నల్లికలలో గనుగొనబడు పదార్థమును రక్తమున కంద జేయుటవలన నిది మిగుల బలము నిచ్చునదై యున్నది. దీనిని మాత్రలకు బైన పూతగాగూడ నుపయోగింతురు. రససంబంధమగు

నట్టియు కాపర్ (రాగి లేక తామ్రము) సంబంధమగు నట్టియు విషములకు విరుగుడుగ బనిచేయును.

---

## కాపర్ సల్ఫేట్ (మైలతుత్తము) — Copper Sulphate.

నీలవర్ణమైన గడ్డలుగ నుండును; కొద్దిమోతాదులలో ($\frac{1}{2}$ గ్రె॥) బలమైన అతి విరేచనముల యందును, కలరాయందును, ($\frac{1}{2}$ గ్రె॥) ఓపియంతో గలిపి యియ్యనగును. జరములకు బలమును గలుగజేయు గుణమును బట్టి మూర్ఛలయం దియ్యబడును. పెద్ద మోతాదులలో (5 గ్రె॥ మొ॥ 10 గ్రె॥) ఫాస్ఫరస్, నల్లమందు, విషముష్టి, ఉమ్మెత్త, నాభి, పాషాణము— వీటియొక్క విషప్రయోగములందు వాంతికారిగ నుపయోగింప నగును. 5 గ్రె॥ ను 1 పైంటు గోరువెచ్చని నీటిలో గలిపి యియ్యవలెను. ఒక అరగంట కాలములో దీనివలన ప్రయోజనము లేకపోయినయెడల మఱల నొకమోతాదును యిదేప్రకారముగ నియ్యవలయును; అవసరమైనచో నింకొక పర్యాయమును యియ్యవచ్చునుగాని, యింతకు మించరాదు. మఱియు నిది వాంతితో వెలువరింపబడక పోయినయెడల నిదియే విషముగ బనిచేయును గావున దీని నింత కెక్కుడుగ నుపయోగించరాదు. దీనిని వాంతికారిగ పైన చెప్పబడిన విషప్రయోగముల యందు మాత్రమే ఉపయోగింప వలయునుగాని యితరవిషయములందు వాడుక చేయరాదు. దీనివలన నేమైన ననారోగ్యఫలితములు గాన్పించిన యెడల కోడిగుడ్డులోని తెలుపు పదార్థము నియ్యవలయును.

1 ఔన్సు జలము నందు 3 గ్రె॥ కాపర్ సల్ఫేట్‌ను గలిపి కురుపులను గడుగుట కుపయోగింప నగును.

బిడ్డలకు గలిగెడి కండ్లకలకయందు స్రావ మధికముగ నుండిన విషయములలో 1 ఔన్సు జలమునందు 1 గ్రె॥ కాపర్ సల్ఫేట్‌ను గలిపి యాలోషనుతో నేత్రములను దఱచుగ గడుగవలయును; అవసర మని తోచినచో నిందులకు రెట్టింపు మోతాదును గూడ నీటిలో గలిపి ఉపయోగింప వచ్చును.

తామరయందు:— కాపర్ సల్ఫేట్ పొడి 20 గ్రె॥, మాచికాయపొడి 1 డ్రా॥, పిరోజిల్ 1 ఔన్సు, వీటి నన్నిటిని గలిపి ఆయింట్‌మెంట్ గా జేసి అస్వస్థత భాగమున బాగుగ రుద్ద నగును.

జలగల యొక్క కాటు వలన విశేషముగ రక్తస్రావ మగుచున్నపుడు కాపర్ సల్ఫేట్ యొక్క పొడిని అద్దుటవలన స్రావమును నిలుపు చేయవచ్చును. ముక్కు నుండి రక్తస్రావ మగుచున్నపుడు పటిక వలన ప్రయోజనము గనుపించ నపుడు 4 గ్రా॥ కాపర్ సల్ఫేట్‌ను 1 ఔన్సు జలములో గలిపి నాసికాద్వారమునందు ప్రయోగించుటవలన నొకప్పుడు గుణము కనుపడవచ్చును.

మోతాదు — స్రావముల నణచివేయుటకు మాత్రరూపమును ½ గ్రా॥ మొ॥ 2 గ్రా॥; వాంతికారిగ పైనచెప్పిన రీతిని 5 గ్రా॥ మొ॥ 10 గ్రా॥

---

## సిరోమెల్ — Ceromel.

1 ఔన్సు పసుపు వర్ణముగల మైనమును 4 ఔన్సుల శుభ్రమగు తేనెతో గలిపి సన్నని నిప్పుసెగలోగాచి వడపోసి యుంచుకొననగును. దీనికే సిరోమెల్ అని పేరు. ఆయింట్ మెంట్లను జేయుటలో ఉష్ణదేశములయందు జంతుసంబంధమగు క్రొవ్వు పదార్థములు త్వరితముగ క్రుళ్లిపోయి కంపువేయును గనుక దీని నుపయోగింప వచ్చును. నానుడు కురుపులకు పైన రాసినచో చురుకుదనమును బుట్టించును.

---

## హానీ (తేనె) — Honey.

ఇండియాదేశమునందనేక ప్రదేశములలో మంచిరకపు తేనె దొరకును. దీనియందు స్వచ్ఛమైన వైద్యగుణము లేవియు లేకున్నను, బిడ్డలకు పౌడర్లను యిచ్చుటలో దీనిని గలిపి యిచ్చుటకు వీలుగ నుండగలదు. కావున, కొంతతేనెను నిలువ యందుంచుకొనుట మంచిది; మాత్రల జేయుటకును నుపయోగింప వచ్చును. బిడ్డలకు సూక్ష్మవిరేచనకారిగ బనిచేయగలదు. ఇది మలినయుతమై యున్నయెడల, క్రాగుచున్న వేడినీటిలో నొకపాత్ర నుంచి, అందు దీని నుంచి, కరగబెట్టి గుడ్డతో వడపోయవలయును; అప్పు డిది పరిశుభ్రముగ నుండును.

---

## ప్లాస్టర్సు (పలాస్త్రిలు) — Plasters.

పలాస్త్రులు ముఖ్యముగ నవి కలుగజేయు పట్టుకై ఉపయోగింపబడుచున్నవి. అనారోగ్యభాగమును జుట్టుకొని సాగుదల స్థితిని బొందియున్న అల్లికప్రదేశములను పట్టునందుంచి యెక్కువైన యొత్తిడిని గలుగ జేయుట మూలమున వాపుదల

ఫలితములను శరీరమునందు హరింపు నందజేయును; కీలుకు సంబంధమగు నిట్టి ఫలితములను హరింపు నంద జేయుటకు మెర్క్యూరీ పలాస్త్రి (Mercury Plaster) నుపయోగింప నగును. మెంథాల్, బెలడోనా, ఓపియం పలాస్త్రిలను వేయుట వలన నొప్పిని శాంతిపఱచ వచ్చును.

కెంతారిడీస్ పలాస్త్రి (Emplastrum Cantharides) ప్రతిహతమగు రేగుదల (Counter- Irritation) ను గల్గజేయును. ఈ కెంతారిడీస్ పలాస్త్రి తప్ప తక్కిన వన్నియు అస్వస్థతాభాగమును బయటి శీతోష్ణస్థితి మార్పులకు లోనుగాకుండ జేసి వాపుదల సంబంధ మగు నిలువపదార్థములను శరీరమునందు జీర్ణింప జేయును; ఆవిరిగా మారు స్థితిని ఆపుచేయుట వలన నాభాగమునందలి యుష్ణ మధిక మై అంతరావయవములు పొందునట్టి లాభముల నిదియు బొందును.

---

## ల్యానోలీన్ — Lanoline.

ల్యానోలీన్ అనునది గొఱ్ఱెయొక్క బొచ్చునుండి తయారుచేయబడిన క్రొవ్వు పదార్థము. దీనిని డాక్టర్ లీబ్రిక్ గారు, మనుష్యునియొక్క చర్మమునందును, కెండ్రుకలయందును, పక్షులయొక్క యీకలయందును, తక్కిన జంతువులయొక్క అనేకభాగముల యందును, గనుగొనినట్లు చెప్పియున్నారు, కొంచెము పసుపువర్ణమును గలిగి, జిగురుగ నుండి, వాసనలేకుండ నుండి, కుళ్లకుండునట్టిదై, యుండును; నీటిని యీడ్చుకొనునుగాని గ్లిసరీన్‌తో గలియదు; ఆయింట్‌మెంట్లను జేయుటకు దీనితో సమానమైనది మఱియొకటి లేదు. చర్మముపై రాసినయెడల నిది శరీరములోనికి బహుత్వరితముగ నింకిపోవును. ఈ గుణమును బట్టియే, యిందుతో గలిపి యొడలుపై ప్రయోగింపబడిన అయొడిన్ మూడునిమిషముల పిమ్మట మూత్రమునందు గనుగొనబడెను. త్వరితముగ నేదైన శరీరమున నింకిపోవలెనన్న విషయములో దీనితో గలిపి ఉపయోగింప నగును. కాలిన స్థలములయందును ఉడుకునీళ్ళు పడియున్న స్థలములయందును దీనిలో 100 కి 4 వంతున కోకేన్ (Cocaine) ను గలిపి ఉపయోగించిన యెడల నొప్పిని దగ్గించి, ఆభాగమునందు గాలి తగులకుండ జేయును.

---

## వాసలీన్ — Vaseline.

137 వ పుటయందు వివరము లియ్యబడిన సాఫ్టు పెరఫీన్ కే వాసలీన్ అను మఱియొక పేరు గలదు.

---

## సిల్లా (స్క్విల్) — Scilla (Squill).

స్క్విల్ రేగుదలను గలుగ జేయునట్టి బల మైన విషమై యున్నది; ఇది వాంతులను విరేచనములను గూడ గలుగ జేయును.

దీనియొక్క గుణము డిజిటాలిస్‌ను బోలియే యుండునుగాని, డిజిటాలిస్ కంటె నిది జీర్ణాశయమునకును ప్రేగులకును నెక్కువ రేగుదలను గలుగజేసి, డిజిటాలిస్‌యందు లేనట్టి కఫము వెలిబుచ్చునట్టి గుణమును గలిగియున్నది. ఇది మూడుమార్గముల గుండ శరీరమునుండి వెలువడును:—(1) ప్రేగులగుండ సాధువిరేచనకారిగ బనిచేయును. (2) మూత్రగ్రంథులకు జురుకుదనమును బుట్టించి మూత్ర ప్రకోపఫలితములను గనబఱచును. (3) శ్వాసకోశసంబంధ మగు ఆమప్రదేశముల యందలి స్రావమును ద్రవపఱచి కఫమును వెలిబుచ్చజేయును. ఈ చివరఫలితము నకై ముఖ్యముగ నిది ఉపయోగింపబడును; దీనిని ఇపికాక్‌తో జేర్చి యిచ్చిన బాగుండును. ఈసంబంధమగు సిరప్ (షరబత్తు)ను 10 మినిముల మోతాదులో దీర్ఘవ్యాపితమగు శ్వాసాస్వస్థతలలో నిచ్చినయెడల కఫమును వెలిబుచ్చును. మూత్ర ప్రకోపకారిగ దీనిని విడిగా నిచ్చుట యరుదై యున్నది; డిజిటాలిస్‌తో గలిపి యియ్యనగును.

### సిరప్ సిల్లా — Syrup Scillae.

మోతాదు :—కఫమును వెలిబుచ్చుటకు ½ డ్రా॥ మొ॥ 1 డ్రా॥.

వాంతికారిగ 1 ఔన్సు; 1 సం॥ వయసుగల బిడ్డకు కఫహారముగ 5 మి॥: వాంతికారిగ ½ డ్రా॥ మొ॥ 1 డ్రా॥.

### టింక్చర్ సిల్లా — Tincture Scillae.

మోతాదు — 5 మి॥ మొ॥ 15 మి॥

---

## సాకరిన్ — Saccharin.

తేలికయినట్టియు, తెల్లనైనట్టియు, పొడి; నీటియందు గొంచెముగ గలియును; ఉడుకునీళ్ళయం దెక్కువగ గలియును; సోడాబైకార్బనస్ సాల్యూషనునందు విరివిగ గలియును. సాకరిన్‌యొక్క విశేషమగు తీపిదనమును బట్టియు లోనికి బుచ్చుకొనుటవలని నిరపాయతను బట్టియు, అసహ్యతను వహించియున్న సాలిసిన్,

కాస్కారా సాగ్రడా మొదలగువాటి అరుచిని బోగొట్టుటకును, అతిమాత్రి వ్యాధిగ్రస్తులయొక్క ఆహారమునకు చవి గలుగజేయుటకును, యిది ఉపయోగింపబడుచున్నది. ఇది చక్కరకంటె 250 మొదలు 300 రెట్లు తీపిని వహించి యున్నది; 450 మొదలు 500 రెట్లు తీపివఱకు గూడ దీని గుణముండు నటుల కొన్నిరకముల సాకరిన్ తయారు చేయబడుచున్నది. సాకరిన్‌ను విశేష పరిమాణములుగ నుపయోగించినను, విశేషకాలమువఱ కుపయోగించినను, జీర్ణాస్వస్థతల నేమియు గలుగ జేయనేరదు.

మోతాదు—½ గ్రా॥ మొ॥ 2 గ్రా॥ కాని, యింక నెక్కువగాగాని.

---

## క్లోరొడీన్ – Chlorodyne.

దీనియందు, క్లోరొఫారం, మార్ఫిన్ హైడ్రొక్లోర్, డైల్యూట్ హైడ్రోసియానిక్ ఆసిడ్, టింక్చర్ కాప్సికం. పెప్పర్మింట్ ఆయిల్, గ్లిసరీన్, టింక్చర్ కెనేబిస్ ఇండికా, అల్కహాల్—యివన్నియు గలియును. దగ్గులు, అతివిరేచనములు, కడుపునొప్పి, మొదలగు వాటియం దుపయోగించును.

మోతాదు — 5 మి॥ మొ॥ 15 మి॥

---

## ఆలెట్రిస్ – Aletris.

దక్షిణ అమెరికా యందలి యొక్క విధమగు చెట్టుయొక్క తీగతోడను వేళ్లతోడను జేయబడిన యౌషధము. ఋతు స్రావము క్రమముగ గాకపోవుటయందును, ఋతుస్రావము నొప్పితో గూడి యగుటయందును. గర్భాశయము వ్రాలిపోవుటయందును, గర్భధారణస్థితి కలుగని విషయమునందును, దీని నుపయోగింపనగును. గర్భస్రావము కలుగకుండుటకును నుపయోగింతురు. గర్భస్రావము మామూలుగ గలుగుచుండెడి విషయములలో దీనిని గర్భధారణ కాలమందు విడువకుండ నుపయోగించుట వలన గర్భాశయమునకు బలమును గలుగ జేసి గర్భస్రావము కలుగ కుండ జేయును.

ఇందు సంబంధ మైనట్టియే ఆలెట్రిస్ కార్డియల్ (Aletris Cordial) అన బడునట్టి ఔషధమును 1 డ్రాము మోతాదులో దినమునకు 3 లేక 4 పర్యాయము లియ్యనగును.

---

## ఈస్టన్స్ సిరప్ — Easton's Syrup.

దీనియందు, ఐరన్ (లోహము), ఫాస్ఫరస్, క్వినీన్, సల్ఫేట్, స్ట్రిక్నిన్— కలిసియుండును. బలవర్ధకౌషధముగ నుపయోగింప బడును.

మోతాదు— ½ డ్రా॥ మొ॥ 1 డ్రా॥

---

## సినరేరియా — Cineraria.

సినరేరియా మెరీటిమా (Cineraria Maritima) అనబడెడి చెట్టు యొక్క ఆకుల నుండి క్రొత్తగ దీయబడిన రసమును దినమునకు 3 మారులు 2 మినిముల మోతాదులో కంటిలో వేయుటచే రెండు మాసములలో కంటి యొక్క పొర (Cataract) రాహిత్యత నందినటుల దెలియుచున్నది. దీనివలన నెట్టి రేగుదల కాని వాపుదల కాని గలుగ నేరదు; ఒక నిమిషము మాత్రమేగాని లేక రెండు నిమిషములు మాత్రము గాని కొంచెముగ చిమచిమ లాడును.

---

## ఆరిస్టాల్ — Aristol.

తేలికయి నట్టియు, యెరుపు బూడిద వర్ణములు గలిసిన వర్ణమును గలిగినట్టియు, పొడి; క్రొత్తగా యున్నపుడు యెట్టిరుచియును వాసనయును లేకుండ నుండును; నీటిలో గలియదు; అల్కహాల్ లో కొద్దిగ గలియును; వెలుతురుగాని వేడిమిగాని తగులగనే చెడిపోవును కాబట్టి, నల్లని సీసాలలో నుంచబడవలయును. చమురులలోను వాసలీన్ లోను గలియును. దీనియందు, తైమాల్, అయొడిన్, పొటాసియం అయొడైడ్, కలసి యుండును. సిఫిలిస్ (కొఱుకు) వ్యాధియందు అయొడొఫారంకు బదులుగ దీనిని అవ్వ్యాధి సంబంధమగు కురుపులకు నుపయోగించుట వలన గుణముగ నుండగలదు. అయొడొఫారమున కుండెడివాసనలేకుండుటయు, దానివలె నిది శరీరమునందు జీర్ణతనంది విషఫలితముల గనబరచకుండుటయు— యీరెండును దీనియందలి సుగుణములై యున్నవి. దీనిని ముఖ్యముగ — చెంపపైపొక్కులు, సోరియేసిస్, తామర, ఏనుగగజ్జి — మొదలగు చర్మవ్యాధుల యందు బాగుగ బనిచేయును.

**100 కి 5** లేక **10** వంతున చొప్పున ల్యానొలీన్ లో గాని వాసలీన్ లో గాని కలుపబడి తయారుచేయబడిన అయింట్ మెంట్ ను మూలశంకవ్యాధి యందు లేపనముగ నుపయోగింప వచ్చును.

---

## క్సైలాల్ — Xylol.

నిర్వర్ణమైనట్టియు కొంచెముగ బసుపువర్ణమును కలిగినట్టియు సూక్ష్మమైన వాసన కలిగినట్టియు, ద్రవపదార్థము; తారు (Tar) సంబంధమైనది; మశూచి వ్యాధియందు దీనిని లోనికి బుచ్చుకొనుట వలన, గొంతునందలి వాపుదలను, గొంతులోని పొక్కులను, నెమ్మదిపఱచి, పైఊపిరి యందలి దుర్వాసనను బోగొట్టును.

మోతాదు — 10 మి॥ మొ॥ 15 మి: (ఆలివ్ ఆయిల్ తో గలిపి యియ్య వచ్చును.

---

## ఆంటిఫెబ్రిన్ — Antifebrin.

నిర్వర్ణమైనట్టియు, మెరయునట్టియు, పలుకులుగ నుండును. దీని ఉపయోగము వలన జ్వరమును తగ్గునట్లు జేయుననియు, నరముల సంబంధమగు తలనొప్పి మొదలగు వాటి నంతరింప జేయుననియు, వాడుక గలదుగాని — యీఫలితములు కొంచెము కాలము వరకు మాత్రమేయుండి, నీరసతనుగూడ గలుగజేయును గావున, నీ మందు నుపయోగించుట మంచిది కాదు. ప్రికృత వైద్యమునందు యీ ఔషధము వాడుక చేయబడుచున్నటులరయే గనబడదు. ఫేనాసిటిన్ వలె నిది క్షేమకరమగు జ్వరనివారిణి కాదు.

మోతాదు — 1 గ్రె॥ మొ॥ 3 గ్రె॥

---

## ఆంటిపైరిన్ — Antipyrin.

నిర్వర్ణమైనట్టియు, వాసనలేనట్టియు, చేదుగుణమును గలిగినట్టియు, పలుకులుగ నుండును; నీటిలో గలియును. ఇదికూడ జ్వరమును తగ్గించునదగను, నొప్పిని బోగొట్టునదిగను, వర్తించును. దీనియొక్క వాడుక తగ్గిపోయినది. జ్వరము విశేషించియున్న విషయములందు దీనియొక్క గుణమునం దెక్కువ నమ్మక ముంచుటకు వీలు లేదు. క్షయవ్యాధియందు మాత్రము జ్వరము మిక్కుటముగ నున్నపుడు, మొదటగా 10 గ్రెయినులను, ఒకగంట పిమ్మట 5 గ్రెయినులను, మఱియొకగంట తరువాత యింకొక 5 గ్రెయినులను, యిచ్చిన యెడల పూర్ణమైనట్టియు సంతుష్టికరమైనట్టియు మోతాదుగ నెంచదగును. ఇందువలన శరీరవేడిమి 10 డిగ్రీలు సయితము తగ్గి, దుర్గుణములయొక్కయు ఆయాసముయొక్కయు తీవ్రతను తాత్కాలికముగ తగ్గిం

చును. చిన్న మోతాదుల నింక నెక్కువ దఱచుగ నిచ్చినయెడల క్షేమకరమై యున్నను, సంతుష్టమగు ఫలితముల నియ్యజాలవు. ఎటులైనను, దీని యుపయోగానంతర మొక ప్పుడు క్షీణగతి కలిగి అపాయము జనింపవచ్చును గావున, దీనియొక్క ఉపయోగ మును గూర్చి యంతగా బ్రోత్సాహింప దగియుండలేదు.

మోతాదు — 5 గ్రె॥ మొ॥ 20 గ్రె॥

---

## రిసార్సిన్ — Resorcin.

స్ఫటికమువలె నుండు తెల్లనిపొడి; దీనియొక్క గుణములయందు కార్బాలిక్ ఆసిడ్‌ను బోలియుండును; కుళ్లకుండ జేయుటయందు బలమైనది. 100 కి 1 పాలు వంతున కుళ్ళకుండ జేయును; 100 కి 2 పాళ్ళవంతున గలిపి ఉపయోగించినచో పుండ్లకు రేగుదలను గలుగజేయకుండ నుండును.

బిడ్డలకు అతివిరేచనములు కలిగినప్పుడు 1 గ్రె॥ మోతాదు నిచ్చిన యెడల మంచి గుణము నిచ్చును.

జ్వరమును తగ్గించుటకు గాను యిది పెద్దమోతాదులలో నుపయోగింప బడుచుండెడిది గాని, యీ పద్ధతి అపాయముతో గూడి యున్నది.

---

## గోక్రూ (పల్లేరు) — Gokhru.

పల్లేరు యిసుకనేలలో నెక్కువ యభివృద్ధి నందును; చెన్నపురి రాజధాని యందును, సంయుక్తరాష్ట్రముల యందును, విశేషించి దొరకును. వేళ్ళసహితముగ చెట్టుఅంతయు మందున కుపయోగించు చున్నది. పల్లేరుకాయలలో పండినవాటిని యెండబెట్టి వీటినుండి తయారు చేసిన కషాయమును, చలువచేయుటకును, మూత్రప్రకోపకారిగను బలవర్ధకౌషధముగను బనిచేయుటకును, సంభోగావయవములకు బలమును గలుగ జేయుటకును, నిద్రయందలి యింద్రియ స్ఖలనము నాపుచేయుటకును, నిద్రయందు స్వాధీనము తప్పి మూత్రము విసర్జనమగుటను నిలిపివేయుటకును, వీర్యనష్టమును బోగొట్టుటకును, ఇంద్రియ మూత్రమార్గముల యొక్క మూత్ర విసర్జనమునందలి బాధ కలుగుటయు మొదలుగాగల అస్వస్థతలను బోగొట్టుటకును, మూత్రసంబంధమగు నితర జబ్బులను స్వస్థ పరచుటకును, నపుంసకత్వ స్థితిని బాగుపరచుటకును, నుపయోగించును.

దురభ్యాసములవలన గలిగిన నపుంసకత్వమునకు సమాన భాగములుగల పల్లేరు విత్తులను నువ్వుగింజలను నూరి మేకపాలతోటిని తేనెతోటిని దీసికొనిన యెడల స్వస్థతను గలుగజేయునని చెప్పబడు చున్నది.

కషాయము:—ఎండబెట్టబడిన ముదురు పల్లేరుకాయలను 3 ఔన్సులను నలుగగొట్టి, 1½ పైంట్ల జలములో వేసి, సన్నని నిప్పుసెగను మఱగబెట్టి, 1 పైంటు అగునంతవఱకును గాచి, చల్లారినపిమ్మట వడపోయవలయును దీనియొక్క మోతాదు 1 ఔ॥ మొ॥ 3 ఔ॥ లు; దినమునకు 4 లేక 5 పర్యాయములు పుచ్చుకొన నగును. ఆకులయొక్క రసము :—అప్పుడే కోసిన ఆకులను నీళ్ళు కలుపకుండ నూరి ఆ రసమును వడపోయవలయును; దీనియొక్క మోతాదు— 1 ఔ॥ మొ॥ 2 ఔ॥ లు; దినమునకు 4 లేక 5 పర్యాయములు పుచ్చుకొన నగును.

---

## కమల (కాపిలపొడి) — Kamala.

దీనికి తెలుగులో కాపిలపొడి అందురు; ఎఱ్ఱని పొడిగా నుండును. పేగులలో నుండెడి టేపువరం (Tape-Worm) ను నశింపజేయుట కుపయోగింతురు; ఇతర విధములగు పురుగుల కుపయోగించదు. 2 లేక 3 డ్రాముల పొడిని తేనెలో గలిపి యియ్యనగును; దీనికి ముందుగాని వెనుకగాని వేరు మందేమియు నియ్యనక్కర లేదు. దీనియొక్క ఉపయోగానంతరము కడుపులో దిప్పుటయు పేగులు మెలివేయుటయు కలుగవచ్చును; 3 వ లేక 4 వ విరేచనమునందు టేపువరం నిర్జీవముగ వెలువడును. ఒకసారి దీని నుపయోగించుటవలన నుపయోగము లేకపోయినయెడల నొకవారము పిమ్మట మరల దీని నుపయోగింప నగును; అప్పుడును నుపయోగించని యెడల వేఱు మందుల నుపయోగించవలయును.

---

## లినిమెంట్ క్లోరొఫారం — Liniment Chloroform.

క్లోరొఫారం 1 భాగము, లినిమెంట్ ఆఫ్ క్యాంఫర్ 1 భాగము, కలియును; దీనిని పైన రాయుటకు మాత్రమే ఉపయోగింతురు; చురుకుదనమును బుట్టించును.

---

## మార్ఫిన్ ఆసిటస్ (మార్ఫిన్ ఆసిటేట్) — Morphine Acetas.

తెల్లనిపొడి; 2½ రెట్ల జలములో గలియును; 5 రెట్ల గ్లిసరీనులో గలియును.

మోతాదు — ⅛ గ్రే॥ మొ॥ ½ గ్రే॥

---

## లైకర్ మార్ఫియా హైడ్రోక్లోర్-Liqour Morphia Hydrochlor.

ఏదయిన బాధచే నిద్రరాకుండనుండు విషయములలో నిద్రను గలుగజేయుటకు మార్ఫియా సంబంధమైనవాటి నుపయోగింతురు; అట్టివాటిలో నిది యెక్కువ వాడుకయందు కలదు.

మోతాదు — 10 మి॥ మొ॥ 60 మి॥

---

## పెరీరా – Pareira.

పెరీరా అనబడు చెట్టుయొక్క వేరు మూత్రప్రకోపకారిగ బనిచేయును; మూత్రాశయముయొక్క ఆమసంబంధమగు పొరలయందలి నొప్పిని పోగొట్టును.

యక్ట్రాక్టు పెరీరా లిక్విడ్ — Extract Pareira Liquid.

మోతాదు — ½ డ్రా॥ మొ॥ 2 డ్రా॥

---

## మిస్టూరా క్రేటా – Mistura Cretae.

సీమసున్నపుపొడి 50 పాళ్లు, టాగ్రకంతా 7 పాళ్లు, చక్కర 100 పాళ్లు- వీటి నన్నిటిని గలిపి యుంచుకొని, వలసినప్పుడు 40 గ్రెయినులను 1 ఔ॥ సినమన్ వాటర్ (ఆక్వా సినమన్)లో గలిపి ఉపయోగించవచ్చును. దీనికి చాక్ మిక్చర్ (Chalk Mixture) అని కూడ వాడుక పేరుగలదు. బిడ్డలయొక్క అజీర్ణములయందుపయోగించును.

మోతాదు — ½ ఔ॥ మొ॥ 1 ఔ॥

## లైకర్ హైడ్రార్జరీపెర్క్లోర్ – Liquor Hydrargyri Perchlor.

పెర్క్లోరీడ్ ఆఫ్ మెర్క్యూరీ 1 పాలు, జలము 875 పాళ్లు, కలిసినచో నిది యేర్పడును; అనగా, 1 డ్రామునందు 1/16 గ్రె॥ ఉండును.

కొఱుకు వ్యాధియందు కొద్ది మోతాదులలో నియ్యబడును; పేగులయందు క్రిములుండ జేయును; బిడ్డయొక్క కొన్నివిధములగు అతివిరేచనముల యందుపయోగముగ నుండును.

మోతాదు — ½ డ్రా॥ మొ॥ 1 డ్రా॥

# అనుబంధము 1.

## కొన్ని ప్రసిద్ధ ఆంగ్లేయౌషధ యోగములు.

### గర్భస్రావము (Abortion)

| | |
|---|---|
| క్వినీన్ సల్ఫేట్ | 10 గ్రె॥ |
| యక్ట్రాక్టు యెర్గాట్ లిక్విడ్ | 1 డ్రా. |
| ఆసిడ్ సల్ఫ్యూరిక్ | 30 మి. |
| టించ్చర్ డిజిటాలిస్ | 20 మి. |
| జలము | 3 ఔ. |

ఒక ఔన్సు మోతాదులో దినమునకు మూడుసారు లియ్యవలయును.

---

### జలోదరము (Ascites)

| | |
|---|---|
| 1. పల్విస్ డిజిటాలిస్ | 1 గ్రె. |
| పల్విస్ సిల్లే | 1 గ్రె. |
| రసభస్మము | 1 గ్రె. |

యక్ట్రాక్టు జన్షన్ మాత్రయగుట కవసర మగునంత. ఒక్కొకమాత్ర చొ॥ దినమునకు రెండు సారులు.

(లేక)

| | |
|---|---|
| 2. పొటాస్ ఆసిటస్ | 45 గ్రె. |
| కెఫీన్ సిట్రస్ | 6 గ్రె. |
| జలము | 3 ఔ. |

ఒక ఔన్సు చొ॥ దినమునకు మూడు సారులు.

---

### చుండు (Dandruff)

| | |
|---|---|
| క్లోరల్ హైడ్రస్ | 1 డ్రా. |
| టార్టారిక్ ఆసిడ్ | 1 డ్రా. |
| సీమ ఆముదము | ½ డ్రా. |
| ఆల్కహాల్ | 1 ఔ. |
| జలము | 1 ఔ. |

---

### బట్టతల (Alopecia)

| | |
|---|---|
| 1. సల్ఫర్ ఆయింట్ మెంట్ | 4 డ్రా. |
| క్రియిసార్బయిన్ | 1 డ్రా. |
| ఆలివు ఆయిల్ | 1½ ఔ. |

(లేక)

| | |
|---|---|
| 2. స్పిరిట్స్ అమ్మోనియా ఆరోమేటిక్ | 1 ఔ. |
| స్పిరిట్ రోజ్ మేరీ | 1 ఔ. |
| గ్లిసరీన్ | 1 ఔ. |
| టించ్చర్ కెంతారిడీస్ | 4 డ్రా. |
| పన్నీరు | 4½ ఔ. |

వీటిని బాగుగా గలిపి వెండ్రుకల యొక్క కుదుళ్ళలో బాగుగా రుద్దవలయును.

---

### ఋతుస్రావముయొక్క క్షీణత లేక నిలుపుదల (Amenorrhoea)

| | |
|---|---|
| 1. పొటాస్ పర్మాంగనస్ | 1 గ్రె. |

కెయొలిన్ - మాత్రగాజేయుటకు వీల గునంత. దినమునకు రెండుసారులు,

(లేక)

2. రిడ్యూస్డ్ ఐరన్ 36 గ్రే.
ఫెర్రియి ఆర్సెనస్ 1½ గ్రే.
యక్ట్సాక్ట్ ఆఫ్ నక్సు వామికా 3 గ్రే.
క్వినీన్ సల్ఫేట్ 12 గ్రే.
యక్ట్రాక్టు ఆఫ్ జన్షన్ 24 గ్రే.

వీని నన్నిటిని గలిపి 18 మాత్రలుగా జేయవలెను. అరమాత్రనుండి ప్రారంభించి క్రమముగా నొక మాత్రకు హెచ్చింపుచు దినమునకు మూడు సారులు భోజనానంతరము యియ్యవలయును. ఈ మాత్రల నుపయోగించుట క్రమముగా మానవలయునుగాని ఆకస్మికముగా నాపవలదు. ఆర్సెనిక్ (పాషాణము) కొందరి జీర్ణతత్వమునకు సరిపడక పోవచ్చును. అట్టివిషయములలో దానిని మాత్రల నుండి పూర్ణముగా త్యజింపవచ్చును.

---

## ఉబ్బసము — Asthma.

(ఉద్రుతగతియందు)

పొటాస్ అయొడైడ్ 9 గ్రే.
టింక్చర్ బెలడోనా 15 మి.
టింక్చర్ లోబేలియా యీతర్ 30 మి.
స్పిరిట్స్ అమ్మోనియా అరోమేటిక్ 1 డ్రా.
స్పిరిట్స్ క్లోరోఫారం 30 మి.
జలము 3 ఔ.

ఒక్కొక్క ఔన్సు చొ॥ దినమునకు మూడుసారులు.

---

## కురుపులు, వ్రణములు, రాచకురుపులు.

## Boils, Abscesses, Carbuncles.

1. 1 భాగము కార్బాలిక్ ఆసిడ్ను 10 భాగములు గ్లిసరీన్తో గలిపి పైన రాయవలయును.

2. వేడికాపడములును, పిండికట్లును.

3. హోమోపతీ వైద్యశాస్త్రజ్ఞులు టించ్చర్ ఆర్నికో ఒకచుక్కను, ఒక ఔన్సు జలములో గలిపి మూడుగంటల కొకసారి లోని కియ్యనగునని సూచించిరి.

---

## పాండురోగము (Anaemia)

ఫెర్రయి యెట్ అమ్మోనియా సిట్రస్ 10 గ్రే.
యక్ట్రాక్టు నక్సు వామికా ద్రవము 2 మి.
లైకర్ ఆర్సెనికాలిస్ 4 మి.
గ్లిసరీన్ 20 మి.
జలము 2 ఔ.

1 ఔ. చొ॥ దినమునకు రెండుసార్లు భోజనానంతరము.

---

## కురుపులు (Boils)

1. కాల్సియం సల్ఫయిడ్ 10 గ్రే.

మాత్ర లగుటకు అవసరమైనంత యక్ట్రాక్టు జన్షన్‌తో గలిపి 100 మాత్రలుగా జేయవలయును. దినమునకు మూడు మాత్రల నుపయోగింపవలయును.

2. బోరిక్ ఆయింట్‌మెంట్ 2 డ్రా.
ఇక్థియాల్ ½ డ్రా.
ఫ్లెక్సిబిల్ కలోడియం 1 డ్రా.

వీనినన్నిటిని గలిపి కురుపులకు పైన రాయవలయును.

---

## 6 సంll ల వయస్సుగల బిడ్డలకు ఉబ్బసము.

పొటాస్ అయొడైడ్ 6 గ్రె.
అమ్మోనియా కార్బనస్ 3 గ్రె.
వైనం ఇపికాక్ 15 మి.
సిరప్ టోలు 1 డ్రా.
స్పిరిట్స్ క్లోరోఫారం 10 మి.
జలము 3 ఔ.

ఒక్కొక ఔన్సు చొll దినమునకు మూడు సారులు.

---

## కనురెప్పల ఉబ్బుదల (Blepharitis)

బోరిక్ ఆసిడ్ 5 గ్రె.
లానొలీన్ 1 డ్రా.

కనురెప్పల అంచులకు రాయవలయును.

## గొంతు బొంగుపోవుట (హిస్టీరియా సంబంధమగు) Aphonia

జింక్ వలేరియనస్ 1 గ్రె.

కయోలిన్ మాత్రయగుటకు అవసరమగునంత. ఒక్కొకమాత్ర చొll దినమునకురెండు సారులు.

---

## కాలినగాయములు (Burns)

1. అవిసినూనెను (లేక కొబ్బరి నూనె) సున్నపునీళ్ళను సమానభాగములుగ కల్వములో వేసి మర్దించి — దీనిని గాయములపైన రాయవలయును. దీనికే నవనీత మందురు.

2. బోరిక్ ఆసిడ్ 15 గ్రె.
గ్లిసరీన్ 1 డ్రా.
ఆలివ్ ఆయిల్ 1 ఔ.

వీని నన్నిటిని గలిపి పైన రాయవలయును.

---

## రొమ్మున్నపడిసెము (Bronchitis.)

పొటాస్ సిట్రస్ 1 డ్రా.
లైకర్ అమ్మోనియా సిట్రస్ 6 డ్రా.
వైనం ఇపికాక్ 30 మి.
స్పిరిట్స్ క్లోరోఫారం 5 మి.
జలము 3 ఔ.

ఒక్కొక ఔన్సు చొll దినమునకు మూడుసారు లియ్యవలయును.

---

## రొమ్మునొప్పడిసెము.

(1 సం॥ వయసుగల బిడ్డకు తీవ్రస్థితియందు)

| | |
|---|---|
| పొటాస్ సిట్రిస్ | 5 గ్రే. |
| లైకర్ అమ్మోనియా సిట్రస్ | 1 డ్రా. |
| వైనం ఇపికాక్ | 10 మి. |
| సిరప్ టోలు | 30 మి. |
| ఆక్వా క్లోరొఫారం | 5 ఔ. |

3 గంటల కొక ఔన్సు చొ॥ యియ్యవలయును.

---

## రొమ్మునొప్పడిసెమునకు లోనకు వాసనజూచుట.

| | |
|---|---|
| టింక్చర్ బెంజాయిన్ కో | 3 డ్రా. |
| యూకలిప్టస్ ఆయిల్ | 1 డ్రా. |
| క్రియసోట్ | ½ డ్రా. |

ఈ మిశ్రౌషధమునుండి ఒకడ్రామును ఉడుకు నీటిలో వేసి వాసన జూడవలయును.

---

## బాధతో గూడిన పుండు (Cancer)

బాధను తగ్గించుటకుగాను ½ డ్రాము సిట్రిక్ ఆసిడ్ను 4 ఔన్సుల జలములో గలిపి - లింటును యిందులో దడిపి పుండుపైన వేయవలయును.

---

## ధాతునష్టము.

(మూత్రగ్రంధులయొక్క క్షీణదశ)

(Bright's Disease)

1. ఫెర్రయి టెట్ అమ్మోనియా సిట్రిస్ 15 గ్రే.

| | |
|---|---|
| లైకర్ స్ట్రిక్నీన్ | 6 మి. |
| గ్లిసరీన్ | 45 మి. |
| స్పిరిట్సు క్లోరొఫారం | 20 మి. |
| జలము | 3 ఔ. |

ఒక్కొక ఔన్సు చొ॥ దినమునకు మూడు సారులు.

2. [illegible]యూరిన్ సోడా అసిటేట్ 15 గ్రే.

| | |
|---|---|
| కఫీన్ సిట్రిస్ | 9 గ్రే. |
| టింక్చర్ డిజిటాలిస్ | 15 మి. |
| జలము | 3 ఔ. |

ఒక్కొక ఔన్సు చొ॥ దినమునకు మూడు సారులు.

---

## తేనెటీగ కాటు.

దాల్చిన అరఖు (Cinnamon Oil)ను పైన రాయవలయును.

---

## నల్లులు (Bed-bugs)

1. పెట్రోలియం 3 ఔన్సులను 100 ఔన్సుల జలములో గలిపి నల్లులుండు స్థానములలో బోసిన నవి నశించగలవు.

2. గంధకపు పొగవలన గూడ నల్లులు నశించి పోవును.

---

## తిమురువాయువు (Beri-beri)

| | |
|---|---|
| 1. టింక్చర్ నక్సువామికా | 15 మి. |
| టింక్చర్ స్ట్రొఫాంతస్ | 15 మి. |
| స్పిరిట్సు క్లోరొఫారం | 30 మి. |

| | |
|---|---|
| జలము | 3 ఔ. |

ఒక్కొక్క ఔన్సు చొ॥ దినమునకు మూడుసారు లియ్యవలయును.

2. ఫెర్రయి యెట్ క్వినీన్ సిట్రస్ 10 గ్రె.

| | |
|---|---|
| లైకర్ ఆర్సెనికాలిస్ | 4 మి. |
| గ్లిసరీన్ | 20 మి. |
| స్పిరిట్స్ క్లోరొఫారం | 20 మి. |
| జలము | 2 ఔ. |

ఒక్కొక్క ఔన్సు చొ॥ రెండుసారులు భోజనానంతరము యియ్యవలయును.

---

## దగ్గు (Cough)

| | |
|---|---|
| 1. టింక్చర్ క్యాంఫర్ కొ | 3 డ్రా. |
| స్పిరిట్స్ అమ్మోనియా ఆరొమేటిక్ | 2 డ్రా. |
| జలము | 8 ఔ. |

దీర్ఘవ్యాపితమయి శ్వాససంబంధములగు దగ్గులయందు ప్రతి రెండు లేక మూడు గంటలకు ఒక ఔన్సు చొ॥ యియ్యవలయును.

| | |
|---|---|
| 2. టింక్చర్ క్యాంఫర్ కొ | 3 డ్రా. |
| వైనం ఇపికాక్ | 1 డ్రా. |
| స్పిరిట్ ఈతరు నైట్రస్ | 3 డ్రా. |
| జలము | 8 ఔ. |

జలుబువలన గలుగు దగ్గుయందును, యితర విధములగు దగ్గులందును, కఫము వెలువడక పోయిన యెడల, యీమందును ప్రతి మూడు లేక నాలుగు గంటల కొక ఔన్సు చొ॥ యియ్యవలయును. ఇంతకు మించిన ప్రతిసంవత్సరము వయస్సునకును మోతాదును సంవత్సరమున కొక డ్రాము చొ॥ హెచ్చింపవలయును.

| | |
|---|---|
| 3. హెరాయిన్ హైడ్రోక్లోర్ | ½ గ్రె. |
| జలము | 10 ఔ. |

ఒక్కొక్క ఔన్సు చొ॥ దినమునకు మూడుసారులు.

---

## రొమ్ముపడిసెము.
## (తీవ్రముగనుండు ప్రారంభస్థితియందు)

| | |
|---|---|
| ఆంటిమొని టార్టరేట్ | 1 గ్రె. |
| పొటాస్ నైట్రస్ | 2 డ్రా. |
| టింక్చర్ క్యాంఫర్ కొ | 4 డ్రా. |
| జలము | 12 ఔ. |

అరఔన్సు చొ॥ 3 గంటల కొకసారి యియ్యవలయును.

---

## శీతకాలపు గజ్జి (Chilblains)

| | |
|---|---|
| 1. కార్బాలిక్ ఆసిడ్ | 1 డ్రా. |
| టింక్చర్ అయొడిన్ | 2 డ్రా. |
| ట్యానిక్ ఆసిడ్ | 2 డ్రా. |
| ఆముదము | 4 ఔ. |

వీని నన్నిటిని గలిపి పైన రాయవలయును.

2. అమ్మోనియం క్లోరైడ్ 4 డ్రా.
వినిగర్ 2 ఔ.
జలము 6 ఔ.

వీని నన్నిటిని గలిపి పైన రాయవలయును.

3. గుడ్డను పెప్పర్మింట్ ఆయిలులో దడిపి పైని వేయనగును.

## మలబంధము (Constipation)

| | |
|---|---|
| పల్వీస్ ఇపికాక్ | 1 గ్రె. |
| యక్ట్స్రాక్టు కాస్కారా సాగ్రడా | 3 గ్రె. |
| ,, బెలడోనా | 1 గ్రె. |
| ,, నక్సువామికా | 1 గ్రె. |

మాత్రయగుటకు వలెనంత యక్ట్స్రాక్టు జనన్ను గలుపవలయును. వీని నన్నిటిని గలిపి 6 మాత్రలుగా జేసి దీర్ఘవ్యాపితమగు మలబంధ విషయములందు రాత్రి నిద్రించు ముందు 1 లేక 2 మాత్రలను సేవించవలయును,

## అధికకాలము మంచము పట్టుట వలన గలుగు పుండ్లు. (Bed sores)

1. పటిక 2 డ్రా.
టింక్చర్ క్యాంఫర్ కో 1 ఔ.

ఒక కోడిగుడ్డు తెలుపుతో బాగుగా గలిపి పుండ్లకు రాయనగును.

2. పుండ్లు పడుటకు ముందు యెర్రగానున్న విషయములందు ల్యానొలీన్ను బాగుగా రుద్దినయెడల పుండ్లు యేర్పడకుండును.

## బ్రాంకో న్యూమోనియా (Bronchopneumonia)

(1 సం॥ వయసుగల బిడ్డలయందు వచ్చు న్యూమోనియావలె నుండునట్టి జ్వరము. పొంగు మొదలగు వ్యాధుల పిమ్మట వచ్చును).

| | |
|---|---|
| అమ్మోనియా కార్బనస్ | 1 గ్రె. |
| లైకర్ అమ్మోనియా ఆసిటేటిస్ | 40 మి. |
| టింక్చర్ బెలడోనా | 4 మి. |
| టింక్చర్ సిల్లా | 2 మి. |
| సిరప్ టోలు | 20 మి. |
| ఇన్ఫ్యూజన్ సెనిగా | 4 డ్రా. |

నాల్గవవంతు చొ॥ 3 గంటల కొకసారి యియ్యవలయును.

## కారిజముయొక్క క్షీణత (సామాన్యముగ త్రాగుబోతులలో గలుగును) (Cirrhosis of the Liver)

| | |
|---|---|
| అమ్మోనియం క్లోరైడ్ | 10 గ్రె. |
| టింక్చర్ జనన్ కో | 20 మి. |
| ఇన్ఫ్యూజన్ సెన్నా | 1 ఔ. |

ఒక ఔన్సు చొ॥ దినమునకు రెండుసారు లియ్యవలయును.

### పురుగుకాటు.

(నల్లులు, దోమలు, ఈగలు, మొదలగు పురుగులవలన.)

చిట్లాముదమునుగాని వంట ఆముదమునుగాని రుద్దనగును.

---

### శూలనొప్పి (Colic)

| | |
|---|---|
| మెగ్నీసియం కార్బనేట్ | 1½ డ్రా. |
| అమ్మోనియం కార్బనేట్ | ½ డ్రా. |
| టింక్చర్ లావండ్యూలా కో | 2 డ్రా. |
| పెప్పర్మింట్ ఆయిల్ | 2 మి. |
| జలము | 6 ఔ. |

నొప్పి తగ్గు వరకును రెండు గంటలకొకసారి అరఔన్సు చొ॥ యియ్యవలయును.

---

### మూత్రాశయ సంబంధమగు శూలనొప్పి (Renal Colic)

| | |
|---|---|
| టింక్చర్ బెలడోనా | 10 మి. |
| అక్వా క్లోరొఫారం | 1 ఔ. |

మూడుగంటలకొకసారి ఒక ఔన్సు చొ॥ యియ్యవలయును.

---

### కొఱుకు పుండు (Chancre)

| | |
|---|---|
| అరిస్టాల్ | 1 డ్రా. |
| బోరిక్ ఆసిడ్ | 1 డ్రా. |

ఈ రెండును గలిపిన పొడిని పుండుపైన జల్లవలయును.

---

### కాలరా (Cholera)

| | | |
|---|---|---|
| 1. | టింక్చర్ కాప్సికం | 5 డ్రా. |
| | స్పిరిట్స్ క్యాంఫర్ | 4 డ్రా. |
| | టింక్చర్ గ్వాయిషం | 3 డ్రా. |

వీని నన్నిటిని గలిపి రెండు లేక మూడు గంటలకు ఒకసారి ఒక డ్రాము కొలత ప్రకారం వేడినీళ్ళలో వేసి యియ్యవలయును.

| | | |
|---|---|---|
| 2. | టింక్చర్ కాప్సికం | 2 డ్రా. |
| | టింక్చర్ ఓపియం | 2 డ్రా. |
| | టింక్చర్ రీయై కో | 2 డ్రా. |
| | పెప్పర్మింట్ ఆయిల్ | 2 డ్రా. |
| | స్పిరిట్స్ కాంఫర్ | 2 డ్రా. |

15 మొదలు 30 చుక్కల వరకును ప్రతి గంటకును యియ్యవలయును.

| | | |
|---|---|---|
| 3. | రసభస్మము | 1 గ్రే. |
| | సోడా బైకార్బనేట్ | 8 గ్రే. |

దీనిని 4 భాగములుగా జేసి గంటకొక పొట్లము నియ్యవలయును.

| | | |
|---|---|---|
| 4. | లైకర్ స్ట్రిక్నీన్ | 15 మి. |
| | టింక్చర్ డిజిటాలిస్ | 40 మి. |
| | అక్వా క్లోరొఫారం | 6 ఔ. |

కాళ్లును చేతులును చలువలు గ్రమ్మనారంభించినపుడు మూడు గంటలకొకసారి ఒక ఔన్సు చొ॥ యియ్యవలయును.

---

## పసి బిడ్డలయందు కాలరా (Cholera Infantum)

1. టింక్చర్ అకోనైట్ 4 మి.
జలము 4 ఔ.

అర ఔన్సు చొ॥ రెండుగంటల కొకసారి యియ్యవలయును.

2. హైడ్రార్గరై కం క్రీటా 1 గ్రే.
మూడుగంటల కొకసారి యియ్యవలయును.

---

## కాళ్లు చేతులు స్వాధీనముండక తప్పి గంతులు వేయుట. (Chorea)

(ప్రారంభగతియందు)

1. సోడా సాలిసైలస్ 1 డ్రా.
స్పిరిట్స్ అమ్మోనియా ఆరొమేటిక్ $1\frac{1}{2}$ డ్రా.
అక్వా క్లోరోఫారం 6 ఔ.

ఔన్సు చొ॥ దినమునకు మూడుసారులు.

2. (అనంతర గతులయందు)
లైకర్ ఆర్సనికాలిస్ 3 మి.
అక్వా క్యాంఫర్ 1 ఔ.

1 ఔన్సు చొ॥ దినమునకు రెండుసారులు భోజనానంతరము యియ్యవలయును.

క్రమముగా లైకర్ ఆర్సనికాలిస్ మోతాదును దినమునకు 15 మినిములకు హెచ్చింపవలయును.

---

క్లోరల్ హైడ్రస్ 2 గ్రే.
పొటాస్ బ్రోమైడ్ 8 గ్రే.
టింక్చర్ హయసామి 10 మి.
చక్కెర (కొంచెముగా)
జలము 1 ఔ.

వణకుట అధికముగా నుండినపుడు ఈమందును యియ్యవలయును.

---

## జీర్ణకారి (Carminative Mixture)

స్పిరిట్స్ అమ్మోనియా ఆరొమేటిక్ 3 డ్రా.
సోడా బైకార్బనస్ 90 గ్రే.
టింక్చర్ కార్డమం కో 6 డ్రా.
స్పిరిట్స్ క్లోరోఫారం 3 డ్రా.
జలము $10\frac{1}{2}$ ఔ.

బాగుగా కలుపవలెను. మూడుగంటల కొక ఔన్సు చొ॥ నియవచ్చును.

అజీర్తికి ఉపయోగమగును. బలమగు భోజనము పిమ్మట ఒక మోతాదు పుచ్చుకొన నగును. 4 లేక 5 చుక్కలు పెప్పర్మింట్ ఆయిల్ కలుపనగును.

---

## త్రాగుడునందు అభిలాషను మాన్పుటకు (Drunkenness)

టింక్చర్ నక్సువామికా 20 మి.
టింక్చర్ జన్షన్ కో 2 డ్రా.
టింక్చర్ కలంబా 2 డ్రా.
జలము 4 ఔ.

1 ఔన్సు చొ॥ భోజనపూర్వము ఆకలి బుట్టించుటకు గాను యియ్యనగును.

---

### త్రాగుబోతునకు గలుగు సంధిగుణము.
### (Delirium Tremens)

| | |
|---|---|
| సోడా బ్రోమైడ్ | 45 గ్రె. |
| క్లోరల్ హైడ్రేస్ | 45 గ్రె. |
| టింక్చర్ హాయొసామస్ | 45 మి. |
| నారింజరసము | 4 మి. |
| ఆక్వా క్లోరొఫారం | 3 ఔ. |

ఔన్సు చొ॥ దినమునకు మూడుసార్లు యియ్యనగును.

---

### అతిమూత్రము-మధుపదార్థముతో గూడినది.
### (Diabetes Mellitus)

| | |
|---|---|
| 1. ఆసిడ్ ఆర్సినియస్ | $\frac{1}{50}$ గ్రె |
| కొడీనా ఫాస్ఫస్ | $\frac{1}{4}$ గ్రె. |
| అలాయిన్ | $\frac{1}{2}$ గ్రె. |
| స్ట్రిక్నీన్ ఫాస్ఫస్ | $\frac{1}{50}$ గ్రె. |

ఈపాళ్ల ప్రకారం ఒక్కొక్క మాత్రలో నుండునట్లు యక్స్ట్రాక్టు జన్షన్ తో గలిపి మాత్రలుగా జేసి భోజనానంతరము ఒక్కొక్క మాత్ర చొ॥ దినమునకు రెండు మాత్రలను సేవించవలయును.

2. యక్స్ట్రాక్టు జాంబులీన్ లిక్విడ్ 1 డ్రా.

జలములో గలిపి దినమునకు రెండు సారులు పుచ్చుకొనవలయును.

3. ఆసిడ్ ఫాస్ఫారిక్ డిల్యూట్ 15 మి.

దీనిని ఒక ఔన్సు జలములో గలిపి దాహము నణచుటకు బుచ్చుకొన వలయును.

---

### మధుపదార్థము లేకుండ వెలువడు అతిమూత్రము.
### (Diabetes Insipidus)

జింక్ వెలీరియేనస్ 4 గ్రె.

పైమోతాదు ప్రకారం మాత్రలుగా జేసి దినమునకు మూడుమాత్రల నియ్య వలయును.

---

### అతివిరేచనములు. (Diarrhoea)

| | |
|---|---|
| 1. బిస్మత్ సబ్నైట్రేస్ | 30 గ్రె. |
| సలోల్ | 15 గ్రె. |
| సోడా బైకార్బనస్ | 15 గ్రె. |

3 భాగములుగా జేసి మోతాదున కొక్కొక్క పొట్లము చొ॥ దినమునకు మూడుసారు లియ్యవలయును.

| | |
|---|---|
| 2. పల్విస్ ఇపికాక్ కొ | 15 గ్రె. |
| బిస్మత్ సాలిసైలస్ | 15 గ్రె. |

మూడు భాగములుగా జేసి మోతాదున కొక్కొక్క పొట్లము చొ॥ దినమునకు మూడుసారు లియ్యవలయును.

---

1 సం॥ వయసుగల బిడ్డకు అతివిరేచనములు.

| | |
|---|---|
| పల్విస్ క్రీటా అరోమేటిక్ | 6 గ్రె. |
| బిస్మత్ సాలిసైలస్ | 6 గ్రె. |

ఆరు పొట్లములుగా జేసి 3 గంటల కొక పొట్లము నియ్యవలయును.

---

## 1 సం॥ వయసుగల బిడ్డకు ఆకు పచ్చరంగు విరేచనములు (Green Diarrhoea)

ఒక ఔన్సు జలములో 20 మినిముల ల్యాక్టిక్ ఆసిడ్‌ను గలిపి మూడేసి గంటల కొకసారి ఒక డ్రాము చొ॥ యియ్యవలయును.

---

## 2 సం॥ వయసుగల బిడ్డకు అతి విరేచనములు.

| | |
|---|---|
| సలోల్ | 3 గ్రె. |
| బిస్మత్ కార్బనస్ | 12 గ్రె. |
| పల్విస్ క్రేటా అరోమేటిక్ | 12 గ్రె. |

---

## మలబంధము

(సంవత్సరములోపు వయసుగల బిడ్డలకు)

| | |
|---|---|
| మెగ్నీసియం కార్బనస్ | 4 గ్రె. |
| మెగ్నీసియం సల్ఫేట్ | 16 గ్రె. |
| సోడా బైకార్బనస్ | 4 గ్రె |
| పల్విస్ రీయై | 4 గ్రె. |
| టింక్చర్ కార్డమం కో | 20 మి. |
| టింక్చర్ జింజిబ్రిస్ | 8 మి. |
| ఆక్వా అనీతి | 4 డ్రా |

ఒక డ్రాము మోతాదు చొ॥ దినమునకు రెండుసారు లియ్యవలయును.

---

## చిన్నబిడ్డగుణము (Convulsions)

(1 సం॥ వయసుగల బిడ్డకు)

| | |
|---|---|
| పొటాస్ బ్రొమైడ్ | 4 గ్రె. |
| టింక్చర్ బెలడోనా | 4 మి. |
| క్లోరల్ హైడ్రస్ | 2 గ్రె. |
| ఆక్వా క్లోరోఫారం | 4 డ్రా. |

ఒక డ్రాము చొ॥ మూడు గంటల కొకసారి యియ్యవలయును. చక్కెర కొంచెముగా చేర్చుడు.

---

## విరేచనకారులు.

1. చిట్లాముదము 2 లేక 3 డ్రాములు క్షేమకరమగు విరేచనకారిగ సేవింపనగును. ఒక గ్లాసునకు లోపల నిమ్మరసము రాచి, ఆముదమును పోసి, పైన కొంచెముగా నిమ్మరసమును బోసి. అటుపిమ్మట నీయాముదమును త్రాగుట వలన నీసువాసనచే నందలి అసహ్యమును అరుచియును తగ్గును.

---

2.

| | |
|---|---|
| టార్టారిక్ ఆసిడ్ | 1 డ్రా. |
| సోడా కార్బనస్ | 1 డ్రా. |
| క్రీం ఆఫ్ టార్టార్ | 1 డ్రా. |
| మెగ్నీసియం సిట్రస్ | 1 డ్రా. |

| | |
|---|---|
| మెగ్నీసియం సల్ఫేట్ | 1 డ్రా. |
| చక్కెర (మెత్తనిపొడి) | 2 డ్రా. |

ఒక టీ స్పూన్ కొలనుగాని కొంచె మెక్కువగా గాని నీటిలో గలిపి పుచ్చుకొనవలయును. ఇది "ఈనోజ్ ఫ్రుట్ సాల్ట్" వలె సాధు విరేచనకారిగ బని చేయును.

---

3.

| | |
|---|---|
| హైడ్రార్జిరై కంక్రేటా (గ్రే పౌడరు) | ½ గ్రే. మొదలు 2 గ్రే. |
| సోడా కార్బనేట్ | 6 గ్రే. |

బిడ్డలకు నీళ్లవిరేచనము లగుచు విరేచనము తెల్లగా కుదపలుగా నుండి, పాలు అజీర్ణస్థితిలో వెలువడు చుండినయెడల, యీమందు వెంటనే పనిచేయును. ఉదయమున ఒకపొట్లమును సాయంత్ర మొక పొట్లమును యియ్యనగును. 1 మొదలు 6 నెలలు వయసుగల బిడ్డకు అరగ్రెయిను గ్రే పౌడరు, 6 గ్రే. సోడా; 6 మొదలు 12 నెలల వరకు 1 గ్రే. గ్రే పౌడరును 6 గ్రే. సోడా ; 1 సం॥ మొదలు 3 సం॥ ల వరకును 1½ గ్రే. గ్రే పౌడరు 6 గ్రే. సోడా ; 4 మొ. 8 సం॥ ల వయసు వరకును 3 గ్రే. గ్రే పౌడరును 6 గ్రే. సోడాయును; యీమోతాదుల ప్రకారము యియ్యవలయును.

---

4.

| | |
|---|---|
| సోడా సల్ఫేట్ | 4 డ్రా. |
| టింక్చర్ ఆఫ్ జింజర్ | 20 మి. |
| జలము | 2 ఔ. |

సామాన్యముగ విరేచనమగుటకు దీనిని ఉపయోగింప వచ్చును. శరీర తత్వమును బట్టి సోడా సల్ఫేట్ అధికముగ దోచిన యెడల ఒకటి రెండు డ్రాములు తగ్గింపవచ్చును.

---

5.

| | |
|---|---|
| సోడా సల్ఫేట్ | 4 డ్రా. |
| టింక్చర్ సింకోనా | 4 డ్రా. |
| సల్ఫేట్ ఆఫ్ ఐరన్ | 15 గ్రే. |
| జలము | 8 ఔ. |

బాగుగ కలిపి నాలుగు గంటల కొకసారి ఒక ఔన్సు పుచ్చుకొనవలయును. ప్లీహ వ్యాధులయందును ఋతుస్రావము యొక్క నిలుపుదల యందును, నులిపురుగులకును ఉపయోగింప నగును.

---

6.

| | |
|---|---|
| మెగ్నీసియా బైకార్బనేట్ | 10 గ్రే. |
| సోడా బైకార్బనేట్ | 8 గ్రే॥ |
| మిస్టూరా సెన్నా కొ | 1 ఔ. |

బాగుగా కలుపవలెను. అజీర్తికిని కాలేజ వ్యాధులకును ఉపయోగింపనగును.

---

7.

| | |
|---|---|
| రస భస్మము | 5 గ్రే. |
| పల్వీస్ జాలప్ కొ | 1 డ్రా. |

బాగుగా కలిపి పవుడరుగా చేయవలయును. బలమగు విరేచనకారి. మలము

నీటితో గూడి యుండునట్లు చేయును. నంజు వ్యాధుల యందు ఉపయోగింప నగును.

---

8. పొడాఫైలం రెజిన్ 1½ గ్రె.
యక్ట్రాక్టు కాలోసింత్
కొ 30 గ్రె.
పల్విస్ ఇపికాక్ 4 గ్రె.

కొంచెము జిగురుతో బాగుగా కలిపి 12 మాత్రలుగా జేయవలయును. మోతాదు — రెండు దినముల కొకమాత్ర చొ॥ కాలేజ వ్యాధులకును, విరేచన బద్ధమునకును ఉపయోగింప నగును.

---

జలుబు (Coryza)
(ప్రారంభస్థితియందు)

| | |
|---|---|
| టింక్చర్ అకోనైట్ | 4 మి. |
| టింక్చర్ బెలడోనా | 8 మి. |
| స్పిరిట్స్ క్యాంఫర్ | 8 మి. |
| ఆక్వా క్లోరోఫారం | 2 ఔ. |

అర ఔన్సు చొ॥ మూడు గంటల కొకసారి యియ్యవలయును.

---

2 సం॥ ల వయసుగలబిడ్డకు అతి విరేచనములు.

| | |
|---|---|
| సలోల్ | 3 గ్రె. |
| బిస్మత్ కార్బనస్ | 12 గ్రె. |
| పల్విస్ క్రేటా ఆరొమేటిక్ | 12 గ్రె. |

ఆరుమోతాదులుగ జేసి మూడేసి గంటల కొక మోతాదు నియ్యవలయును.

---

ఋతుస్రావమునం దధికముగ నగుట, లేక తఱచుగనగుట, లేక అధికకాలమువఱకు నగుట. (Menorrhagia)

1. యక్ట్రాక్టు యెర్గోటా లిక్విడ్ అర డ్రాము మొదలు ఒకడ్రాము వరకును జలములోగాని షరబతులోగాని కలిపి మూడుగంటల కొకసారి యియ్యవలయును.

2. టింక్చర్ హమామలిస్ 5 చుక్కలను మూడు లేక నాలుగు గంటల కొకసారి జలములో గలిపి యియ్యవలయును.

3. ఋతుస్రావము అధికముగనగు విషయములో ఒకటి లేక రెండునిమ్మకాయలరసమును నోటితో బీల్చుటవలన మిగులగుణముగా నుండునని యొక అమెరికా వైద్యశాస్త్రజ్ఞుడు చెప్పుచున్నాడు.

---

ఉజీర్ణవ్యాధి (Dyspepsia)

| | |
|---|---|
| 1. బిస్మత్ కార్బనస్ | 30 గ్రె. |
| పెప్సిన్ పైన్ | 1½ డ్రా. |
| టింక్చర్ నక్సువామికా | 24 మి. |
| పల్విస్ ట్రాగకాంత్ | 12 గ్రె. |

ఆక్వా మెంతా పిప్ 3 ఔ.

ఔన్సు చొ॥ దినమునకు మూడుసారు లియ్యవలయును.

---

2. సోడా బైకార్బనస్ 45 గ్రె.
పల్విస్ రీయై 15 గ్రె.
మెగ్నీసియం కార్బనస్ 15 గ్రె.
స్పిరిట్సు క్లోరోఫారం 30 మి.
టింక్చర్ నక్సువామికా 15 మి.
ఆక్వా మెంతా పిప్ 3 ఔ.

3. లైకర్ బిస్మత్ యెట్ పెప్సిన్
కో (హాలాలెట్) 2 డ్రా.
ఆక్వా అనీతి 1 డ్రా.
జలము 3 ఔ.

1 ఔన్సు మోతాదులో దినమునకు మూడుసారు లియ్యవలయును.

---

## ఋతుస్రావమునందు నొప్పి కలుగుట (Dysmenorrhoea)

లైకర్ కాలోఫైల్ యెట్ పల్సేటిల్లా 40 మి.
లైకర్ సెడెన్సు (పెరీ డేవిస్ కంపెనీ) 50 మి.
ఆలెట్రిస్ కార్డియల్ 1 డ్రా,
ఆక్వా క్లోరోఫారం 2 ఔ.

ఒక ఔన్సు చొ॥ దినమునకు రెండుసారు లియ్యవలయును.

---

## చెవిపోటు (Earache)

టింక్చర్ ఓపియం 1 డ్రా.
గ్లిసరీన్ $1\frac{1}{2}$ డ్రా.
కార్బాలిక్ ఆసిడ్ 24 మి.
కొబ్బరి నూనె 1 ఔ.

ఈమిశ్రితౌషధమును వెచ్చచేసి 1 లేక 2 చుక్కలను చెవిలో వేయవలయును.

---

## మూలగజ్జి (Eczema)

సాలిసైలిక్ ఆసిడ్ 15 గ్రె.
జింక్ ఆక్సైడ్ 40 గ్రె.
వాసలీన్ 1 ఔ.

ఈ ఆయింటుమెంటును పైన రాయనగును.

---

## దుర్వాయువులను క్రిమి జాలములను, నశింపజేయు మందులు (Disinfectants.)

1. కార్బాలిక్ ఆసిడ్ 1 డ్రా.
జలము 1 పైంటు.

కురుపులు పుండ్లు, గాయములు— కడుగుట కుపయోగించును.

---

2. బోరిక్ ఆసిడ్ 4 గ్రె.
జలము $1\frac{1}{2}$ డ్రా.

నేత్రములకు, మూత్రాశయమునకు, భగ రంధ్రమునకు, నోటికి—శుభ్రపరచుట కుపయోగించును.

---

3. క్రియసోట్

ఒక పైంటు ఉడుకునీళ్లలో ఒక డ్రాము క్రియసోట్‌ను వేసి వాసన జూచినయెడల క్షయవ్యాధియందు దగ్గును తెమడను తగ్గించును. 1 మొదలు 3 చుక్కలవరకును క్రియసోట్‌ను కాడ్ లివరు ఆయిల్ మోతాదులో గలిపి పుచ్చుకొనినయెడల క్షయవ్యాధియందు గుణముగ నుండును

4. పొటాస్ పర్మాంగనేట్. దీనిని నీటిలో గలిపిన యెడల యెఱ్ఱరంగు యేర్పడును. ఒక ఔన్సు జలములో రెండు గ్రెయినుల పొటాస్ పర్మాంగనేట్‌ను గలిపి దుర్వాసనగల కురుపులను గడిగిన యెడల నా దుర్వాసన నశించును.

బుతుస్రావము నిలచిన విషయములో 2 లేక 3 గ్రెయినులు మాత్రగాజేసి దినమునకు 3 లేక 4 సారు లిచ్చినయెడల గుణ మియ్యగలదు

---

5. పర్‌క్లోరీడ్ ఆఫ్ మెర్క్యురీ

ఇది క్రిమిజాలముల నశింపజేయుట యందు మిగుల బలమైనది. 10 ఔన్సుల జలములో 1 గ్రెయినును గలిపి అంటు వ్యాధిచే బాధనొందు రోగని ముట్టుకొనిన పిమ్మట చేతులు కడుగుకొనుట కుపయోగింపనగును.

---

6. యూకలిప్టస్ ఆయిల్.

ఇది క్షయ వ్యాధియందును, దుర్వాసనతో గూడిన కఫము వెలువడు దగ్గు విషయములందును, మూత్రాశయము రేగుదల నందిన స్థితులయందును, 1 మొదలు 5 చుక్కలవరకును షరబతులో గలిపి యిచ్చినయెడల గుణమిచ్చునని యెంచబడుచున్నది.

7. థైమాల్ (వాముపువ్వు)

చర్మవ్యాధులకు థైమాల్‌తో చేయబడిన సబ్బు ఉపయోగింపనగును. 6 గ్రెయినుల థైమాల్‌ను ఉడుకు నీళ్లలోవేసి వాసన జూచినయెడల జలుబున కుపయోగించును. చర్మవ్యాధులకు 5 మొదలు 30 గ్రెయినులవరకు 1 ఔన్సు వాసలీన్‌లో గలిపి ఆయింటుమెంటుగా జేసి ఉపయోగింపవచ్చును.

---

8. మెంతాల్ (పెప్పర్మింట్ పువ్వు)

మెంతాల్ 3 భాగములు, క్లోరోఫారం 4 భాగములు, ఆలివ్ ఆయిల్ 16 భాగములు—వీని నన్నిటిని జేర్చిన తైలమును నడుమునొప్పి, తుంటినొప్పి, నరములతో సంబంధించిన తలనొప్పి మొదలగు వాని విషయములలో పైన రాయుటవలన నుపయోగింపగలదు.

---

## ఋతుస్రావము తెలుపువర్ణముగా నుండుట (కుసుమవ్యాధి)

## (Leucorrhoea)

1. గోరువెచ్చని నీళ్లు ఔన్సునకు 2 గ్రె. చొ॥ జింక్ సల్ఫేటును గలిపి పిచికారీ చేయుటవలన నుపయోగముగ నుండును.

2. స్రావమువలన మంటగా నుండిన యెడల ఒక పైంటు జలములో $\frac{1}{8}$ ఔన్సు సోడా కార్బనేటును గలిపి పిచికారీ చేయుటవలన మిగుల శమనముగా నుండగలదు.

---

3. ఫెర్రయియొటెక్వినీన్ సిట్రిస్ 40 గ్రె.
జలము 8 ఔ.

బాగుగాగలిపి మూడు లేక నాలుగు గంటలకు ఒక ఔన్సు చొ॥ పుచ్చుకొనవలయును. ఈ మందు పుచ్చుకొనిన పిమ్మట నోరు కడుగుకొనవలయును. లోహసంబంధమగు ఔషధములన్నియు విరేచమునకు నలుపురంగును పుట్టించును.

---

4. అమ్మోనియం క్లోరైడ్ 10 గ్రే,
లైకర్ సింకోనా హైడ్రో బ్రోం 10 మి.
టింక్చర్ నక్సువామికా 10 మి.
లైకర్ అర్సెనికాలిస్ 4 మి.
ఇన్ఫ్యూజన్ జన్షన్ కో 2 ఔ.

ఒక ఔన్సు చొ॥ భోజనానంతరము దినమునకు రెండుసారు లియ్యవలయును.

---

## జిగట విరేచనములు

## (Dysentery)

1. మెగ్నీసియం సల్ఫేట్ 4 డ్రా.
ఆసిడ్ హైడ్రోక్లోరిక్ డిల్యూట్ 40 మి.
ఆక్వా మెంతా పిప్ 4 ఔ.

ఒక్కొక ఔన్సు చొ॥ జిగటలేకుండగ స్వచ్ఛమైన విరేచనమగువరకును యియ్యవలయును.

---

2, పల్వీస్ ఇపికాక్ 1 డ్రా.
ట్యానిక్ ఆసిడ్ $\frac{1}{2}$ డ్రా.

15 మాత్రలుగా జేసి గంట కొక మాత్ర చొ॥ యియ్యవలయును.

---

## ముఖపార్శ్వము వంకరపోవుట

## (పక్షవాత సంబంధమగు)

## Facial Paralysis.

సోడా సాలిసైలస్ 30 గ్రే,
లైకర్ అమ్మోనియాఆసిటేటిస్ 6 డ్రా.
స్పిరిట్ యీతర్ నైట్రిస్ 45 మి.
ఆక్వా క్యాంఫర్ 3 ఔ.

ఒక్కొక ఔన్సు మోతాదు చొ॥ దినమునకు మూడుసారు లియ్యవలయును.

---

### పిత్తాశయ సంబంధమగు రాళ్లు (Gall Stones).

(కడుపునొప్పి లేని సమయములో సేవించుటకు)

1. సోడియం గ్లైకోకలేట్ 5 గ్రే.

భోజనానంతరము దినమునకు మూడు సారు లియ్యవలయును.

2. యక్ట్రాక్టు బెలడోనా 1 గ్రే.
పొడాఫయిలం రెజిన్ 1 గ్రే.

నాలుగు మాత్రలుగా జేసి దినమునకు మూడు మాత్రల నియ్యవలయును.

---

### సన్నిపాత జ్వరమునందు పేగుల లోనుండి రక్తస్రావ మగుట (Intestinal Haemorrhage in Enteric)

ట్యానిక్ ఆసిడ్ 40 గ్రే.
లైకర్ మార్ఫియా హైడ్రోక్లోర్ 40 మి.
కర్పూర తైలము 20 మి.
గం ఆకేసియా 1 ఔ.
టింక్చర్ క్లోరొఫారం కొ 40 మి.
ఆక్వా మెంతా పిప్ 4 ఔ.

నాలుగు భాగములుగా జేసి 4 గంటల కొకసారి యియ్యవలయును.

---

### సన్నిపాత జ్వరము (Typhoid Fever)

లైకర్ అమ్మోనియా సిట్రేటిస్ 6 డ్రా.
సోడా క్లోరస్ 15 గ్రే.
టింక్చర్ అరంటీ 1 డ్రా.
ఆక్వా అనిసి 3 ఔ.

ఒక్కొక ఔన్సు చొ॥ దినమునకు మూడుసారు లియ్యవలయును.

---

### సన్నిపాత జ్వరమునందు ఉదరము వాయుపూరిత మగుట (Tympanites in Enteric)

రసభస్మము 1 గ్రే.
సోడా బైకార్బనస్ 30 గ్రే.

ఎనిమిది భాగములుగా జేసి 2 గంటల కొక పొట్లము నియ్యవలయును.

---

### మూర్ఛ (Epilepsy)

పొటాసియం బ్రొమైడ్ 30 గ్రే.
సోడియం బ్రొమైడ్ 30 గ్రే.
అమ్మోనియం బ్రొమైడ్ 10 గ్రే.
లైకర్ ఆర్సెనికాలిస్ 4 మి.
ఆక్వా క్లోరొఫారం 2 ఔ.

1 ఔన్సు చొ॥ దినమునకు రెండు సారు లియ్యవలెను.

---

### సెగవ్యాధి (Gonorrhoea)

1. (ప్రథమ గతియందు)
పొటాస్ బైకార్బనస్ 1 డ్రా.
పొటాస్ అసిటస్ 1 డ్రా.
టింక్చర్ అకొనైటు 6 మి.

టింక్చర్ హయొసామి 2 డ్రా.
ఇన్ఫ్యూజన్ బక్కు 6 ఔ.

ఒక ఔన్సు చొ॥ మూడు గంటల కొకసారి యియ్యవలయును.

---

2. (ద్వితీయ గతియందు)

ఓలియం శాంటాల్ ప్లేవి (చందిని నూనె) 30 మి.
ఓలియం క్యూబెబ్ 15 మి.
బాల్సం కోపేబా 30 మి.
లైకర్ పొటాస్ 30 మి.
స్పిరిట్ యీతర్ నైట్రిస్ 1 డ్రా.
టింక్చర్ హయొసామి 45 మి.
ఇన్ఫ్యూజన్ బక్కు 3 ఔ.

ఒక ఔన్సు చొ॥ దినమునకు మూడు సారు లియ్యవలయును.

(లేక)

బాల్సం కోపేబా 30 మి.
పొటాస్ నైట్రిస్ 15 గ్రే.
గం అకేసియా (అవసరమైనంత)
ఇన్ఫ్యూజన్ బక్కు 3 ఔ.

ఒక ఔన్సు చొ॥ దినమునకు మూడు సారు లియ్యవలయును.

---

3. (తృతీయ గతియందు)

హెల్మిటాల్ 15 గ్రే.

మూడు భాగములుగా జేసి దినమునకు మూడుసారు లియ్యవలయును.

(లేక)

కోపేబా, క్యూబెబ్, శాంటాల్ మాత్రలు (పెర్రి డేవిస్ అండ్ కంపెనివారి వలన తయారు చేయబడినవి)

నాలుగు గంటల కొక మాత్ర చొ॥ యియ్యవలయును.

---

4. ధీర్ఘ సెగవ్యాధికి పిచికారీ చేయుటకు.

జింక్ పర్మాంగనేట్ $\frac{1}{4}$ గ్రే.
జలము 1 ఔ.

---

## గౌట్ అను వాతరోగము (Gout)

అమ్మోనియా ఫాస్ఫస్ 20 గ్రే.
అమ్మోనియా అయొడైడ్ 4 గ్రే.
వైనం కొల్చికం 10 మి.
ఆక్వా క్లోరోఫారం 2 ఔ.

ఒక ఔన్సు చొ॥ దినమునకు రెండు సారు లియ్యవలయును.

---

## క్షయవ్యాధియందు శ్వాసకోశములనుండి రక్తము వెలువడుట (Haemoptysis)

1. మెగ్నీసియం సల్ఫేట్ 2 డ్రా.
గ్యాలిక్ ఆసిడ్ 15 గ్రే.
ఆసిడ్ సల్ఫ్యూరిక్ డిల్యూట్ 45 మి.
టింక్చర్ కార్డమం కో 2 డ్రా.
ఆక్వా క్లోరొఫారం 3 ఔ.

ఒక ఔన్సు చొ॥ నాలుగు గంటల కొక సారి యియ్యవలయును.

---

2. పిల్యూలా ప్లంబి కం ఓపియం 1 గ్రె. ఒక గ్రె॥ మాత్ర చొ॥ దినమునకు రెండుసారు లియ్యవలయును.

---

## తలనొప్పి (Head-ache.)

| | |
|---|---|
| 1. ఫెనాసిటిన్ | 5 గ్రె. |
| కెఫీన్ సిట్రిస్ | 3 గ్రె. |

ఈ రెంటిని గలిపి ఒక మోతాదుగా నియ్యవలయును. తలనొప్పి నెమ్మది లేని యెడల నాలుగు గంటల పిమ్మట మరి యొక పొట్లము నియ్యవలయును.

| | |
|---|---|
| 2. పొటాసియం బ్రొమైడ్ | 15 గ్రె. |
| టింక్చర్ జెల్సీమియం | 5 మి. |
| కెఫీన్ సిట్రిస్ | 2 గ్రె. |
| సిరప్ ఆరంటీ | 40 మి. |
| ఆక్వా క్లోరోఫారం | 1 ఔ. |

ఇది యంతయు నొకమోతాదుగా నియ్యవలెను. తలనొప్పి నెమ్మది లేనియెడల నాలుగు గంటలపిమ్మట మరియొక మోతాదు నియ్యవలయును.

---

## వెక్కిలి (Hiccough)

1. సాధుగతియందు లోనికి కొన్ని దీర్ఘ శ్వాసలను దీసికొని, సాధ్య మగు నంతవరకు శ్వాసను నిలిపియుంచుటవలన, నెమ్మదించి పోవును.

2. చల్లని నీటిని దాగుటవలన నిలచిపో వచ్చును.

3. ఒక డ్రాము స్పిరిట్సు అమ్మోనియా ఆరొమేటిక్‌ను ఒక ఔన్సు జలములో వేసి పుచ్చుకొనిన నయము కా వచ్చును.

4. పది గ్రెయినుల బిస్మత్ సబ్ నైట్రస్ ను జలములో గలిపి పుచ్చుకొనిన యొకప్పుడు నయము కావచ్చును.

5. దీర్ఘ వ్యాపితమగు నీ వ్యాధియందు, ఒక టీ స్పూన్ ఆవాలను నాలుగు ఔన్సుల మసలగాచిన నీళ్లలో యిరువది నిమిషముల కాల ముంచి పిమ్మట వడ పోసి త్రాగినచో వెంటనే వ్యాధి రహితమై నటుల తెలియుచున్నది.

---

## హిస్టీరియా (Hysteria)

| | |
|---|---|
| 1. ఫెర్రయి బ్రొమైడ్ | 1 గ్రె. |
| జింక్ బ్రొమైడ్ | ½ గ్రె. |
| క్వినీన్ బ్రొమైడ్ | 2 గ్రె. |
| పిల్యూలా ఆలోస్ యెట్ ఆసాఫటిడా | 4 గ్రె. |

వీని నన్నిటిని రెండు మాత్రలుగా చేసి దినమునకు రెండుమాత్రలు చొ॥ సేవించ వలయును.

2. టింక్చర్ వలీరియన్

| | |
|---|---|
| అమ్మోనియేటా | 1½ డ్రా. |
| స్పిరిట్ యీతరిస్ కో | 1½ డ్రా. |
| టింక్చర్ అసాఫటిడా | 45 మి. |
| ఆక్వా క్యాంఫర్ | 3 ఔ. |

ఒక ఔన్సు మోతాదులో దినమునకు మూడుసారు లియ్యవలయును.

---

## మూత్రవిసర్జనము స్వాధీనము తప్పుట

## (Incontinence of Urine)

ఇది సామాన్యముగా బిడ్డలలో గలుగుచుండును. నాలుగు చుక్కలు టింక్చర్ బెలడోనాను జలములో గలిపి సాయంకాలము 4 గంటలకు యియ్యవలయును. బిడ్డ పరుండబోవునపుడు మరల నదే ప్రకారము యియ్యవలయును. ప్రతిదిన దినమును మోతాదును ఒకచుక్క చొ॥ పది చుక్కల వరకును హెచ్చింపవలయును. కొద్ది మోతాదువలననే ఉపయోగముగ నుండినయెడల మోతాదును హెచ్చింప నవసరము లేదు.

---

## పశిరికెలు (లేక) పచ్చకామాల

## (Jaundice)

| | |
|---|---|
| అమ్మోనియం క్లోరైడ్ | 45 గ్రె. |
| టింక్చర్ పొడాఫైలిన్ | |
| అమ్మోనియేటా | 15 మి. |
| ఇన్ఫ్యూజన్ జన్షన్ కో | 3 ఔ. |

ఒక ఔన్సు మోతాదు చొ॥ దినమునకు మూడుసారు లియ్యవలయును.

---

## చలిజ్వరము (' alaria)

| | |
|---|---|
| 1. క్వినీన్ సల్ఫేట్ | 15 గ్రె. |
| మెగ్నీసియం సల్ఫేట్ | 3 డ్రా. |
| అమ్మోనియం క్లోరైడ్ | 30 గ్రె. |
| ఆసిడ్ నైట్రో హైడ్రోక్లోర్ డిల్ | 30 మి. |
| ఆక్వా మెంతా పిప్ | 3 ఔ. |
| 2. క్వినీన్ సల్ఫేట్ | 15 గ్రె. |
| ఫెర్రయి సల్ఫేట్ | 3 గ్రె. |
| మెగ్నీసియం సల్ఫేట్ | 3 డ్రా. |
| ఆసిడ్ సల్ఫూరిక్ డిల్యూట్ | 30 మి. |
| ఆక్వా మెంతా పిప్ | 3 ఔ. |

ఒక ఔన్సు మోతాదులో దినమునకు మూడుసారు లియ్యవలయును.

---

## చలిజ్వరఫలితముగ బల్ల పెరుగుట.

## (Enlargement of Spleen)

| | |
|---|---|
| ఆర్సెనిక్ అయొడైడ్ | 1 గ్రె. |
| క్వినీన్ హైడ్రోక్లోర్ | 48 గ్రె. |
| యక్ట్రాక్టు నక్సువామికా | 8 గ్రె. |
| యక్ట్రాక్టు కాస్కారా సాగ్రాడా | 16 గ్రె. |

యక్ట్రాక్టు జన్షన్ (మాత్రయగుటకు అవసరమైనంత)

32 మాత్రలుగా జేసి ఒక్కొక మాత్ర చొ॥ దినమునకు మూడుసారులు భోజనానంతర ముపయోగింప నగును.

---

## జ్వరఫలితమగు బల్లకు పైన రాయుటకు మందు.

1. అంగ్యుయెంటం హైడ్రార్జైరై అయొడైడ్ రూబ్రి 4 డ్రా.
   అంగ్యుయెంటం బెలడోనా 4 డ్రా.
   ప్లీహముపైన రాయవలయును.

(లేక)

2. క్రియసోట్ 2 డ్రా.
   లినిమెంట్ అయొడిన్ 6 డ్రా.

ప్లీహముపైన ఒక చతురపు అంగుళముమేర రాయవలయును.

---

## మెదడుయొక్క పొరలవాపుదల (వయస్కులలో)

## Meningitis (In Adults)

1. పొటాసియం బ్రోమైడ్ 45 గ్రె.
   పొటాసియం అయొడైడ్ 9 గ్రె.
   టింక్చర్ హయొసామి 45 మి.
   అక్వా క్లోరొఫారం 3 ఔ.

ఒక ఔన్సు మోతాదులో దినమునకు మూడుసారు లియ్యవలయును.

2. హైడ్రార్జైరై అక్సైడ్ ప్లేవి అయింటుమెంటును అస్వస్థత భాగమున చెంద్రుకలను బూర్తిగా తొలగించి రుద్దవలయును.

---

## మూత్రాశయమునందు రక్తము గూడి, మూత్రమేర్పడుట నిలచిపోయి, ధాతునష్టము కలుగుచు, తీవ్రస్థితిని వహించుట

## Acute Nephritis [Bright's Disease)

పొటాస్ అసిటస్ 45 గ్రె.
లైకర్ అమ్మోనియా అసిటేటిస్ 6 డ్రా.
స్పిరిట్ యీతర్ నైట్రస్ 45 మి.
టింక్చర్ హయొసామి 45 మి.
అక్వా క్యాంఫర్ 3 ఔ.

1 ఔన్సు మోతాదులో దినమునకు మూడు సారులు.

---

## నరములసంబంధమగు బలహీనత

## [Nervous Debility]

యక్ట్రాక్టు డామియానా లిక్విడ్ 40 మి.
ఆసిడ్ ఫాస్ఫారిక్ డిల్యూట్ 20 మి.
టింక్చర్ నక్సువామికా 10 మి.
ఇన్ఫ్యూజన్ జన్షన్ 2 ఔ.

ఒక ఔన్సు మోతాదులో దినమునకు రెండు సారులు భోజనానంతర మియ్యవలయును.

---

### క్షయవ్యాధియందు రాత్రి చెమటలు (Night Sweats of Phthisis)

| | |
|---|---|
| జింక్ ఆక్సైడ్ | 8 గ్రె. |
| యక్ట్రాక్టు బెలడోనా | 1 గ్రె. |

నాలుగు మాత్రలుగ జేసి రాత్రి పరుండుముందు ఒక మాత్ర చొ॥ సేవించ వలయును.

---

### గుండె అదరు (Palpitation)

| | |
|---|---|
| పొటాసియం బ్రొమైడ్ | 45 గ్రె. |
| టింక్చర్ డిజిటాలిస్ | 15 మి. |
| టింక్చర్ కనవలేరియా మజలిస్ | 30 మి. |
| ఆక్వా అనితి | 3 ఔ. |

ఒక ఔన్సు మోతాదులో దినమునకు మూడు సారులు.

---

### పేలు (తలలో) (Lice)

మర్క్యురీ పెర్క్లోరైడ్ ఒక గ్రెయినును పది ఔన్సుల వినిగర్‌లో గలిపి తలకు రాయవలయును.

---

### గుండెనంజు (Pericarditis)

1. నొప్పి అధికముగా నుండిన విషయములలో గుండెపైన బెలడోనా పలాస్త్రీని సన్నని చర్మముపైన యేర్పరచి పటువేయుట బాగుండును.

2.

| | |
|---|---|
| పొటాస్ అసిటస్ | 45 గ్రె. |
| పొటాస్ అయొడైడ్ | 9 గ్రె. |
| టింక్చర్ డిజిటాలిస్ | 15 మి. |
| ఆక్వా క్లోరొఫారం | 3 ఔ. |

ఒక ఔన్సు మోతాదులో 3 గంటల కొకసారి యియ్యవలయును.

---

### బిడ్డలయందు యెముకలలో పట్టులేకుండుట (Rickets)

1. మాల్టీన్ అండ్ కాడ్ లివరు ఆయిల్
2. శనటోజెన్

ఈ మందులు సేవించువిధము ఆయా మందుల సీసాలపై నుండును.

---

### కోరింత దగ్గు (Whooping Cough)

(2 సం॥ ల వయసుగల బిడ్డకు)

1.

| | |
|---|---|
| అమ్మోనియం బ్రొమైడ్ | 6 గ్రె. |
| టింక్చర్ బెలడోనా | 3 మి. |
| వైనం ఇపికాక్ | 9 మి. |
| జలము | 6 డ్రా. |

రెండు డ్రాముల మోతాదులో దినమునకు మూడుసారు లియ్యవలయును.

---

2. ఒకటి లేక రెండుచుక్కలు యూకలిప్టస్ ఆయిల్‌ను రెండు డ్రాముల గోరువెచ్చని జలములోవేసి బాగుగా కలిపి వెంటనే యియ్యవలయును.

3. ఒక సం॥ వయసుగల బిడ్డకు

| | |
|---|---|
| అయొడిన్ స్వచ్ఛమైనది | 1 గ్రే. |
| పొటాసియం అయొడైడ్ | 15 గ్రే. |
| జలము | 2 ఔ. |

దీనిని 24 భాగములుగా జేసి ఒక్కొక భాగమును దినమునకు మూడుసారు లియ్యవలయును. ఇది బాగుగా పనిచేయగలదు.

---

4. దగ్గు యొక్క తెర దీర్ఘముగా నుండిన యెడల

| | |
|---|---|
| సోడియం బ్రొమైడ్ | 6 గ్రే. |
| క్లోరల్ హైడ్రెస్ | 3 గ్రే. |
| సిరప్ | 30 మి. |
| జలము | 6 డ్రా. |

రెండు డ్రాముల మోతాదులో దినమునకు మూడుసారు లియ్యవలయును.

---

## క్షయవ్యాధి (Consumption)

1.

| | |
|---|---|
| గ్వయిషల్ కార్బనస్ | 6 గ్రే. |
| తిమొకాల్ | 6 గ్రే. |
| క్రియసోట్ | 1½ గ్రే. |
| క్వినీన్ మ్యూరియస్ | 1½ గ్రే. |

మూడు మాత్రలుగాజేసి దినమునకు మూడు మాత్రలు చొ॥ సేవింపవలయును.

---

2. క్రీం ఆఫ్ మాల్ట్ అండ్ కాడ్ లివరు ఆయిల్ విత్ క్రియసోట్ అండ్ హైపోఫాస్ఫైట్స్ (ఆపెన్ హెమిల్ అండ్ కో)

ఒక డ్రాము మోతాదులో దినమునకు మూడుసారు లియ్యవలయును.

---

## న్యుమోనియా (Pneumonia)

(ప్రథమగతి యందు)

1.

| | |
|---|---|
| అమ్మోనియా కార్బనస్ | 12 గ్రే. |
| లైకర్ అమ్మోనియా సిట్రేటిస్ | 4½ డ్రా. |
| టింక్చర్ డిజిటాలిస్ | 15 మి. |
| అక్వా క్లోరోఫారం | 3 ఔ. |

ఒక ఔన్సు మోతాదు చొ॥ 4 గంటల కొకసారి యియ్యవయును.

(లేక)

2.

| | |
|---|---|
| టింక్చర్ అకొనైట్ | 4 మి. |
| వైనం అంటిమోనియాలిస్ | 16 మి. |
| స్పిరిట్స్ అమ్మోనియా అరొమేటిక్ | 1½ డ్రా. |
| ఇన్ఫ్యూజన్ డిజిటాలిస్ | 4 డ్రా. |
| అక్వా క్లోరోఫారం | 4 ఔ. |

ఒకఔన్సు మోతాదులో మూడుగంటల కొకసారి యియ్యవలయును.

---

(ద్వితీయగతి యందు)

దగ్గు తగ్గి కఫము అంతరించుచున్న సమయములో:—

| | |
|---|---|
| సోడా అయొడైడ్ | 6 గ్రే. |
| అమ్మోనియా కార్బనస్ | 12 గ్రే. |
| వైనం యిపికాక్ | 30 మి. |

టింక్చర్ సింకోనా 30 మి.
స్పిరిట్స్ క్లోరొఫారం 45 మి.
ఇన్ఫ్యూజన్ సెనిగా 3 ఔ.

ఒకఔన్సు మోతాదులో నాలుగు గంటల కొకసారి యియ్యవలయును.

---

(న్యుమోనియాయొక్క సందిగ్ధ స్థితియందు)
(During Crisis)

లైకర్ స్ట్రిక్నిన్ హైడ్రోక్లోర్ 15 మి.
టింక్చర్ కార్డమం కో 1½ డ్రా.
స్పిరిట్స్ క్లోరొఫారం 30 మి.
అక్వా అనిశి 3 డ్రా.

ఒక డ్రాము మోతాదులో 4 గంటల కొకసారి యియ్యవలయును.

---

## కీళ్ళనొప్పి
## (Acute Rheumatism)
(తీవ్రస్థితియందు)

1. అమ్మోనియా ఫాస్ఫస్ 30 గ్రె.
అమ్మోనియా సాలిసైలస్ 30 గ్రె.
అక్వా క్లోరొఫారం 3 ఔ.

ఔన్సు మోతాదులో దినమునకు మూడు సారు లియ్యవలయును.

సోడా సాలిసెలిస్ 30 గ్రె.
పొటాస్ బైకార్బనస్ 30 గ్రె.
స్పిరిట్స్ అమ్మోనియా అరొమేటిక్ 45 గ్రె.
అక్వా క్యాంఫర్ 3 ఔ.

ఔన్సు మోతాదులో దినమునకు మూడుసారు లియ్యవలయును.

(పైన రాయుటకు)

1. లినిమెంట్ బెలడోనా 1½ డ్రా.
లినిమెంట్ ఓపియం 1½ డ్రా.
లినిమెంట్ మెంతాల్ 1½ డ్రా.
లినిమెంట్ క్లోరోఫారం 1½ డ్రా.
ఓలియం సినేపిస్ 1 ఔ.

వీని నన్నిటిని మిశ్రితముజేసి అస్వస్థత భాగమునకు పైన రాయవలయును.

2. ఆసిడ్ సాలిసైలిక్ 1 ఔ.
టర్పన్టీన్ 1 ఔ.
లానొలీన్ 3 ఔ.
పారఫీన్ ఆయింట్మెంట్ 5 ఔ.

ఈ మందునైనను పైనరాయుట కుప యోగించవచ్చును.

---

## దీర్ఘవ్యాపితమగు కీళ్ళనొప్పి
## [Chronic Rheumatism]

పొటాసియం అయొడైడ్ 15 గ్రె.
టింక్చర్ గ్వాయకై అమ్మోనియేటా 45 మి.
ఇన్ఫ్యూజన్ సార్సా 3 ఔ.

ఒక ఔన్సు మోతాదులో దినమునకు మూడుసారు లియ్యవలయును.

---

## గొంతునొప్పి (Sore Throat)

పొటాస్ క్లోరస్ 1. గ్రె

గ్లిసరీన్ టైమ్యులైన్ 1 డ్రా.
అక్వా క్లోరోఫారం 3 ఔ.

ఒక ఔన్సు మోతాదు చొ॥ 3 గంటల కొకసారి యియ్యవలయును.

---

## 1 సం॥ వయసుగల బిడ్డకు పండ్లు వచ్చునపుడు గలుగు కలత

Restlessness during teething for 1 year old Child)

పొటాసియం బ్రొమైడ్ 6 గ్రే.
టింక్చర్ హయొసామి 20 గ్రే.
స్పిరిట్స్ క్లోరోఫారం 4 మి.
అక్వా అనీతి 4 డ్రా.

ఒక డ్రాము మోతాదులో 3 గంటల కొకసారి యియ్యవలయును.

---

## చిడుము లేక గజ్జి ( Itches)

1. సల్ఫర్ సబ్లిమేటం 1 డ్రా.
   బాల్సం పెరూవియాని ½ డ్రా.
   లానొలీన్ 1 ఔ.

వీని నన్నిటిని గలిపి గజ్జిపైన రాయ నగును.

2. బీటా నాఫ్థాల్ 40 గ్రే.
   సల్ఫర్ ఆయింట్‌మెంట్ ½ డ్రా.
   వాసలీన్ 1 ఔ.

వీనిని గలిపి కూడ గజ్జిపై రాయుట కుపయోగింప నగును.

---

## గొంతునొప్పికి గండూషము.

(Gargle for Sorethroat)

అలం (పటిక) 10 గ్రే.
బొరాక్సు (వెలిగారము) 10 గ్రే
పొటాస్ క్లోరస్ 10 గ్రే.
టింక్చర్ మిర్ 15 మి.
జలము 1 ఔ.

---

## గొంతు బొంగుపోవుట.

అతిమధురము వేళ్లయొక్క పొడి 4 డ్రా.
బాల్సం కోపేబా 3 డ్రా.
తేనె మైనము (తెల్లనిది) 2 డ్రా.

3 గ్రెయినుల మాత్రలుగా జేసి దినమునకు రెండు లేక మూడు మాత్ర లుపయోగించవలయును.

---

## మశూచి (Small Pox)

రెండు డ్రాముల వినిగర్‌ను, జలములో గలిపి గాని కలుపకుండగగాని, ఉదయమును సాయంత్రమును పుచ్చుకొనుచుండిన యెడల, మశూచి వ్యాపించిన స్థలము లందు ఆ వ్యాధి కలుగ కుండ జేయవచ్చు నని తెలియుచున్నది.

---

## ఆఘ్రాణించుటకు లవణములు.

( Smelling Salts)

అమ్మోనియా కార్బనస్ 1 ఔ.
లైకర్ అమ్మోనియా ఫార్‌ట్ 15 మి.

| | |
|---|---|
| బెర్గమాట్ ఆయిల్ | 10 మి. |
| యుడికొలోన్ | 30 మి. |

వీని నన్నిటిని గలిపి గాజుమూతగల బుడ్డిలో వేసి నిలవ యుంచవలెను.

---

## కొఱుకు వ్యాధి (Syphilis)

(ప్రథమగతి యందు)

| | |
|---|---|
| హైడ్రార్జరై కం క్రేటా (గ్రే పవుడరు) | 1 గ్రే. |

ఒక గ్రెయిను మోతాదులో దినమునకు రెండుసార లియ్యవలయును.

(లేక)

| | |
|---|---|
| లైకర్ హైడ్రార్జరై పెర్‌క్లోర్ | 1½ డ్రా. |
| అక్వా క్లోరోఫారం | 1½ ఔ. |

అర ఔన్సు మోతాదులో దినమునకు మూడుసారు లియ్యవలయును.

(ద్వితీయగతి యందు)

| | |
|---|---|
| గ్రే పవుడరు | 4 గ్రే. |
| పల్విస్ ఇపికాక్ కో | 4 గ్రే. |
| యక్ట్రాక్టు జన్షన్ (వలసినంత) | |

నాలుగు మాత్రలుగాజేసి దినమునకు 4 మాత్రల చొ॥ సేవించవలయును.

(తృతీయగతి యందు)

| | |
|---|---|
| పొటాస్ అయొడైడ్ | 10 గ్రే. |
| డనవన్స్ సొల్యూషన్ | 20 మి. |
| సిరప్ ట్రైఫోలియై కో (పెర్రీడేవిస్ కంపెనీది) | 1 డ్రా. |
| జలము | 2 ఔ. |

ఒక ఔన్సు మోతాదులో దినమునకు రెండుసారులు భోజనానంతర మియ్యవలయును.

---

## ఎలుకలు (Rats)

ఎలుకలబాధ విశేషముగా నున్నచోట పిప్పర్మెంట్ పువ్వుయొక్క పలుకులను ఎలుకలు సంచరించు స్థానములయందు చల్లినయెడల నవి పారిపోవును.

---

## తలవెండ్రుకల వృద్ధికి (Hair Restorer)

| | |
|---|---|
| టించ్చర్ కంతారిడీస్ | 4 డ్రా. |
| లైకర్ అమ్మోనియా ఫార్‌ట్ | 2 డ్రా. |
| గ్లిసరీన్ | 4 డ్రా. |
| జలము | 6 ఔ. |

తలవెండ్రుకల కుదుళ్ళలో రుద్దుట కుపయోగింపవలయును.

---

## గర్భిణియందు వాంతులు (Vomitting of Pregnancy)

1. ఇన్‌గ్లూవిన్ 5 గ్రెయినుల మోతాదులో దినమునకు మూడుసారు లియ్యవలయును.

2. 

| | |
|---|---|
| వైనం ఇపికాక్ | 5 మి. |
| జలము | 10 డ్రా. |

రెండు డ్రాముల మోతాదులో రెండు గంటల కొకసారి యియ్యవలయును.

3. టింక్చర్ అయొడిన్ 4 మి.
జలము 1 ఔ.

రెండు డ్రాములమోతాదులో 3 గంటల కొకసారి యియ్యవలయును.

---

## ఒడలు దురదలు (Itching)

1. సోడియం హైపోసల్ఫయిట్ 4 డ్రా.
గ్లిసరీన్ 2 డ్రా.
జలము 4 డ్రా.

ఒడలున కంతకును రాసి ఒక అర గంట తరువాత శుభ్రముగా స్నానము చేయవలయును.

2. సుమారు 30 గాలనుల వేడినీళ్లలో 1 ఔన్సు వెలిగారపు పొడియును ఒక ఔన్సు సోడా బైకార్బనేటును గలిపి స్నానము చేయవలయును.

3. కార్బాలిక్ ఆసిడ్ 2 డ్రా.
గ్లిసరీన్ 1 డ్రా.
పన్నీరు 8 ఔ.

స్పంజిని యిందులో ముంచి ఒడలున కద్దవలయును.

---

## పంటి నొప్పి (Toothache)

యాలకు అరఖును లింటులో ముంచి పంటిరంధ్రములో నుంచవలయును.

---

## గొంతుయొక్క రోగుదలయందు గొంతులో రాయుటకు (Throat Paint)

టాన్నిక్ ఆసిడ్ 30 గ్రే.
పొటాస్ క్లోరస్ 10 గ్రే.
గ్లిసరీన్ 1 ఔ.

---

## శరీరమునం దచ్చటచ్చటగాని లేక గొంతు భాగమునందుగాని కంతు లేర్పడుట (Scrofula)

1. సిరప్ ఫెర్రయి అయొడైడ్ ఒక డ్రాము మోతాదును ఒక ఔన్సు జలములో గలిపి భోజనానంతరము దినమునకు రెండుసారు లియ్యవలయును.

2. పైమందుతో పాటు మాల్ట్ చేరిన కాడ్ లివరు ఆయిల్ను గూడ పై ప్రకారమే యియ్యవలెను.

---

## పండ్లపొడి (Tooth Powder)

బోరిక్ ఆసిడ్ 40 గ్రే.
పొటాస్ క్లోరస్ 30 గ్రే.
రెజిన్ గ్వయాక్ 20 గ్రే.
సీమసున్నపు పొడి 1 డ్రా.
మెగ్నీసియం కార్బనస్ 5½ డ్రా.

వీని నన్నిటిని గలిపి బాగుగా నూరవలయును.

---

### జ్వరమునకు మందు.
### (Fever Mixture)

పొటాస్ సిట్రిస్ 1 డ్రా.
స్పిరిట్ యీతర్ నైట్రస్ 5 డ్రా.
నిమ్మ షరబతు 5 డ్రా.
లైకర్ అమ్మోనియా అసిటేటిస్ 2 ఔ.

ఒక డ్రాము మోతాదులో మూడు సంవత్సరముల వయసుగల బిడ్డకు రెండు గంటల కొకసారి యియ్యవలయును. పెద్దవారలకు సంవత్సరమునకు 10 చుక్కలు చొ॥ మోతాదు హెచ్చించవలయును. వయస్కులకు 5 డ్రాముల మోతాదులో నియ్యనగును.

---

### గుండెవ్యాధి (Heart Disease)

మూడే ముఖ్య సూత్రములు.

1. అలసట కలుగకుండ శరీర పరిశ్రమ చేయవలయును.

2. ఉద్రేకమును బుట్టింపకుండ బలమును గలుగజేయు పదార్థముల భుజింపవలయును.

3. శాంతతతో గూడిన ఉల్లాసమును వహింప వలయును.

---

### తామర (Ringworm)

1. తామర భాగమును సబ్బుతో గడిగి యీ క్రింది మిశ్రితౌషధమును పైన రాయవలయును.

అయొడిన్ 10 గ్రె.
కర్పూర తైలము 1 ఔ.

2. సోడియం హైపోసల్ఫైట్ 1 డ్రాము 1 ఔన్సు జలములో గలిపి లేపనము చేయవలయును.

3. క్రిసొఫానిక్ ఆసిడ్ 1 డ్రా.
వాసలీన్ 10 డ్రా.
దీనిని పైన రాసిన నుపయోగించగలదు.

4. రస భస్మము 1 డ్రా.
టింక్చర్ అయొడిన్ 1 ఔ.
దీనిని అస్వస్థత భాగమున బ్రష్‌తో రాయవలయును.

5. బోరిక్ ఆసిడ్ 1 డ్రా.
జలము 8 ఔ.
దీనిని విరివిగా రాయవచ్చును.

---

### మూలశంక (Piles)

1. యక్ట్రాక్టు హమామలిస్ 2 ఔ.
యక్ట్రాక్టు హైడ్రాస్టిస్ కెనాడెన్సిస్ 2 ఔ.
టింక్చర్ బెంజాయిన్ కో 2 ఔ.
టింక్చర్ బెలడోనా 4 డ్రా
ఆలివ్ ఆయిల్ 4 ఔ.
కార్బాలిక్ ఆసిడ్ 1 డ్రా.
ఆసన స్థానమున రాయవలయును.

2. బెలడోనా అయింట్‌మెంట్ 2 ఔ.
హారతి కర్పూరము 1 డ్రా.

టింక్చర్ క్యాంఫర్ కో 1 డ్రా.
విశేష బాధతో గూడిన మూలశంక వ్యాధియం దిది ఉపయోగముగ నుండ గలదు. (పైన రాయుటకు మాత్రమే)

3. ఈవ్యాధిచే బాధనొందువారు సాధు విరేచనకారుల నుపయోగించుచు మల బద్ధము లేకుండ జేసికొనవలయును.

---

## నులిపురుగులు.
## (Thread Worms)

బిడ్డలకు 1 మొదలు 3 గ్రెయినుల వరకు శాంటొనినును కొంచెము చక్కెరతో గలిపి రాత్రి పరుండబోవువేళ యిచ్చి ఉదయమున ఒక మోతాదు చిట్లాముదము నియ్యవలయును.

పెద్దవారలకు యిదేరీతిగ రెట్టింపు మోతాదులో నియ్యవలయును.

---

## ఏటికపాములు.
## (Round Worms)
(బిడ్డలకు)

శాంటొనిన్ 1 గ్రె. మొ॥ 3 గ్రె.
రసకర్పూరము ½ గ్రె. మొ॥ 1½ గ్రె.
వలసినంత చక్కెర.

వీనినన్నిటిని గలిపి రాత్రి పరుండ బోవు ముందర సేవించి ఉదయముననే ఒక మోతాదు చిట్లాముదము నియ్యవలయును.

పెద్దవారలకు దీనికి రెట్టింపు మోతాదును యిదేప్రకారము యియ్యవలయును.

---

## పొంగువచ్చు ద్రవపదార్థములు (Effervescent Mixtures)

1. 20 గ్రెయినుల పొటాస్ బైకార్బనేటును రెండు ఔన్సుల జలమునందు గలిపి, లోనకు పుచ్చుకొను ముందు 14 గ్రెయినుల సిట్రిక్ ఆసిడ్ను కలుపవలయును (కడుపు ఉబ్బరమునకు).

2. 17 గ్రెయినుల సోడా బైకార్బనేటును రెండు ఔన్సుల జలమునందు గలిపి పిమ్మట 10 గ్రెయినుల సిట్రిక్ ఆసిడ్ను గలిపి పుచ్చుకొనవలయును. (కడుపు ఉబ్బరమునకు).

3. 2 డ్రాములు సోడా బైకార్బనేట్ను 8 ఔన్సుల జలములో గలిపి ఒక బుడ్డిలో నుంచవలయును. 1 డ్రాము టార్టారిక్ ఆసిడ్ను 4 ఔన్సుల జలములో గలిపి వేరుబుడ్డిలో నుంచవలయును. 4 డ్రాముల సోడా మిక్శ్చరును 2 డ్రాముల ఆసిడ్ మిక్శ్చరుతో గలిపి పుచ్చుకొనవలయును. జ్వరమునకును, గర్భవతులకు వాంతులగునపుడును, యియ్యనగును.

---

## లైం వాటరు (Lime Water)

శుభ్రమైన రెండు పైంట్ల చల్లనినీళ్ళలో ఒక అర ఔన్సు కాల్చి యార్చిన సున్నమును గలిపి మూడు గంటల కాలము దానిని నిలువ చేయవలయును. లోనకు గాలి చొరకుండునట్లు మూతను జాగ్రతగా నుంచవలయును. దీనిని ప్రతి రెండు దినములకును క్రొత్తగా జేసికొనుట మంచిది. మోతాదు ఒక ఔన్సు మొదలుకొని మూడు ఔన్సుల వరకును యీయనగును. పిల్లలకు పండ్లు వచ్చునపుడును, విరేచనము లగునపుడును, అజీర్తికిని, కలరాకును ఉపయోగింపనగును.

---

## ఆల్టరేటివులు (Alteratives)

రక్తముయొక్క స్థితిని మార్చునట్టిగాని, శరీరమునందు కొన్ని ద్రవముల స్రవింపజేయు. మాత్రగ్రంథుల యొక్క, కాలేజము యొక్క, ప్రేగుల యొక్క, గతులను మార్చునట్టిగాని, మందులకు ఆల్టరేటివు లని పేరు.

| | |
|---|---|
| పొటాసియం బ్రొమైడ్ | 1 డ్రా. |
| జలము | 6 ఔ. |

బాగుగా కలిపిన పిమ్మట దినమునకు 3 పర్యాయములు ఒక్కొక్క ఔన్సు చొప్పున నీయవలయును. నరములు, మెదడుతో, సంబంధించిన వ్యాధుల కీయనగును.

| | |
|---|---|
| 2. పొటాసియం బ్రోమైడ్ | 30 గ్రే. |
| స్పిరిట్ ఈతర్ నైట్రస్ | 30 మి. |
| తెల్లని చక్కెర | 1 డ్రా. |
| జలము | $1\frac{1}{2}$ ఔ. |

బాగుగా కలిపి, ఒకటి రెండు సంవత్సరముల వయసుగల బిడ్డకు రెండు గంటల కొకసారి ఒకడ్రాము చొప్పున నీయవలయును. రెండు సంవత్సరముల పిమ్మట రెండు డ్రాములు యీయవచ్చును. పసిపిల్లలకు జ్వరముపైన మగతగలిగి నప్పు డీయవలయును. దీనికే చంటిబిడ్డగుణ మని వాడుక గలదు.

| | |
|---|---|
| 3. పొటాసియం అయొడైడ్ | 1 డ్రా. |
| జలము | 8 ఔ. |

బాగుగా కలిపిన పిమ్మట, దినమునకు మూడుసార్లు ఒక్కొక్క ఔన్సు చొప్పున నీయవలయును. కొరుకువ్యాధి కుపయోగింపనగును.

| | |
|---|---|
| 4. మెగ్నీసియా బైకార్బనస్ | 15 గ్రె. |
| ఆయిల్ ఆఫ్ అనిసీడ్ | 2 మి. |
| జలము | 1½ ఔ. |

ఆరుమాసములు మొదలు ఒక సంవత్సరము వరకు వయసుగల బిడ్డకు, కడుపు ఉబ్బరముగా నుండినపుడు ఒకడ్రాము యియ్యవలయును. ఆరుమాసముల లోపు వయసుగల బిడ్డకు అరడ్రాము యియ్యవలయును.

---

## అస్ట్రింజెంట్లు (Astringents)

దేహమునందలి నానాభాగములయందు పనిచేయుటవలన వివిధ అవయవముల నుండి వెలువడు ద్రవపదార్థ పరిమాణములను తగ్గించు ఔషధములు అస్ట్రింజెంట్లు అనబడును. రక్తము స్రవించునపుడు ఆయాస్థానములయం దివి ప్రయోగింపబడిన యెడల చిన్నరక్తనాళములయొక్క మూతులు ముడుచుకొన జేయబడి రక్తస్రావము నిలుపు చేయబడును.

| | |
|---|---|
| 1. ఆలం (పటిక) పొడి | 1 డ్రా. |
| జలము | 8 ఔ. |

నాలుగుగంటల కొక ఔన్సు చొప్పున నీయవలయును. గర్భస్రావమునకు, అతిస్రావమునకు, దీర్ఘవిరేచన వ్యాధికి, ఉపయోగింపనగును. కురుపులు కలిగినపుడును ఉపయోగింపనగును.

| | |
|---|---|
| 2. నీటితోగలిసిన సల్ఫూరిక్ అసిడ్ (డైల్యూట్) | 2 డ్రా. |
| టింక్చర్ ఆఫ్ జింజర్ | 1 డ్రా. |
| జలము | 8 ఔ. |

నాలుగుగంటల కొకఔన్సు చొప్పున నీయవలయును. గర్భస్రావమునకును శ్వాసకోశములనుండి రక్తమువచ్చుటకును, అజీర్తికిని, యియ్యనగును. ఈమందు పుచ్చుకొనినపిమ్మట నీటితో పుక్కిలించి ఉమ్మివెయ్యవలయును.

| | |
|---|---|
| 3. అసిటేట్ ఆఫ్ లెడ్ | 3 గ్రె. |
| టింక్చర్ ఆఫ్ ఓపియం | 5 మి. |
| జలము | 1½ ఔ. |

ప్రతి మూడు గంటలకుగాని నాలుగు గంటలకుగాని పుచ్చుకొనవలయును. శ్వాసకోశములనుండిగాని, ప్రేగులనుండిగాని, రక్తము స్రవించుట కీయనగును.

| | |
|---|---|
| 4. నీటితోగలిసిన సల్ఫూరిక్ ఆసిడ్ (డైల్యూట్) | 25 మి. |
| టింక్చర్ ఆఫ్ ఓపియం | 8 మి. |
| జలము | $1\frac{1}{2}$ ఔ. |

దినమునకు మూడు పర్యాయము లీయవలయును. శ్వాసకోశములనుండియు, అన్నకోశమునుండియు, రక్తము వచ్చినప్పు డీయనగును. అజీర్తివిరేచనములకును కాలరాయందును పనికివచ్చును. ఆరుమాసముల బిడ్డకు అరడ్రాము యీయనగును. ఒక్కొక్క డ్రాము మందునందు సుమారు ఒకచుక్క టింక్చర్ ఓపియం ఉండును. బిడ్డయొక్క వయస్సునుబట్టి సంవత్సరమున కొకడ్రాము చొ॥ యీమందును యియ్య వచ్చును. ఓపియం కలిసియున్న ప్రతిమందును బిడ్డలకు బహుజాగ్రత్తతో నీయవలసి యుండును. నాలుగు గంటలకంటె నెక్కువ తరుచుగ నీ మందును యియ్యగూడదు.

| | |
|---|---|
| 5. గాలిక్ ఆసిడ్ | 5 గ్రె. |
| జలము | 2 ఔ. |

దినమునకు మూడుసారు లీయవలయును. శ్వాసకోశములనుండిగాని అన్న కోశమునుండిగాని రక్తము వచ్చుటయందును, స్కర్వీయందును, అజీర్తియందును, అజీర్తి విరేచనములయందును, అతివిరేచనములయందును, యీమందు నీయనగును.

| | |
|---|---|
| 6. ఆసిటేట్ ఆఫ్ లెడ్ | 3 గ్రె. |
| యక్స్ట్రాక్టు ఆఫ్ ఓపియం | $\frac{1}{4}$ గ్రె. |

బాగుగ కలిపి మాత్రగా జేయవలయును. ఒక్కొక్క మాత్ర చొప్పున దినమునకు మూడుసార్లు పుచ్చుకొనవలయును. రక్తస్రావమున కుపయోగించును. అజీర్తి విరేచనములయందును, అతి విరేచనములయందును, ఉపయోగించును,

| | |
|---|---|
| 7. పల్విస్ క్రెటా ఆరొమేటిక్ కం ఓపియం | 5 గ్రె. |
| సోడా బైకార్బనస్ | 1 గ్రె. |
| అలం (పటిక) పొడి | 1 గ్రె. |

పవుడరుగా చేయ వలయును. విరేచనములయందు ప్రతిరాత్రియును, అవ సరమయితే ఉదయమునను రాత్రియుగూడ, ఒకపవుడరు పుచ్చుకొనవలయును. అతి విరేచనముల యందును, బిడ్డలకు అజీర్తివిరేచనముల యందును, ఉపయోగింపనగును,

1½ సం|| మొదలు 2 సం|| వరకును వయసుగలిగిన బిడ్డకు 5 గ్రెయినులు పల్వీస్ క్రీటా ఆరోమేటిక్ కం ఓపియం యియ్యవచ్చును. ఇందులో ఓపియం ⅛ గ్రెయిను ఉండును. ఒకసంవత్సరము వయసునం దిందులో సగము యియ్యవలయును. ఆరుమాసముల వయసునం దిందులో నాలవవంతు యియ్యనగును.

---

## డయూరిటిక్సు; డయఫొరిటిక్సు — (Diuretics; Diaphoretics)

మూత్రగ్రంథులపైనయును, మూత్రకోశములపైనయును పనిచేయుటవలన మూత్రమును వృద్ధిపరచునట్టి మందులకు డయూరిటిక్సు అని పేరు. ఈమందులలోనే విశేషము చర్మభాగములయందు పనిచేసి చెమటను అధికపరచు గుణమును గలిగి యుండుటచే, డయఫొరిటిక్సు అనియు పిలువబడును.

| | |
|---|---|
| 1. పొటాస్ నైట్రిస్ | 1 డ్రా. |
| స్పిరిట్ ఈతర్ నైట్రిస్ | 3 డ్రా. |
| జలము | 8 ఔ. |

నాలుగు గంటలకొకసారి ఒక్కొక ఔన్సు చొప్పున నియవలయును. జ్వరమునందును, మూత్రమును వృద్ధిపరచుటకును, యియ్యనగును.

| | |
|---|---|
| 2. పొటాస్ నైట్రిస్ | 40 గ్రె. |
| స్పిరిట్ ఈతర్ నైట్రిస్ | 2 డ్రా. |
| వైన్ అఫ్ కొల్చికం | 3 డ్రా. |
| జలము | 8 ఔ. |

దినమునకు మూడు పర్యాయములు ఒక్కొక ఔన్సు చొప్పున నియవలయును. కీళ్ళనొప్పులయం దీయనగును.

| | |
|---|---|
| 3. పొటాస్ నైట్రిస్ | 40 గ్రె. |
| స్పిరిట్ ఈతర్ నైట్రిస్ | 2 డ్రా. |
| టింక్చర్ అఫ్ కంతారిడీస్ | 2 డ్రా. |
| జలము | 8 ఔ. |

కాలరాయందు మూత్రము బంధించినప్పుడు మూడు గంటలకొక ఔన్సు చొప్పున నియనగును.

---

## కఫహారులు — (Expectorants)

శ్వాసకోశములకు బోవు వాయుమార్గములయందును, కొంతవరకు దేహమంతటను, బనిచేయుటవలన, దగ్గు, ఉబ్బసము మొదలగు శ్వాసవ్యాధులలో శ్వాసకోశములయందును శ్వాసకోశములకు సంబంధించిన ఱతులయందును స్రవించు ద్రవపదార్థములను వెలిబుచ్చుటకు ఉపయోగించు మందులు యెక్స్పెక్టొరెంట్లు (కఫహారులు) అనబడును.

| | |
|---|---|
| 1. స్పిరిట్సు అమ్మోనియా అరొమేటిక్ | 2 డ్రా. |
| స్పిరిట్ ఈథర్ నైట్రిస్ | 4 డ్రా. |
| టింక్చర్ జింజిబ్రిస్ | 1 డ్రా. |
| జలము | 6 ఔ. |

రెండు గంటలు లేక మూడుగంటల కొకపర్యాయము ఒక్కొక ఔన్సు చొప్పున నీయవలయును. ఉబ్బసపుదగ్గు యొక్క ఉద్రేకస్థితియం దీయనగును.

| | |
|---|---|
| 2. క్యాంఫర్ | 1 గ్రె. |
| ఇపికాక్ పవుడరు | 3 గ్రె. |

కొంచెము జిగురుతో కలిపి మాత్రగా జేయవలయును. ఉబ్బసమునందు రెండు గంటల కొకమాత్ర పుచ్చుకొనవచ్చును.

| | |
|---|---|
| 3. మెగ్నీసియా కార్బనస్ | 25 గ్రె. |
| పెప్పర్ మింటు అయిల్ | 2 మి. |
| జలము | 1 ఔ. |

ఒకటి రెండు సంవత్సరముల వయసుగల బిడ్డకు కోరింత దగ్గునందు దినమునకు మూడు లేక నాలుగు పర్యాయములు ఒకడ్రాము చొప్పున నీయవచ్చును. మందు వాడుటకు ముందుగా బుడ్డిని కదలించవలయును.

---

## బలవర్ధకౌషధములు (Tonics)

శరీరము, శోషింపజేయు వ్యాధులచే బీడింపబడిన పిమ్మట, స్వస్థావస్థయందు బలమునందుట కీయదగిన ఔషధములకు బలవర్ధకౌషధములు (Tonics) అనిపేరు. ఇవి శరీరమునందు ఉద్రేకమును బుట్టించక నెమ్మదిగా బనిచేయును. లోహసంబంధ

మగు బలవర్ధకౌషధములు రక్తమునందలి లోహ సంబంధమగు లోపమును బూర్తి జేయును.

| | |
|---|---|
| 1. క్వినీన్ సల్ఫేట్ | 20 గ్రే. |
| షెర్రీ వైన్ | 2 ఔ. |
| జలము | 8 ఔ. |

బాగుగ గలిపి, ఒకఔన్సు చొప్పున దినమునకు మూడుసారు లీయవలయును.

| | |
|---|---|
| 2. క్వినీన్ సల్ఫేట్ | 24 గ్రే. |
| నిమ్మరసము (నిమ్మకాయలనుండి అప్పుడు తీసినది) | 2 డ్రా. |
| జలము | 8 ఔ. |

బాగుగ గలిపి, ఒక ఔన్సుచొప్పున దినమునకు మూడుసారు లీయవలయును.

| | |
|---|---|
| 3. ఫెర్రయి యెట్ క్వినీన్ సిట్రస్ | 40 గ్రే. |
| జలము | 8 ఔ. |

బాగుగాకలిపి, మూడు లేక నాలుగు గంటలకు ఒక ఔన్సు చొప్పున పుచ్చుకొనవలయును. ఈమందు పుచ్చుకొనిన పిమ్మట నోరు కడుగుకొనవలయును. లోహ సంబంధమగు ఔషధములన్నియు విరేచనమునకు నలుపురంగును పుట్టించును.

| | |
|---|---|
| 4. టింక్చర్ ఫెర్రయి పెర్క్లోర్ | 2 డ్రా, |
| జలము | 8 ఔ. |

ఒక్కొక ఔన్సు చొప్పున దినమునకు మూడుసార్లు పుచ్చుకొనవలయును. పాండు రోగమునందును నీరసవ్యాధి యందును యీయనగును. మందుపుచ్చుకొనిన పిమ్మట నోరు కడుగుకొనవలయును.

| | |
|---|---|
| 5. క్వినీన్ సల్ఫేట్ | 24 గ్రే. |
| ఫెర్రియి సల్ఫేట్ | 24 గ్రే. |
| మెగ్నీసియా సల్ఫేట్ | 1 ఔ. |
| డైల్యూట్ సల్ఫూరిక్ ఆసిడ్ (నీటితో గలిసిన) | 2 డ్రా. |
| జలము | 12 ఔ. |

పూటొకటికి ఒకఔన్సు చొప్పున దినమునకు మూడుసార్లు యీయవలయును.

| | |
|---|---|
| 6. సల్ఫేట్ ఆఫ్ ఐరన్ | 9 గ్రె. |
| క్వినిన్ సల్ఫేట్ | 12 గ్రె. |
| డైల్యూట్ సల్ఫ్యూరిక్ ఆసిడ్ | 1 డ్రా. |
| సల్ఫేట్ ఆఫ్ సోడా | 1 ఔ. |
| తెల్లని చక్కెర | 2 డ్రా. |
| జలము | 12 ఔ. |

ఒక ఔన్సు చొప్పున దినమునకు రెండు లేక మూడుసార్లు పుచ్చుకొనవలయును. విరేచన బద్ధముతో గూడినట్టియు నొప్పితో గూడినట్టియు ఋతుస్రావమునకు యీయనగును. కొరిజ ప్లీహవ్యాధులయందు బలవర్ధకౌషధముగ నీయవచ్చును.

---

## కుష్ఠవ్యాధి (Leprosy)

షాల్ మొగ్రా ఆయిల్ ను వ్యాధి ఆవరించిన స్థలమునందు దినమునకు 20 నిమిషముల కాలము రుద్దవలయును; ఈమందునకే ఓలియం గైనొకార్డి అనుపేరు కూడ కలదు. దీనినే 10 మినిములమోతాదులో పాలలో గలిపి, దినమునకు మూడుసారులు లోన కీయవలయును. మోతాదును రెండుద్రాములవరకు క్రమముగా హెచ్చింపనగును. ఈ చికిత్స 6 లేక 7 సంవత్సరములవరకు చేయవలసియుండును.

---

## గవదలు (Mumps)

సాధువిరేచనకారిగ పనిచేయుటకు మొదటగా చిట్లాముదము నియ్యవలయును. పిమ్మట యీ క్రింది మందు నియ్యవలయును.

| | |
|---|---|
| పొటాసియం బ్రొమైడ్ | 20 గ్రె. |
| ఫెనాసిటిన్ | 8 గ్రె. |
| కెఫీన్ సిట్రిస్ | 2 గ్రె. |

వీని నన్నిటిని గలిపి 4 మోతాదులుగ జేయవలయును. 8 లేక 10 సంవత్సరములు వయసుగల బిడ్డకు, మొదటిమోతాదును యిచ్చినపిమ్మట, రెండవమోతాదును 4 గంటలతరువాతయును, మూడవ మోతాదును 6 గంటల అనంతరమును, యియ్యవలయును. పెద్దవారల కైనయెడల అరగంట కొక మోతాదు చొ॥ 4 మోతాదుల

నియ్యవలయును. పిమ్మట నొప్పి పోవువరకును రెండుగంటల కొక మోతాదు నియ్య వలయును.

వాపుదలభాగముల వేడి కాపడములను గాచవలయును. వ్యాధికాలమందు తేలికగ జీర్ణమగు పదార్థములను మాత్రమే పుచ్చుకొనవలయును. పాలను, రొట్టెను పుచ్చుకొనవచ్చును. వాపుదల పోవువరకును నడుచుటను మానివేయవలయును.

---

## గోరుచుట్టు — (Whitlow)

ప్రారంభమునందు బలమగు విరేచనకారి నియ్యవలయును. అస్వస్థతభాగము నకు రెండుగంటల కొకసారి వేడి కాపడముల నిచ్చి, చేతిని యెత్తిపెట్టు స్థితిలో నుంచవలయును. చీము మొదలగు చెడుపదార్థములను వెలిబుచ్చుటకుగాను సామా న్యముగ శస్త్రము అవసరమగును. ఇందునుగురించి అశ్రద్ధజేసినయెడల, ఒకప్పుడు వ్రేలునకును, మఱియొకప్పుడు ప్రాణమునకు గూడ, అపాయము కలుగవచ్చును. రోగికి క్రమమైన ఆహారము నిచ్చుచు, అవసరమైన యెడల బలవర్ధకౌషధములగూడ నియ్య నగును.

---

## మూత్రకృచ్ఛ్రము — (Stone in the Bladder)

మూత్రకృచ్ఛ్ర సంబంధమగు తెర కలిగినపుడు బాధ కుపశాంతిని గలుగ జేయవలయును. రోగిని వేడినీళ్లతొట్టెలో గూర్చుండబెట్టి, 25 గ్రెయినుల క్లోరల్ హైడ్రేస్‌ను యియ్యవలయును. బాధ తగ్గని యెడల. 8 గంటలకు మరల నియ్య వలయును. నడుముపైన వేడికాపడములను గాచవలయును. మలబంధ ముండిన యె డల, విరేచనకారి నియ్యవలయును. బార్లే నీళ్ళను విశేషముగ త్రాగవలయును.

ఎరుపు మూత్రకృచ్ఛ్ర ముండినయెడల, శాకసంబంధమగు ఆహారములను మా త్రమే భుజింపవలయును. 10 గ్రెయినుల పొటాస్ బైకార్బనస్‌ను ఒక ఔన్సు జలములో గలుపుచు, దినమునకు మూడుపర్యాయములు పుచ్చుకొనవలయును. విరే చనకారి నప్పు డప్పుడు ఉపయోగించు చుండ వలయును. పెపరజీన్ (Piperazine) అను ఔషధము మిగుల ఉపయోగము. దీనియొక్క మోతాదు 4 గ్రెయినులు మొదలు 10 గ్రెయినుల వరకు అయియున్నది.

తెలుపు మూత్రకృచ్ఛ్రమునందు, డైల్యూట్ (నీటితో గలిసిన) నైట్రిక్ ఆసిడ్ 20 మినిములను నాలుగు ఔన్సుల జలములో గలిపి యియ్యవలయును. క్వైనీన్‌ను బలవర్ధకౌషధముగ నియ్యనగును.

మూత్రకృచ్ఛ్రముయొక్క అన్ని తరగతులయందును మంచినీళ్ళ నెక్కువగ ద్రాగవలయును. ఒకటంబ్లరు ఉడుకునీళ్ళను, ఉదయమునను, మధ్యాహ్నమునను, సాయంకాలమునను, ద్రాగుచుండవలయును. భోజనమును ద్వరితముగ జేయవలసి యుండును. విస్తారము సేపు పరుండియుండకూడదు. అట్లు చేసినయెడల, మూత్రకృచ్ఛ్ర మేర్పడుట కనువు ఎక్కువగును. వేడిస్నానములు, మొరటు తువ్వాళ్లతో నెక్కువగ దుడుచుకొనుట, ఫ్లానల్ దుస్తులు, నిస్త్రాణను గలుగజేయని శరీరసాధకము, అవసరములయి యున్నవి.

---

## వాంతులు (జీర్ణకోశ సంబంధమగు) — (Vomitting-Gastric)

బిస్మత్ సబ్‌నైట్రటస్‌నుగాని, బిస్మత్ కార్బనస్‌గాని, 10 గ్రెయినుల మోతాదులో 4 గంటల కొకసారి యియ్యవలయును.

వాంతులతోగూడ, తలనొప్పి, జ్వరత, ఒడలంతయు నొప్పి, యుండి యుండిన యెడల ఒక్కొక మోతాదునందు 5 గ్రెయినుల డోవర్సు పౌడరునుగూడ గలిపినయెడల మంత్రమువలె పనిచేయును.

డోవర్సు పౌడరులో నల్లమందు ఉండును గనుక, బిడ్డలకును, కొందరి వయస్కులకునుగూడ, యీ పౌడరు శరీరతత్వమునకు సరిపడక పోవచ్చునుగాన, దీనిని మానివేసి ఒక్కొక మోతాదునందు మెగ్నీసియం కార్బనస్ 10 గ్రెయినులను గలుపనగును.

---

## అతిసారవిరేచనములు (దీర్ఘవ్యాపితమగు) — (Diarrhoea-Chronic)

| | |
|---|---|
| యక్ట్రాక్టు బేలి లిక్విడ్ | 4 డ్రా. |
| స్పిరిట్స్ క్లోరోఫారం | 20 మి. |
| జలము | 4 ఔ. |

6 గంటల కొక ఔన్సు చొ॥ యియ్యవలెను.

---

## వీర్యనష్టము — (Spermatorrhea)

| | |
|---|---|
| 1. యక్ట్రాక్టు డామియానా లిక్విడ్ | 1½ డ్రా. |
| టింక్చర్ జింజిబ్రస్ | 20 మి. |
| కొంచెము చక్కెర | |
| జలము | 3 ఔ. |

ఒక్కొక్క ఔన్సు మోతాదులో దినమునకు మూడుసారు లియ్యవలయును.

2. యక్ట్రాక్టు డామియానా సాలిడ్ను 2 గ్రెయినుల మాత్రలనుజేసి దినమునకు రెండు మాత్రల చొ॥ సేవింపవలయును.

3. రోగి సంతోషముగ నుండవలయును. గట్టిపాన్పులపై బరుండవలయును మెత్తని పరుండరాదు. చల్లని నీటితో శిరస్నానము చేయనగును.

---

## పాముకాటు — (Snake Bite)

పాముకాటునకు వెంటనే చికిత్సచేయవలయును. లేనిచో లాభ ముండదు. కాటునకు సమీపమున, అనగా కాటునకు కొంచెముగా పైయెత్తున, గట్టిగా కట్టును కట్టి పదునైన చిన్నకత్తిని దీపముపైన గాచి, యీ కత్తితో కాటుస్థానమున + గురు రూపమున గీరవలయును, ఇట్లు గీరుట మూలమున వచ్చిన రక్తమును వీలైనంతవరకు పిండివేసి, ఆగాయమునందు కొంచెము పొటాస్ పర్మాంగనేట్ పొడిని చొప్పించి దానిని బాగుగా గాయములోనికి రుద్దవలయును.

రోగికి మగత గలుగుచుండిన యెడల 10 చుక్కల లిక్కర్ అమ్మోనియాను ఒక ఔన్సు జలములో వేసి యియ్య వలయును. అవసరమని తోచినయెడల యీ మందును మరల యిచ్చుచుండవలయును.

---

## తేలుకాటు — (Scorpion Sting)

వినిగర్ను కాటుపైన గట్టిగా రుద్దవలయును.

నొప్పి నయము కానియెడల, పటికను క్రొవ్వువత్తి దీపముపైన కరగించి, దానిని వెంటనే కుట్టిన స్థానమున అద్దవలయును,

కుట్టిన వెంటనే చల్లనిజలమును త్రాగినయెడల బాధ వ్యాపింపకుండ నుండునని చెప్పుదురు.

---

## పులిపిరి కాయలు — (Warts)

స్వచ్ఛమైన నైట్రిక్ ఆసిడ్ను సూక్ష్మముగా పులిపిరికాయలపై నద్దవలయును.

---

# అనుక్రమణిక 1.

---

ఏ ఔషధయోగమునందైనను జలము 4 ఔన్సులు అని వ్రాసియుండిన యెడల మిశ్రితౌషధమంతయు 4 ఔన్సులు అగువరకును జలములు గలుపవలయునని తెలిసికొనవలయును. ఇటులనే యిట్టి ప్రతి విషయమునందును గ్రహింపనగును.

ఇన్‌ఫ్యూజన్ సార్సా అనగా సుగంధిపాల కషాయము.

ఇన్‌ఫ్యూజన్ డిజిటాలిస్ అనగా డిజిటాలిస్ ఆకులతో జేసినకషాయము. దీనికి బదులుగా టించ్చరు డిజిటాలిస్‌ను మోతాదు ఒకటికి 5 మినిములు చొ॥ గలిపి తక్కినభాగమును జలమును గలుపుకొనవచ్చును.

ఇన్‌ఫ్యూజన్ బక్కు, ఇన్‌ఫ్యూజన్ సెనిగా, ఇన్‌ఫ్యూజన్ సెన్నా, ఇన్‌ఫ్యూజన్ జన్షన్ - వీటియన్నిటి విషయములలోను ఆయా కషాయములు సందర్భపడనపుడు ఆయా టించ్చర్లను మోతాదు ననుసరించి సూక్ష్మముగా గలిపి, తక్కిన భాగమునకు జలమును గలుపవలయును. మోతాదు ఒకటికి టించ్చర్లు కొన్ని మినిములలో మాత్రమే ఉండునని గ్రహింపవలయును.

ఆక్వా క్లోరోఫారమునకు బదులుగా ప్రతిఔన్సు మిశ్రితౌషధమునకు 10 మి. స్పిరిట్స్ క్లోరోఫారమును గలుపుకొని తక్కినది జలమును గలుపుకొననగును.

స్పిరిట్స్ క్యాంఫర్, తూనికప్రకారము 1 డ్రా. ఆల్కహాలును, 1 డ్రాము హారతికర్పూరమును గలిపినయెడల స్పిరిట్స్ క్యాంఫర్ అగును.

ఆక్వా క్యాంఫర్ కావలసి వచ్చినపుడు ప్రతిఔన్సు మిశ్రితౌషధమునకును 2 లేక 3 మినిముల స్పిరిట్స్ క్యాంఫరును గలుపుకొని తక్కినది జలమును గలుపుకొననగును.

ఆక్వా అనీతి కావలసివచ్చినపుడు యిందు సంబంధమగు చమురును, అనగా ఓలియం అనీతిని, మిశ్రితౌషధమునకంతకును 1 లేక 2 చుక్కలను గలిపిన చాలును.

మిస్టూరా సెన్నాకో సందర్భపడనపుడు రెండవ పక్షముగా టించ్చర్ సెన్నాకోను ఉపయోగింపవచ్చును గాని టించ్చర్‌యొక్క మోతాదు ½ డ్రాము మొదలు 1 డ్రాముపరకు మాత్రమే అయియున్న సంగతిని గమనింపవలయును.

ఆక్వా మెంతా పిప్‌ను ఉపయోగింపవలసి వచ్చినపుడు మిశ్రితౌషధమునం దం తను 3 లేక 4 చుక్కలు పెప్పర్మింట్ అయిల్‌ను ఉపయోగింపవచ్చును.

సిరప్ ఆరంటీ సందర్భపడనపుడు మోతాదు ఒకటికి 5 మి. చొప్పున టింక్చర్ ఆరంటీని గలిపి, కొంచెము చక్కెరనుగూడ మిశ్రితము చేసి, తక్కినది జలభాగమును గలుపనగును.

ఆసిడ్ సల్ఫ్యూరిక్ డైల్యూట్‌ను జేయుటకు గాను, 4 డ్రాములు సల్ఫ్యూరిక్ ఆసిడ్‌ను 40 డ్రాముల జలములో నెమ్మదిగా గలుపుము, చల్లారిన పిమ్మట మరి $8\frac{1}{2}$ డ్రాముల జలమును మరల గలుపవలయును.

ఆసిడ్ నైట్రిక్ హైడ్రోక్లోర్ డైల్యూట్‌ను తయారు చేయుటకుగాను, 3 భాగములు నైట్రిక్ ఆసిడ్, 4 భాగములు హైడ్రో క్లోరిక్ ఆసిడ్, జలము 25 భాగములు, వీని నన్నిటిని గలిపి నిలువ యుంచుకొనవలయును.

లైకర్ అమ్మోనియా ఆసిటేటిస్ (డైల్యూట్) ను యీక్రిందిప్రకారము తయారు చేయవలయును.

1 ఔన్సు అమ్మోనియా కార్బనస్‌ను 10 ఔన్సుల జలములో గలిపి, "రెడ్" లిట్మస్ కాగిదమును దీనిలో ముంచినయెడల "బ్లూ" కాకుండు నంతవరకును, బ్లూలి ట్మస్ కాగిదమును దీనిలో ముంచినయెడల యెరుపు కాకుండు నంతవరకును దీని యందు ఆసిటిక్ ఆసిడ్‌ను గలిపి, పిమ్మట నిదియొక పైంటు అగు నంతవరకును జల మును గలిపి, ఆకుపచ్చ సీసాలో నిలువచేయవలయును. ఆసిటిక్ ఆసిడ్‌ను అవస రమైన దానికంటె నెక్కువ గలుపకుండ జాగ్రతను బుచ్చుకొనవలయును. దీనియొక్క మోతాదు 2 డ్రాములు మొదలు 6 డ్రాములవరకు అయియున్నది.

ఆసిడ్ నైట్రిక్ డైల్యూట్ అనగా 10 డ్రాముల జలములో 1 డ్రాము నైట్రిక్ ఆసిడ్ గలిసినట్టిది. దీనియొక్క మోతాదు 10 మి. మొదలు 30 మి. వఱకును అయియున్నది.



# అనుక్రమణిక 2.

ఈగ్రంథమునందు తెలుగున వ్రాయబడిన ఆంగ్లేయౌషధములయొక్క పేర్లు చదువరుల ఉపయోగమునకై ఆంగ్లభాషయందు క్రింద వివరింపబడినవి.

## అ



## ఇ

ఇన్ఫ్యూజన్ జన్షన్ కో(Inf. Gentian Co.]
,, బక్కు ,, Buchu)
,, సార్సా ,, Sarsa)
,, సెన్నా ,, Senna)
,, సెనిగా ,, Senega)
ఇక్థియాల్ (Ichthyol)

## ఓ

ఓలియం క్యూబెబ్ (Oleum Cubeb )
,, గైనోకార్డి ,, Gynocarde
,, శాంటల్ ఫ్లేవి ,, Santal Flavi)
,, సినేపిస్ ,, Sinapis)
క్రయిసార్బయిన్ (Chrysarobine)
కార్బాలిక్ ఆసిడ్ (Carbolic Acid )
కాల్సియం సల్ఫయిడ్ (Calcium Sulphide)
క్రియసోట్ (Creasote )
క్రైసొఫానిక్ ఆసిడ్ Chrysophonic Acid)
క్రీం ఆఫ్ టార్టార్ (Cream of Tartar)
క్రీం ఆఫ్ మాల్ట్ అండ్ కాడ్ లివర్ ఆయిల్ విత్ క్రియసోట్ అండ్ హైపోఫాస్ఫయిట్స్ (Cream of Malt and Cod liver Oil with Creasote and Hypo-phosphites)
క్వినిన్ బ్రోమైడ్ (Quinine Bromide)
,, సల్ఫేట్ ,, Sulphate)
,, మ్యూరియస్ ,, Murias)
,, హైడ్రోక్లోర్ ,, Hydrochlor)
కఫీన్ సిట్రస్ (Caffine Citras )
కయొలిన్ (Kaolin)
కొడీనా ఫాస్ఫస్ (Codeina Phosphas]

క్లోరల్ హైడ్రస్ (Chloral Hydras)

## గ

గం అకేసియా (Gum Acacia)
గ్యాలిక్ ఆసిడ్ (Gallic Acid)
గ్వయిషల్ కార్బనస్ (Guiacol Carbonas)
గ్లిసరీన్ (Glycerine)
గ్రే పౌడర్ (Grey Powder)
గ్లైకొథైమొలైన్ (Glycothymoline)

## జ

జింక్ ఆక్సైడ్ (Zinc Oxide)
,, పర్మాంగనేట్ ,, Permanganate
,, బ్రోమైడ్ ,, Bromide
,, వలీరియేనస్ ,, Valerianus
,, సల్ఫేట్ ,, Sulphate

## ట

టర్పన్టీన్ (Turpentine)
టార్టారిక్ ఆసిడ్ (Tartaric Acid)
ట్యానిక్ ఆసిడ్ (Tannic Acid)
టింక్చర్ అయొడిన్ (Tincture Iodine)
,, అసాఫటిడా ,, Asafetidae)
,, అకొనైట్ ,, Aconite)
,, అరంటీ ,, Aurantii)
,, ఆర్నికో ,, Arnico)
,, ఓపియం ,, Opium )
,, కన్వలేరియామజలిస్ ,, Convall majalis]
,, కలంబా ,, Calumba)
,, కాప్సికం ,, Capsicum)

,, కార్డమం కో ,, CardamomCo.]
,, క్యాంఫర్ కో ,, Camphor Co.]
,, కంతారిడిస్ Tincture Can tharidis)
,, క్లోరోఫారం కో ,, Chloro-form Co.)
,, గ్వయకై అమ్మోనియేటా ,, Guaiaci Ammon.]
,, గ్వయిషం ,, Guaiaci)
,, జన్షన్ కో ,, Gentian Co]
,, జింజిబ్రస్ ,, Zingibras)
,, జెల్సిమియం ,, Gelsimium)
,, డిజిటాలిస్ ,, Digitalis)
,, నక్సువామికా ,, Nux Vomica)
,, పొడాఫైలిన్ అమ్మోనియేటా ,, Podoph Ammon)
,, బెలడోనా ,, Belladonna)
;. బెంజాయిన్ కో ,, Benzoin Co)
,, మిర్ ,, Myrrh)
,, రీయై కో ,, Rhei Co)
,, లావండ్యూలా కో ,, Lavandu-lae Co]
,, లోబీలియా యీతర్ ,, Lobel. Ether]
,, వలీరియన్ అమ్మోనియేటా ,, Valer. Ammon.)
,, సిల్లా ,, Scillae)
,, సింకోనా ,, Cinchona)
,, స్ట్రొఫాంతస్ ,, Strophanthus)
,, హమామలిస్ ,, Hamamelis)
,, హాయొసామి ,, Haoscyami)

## డ

డనవన్స్ సొల్యూషన్ (Donovan's Solution]
డోవర్స్ పౌడర్ (Dover's Powder) or
లేక (పల్విస్ ఇపికాక్ కో) (Pulv. Ipecac Co.]

## త

థియొకాల్ (Theocol)
థియోసిన్ సోడా అసిటేట్ (Theocin Soda Acetate]
తైమాల్ (Thymol)

## ద

దాల్చిని అరకు (Cinnamon Oil)

## న

నైట్రిక్ అసిడ్ (Nitric Acid)

## ప

పన్నీరు (Rose Water)
పల్విస్ ఇపికాక్ (Pulv. Ipecac)
,, క్రేటా అరోమేటిక్ ,, Creta Arom.]
,, ,, కం ఓపియం ,, ,, Cum Opium]
,, జాలప్ కో ,, Jalap Co.]
,, ట్రాగకాంత్ ,, Tragacanth)
,, డిజిటాలిస్ ,. Digitalis)
,, రీయై ,, (Rheii)
,, సిల్లే ,, Scillae )
పర్ క్లోరిడ్ అఫ్ మర్క్యురీ (Perchl. of Mercury]

పారఫిన్ అయింట్మెంట్ (Paraffin Ointment)
పిల్యూలా అలోజ్ యెట్ అసాఫటిడా { Pil. Aloes et Asafetidae
పిల్యూలా ప్లంబి కం ఓపియం (Pil. Plumbi cum Opium)
పెట్రోలియం (Petroleum)
పెప్సిన్ వైన్ (Pepsin Wine)
ఫెనాసిటిన్ (Phenacetin)
పెప్పర్మింట్ ఆయిల్ (Pepperm. Oil)
ఫెర్రయి ఆర్సనస్ (Ferri Arsenas)
,, యెట్ అమ్మోనియా సిట్రస్ (Ferri et Ammon. Citras)
,, యెట్ క్వినిన్ సిట్రస్ ,, Quin. Citras)
,, బ్రోమైడ్ ,, Bromide)
,, సల్ఫేట్ ,, Sulphate)
ఫ్లెక్సిబిల్ కలోడియం (Flex. Collodium)
పొటాస్ అయొడైడ్ (Potass Iodide)
,, అసిటస్ ,, Acetas)
,, క్లోరస్ ,, Chloras)
,, నైట్రస్ ,, Nitras)
,, పర్మాంగనస్ ,, Permanganas)
,, బైకార్బనస్ ,, Bicarbonas)
,, బ్రోమైడ్ ,, Bromide)
,, సిట్రస్ ,, Citras)
పొడొఫైలం రజిన్ (Podoph. Resin)

## బ

బాల్సం కోపేబా (Balsam Copaiba)
,, పెరూవియాని ,, (Peruviani)
బిస్మత్ కార్బనస్ (Bismuth Carbonas)
,, సబ్నైట్రస్ ,, Subnitras)
,, సాలిసైలస్ ,, Salicylas)
బీటా నాఫ్థాల్ (Beta Naphthal)
బెర్గమాట్ ఆయిల్ (Bergamot Oil)
బెల్లడోనా అయింట్మెంట్ (Belladonna Ointment)
బొరాక్సు (వెలిగారము) (Borax)
బోరిక్ అయింట్మెంట్ (Boric Ointment)
,, ఆసిడ్ (Boric Acid)

## మ

మాల్టీన్ అండ్ కాడ్ లివరు ఆయిల్ [Maltine & Cod liver Oil]
మిస్టూరా సెన్నా కో [Mistura Senna Co]
మెగ్నీసియా కార్బనస్ (Mag. Carbonas]
,, బైకార్బనస్ ,, Bicarbonas)
,, సల్ఫేట్ ,, Sulphate)
,, సిట్రస్ ,, Citras)
మెంతాల్ (Menthol)

## య

యక్స్ట్రాక్టు ఓపియం [Extr. Opium]
,, కొలోసింత్ కో ,, Colocynth Co.]
,, కాస్కారా సాగ్రాడా ,, Cascara Sagrada]
,, జన్షన్ ,, Gentian]
,, జాంబులీన్ లిక్విడ్ ,, Jambuline Liq.)
,, డామియానా లిక్విడ్ ,, Damiana Liq ]
,, ,, సాలిడ్ ,, Solid)

యక్స్ట్రాక్టు నక్సువామికా (Extr. Nux Vomica)
,, బెలడోనా ,, Belladonna)
,, బేలి లిక్విడ్ ,, Belae Liq.)
,, యెర్గాట్ లిక్విడ్ ,, Ergot Liq)
,, హమామెలిస్ ,, Hamamelis)
,, హైడ్రాస్టిస్ కెనాడెన్సిస్ Extr. Hydr. Canadensis)
యూకలిప్టస్ఆయిల్ (Eucalyptus Oil)

## ర

రస భస్మము (Calomel)
రిడ్యూస్డు ఐరన్ (Reduced Iron)
రెజిన్ గ్వయాక్ (Resin Guiac)

## ల

లానోలీన్ (Lanoline)
లాక్టిక్ ఆసిడ్ (Lactic Acid)
లినిమెంట్ అయొడిన్ (Liniment Iodine)
,, ఓపియం ,, Opium)
,, క్లోరోఫారం ,, Chloroform)
,, బెలడోనా ,, Belladonna)
,, మెంతాల్ ,, Menthol)
లైకర్ అమ్మోనియా అసిటేటిస్ Liq. Amm. Acetatis)
,, ,, ఫొరట్ ,, ,, Fort)
,, ఆర్సెనికాలిస్ ,, Arsenicolis)
,, అమ్మోనియా సిట్రస్ ,, Amm. Citras]
లైకర్ కాలోఫైల్ యెట్ పల్సేటిల్లా (Liq. Caulophyl et Pulsatilla)
,, పొటాస్ ,, Potass)
,, బిస్మత్ యెట్ పెప్సిన్ కో ,, (Bismuth et Pepsin Co. [Hewlett]
లైకర్ మార్ఫియా హైడ్రోక్లోర్ (Liq. Morphia Hydrochlor]
,, సింకోనా హైడ్రోబ్రోం ,, Cinchona Hydrobrom]
,, సెడన్స్ (Liq. Sedans)
,, స్ట్రిక్నిన్ హైడ్రోక్లోర్ [Liq. Strychnine Hydrochlor]
,, హైడ్రార్జిరై పెర్క్లోర్ (Liq. Hydr. Perchlor]
లైం వాటర్ (Lime water)

## వ

వాసలీన్ (Vaseline)
వినెగర్ (Vinegar)
వైనం ఆంటిమోనియాలిస్ (Vinum Antimonialis)
,, ఇపకాక్ ,, [Ipecac]
,, కాల్చికం ,, Colchicum)

## శ

శనటోజన్ (Sanatogen)
శాంటోనిన్ (Santonine)

## ష

షాల్ మొగ్రా ఆయిల్ (Chaulmogra Oil)
షెర్రీ వైన్ (Sherry Wine)

## స

సలాల్ (Salol)
సల్ఫర్ అయింట్మెంట్ (Sulphur Ointment
,, సబ్లిమేటం ,, Sublimatum)

సల్ఫేట్ ఆఫ్ ఐరన్ (Sulphate of Iron)
సాలిసైలిక్ ఆసిడ్ (Salicylic Acid)
సిట్రిక్ ,, (Citric ,, )
సిరప్ అరంటీ (Syrup Aurantii)
,, ట్రిపోలియోకో (Syrup Tripl.Co.
,, టోలు ,, Tolu
,, ఫెర్రియి అయొడైడ్ (Syrup Ferri Iodide]
స్పిరిట్స్ అమ్మోనియా అరోమేటిక్ [Sp. Amm. Arom ]
,, ఈతరిస్ కో ,, Etheris Co )
,, ఈతర్ నైట్రిస్ ,, Ether Nitras]
,, క్యాంఫర్ ,, Camphor )
,, క్లోరోఫారం ,; Chloroform
,, రోజ్మేరి ,, Rosemari)
స్ట్రిక్నిన్ ఫాస్ఫస్ (Strych. Phosphas)
సీమ ఆముదము (Castor Oil )
సున్నపు నీళ్లు (Lime Water)
సోడా అయొడైడ్ (Soda Iodide)
,, కార్బనస్ ,, Corbonas)
,, సల్ఫేట్ ,, Sulphate)
సోడా క్లోరస్ (Soda Chloras)
,, బైకార్బనస్ ,, Bicarbonas)
,, బ్రోమైడ్ ,, Bromide)
,, సాలిసైలస్ ,. Salicylas)
సోడియం గ్లయికోకలేట్ (Sodium Glycocholate]
,, హైపోసల్ఫయిట్ ,, Hypo-sulphite)

## హ

హెరాయిన్ హైడ్రోక్లోర్ (Heroin Hydrochlor)
హెల్మిటాల్ (Helmitol)
హైడ్రార్జిరై ఆక్సయిడ్ ఫ్లేవి (Hydr. Oxide Flavi]
,, కం క్రేటా ,, Cum Creta)
గ్రే పౌడరు (Grey Powder)

# విషవిరుగుడులు.

విషప్రయోగమునందు జాల వాటిలో ముందుగ జీర్ణాశయమునందలి పదార్థములను వెలిబుచ్చుటకు వలయు ప్రయత్నములను జేయవలయును. ఇందుకై వాంతికారుల నుపయోగింపనగును.

## వాంతికారులు.

మస్టర్డు పౌడరు—ఒకటంబ్లరు ఉడుకునీళ్లలో పెద్దచెమిచా కొలతగల దీనిని వేసి పుచ్చుకొనవలయును.

సామాన్యపు ఉప్పు—ఒకటంబ్లరు ఉడుకునీళ్లలో రెండు పెద్దచెమిచాల కొలతగల దీనిని వేసి పుచ్చుకొనవలయును.

జింక్ సల్ఫేట్—30 గ్రెయినులు (అర టంబ్లరు ఉష్ణజలములో.)

అమ్మోనియం కార్బనేట్—30 గ్రెయినులు ,,

పల్వస్ ఇపికాక్— 20 గ్రెయినులు ,,

కాపర్ సల్ఫేట్—5 గ్రె॥ మొదలు 10 గ్రె॥ ,,



| విషములు. | విరుగుడులు. |
|---|---|
| (1) ఆసిడ్ హైడ్రోక్లోరిక్<br>,, నైట్రిక్<br>,, సల్ఫూరిక్<br>,, ఫాస్ఫారిక్ | (1) లైం వాటరు<br>మెగ్నీసియం కార్బనేట్<br>సోప్ వాటరు<br>పాలు<br>ఆలివ్ ఆయిల్ |
| (2) ఆకోనైట్ (నాభి) | (2) బ్రాంది మొదలగు మత్తుపదార్థములు; కల్పితమైన శ్వాసకృత్యము; ఒఱగుకొనియుండుట. |
| (3) ఆల్కహాల్ (బ్రాందీ మొదలగునవి) | (3) అమ్మోనియా కార్బనస్. లైకరు అమ్మోనియాను వాసన జూచుట; వేడికాఫీ |
| (4) పొటాష్, సోడా, అమ్మోనియా, స్మెలింగ్ సాల్టు మొదలగు ఆల్కాలీలు | (4) అసిటిక్ ఆసిడ్ లేక వినిగరు; నిమ్మరసము; టార్టారిక్ ఆసిడ్ |

| | |
|---|---|
| (5) ఆంటిపైరిన్<br>ఆంటి ఫిబ్రిన్<br>ఫెనాసిటిన్<br>రిసార్సిన్ | (5) బ్రాంది మొదలగు మత్తుపదార్థములు; స్ట్రిక్నిన్<br>కల్పితమైనశ్వాసకృత్యము; ఒఱగుకొనియుండుట; వాంతికారులు |
| (6) ఆర్సెనిక్ (పాషాణము) | (6) టింక్చర్ ఫెర్రయి పెర్క్లోరున్నూ<br>సోడియం కార్బనేట్ సొల్యూషనున్నూ<br>డయలైజ్డ్ ఐరన్న్నూ, పిమ్మట నీళ్లలోకలిపినసామాన్యపుఉప్పున్నూ |
| (7) బెలడోనా<br>అట్రోపీన్ | (7) ట్యానిక్ ఆసిడ్<br>మార్ఫీన్<br>కాఫీ<br>క్లోరల్ హైడ్రేస్ |
| (8) కఫీన్ | (8) నైట్రోగ్లిసరీన్ |
| (9) కంతారిడీస్ | (9) జావ<br>బ్రాంది వగైరా<br>క్యాంఫరున్నూ ఓపియమున్నూ;<br>చమురులు గాని క్రొవ్వుసంబంధమయినవిగాని కూడవు |
| (10) కార్బాలిక్ ఆసిడ్ | (10) సోడా సల్ఫేట్<br>మెగ్నీసియం సల్ఫేట్<br>ఆలివ్ ఆయిల్<br>కాఫీ |
| (11) కార్బానిక్ ఆసిడ్ గ్యాస్ (అంగార క్షారవాయువు) | (11) పరిశుభ్రమగు గాలి<br>అమ్మోనియా వాసనజూపుట |
| (12) క్లోరల్<br>క్లోరోఫారం | (12) పరిశుభ్రమగు గాలి<br>శిరముపై చన్నీళ్లు ధారగాబోయుట; పొంగువచ్చు ద్రవపదార్థముల దాగ నిచ్చుట<br>వేడిమి;ఒడలుపైదోముట;వేడికాఫీ<br>బ్రాందీ మొదలగు మత్తుపదార్థముల నిచ్చుట<br>ఒఱగుకొనియుండుట; అమిల్ నైట్రైట్ను వాసనజూచుట |

| | |
|---|---|
| (13) కోకేన్ | (13) బ్రాందిమొదలగుమత్తుపదార్థములు<br>స్ట్రిక్నిన్<br>కల్పితమైన శ్వాసకృత్యము<br>అమిల్ నైట్రేట్<br>పొటాసియం బ్రొమైడ్ |
| (14) కోనియం | (14) వాంతికారులు<br>బ్రాంది మొదలగు మత్తుపదార్థములు; కల్పితమైన శ్వాసకృత్యము |
| (15) కాపర్ సంబంధమగు లవణములు | (15) గుడ్లలోని తెలుపును నీళ్లలోకలిపి యిచ్చుటయు, పాలు గోధుమపిండిని నీళ్లలో కలిపి యిచ్చుటయు |
| (16) క్రియసోట్ | (16) గుడ్లలోని శ్వేతపదార్థము నీళ్లలో కలిపి యిచ్చుట |
| (17) డిజిటాలిస్ | (17) ట్యానిక్ ఆసిడ్<br>బ్రాంది మొదలగు మత్తుపదార్థములు; ఒఱగుకొని కూర్చుండుట |
| (18) ఈసరీన్ | (18) బ్రాందీ మొదలగు మత్తుపదార్థములు;కల్పిత మయిన శ్వాసకృత్యము<br>క్లోరల్ హైడ్రస్<br>స్ట్రిక్నిన్ |
| (19) ఈథర్ | (19) అమ్మోనియాను వాసన జూచుట<br>లైకరు అమ్మోనియా అసిటేటిస్ |
| (20) జెల్సిమియం | (20) వాంతికారులు<br>బ్రాందీ మొదలగు మత్తుపదార్థములు; మార్ఫియా |
| (21) అయొడిన్ సంబంధములు | (21) పలుచని వరిపిండి పేస్టు<br>సోడా హైపో సల్ఫేట్<br>లెడ్ అసిటేట్ |
| (22) ఇపికాక్ | (22) ట్యానిక్ ఆసిడ్ |
| (23) లెడ్ సంబంధములు | (23) మెగ్నీసియం సల్ఫేట్<br>సోడా సల్ఫేట్<br>పాలు<br>విరేచనకారులు |

| | |
|---|---|
| (24) మెర్క్యురీ సంబంధములు | (24) గుడ్లలోని శ్వేతపదార్థము<br>పాలు<br>వరిపిండి పేస్టు<br>వాంతికారులు |
| (25) నైట్రొగ్లిసరీన్ | (25) ఎర్గాట్<br>స్ట్రిక్నీన్<br>బెలడోనా<br>శిరమునకు చల్లని లేపనములు |
| (26) ఓపియం సంబంధములు | (26) శరీరమునకు చల్లని లేపనములు.<br>విరేచనకారులు<br>వేడి కాఫీ<br>పొటాస్ పర్మాంగనేట్<br>నిద్ర లేపవలయును<br>స్ట్రిక్నీన్<br>బ్రాందీ వగైరాలు<br>కల్పితమైన శ్వాసకృత్యము<br>అమిల్ నైట్రైట్ |
| (27) ఫాస్ఫరస్ సంబంధములు, నిప్పుపుల్లలు | (27) టెరిబీన్<br>కాపర్ సల్ఫేట్<br>మెగ్నీసియం సల్ఫేట్<br>చమురులు, ఆల్కహాల్ను,<br>యియ్యరాదు<br>మార్ఫీన్ |
| (28) పొటాసియం సయనేడ్, ప్రూసిక్ ఆసిడ్ | (28) అమ్మోనియా<br>శిరముపై చల్లని నీళ్లను ధారగా పోయుట |
| (29) సాంటొనీన్ | (29) విరేచనకారులు<br>క్లోరల్ హైడ్రేట్ |
| (30) సిల్వర్ సంబంధములు | (30) సామాన్య లవణము<br>గ్రుడ్లలోని శ్వేతపదార్థము |
| (31) స్ట్రిక్నీన్<br>నక్సువామికా | (31) ట్యానిక్ ఆసిడ్<br>ఓపియం చిన్న మోతాదులు<br>పొటాసియం బ్రొమైడ్<br>క్లోరల్ హైడ్రేట్ |

| | |
|---|---|
| | అమిల్ నైట్ రైట్ |
| (32) టార్టార్ ఎమిటిక్ | (32) ట్యానిక్ ఆసిడ్<br>పాలు<br>గుడ్లలోని శ్వేతపదార్థము |
| (33) టిన్ లవణములు | (33) సోడా బైకార్బొనేట్<br>ట్యానిక్ ఆసిడ్<br>పాలు |
| (34) జింక్ లవణములు | (34) గుడ్లలోని శ్వేత పదార్థము<br>పాలు<br>సోడా బైకార్బొనేట్<br>ట్యానిక్ ఆసిడ్<br>టింక్చర్ ఓపియం<br>ఉదరముపై అవిసె పిండి కట్టు |

☞ కల్పిత శ్వాసకృత్యముయొక్క వివరములకై గ్రంథమునందలి 76 వ పుటను జూడుడు.



# అనుక్రమణిక 3.



ఈ దిగువ ఆయావ్యాధుల పేర్లక్రింద నుదహరింపబడిన మందులు ఆయా వ్యాధుల కుపయోగింప నగును. ఆయామందులు, అనుభవమును బట్టి జాగ్రతతో గూడిన వివేచనతో వాడుక చేయనగును. విష పదార్థముల యందు మోతాదులను బహుమెలకువతో గమనించవలయును. మందులను గూర్చిన వివరములకై గ్రంథమందు జూడవలయును.

### అజీర్ణవ్యాధి — Dyspepsia.

కార్బాలిక్ ఆసిడ్; బిస్మత్ సంబంధములు; కోకా; కాప్సికం సంబంధములు; హైడ్రాస్టిస్; మాల్టు; పాంక్రియస్ సంబంధములు; పెప్సిన్; పొడాఫయిలిన్; క్వినీన్; సాలిసిన్, సోడా బైకార్బనేట్; పొటాస్ బైకార్బనేట్; సోడియైనైట్రేస్; ఆసిడ్ నైట్రిక్ డిల్యూట్; ఆసిడ్ హైడ్రోక్లోర్ డిల్యూట్; ప్యాపేన్.

### అతిమూత్రము — Diabetis.

కొడీన్; క్రియసోట్; గ్వాయిషల్: జాబరాండి; థైమాల్; జాంబూల్; లిథియావాటర్; యురేని నైట్రస్; మార్ఫీన్; ఫాస్ఫరస్; సాకరీన్; సల్ఫొనల్.

### అతిసారము, అతి విరేచనములు — Diarrhoea.

ఆసిడ్ కార్బాలిక్; ఆసిడ్ ల్యాక్టిక్; బేల్; బిస్మత్ సాలిసైలస్; కనేబిస్; క్లోరొడీన్; యూకలిప్టస్; పల్వ్ఇస్ ఇపికాక్ కో; మార్ఫీన్; నాఫ్తాల్ పొడాఫైలిన్; ఓలియం రిసైనా; రిసార్సిన్ అకేసియా గం.

### అతిస్థూలత — Obesity.

కాస్టిక్ సోడా; కాస్టిక్ పొటాష్; పొటాస్ కార్బనేట్; పొటాస్ బైకార్బనేట్; పొటాస్ ఆసిటస్; పొటాస్ సిట్రస్; అమ్మోనియా మెగ్నీషియా సంబంధములు.

### హిస్టీరియా — Hysteria.

కఫీనా వలిరియేనిస్; కనేబిస్; బ్రోమైడులు; లోహ సంబంధమగు లవణములు; ఫాస్ఫరస్; క్వినీన్; స్ట్రిక్నీన్; వలీరియన్ సంబంధములు; జింక్ లవణములు.

ఈడుపు వాయువు లేక ధనుర్వాయువు — Tetanus.

క్లోరల్; కనేబిస్; జెల్సీమియం; మార్ఫీన్; స్ట్రొఫేన్తస్.

ఉబ్బసము — Asthma.

అమిల్ నైట్రైస్; అర్సెనికల్ (పాషాణ సంబంధమగు) చుట్టలు; కఫీన్; కనేబిస్; క్లోరల్; క్లోరోఫారం; కోకా; కొకేన్; కొడీనా; గ్రిండేలియా, జాబరాండి; నైట్రొగ్లిసరీన్; సోడై నైట్రైస్; స్ట్రమోనియం; కాల్చికం.

ఉమ్మి ఊరుట — Salivation.

అట్రోపీన్; అలం (పటిక); బెలడోనా; కోటో; క్లోరేట్; క్రియసోట్ ఆవిరి.

ఋతుస్రావ సంబంధమగు వ్యాధులు — Menstrual Disorders.

1. ఋతుస్రావముయొక్క క్షీణత లేక నిలుపుదల (అమెనోరియా)

అలెట్రిస్; యెర్గాట్; హైడ్రాస్టిస్; ఐరన్ లవణములు; మేంగనీస్ లవణములు; పొటాస్ పర్మాంగనేట్; సాంటొనీన్.

2. ఋతు స్రావమునందు నొప్పిగలుగుట (డిస్మెనోరియా.)

అలెట్రిస్; కనేబిస్; హైడ్రాస్టిస్; సాలిక్సు నైగ్రా; వైబర్నం; వెలీరియనేట్సు.

3. ఋతుస్రావము నందు — అధిక స్రావమగుట గాని, తఱచుగ నగుట గాని లేక అధిక కాలమువరకు అగుట గాని, (మెనోరేజియా.)

బ్రోమైడ్లు; కనేబిస్; యెర్గాట్; హామామలిస్; హైడ్రాస్టిస్; ఐరన్; థైరాయిడ్.

4. ఋతుస్రావము తెలుపు వర్ణముగ నుండుట (లుకోరియా)

(పై శాంతులు) ఆసిడ్ బోరిక్ లోషన్; అలం లోషన్; హైడ్రాస్టిస్; పొటాస్ పర్మాంగనేట్.

(లోని కిచ్చుటకు) ఐరన్ లవణములు; మినరల్ ఆసిడ్లు; శాకసంబంధమగుబలవర్థ కౌషధములు (Vegetable Tonics.)

ఎండదెబ్బ — Sunstroke.

అట్రొపీన్; మార్ఫీన్ (సూదిద్వారా రక్తములోనికి యింజక్టుచేయుట) క్వినీన్; విరేచన మగుటకు యెనిమా నిచ్చుట.

ఎదురురొమ్ము నొప్పి — Angina Pectoris.

అమిల్ నైట్రైట్; ఆర్సెనిక్ (పాషాణము); కాంఫారిక్ ఆసిడ్; మార్ఫీన్ (సూదిద్వారా యింజక్టుచేయుట); నైట్రొగ్లిసరీన్; సోడియం నైట్రైట్.

ఏనుగు గజ్జి —Eczema.

ఆసిడ్ బోరిక్; ఆసిడ్ సాలిసైలిక్; ఇక్థియాల్; రిసార్సిన్; తైమాల్ జింక్ ఆక్సైడ్ సంబంధములు; అయింట్ మెంట్ ఆసిడ్ గైనొకార్డి; క్రైసారొబైన్.

ఓడలోగలుగు కడుపు త్రిప్పు — Sea - Sickness.

అమిల్ నైట్రైట్; అంటిపయిరిన్; కోకా; కొకేన్; క్లోరల్; క్లోరోఫారం; నైట్రొగ్లిసరీన్; మార్ఫీన్ (సూదితో రక్తములోనికి యింజక్టుచేయుట); బ్రోమైడ్లు; నైట్రైట్లు; రిసార్సిన్; కోలా సంబంధములు.

కడుపునొప్పి — Gastralgia

స్పిరిట్ ఈథరిస్; కెనేబిస్; కోకా; కొడీన్; బిస్మత్ సంబంధములు; క్లోరోఫారం; టింక్చరు క్లోరోఫారం అండ్ మార్ఫియా; క్రియసోట్; పెప్సిన్.

కర్ణరోగములు — Ear - Diseases.

1. చెవిలోనుండి స్రవించుట:—

గ్లిసరీనం ఆసిడ్ ట్యానిక్; బోరిక్ ఆసిడ్.

2. చెవిపోటు:—కొకేన్; అట్రొపీన్.

కాలరా — Cholera.

క్రియసోట్; గ్వయిషల్; టింక్చర్ క్లోరోఫారం అండ్ మార్ఫియా; కాంఫర్; హైడ్రార్జరి పెర్ క్లోరైడ్; మార్ఫీన్; సాలోల్; రిసార్సిన్; సాలోల్.

కాలిజము యొక్క పుండు — Liver Congestion or Abscess.

పొడాఫయిలిన్; హైడ్రార్జరి సబ్ క్లోరైడ్ (రస భస్మము).

కురుపులు (అధికకాలము మంచము పట్టుటచే వీపుమీదగాని తుంటిమీద గాని లేచునట్టివి) Bedsores.

కలోడియం; గ్లిసరీన్; గ్లిసరీనం ఆసిడ్ టానిక్; అయొడోఫారం అయింట్మెంటు; జింక్ ఆక్సైడు అయింటుమెంటు.

కురుపులు రాచపుండ్లు — Boils or Carbuncles.

ఆర్సెనిక్; ఫెర్రియి పెర్ క్లోర్; సిరప్ ఆఫ్ హైపోఫాస్ఫయిట్సు; సిరప్ ఆఫ్ సల్ఫేట్సు; సల్ఫయిడ్సు; కార్బాలిక్ ఆయిల్; బెలడోనా గ్లిసరీన్.

కుష్ఠరోగము — Leprosy.

అనాకార్డియం; బాల్సం గర్జన్; ఓలియం గైనోకార్డి.

కుళ్లకుండ జేసెడు వస్తువులు — Antiseptics.

ఆసిడ్ బోరిక్; ఆసిడ్ కార్బాలిక్; ఆసిడ్ సాలిసైలిక్; క్యాంఫర్; క్యాంఫర్ ఫెనాల్; క్యాంఫర్ నాఫ్తాల్; క్లోరల్; క్రియసోట్; గ్వాయిషల్; యూకలిప్టస్; హైడ్రజరీ పెర్ క్లోర్; అయొడోఫారం; నాఫ్తలీన్; పొటాస్ పర్మాంగనేట్; రిసార్సిన్; సోడై బెంజోస్, సోడై సల్ఫిస్; టెరిబీన్; తైమాల్; జింక్ క్లోరైడ్; జింక్ సల్ఫిస్.

కొంకరలు పోవుట (చంటిబిడ్డ గుణము వగైరా) — Convulsions.

సింకోనా సంబంధములు (క్వినీన్ వగయిరా); బ్రోమైడ్లు; బెలడోనా; మార్ఫీన్; హాయొసామీన్; సల్ఫోనల్; వెలీరియనేట్సు.

కోరియా (ఒకవిధమగు కొంకరలు పుట్టించురోగము) — Chorea.

ఆర్సెనిక్; కాల్సియం క్లోరైడ్; క్లోరల్; యెర్గాట్; హాయొసామీన్; కాడ్ లివరు చమురు; ఫాస్ఫరస్; ఈసరీన్; స్ట్రిక్నీన్; వెలీరియనేట్సు; సల్ఫోనల్.

కొరుకురోగము — Syphilis.

అమ్మోనియా అయొడైడ్; గోల్డు క్లోరైడ్; సోడియం క్లోరైడ్; ఫెర్రయి అయొడైడ్; రససంబంధములు; అయొడైడ్లు; అయొడిన్; రససంబంధములు లేపనములుగా నుపయోగించ వలయును.

కొరుకుసంబంధమగు చర్మరోగములు — Syphlitic Skin Diseases.

రససంబంధములు (అనగా అయింటుమెంట్లుగాని పలాస్త్రిలుగాని); రిసార్సిన్; అయొడోఫారం.

కొరుకు సంబంధమగు పుండ్లు — Syphlitic Ulcers.

లైకర్ హైడ్రాజరీ నైట్రిక్ అసిడ్; రససంబంధమగు అయింటుమెంట్లు, లోషన్లు; అయొడోఫారం; రిసార్సిన్; జింక్ క్లోరైడ్.

కొరుకు పుండు (మేహరోగము.) — Cancer.

ఆర్సెనిక్; క్లోరల్; మార్ఫిన్; పాక్కు మందులు; అయొడోఫారం; క్రోమిక్ ఆసిడ్; క్వినీన్ సాలిసైలిస్; జింక్ క్లోరైడ్;

గనోరియా (సెగ) — Gonorrhoea.

కొకేన్ ఇంజక్షన్; ఐరన్ సాల్టులు (లోహముతోగూడినలవణములు); పొటాస్ సంబంధములు; ఓలియం సాంటాల్ (చెందిని); బెలడోనా; ఓలియం యూకలిప్టస్; హైడ్రాస్టిస్; అయొడోఫారం; పొటాస్ పర్మాంగనేట్; జింక్ క్లోరైడ్; జింక్ సల్ఫస్; జింక్ పర్మాంగనేట్; సాలిక్స్నైగ్రా.

గర్భవత్సంబంధ మగు వాంతులు — Vomittings of Pregnancy.

కొకేన్; బిస్మత్; క్రియసోట్; ఇన్గ్లూవిన్; మార్ఫిన్; పెప్సిన్; క్వినీన్.

వాంతులు — Vomittings.

బిస్మత్; కొకేన్; కార్బాలిక్ ఆసిడ్; క్లోరల్; ఇన్గ్లూవిన్: నైట్రొగ్లిసరీన్; సోడా వాటర్.

గర్భస్రావము — Abortion.

అలెట్రిస్; కొడీన్; హైడ్రాస్టిస్; మార్ఫిన్; వైబర్నం.

గర్భాశయము ముడుచుకొని పోవుటకు— Uterine Contractors.

ఎర్గాట్ సంబంధములు; హెమామిలిస్, హైడ్రాస్టిస్.

గాయములు, బెణుకులు — Bruises & Sprains.

అమ్మోనియా క్లోరైడ్ లోషన్; హెమామిలిస్; వాజలీన్; టింక్చర్ హైడ్రాస్టిస్.

గాయములు (నిప్పువలన లేక మసలగాగిన నీటివలన) — Burns.

ఆసిడ్ బోరిక్; థైమాల్ అయింటుమెంట్; వాసలీన్; జింక్ అయింటుమెంట్; క్యారన్ అయిల్; ల్యానొలీన్.

గుండెరోగములకును గుండెకాయయొక్క బలమును వృద్ధిచేయుటకును

మందులు — Cardiac Tonics.

కఫీన్; డిజిటాలిన్; స్ట్రిక్నిన్; స్ట్రొఫాంతస్.

గురకతో గూడిన దగ్గు — Whooping Cough

వేపర్ ఆసిడ్ కార్బాలిక్; అమ్మోనియా బ్రొమైడ్; అలం (పటిక); బెంజోట్సు; బ్రొమైడ్లు; కనేబిస్; క్లోరల్, యెర్గాట్; గ్రిండేలియా; స్ట్రమోనియం; ఫెనేసిటిన్; జింక్ ఆక్సైడ్; జింక్ సల్ఫస్.

గొంతురోగములు—Throat affections.

1. కొండనాలుకయొక్క వాపుదల— Tonsillitis

ఆసిడ్ బోరిక్; క్రియసోట్; బెలడోనా; క్వినిన్ సాలిసైలిస్; బెన్జోట్సు.

2. గొంతు సడలించుటకు—Relaxed Throat

కార్బాలిక్ ఆసిడ్‌తో చేయబడిన గండూషము (పుక్కిలించెడు మందు) కొకేన్; ట్యానిక్ ఆసిడ్ గ్లిసరీన్; క్లోరేట్సుతో జేయబడిన గండూషములు; అమ్మోనియా క్లోరీడ్ లోనికి పీల్చుట; ఫెర్రయి పెర్క్లోర్; హైడ్రాస్టిస్ గండూషము.

3. స్వరపేటికయొక్క వాపుదల — Laryngitis.

అకొనైట్; ఆసిడ్ ల్యాక్టిక్ (పైన రాయుటకు); క్రియసోట్ (లోనికి పీల్చుటకు); రసభస్మము; మెంతాల్ (పైన రాయుటకు).

గౌట్ (వాతరోగము)—Gout.

అమ్మోనియా బెంజోస్; లితియం లవణములు; మేంగనిస్ లవణములు; బెంజోట్సు; పొటాస్ అయొడీడ్; మార్ఫీన్ (సూదితో లోనికి జొచ్చునటుల చేయుట).

గ్రహణి — Dysentery.

ఆసిడ్ కార్బాలిక్; ఆసిడ్ ల్యాక్టిక్; బిస్మత్ సాలిసైలిస్; క్యాల్సియై సాలిసైలిస్; కనేబిస్; క్లోరొడిన్; యూకలిప్టస్ అయిల్; ఫెర్రయి సాలిసైలిస్;

పల్విస్ యిపికాక్ కో; పొడాఫయిలిన్; ఓలియం రెసైనా (చిట్లాముదము); సోడియా ఫాస్ఫస్; బేల్.

చెంపపై పొక్కులు — Lupus.

ఆసిడ్ సిన్నమికం; ఆసిడ్ ల్యాక్టిక్ (పిగ్మెంటు); ఫాస్ఫరస్; కాడ్ లివర్ చమురు; పొటాస్ అయొడీడ్‌న్నూ హైడ్రాజరీ పెర్ క్లోరీడ్‌న్నూ; అయొడో ఫారం; జింక్ ఆయింటుమెంటు.

చర్మరోగములు (క్రిమిజాలములతో గూడినవి)—Parasitic Skin-diseases.

కార్బాలిక్ ఆసిడ్ ఆయింటుమెంటు; క్రైసా రోబైన్; క్యాల్సియం సల్ఫయిడ్ లోషను; క్రియసోట్ ఆయింటుమెంటు; సోడా హైపొసల్ఫ; తైమాల్.

చీడ లేక గజ్జి—Itch.

వాసలీన్; జింక్ ఆక్సైడ్; జింక్ ఆయింటుమెంటు.

చెమట (అధికమగు)—Excessive Perspiration.

(పైన రాయుటకు) జింకు ఓలియస్; నాఫ్‌తాల్; జింకు ఆక్సైడ్; (లోనికి పుచ్చుకొనుటకు) ఆసిడ్ ఫాస్‌ఫారిక్ డిల్యూట్; బెలడోనా; యెర్గాట్; జాబరాండి; క్వినీన్.

చెమట (దుర్గంధయుత మగు)—Fetid Perspiration.

ఆసిడ్ సాలిసైలిక్; ఆసిడ్ బోరిక్; ఆసిడ్ కార్బాలిక్; జింకు ఓలియస్.

జ్వరనివారిణులు—Antipyretics.

క్రియసోట్; గ్వాయిషల్; ఫెనాసిటిన్; పొటాస్ సిట్రస్; క్వినీన్; సాలిసిన్; సాలోల్.

చలిజ్వరము:— [రిమిటెంటు - నడుమ నడుమ తగ్గుచు హెచ్చు చుండెడు; ఇంటర్‌మిటెంటు = విడిచి విడిచి వచ్చెడు ]—Malarial Fever.

అమిల్ నైట్రిస్; ఆర్సెనిక్; క్రియసోట్; గ్వాయిషల్; ఆసిడ్ సాలిసైలిక్; సాలిసిన్; యూకలిప్టస్ గ్లాబ్యులస్; హైడ్రాస్టిస్; క్వినీన్; టింక్చర్ వార్‌బర్గ్; ఫెనాసిటిన్.

టైఫాయిడ్ జ్వరము—Typhoid Fever.

మిస్ట్యూరా ఆసిడ్ కార్బాలిక్; సాలిసైలేట్లు; అమ్మోనియా కార్బనస్; యూకలిప్టస్ గ్లాబ్యులస్; గ్వాయిషల్ కార్బనస్; నాఫ్‌తాల్; ఫెనాసిటిన్; తైమాల్.

నరములతో సంబంధించిన తలనొప్పి—Nervous Headache.

కఫీన్; కెనెబిన్; స్పిరిట్స్ అమ్మోనియా అరోమేటిక్; ఆర్సెనిక్; శాలీశియ సేట్సు; క్లోరల్; క్యాంఫర్; ఐరన్ సంబంధములు; నైట్రో గ్లిసరీన్; ఫెనాసిటిన్; జింక్ ఆక్సైడ్.

పైత్యసంబంధమగు తలనొప్పి—Bilious Headache.

యూనమిన్; హైడ్రాస్టిన్; పొడాఫయిలిన్; సోడాసంబంధమగు పొంగు వచ్చు పదార్థములు; మెగ్నీసియా సల్ఫేట్.

జలుబు, పడిసెము సంబంధమగు తలనొప్పి—Headache from Cold.

అమ్మోనియా క్లోరిడ్; హైడ్రాజరి సబ్‌క్లోరిడ్ (రసభస్మము); సాలిసైలేట్లు.

దగ్గు—Cough.

బాల్సం గర్జన్; బెలడోనా యిపికాక్ మాత్రలు; టింక్చర్ క్యాంఫర్ కో; క్లోరొడీన్; కొడీన్; జెల్సిమియం; మార్ఫిన్; ఇపికాక్; టెరిబిన్.

దద్దురోగము (ఎరీసిపిలాస్)—Erysipelas.

ఆసిడ్ బోరిక్; అకొనైట్; ఆసిడ్ పిక్రిక్; ఆంటిఫిబ్రిన్; బెలడోనా; డిజిటాలిన్; యెర్గాట్; ఫెర్రయి పెర్‌క్లోర్; కలోడియం.

దాహము—Thirst.

ఆసిడ్ ల్యాక్టిక్; ఆసిడ్ ఫాస్‌ఫారిక్ డిల్యూట్; కోకా.

ధాతునష్టము (మూత్రము ద్వారా ఆల్బుమిన్ అనబడు శ్వేతధాతువు నష్టమగుట)—Albuminaria.

ఆసిడ్ పిక్రిక్; జాబరాండి; ఆమిల్ నైట్రిస్; నైట్రైట్స్.

నంజు (గుండె సంబంధమగు)—Cardiac Dropsy.

కఫీన్; డిజిటాలిస్; స్ట్రొఫాంతస్.

నంజు (మూత్రాశయ సంబంధమగు) — Renal Dropsy.

అమ్మోనియా బెంజోస్; పిల్యూలా హైడ్రొజరి; సోడా అయొడైడ్.

నడుము నొప్పి—Lumbago.

లినిమెంట్ బెలడోనా (పైనరాయుటకు); మెంతాల్ ప్లాస్టర్ (పైనవేయుటకు).

నపుంసకత్వము—Impotency.

ఆర్సెనిక్; కనేబిస్; కోకా; కొకేన్; డామియానా; యెర్గాట్; ఫెర్రయిపెర్క్లోరు; ఫాస్ఫరస్; స్ట్రిక్నిన్.

నరముల సంబంధమగు బలహీనత—Nervous Debility.

కోకా; ఆసిడ్ ఫాస్ఫారిక్ డిల్యూట్; అమ్మోనియం బ్రొమైడ్; క్యాంఫర్; క్లోరల్; ఫాస్ఫరస్; క్వినిన్ సంబంధములు; సాలిసిన్; స్ట్రిక్నిన్; సల్ఫొనల్; జింక్ వలేరియేనిస్.

నాడీవ్యాధి — Neuralgia.

అమ్మోనియా క్లోరిడ్; కనేబిస్; జెల్సిమియం; హయొసామిన్; ఫెనాసిటిన్; నైట్రొగ్లిసరీన్; ఫాస్ఫరస్, క్వినిన్; బ్రొమైడ్లు; సాలిసిలేట్లు.

పైపూతకు:—లినిమెంట్ క్లోరొఫారం; లినిమెంటు ఆకొనైట్; మెంతాల్ సంబంధములు.

నిద్రరామి — Insomnia.

కనేబిస్ సంబంధములు; క్లోరల్; కొడీన్; హయొసామిన్, మార్ఫిన్; బ్రొమైడ్లు; ఫెనాసిటిన్; సల్ఫొనల్.

నిస్సత్తువ— Debility

ఆర్సెనిక్; ఫాస్ఫేట్లు; హైపోఫాస్ఫైట్లు; మాల్ట్; క్వినిన్; సింకోనా సంబంధములు; ఈస్టన్సుసిరప్; ఐరన్ సంబంధములు; కాడ్ లివర్ నూనె; స్ట్రిక్నిన్; ఫాస్ఫరస్.

నీరుడుతిత్తియొక్క వాపు(కండుటమంటతోగూడిననొప్పి)— Catarrh of Bladder.

బెంజోట్సు; యూకలిప్టస్; హైడ్రాస్టిస్.

మూత్రాశయముయొక్క రేగుదల — Irritability of Bladder.

బెలడోనా; కనేబిస్; క్లోరల్; మార్ఫిన్.

న్యుమోనియా — Pneumonia.

ఆసిడ్ సాలిసైలిక్; అమ్మోనియా కార్బనస్; కఫీన్; మార్ఫిన్; క్వినిన్.

## నేత్రవ్యాధులు — Eye-diseases.

1. కను ఱెప్ప యంచున వాపుదల.

ఆసిడ్ బోరిక్; హైడ్రార్జరీ ఆక్సైడ్ ఫ్లేవి ఆయింట్ మెంట్; అయొడోఫారం ఆయింట్ మెంటు.

2. కను ఱెప్పలకు లోపలిభాగమున సగ్గుబియ్యమువలె చిన్నిఅణువు లేర్పడుట.

ఆసిడ్ బోరిక్; హైడ్రార్జరీ ఆక్సైడ్ ఫ్లేవి ఆయింట్ మెంట్; జింక్ సల్ ఫస్ లోషన్.

3. కంటిలోని పొర (Cataract)

సినికేరియా.

4. కంటి పాపలోని పుండ్లు, పువ్వువేయుట.

అట్రపీన్; బెలడోనా; కొకేన్; ఈసరీన్; హైడ్రార్జరీ ఆక్సైడ్ ఫ్లేవి ఆయింట్ మెంటు.

5. కంటిపాపచుట్టు తెల్లని పొర గప్పుట.

అట్రపీన్, బెలడోనా.

6. కనుపాపను ముడుచుకొనునట్లు చేయుటకు.

జాబరాండి; మార్ఫిన్; ఫైజొస్టిగ్మా; ఈసరీన్.

7. కనుపాపను విస్తరింప జేయుటకు.

అట్రపీన్; బెలడోనా; కొకేన్; హాయొసామిన్; హాయొసీన్.

## పడిసెము (శ్వాససంబంధమగు) — Bronchitis.

లిక్కర్ అమ్మోనియా అసిటేటిస్, అమ్మోనియా క్లోరీడ్; యూకలిప్టస్; గ్రిండేలియా; ఇపికాక్; మార్ఫిన్; కాడ్ లివర్ చమురు; కార్బాలిక్ ఆసిడ్; క్రియసోట్ లోనికి పీల్చి వాసనచూచుట; ఫెనాసిటిన్.

## పచ్చకామాల వ్యాధి — Jaundice.

అమ్మోనియా క్లోరీడ్; బెంజోట్లు; యూనమిన్; రసఫస్మము; హైడ్రాస్టిస్; పోడాఫయిలిన్; సెన్నా; పొంగువచ్చు సోడా సంబంధములు.

పక్షవాయువు — Paralysis.

హైపోఫాస్ఫయిట్సు; హయొసామి; ఫాస్ఫరస్; స్ట్రిక్నిన్; ఐరన్; ఫెర్రయి అయొడైడ్; పెప్సిన్; కాడ్లివరు చమురు; ఫైజోస్టిగ్మా.

ప్రసవ సంబంధమగు జ్వరము — Puerperal Fever.

ఆసిడ్ బోరిక్; జాబరాండి; ఫెర్రయి పెర్క్లోర్; క్వినిన్.

పంటినొప్పి — Toothache.

కొకేన్; జెల్సీమియం; ఆసిడ్ కార్బాలిక్; మెంతాల్ సంబంధములు; క్రియసోట్; పొటాస్ పర్మాంగనేట్.

పంటియొక్క చిగుళ్లవాపు — Inflamed Gums.

అలం (పటిక); ఆసిడ్ కార్బాలిక్; టింక్చరు అయొడిన్; టింక్చర్ అకొనైట్; పొటాస్ క్లోరస్.

పాముకాటు—Snake-bite

లిక్కరు అమ్మోనియా ఫార్ట్, పొటాస్ పర్మాంగనేట్; స్ట్రిక్నిన్.

పాండురోగము—Anaemia.

ఆర్సెనిక్: హైపో ఫాస్ఫయిట్సు; ఐరన్ సంబంధములు; ఫాస్ఫేట్సు; ఫాస్ఫరస్; క్వినిన్ సంబంధములు.

ప్లీహవ్యాధులు — Spleen Affections.

క్వినిన్: ఐరన్; టింక్చరు అయొడిన్- పైనరాయుటకు.

పులిపిరికాయలు — Warts.

ఆసిడ్ క్రోమిక్; కొకేన్; కార్బాలిక్ ఆసిడ్: లినిమెంటు అయొడిన్.

పురుగులు—Worms.

రసభస్మము; ఫెర్రయి పెర్క్లోర్; శాంటోనిన్; యూకలిప్టస్; పమిగ్రినట్;

పురుగుకాటు — Insect Bite.

కార్బాలిక్ ఆసిడ్ లోషన్; క్లోరొఫారం; కొకేన్; లిక్కరు అమ్మోనియా; సోడా బైకార్బనేట్; తేలుకుట్టునకు ఇపికాక్తో ఉడుకబెట్టిన పిండికట్టు; తైమాల్.

## వ్రణములు — Wounds.

ఆసిడ్ బోరిక్; కార్బాలిక్ ఆసిడ్ లోషన్; కలోడియం; అయొడోఫారం; ఇక్‌తియాల్; పొటాస్ పర్మాంగనేట్; రిసార్సిన్; తైమాల్; జింక్ క్లోరీడ్; సాలోల్ హైడ్రాజరీ పెర్ క్లోరీడ్ లోషన్. (క్రిమిసంహారకవస్తువులు చూడుడు).

## పైత్యోద్రేకము — Biliousness.

అమ్మోనియా క్లోరీడ్; యూనమిన్; హైడ్రాస్టిస్; పొడాఫైలిన్; సెడ్లిజ్ పవుడర్లు.

## పొక్కుమందులు — Caustics.

క్రియసోట్; ఆసిడ్ క్రోమిక్; హైడ్రాజరీ పెర్ క్లోరీడ్; పొటాస్ పర్మాంగనేట్; జింక్ క్లోరీడ్; ఆసిడ్ అర్సెనియస్.

## పొంగు లేక వేపపువ్వు — Measles.

అకోనైటు; లిక్కరు అమ్మోనియా ఆసిటేటిస్; స్పిరిట్ ఈతర్ నైట్రిస్; ఇపికాక్.

## బట్టతల — Baldness.

క్లోరల్; లినిమెంటు క్యాంఫర్ కో; లినిమెంటు క్లోరోఫారం; జాబరాండి.

## బూరకాలు — Elephant Leg.

కాల్సియం సల్ఫైడ్; ఈస్టన్సు సిరప్.

## బొబ్బలు, తామర, దురదలు — Herpes and Shingles.

మెంతాల్; వాసలీన్; కలోడియం; జింక్ అయింట్‌మెంటు; హైడ్రాజరీ అమ్మోనియా అయింటుమెంటు; సలీన విరేచనకారులు.

## బొల్లి — Leucoderma.

బాల్సం గర్జన్; ఓలియం గైనోకార్డి.

## మద్యపానము — Alcoholism.

అర్సెనిక్; కాప్సికం; క్లోరల్; కోకా; కోకేన్; హైడ్రాస్టిస్; మార్ఫిన్; ఫాస్ఫరస్; క్వినైన్.

## మలబంధము — Constipation.

కాస్కారా సాగ్రడా; రసభస్మము; పొడాఫయిలిన్; చిట్టాముదము; సెడ్లిజ్ పవుడర్లు; సునాముఖీ సంబంధములు; పొంగువచ్చు సోడా సంబంధములు; పొంగువచ్చు మెగ్నీసియం సల్ఫేట్ సంబంధములు.

## మశూచి — Small-pox.

పైకిరాయుటకు—అంగ్యుయెంటం ఆసిడ్ బోరియా; కార్బాలిక్ ఆయిల్, అంగ్యుయెంటం అయొడోఫారం; అంగ్యుయెంటం హైడ్రాజరీ; కలోడియం; అంగ్యుయెంటం జింకు ఓలియేటు.

లోని కిచ్చుటకు—అంటి ఫిబ్రిన్; అంటి పైరిన్; క్రెసలాల్.

## మాంసగ్రంథుల యొక్క వాపుదల — Enlarged Glands.

కాల్సియం క్లోరీడ్; అయొడైడ్లు; ఐరన్ లవణములు; అయొడోఫారం; అయొడీను-లోని కిచ్చుటకును పైనరాయుటకును; హైడ్రాజరి ఓలియేట్; సోడియై అయొడైడ్.

## మూత్రకోశము యొక్క వాపుదల — Nephritis.

గోకూర; ఓలియం సాంటాల్ (చందినీ)

## రక్తమునందు మూత్రము గలియునట్టి వ్యాధి (యురేమియా) — Uraemia.

ఆమిల్ నైట్రైన్; కఫీన్; డిజిటాలిన్; జాబరాండి; నైట్రోగ్లిసరీన్; సోడై బెంజోస్.

## మూత్రగ్రంథులయొక్క క్షీణదశ — Bright's Disease.

కనేబిస్; డిజిటాలిన్; హైడ్రాస్టిస్; జాబరాండి; నైట్రోగ్లిసరీను.

## మూర్ఛ — Epilepsy.

గోల్డుబ్రోమైడ్; బ్రోమైడ్సు; ఆర్సెనిక్ సంబంధములు; ఐరన్ లవణములు; కనేబిస్; నైట్రోగ్లిసరీన్, సొడియై బ్రోమైడ్ అందు నైట్రైన్; స్ట్రిక్నీను; వలేరియనేట్సు; జింక్ బ్రోమైడ్; జింకు సిట్రస్; జింకు లాక్టస్; జింకు సల్ఫస్; సల్ఫోనల్.

## మూలశంక — Piles.

కనాడెన్సిస్; అరిస్టాల్; అంగ్యుయెంటం కోనై; కాస్కారా సాగ్రడా; హామామిలిస్; సెన్నా.

### మెదడు మృదువగుట — Softening of the Brain.

హైపో ఫాస్ఫయిట్సు; ఐరను సంబంధములు; కాడ్ లివరు చమురు; ఫాస్ఫరస్.

### మొటిమలు — Acne.

అంగ్వ్యుయెంటం ఆసిడ్ సాలిసైలిక్; ఫెర్రయి యెట్ క్వినీ సిట్రస్; హైపోఫాస్ఫయిట్సు; హైడ్రొజరీ పెర్క్లోరిడు లోషన్; ఇక్థియాల్; థైమాల్ ఆయింటుమెంట్.

### రక్తస్రావము — Haemorrhage

లోపలికి — ఆసిడ్ పైరోగాలిక్; హమామలిస్; ఐరన్ లవణములు.

వెలుపలికి — అలం (పటిక) ఫెరయి పెర్క్లోర్; హమామలిస్.

### రాత్రి చెమటలు — Night - Sweats.

క్యాంఫారిక్ ఆసిడ్; క్లోరల్; పల్విస్ యిపికాక్ కో; హైపో ఫాస్ఫయిట్సు; ఐరన్ లవణములు; జాజరాండి; సల్ఫొనల్; జింక్ ఆక్సైడ్.

### రికెట్సు — Rickets.

క్యాల్సియం లవణములు; ఫాస్ఫేట్సు; ఆసిడ్ ఫాస్ఫారిక్ డిల్యూట్; కాడ్ లివరు చమురు; లోహ సంబంధములు; హైపో ఫాస్ఫయిట్సు.

### వాపుదల — Inflammation.

1. శ్వాస సంబంధమగునది.

   అమ్మోనియా క్లోరిడ్ ఆవిరి; స్పిరిట్ ఈతర్ నైట్రిస్.

2. అన్నకోశము, ప్రేగుల సంబంధ మగునది.

   బిస్మత్ సంబంధములు; కెఫీన్; యూకలిప్టస్; హైడ్రాస్టిన్.

3. నాసిక సంబంధ మగునది.

   కార్బలైజడ్ సాల్టులు; క్యాంఫర్; కొకేన్.

4. గర్భాశయ సంబంధమగునది.

   అయొడోఫారం; జింక్ సల్ఫస్.

## వాతరోగము — Rheumatism

1. ఉధృతస్థితిలో:—ఆసిడ్ సాలిసైలిక్; ఆసిడ్ క్రియసోటిక్; కోటో; ఫెర్రియి పెర్ క్లోర్; ఓజోనిక్ ఈథర్; పొటాస్ సిట్రస్; క్వినీన్; సాలిసైలేట్లు; సాలోల్; ఫెనాసిటిన్.

2. దీర్ఘ వ్యాపక స్థితిలో:— ఆసిడ్ సాలిసైలిక్; అమ్మోనియా అయొడైడ్; బెలడోనా; లినిమెంట్ కాప్సికం; లినిమెంట్ క్లోరోఫారం; కోటో; జెల్సిమియం; యూకలిప్టస్ ఆయిల్ (పైపూత); పొడాఫయిలిన్; ఓలియం గైనోకార్డి; ఓలియం కాజిపట్; ఓలియం క్రోటోనిస్.

## వాంతి కట్టుటకు — Vomitting.

బిస్మత్, కొకేన్, ఆసిడ్ కార్బాలిక్; క్లోరల్; ఇన్గ్లూవిన్; నైట్రోగ్లిసరీన్; పొంగువచ్చేడి ద్రవపదార్థములు; సోడావాటరు మొదలైనవి.

## వాంతి కారులు — Emetics.

అలం (పటిక); ఇపికాక్; ఆవపిండి; జింక్ సల్ఫస్; జింక్ ఆసిటస్.

## విరేచనములు (చీము, నెత్తురు, మలముతో పడుట.)—Dysentery.

హమామలిస్; హైడ్రాజరీ పెర్ క్లోర్; పల్విస్ ఇపికాక్ కో; మార్ఫిన్; స్వచ్ఛమగు టెరిబీన్; బేల్; బిస్మత్; సాలిసైలిస్; ఓపియం; లెడ్ ఆసిటేట్.

## వీర్యనష్టము — Spermatorrhoea

బెలడోనా; యెర్గాట్; ఫెర్రియి ఫెర్ క్లోర్; ఫాస్ఫేట్సు ఆఫ్ ఐరన్ అండ్ క్వినీన్; ఈస్టన్సు సిరప్; సాలిక్సు నైగ్రా; డామియానా.

## వెక్కిలి — Hiccough.

స్పిరిట్ ఈథరిస్; క్యాంఫర్; క్లోరల్; అమిల్ నైట్రిస్; సోడా బైకార్బనేట్; స్పిరిట్సు క్లోరోఫారం.

## వెఱ్ఱి — Insanity.

కనేబిస్; బ్రొమైడ్లు; క్లోరల్; డిజిటాలిస్; హాయొసామిన్; హాయొసీన్; జెల్సిమియం; మార్ఫిన్; సల్ఫొనల్.

పిచ్చికుక్క కాటువలన కలిగెడి రోగము — Hydrophobia.

కొకేన్; క్లోరల్; కనేబిస్; మార్ఫీన్; నైట్రొగ్లిసరీన్.

శ్వాసకోశములనుండి యెఱ్ఱని రక్తమును గ్రక్కుట — Haemoptysis.

ఆసిడ్ పైరోగాలిక్; అంటిపైరిన్; అలం; డిజిటాలిస్; యెర్గాట్; హామామలిస్.

శ్వాసకృచ్ఛ్రము — Dyspnoea.

ఆసిడ్ కార్బాలిక్; స్పిరిట్ ఈతరిస్; అమిల్ నైట్రిస్; నైట్రోగ్లిసరీన్; సోడియై నైట్రిస్.

రుధిరరక్తనాళముయొక్క ఉబ్బుదల — Aneurism.

అకొనైట్; అమిల్ నైట్రైట్; డిజిటాలిస్; నైట్రో గ్లిసరీన్; పొటాస్ అయొడైడ్.

శూలనొప్పి — Colic.

ఈతర్; అమిల్ వెలీరియనస్; క్యాంఫర్; క్లోరోఫారం; క్లోరోడీన్; మెంతాల్ ఆయిల్ (పెప్పరుమింటు); కాజిపట్ ఆయిల్.

స్నాయువుల ఈడ్పు (రోగమువలన) — Spasm.

ఈతరు; స్పిరిట్సు అమ్మోనియా అరోమేటిక్; అమిల్ నైట్రిస్; క్యాంఫరు; టింక్చర్ క్లోరోఫారం యెట్ మార్ఫియా; ఓలియం మెంతా పిప్.

సోరియేసిస్ — Psoriasis.

పైన రాయుటకు:— ఆసిడ్ కార్బాలిక్; క్రయిసారొబైన్; ఆసిడ్ సాలిసైలిక్; ఓలియం గైనొకార్డి; ఇక్తియాల్; బాల్సం గర్జన్.

లోని కిచ్చుటకు:—ఆర్సెనిక్; ఓలియం గైనొకార్డి; లోహ సంబంధములు; కాడ్ లివరు నూనె; ఫాస్ఫరస్; క్వినీన్.

స్క్రొఫ్యూలా — Scrofula.

కాల్సియం లవణములు; ఫాస్ఫేట్లు; ఫెర్రియి అయొడైడ్; లోహ సంబంధమగు లవణములు; అయొడీన్; అయొడొఫారం; కాడ్ లివర్ నూనె; క్వినీన్.

## స్తనములయొక్క — Breast Affections.

1. వాపుదల:— బెలడోనా.

2. పాలను వృద్ధిజేయుటకు:—ఆసిడ్ ల్యాక్టిక్; జాబరాండి; మాల్టు యక్ స్ట్రాక్టు; ఆముదపు ఆకులు.

3. పాలను నిలుపుచేయుటకు:—బెలడోనా; కోనియం; యెర్గాట్; సలీన విరేచనకారులు.

4. స్తనాగ్రములయొక్క పుండు:—గ్లిసరీన ఆసిక్ ట్యానిక్; కోకేన హైడ్రోక్లోర్.

## స్మృతి తప్పించెడి మందులు — Anaesthetics.

లోనికి పీల్చుట మూలమున:— ఈతర్; అమిల్ హైడ్రైడ్; క్లోరోఫారం; మెంతిలీన.

పైన రాయుటవలన:—ఆయాస్థానముల మాత్రమే.

ఆసిడ్ కార్బాలిక్; ఈతర్; కోకేన.

## స్వస్థావస్థయం దీయదగిన మందులు (వ్యాధి కుదిరిన పిమ్మట)—Tonics.

మీట్ (మాంస) సంబంధములు; సింకోనా; ఈస్టన్సు సిరప్; క్వినీన; కాడ్ లివర్ నూనె; మాల్టు యక్ స్ట్రాక్టు.

## క్షయరోగము — Phthisis.

లోనికి పీల్చుటకు:— ఆసిడ్ హైడ్రో ఫ్లూరిక్; క్రియసోట్; మెంతాల్; టెరిబీన్.

లోని కిచ్చుటకు:— ఆసిడ్ సిన్నమికం; ఆర్సెనిక్; కఫీన; కాల్సియం లవణములు; కొడీన; క్రియసోట్; గ్వాయిషల్ కార్బనస్; యూకలిప్టస్; బెంజోట్లు; కాడ్ లివరు నూనె; పేంక్రియాటిన; పెప్సిన; సాలిసైలేట్లు; హైపోఫాస్ఫయిట్లు; మాల్టు.

క్షీణగతి— Collapse.

స్పిరిట్ ఈథరిస్; స్పిరిట్సు అమ్మోనియా ఆరొమేటిక్; అమ్మోనియా లోనికి పీల్చుట; అమిల్ నైట్రిస్; ఆల్కహాల్; టింక్చర్ డిజిటాలిస్; నైట్రో గ్లిసరీన్; స్ట్రిక్నిన్.

పైత్యకృచ్ఛ్రము — Biliary Calculi
(పైత్యసంబంధ మగు రాళ్లు యేర్పడుట)

స్పిరిట్ ఈథరిస్; అమిల్ నైట్రిస్; క్లోరల్; మార్ఫిన్; నైట్రోగ్లిసరీన్:

మూత్రకృచ్ఛ్రము — Urinary Calculi.
(మూత్రసంబంధమగు రాళ్ళు యేర్పడుట)

అమ్మోనియా ఫాస్ఫస్; అమ్మోనియా బెంజోస్; లిథియం లవణములు; సోడా బెంజోస్; పెపరజీన్.

---

# సౌందర్య రహస్యము.

ఆస్ట్రేలియా సమీపముననున్న న్యూజీలండు ద్వీపమునందలి స్త్రీలు యొడలంతటికిని బురదను బట్టించుకొని అదియంతయు నారు నంతవరకును అటులనేయుండి అనంతరము పరిశుభ్రస్నానముచేసి దానిని గడిగివేయుదురట! ఇదియే వారల సౌందర్యమునకును ఆరోగ్యమునకును గారణమని చెప్పబడుచున్నది. పంది బురద మెచ్చుటకు సరియగు కారణమును మనము గ్రహింపజాలక పరిహాసాస్పదముగ బలుకుచుందుము!

## ఒళ్లు పట్టుట — **Massage** (మెసాజ్).

భారతదేశమునందు ఒళ్లుపట్టుట యొక విధమగు చికిత్సాపద్ధతిగ చిరకాలము నుండి యెంచబడుచున్నది. ఈ వైద్య సంబంధమగు కసరతులు అనాదిగ హిందువులలోను చీనాదేశీయులలోను మాత్రమే గాక గ్రీకులలోను రోమనులలోను గూడ వాడుకయం దుండియున్నవి. 1728 సం॥ ప్రాంతములనే యీవైద్యపద్ధతి ఇంగ్లాడునం దనుచరింపబడెను గాని 19 వ శతాబ్దప్రారంభమునగాని డెన్మార్కు దేశములో కీళ్లనొప్పి, నాడీవ్యాధి, తుంటినొప్పి మొదలగు వ్యాధులకు యీ చికిత్సాపద్ధతి అనుచరణయం దుంచబడి యుండలేదు. ఈ "మెసాజ్" పద్ధతిలో శరీరసాధకమును రోగి తనంతట తాను చేయుటకు బదులుగా మరియొకరు తనశరీరముపై బనిచేయుట తటస్థించుచున్నది. బెణుకులు, కీళ్లవాపులు, కీళ్లు బిగుసుకొనిపోవుట, నరముల సంబంధమగునట్టియు అజీర్ణసంబంధగుమనట్టియు అస్వస్థతలయందును, మలబద్ధము నందును, వెన్నెముక వంకరతిరిగిన సందర్భములందును, యీ చికిత్సాపద్ధతు లుపయోగించుచున్నవి.

ఈ ఒళ్లు పట్టుట యొక్క యుద్దేశములు — (1) శరీర మంతటియొక్క గాని లేక శరీరముయొక్క యేప్రత్యేకభాగముయొక్కగాని పోషణమునుబలపరచుటయును, (2) వ్యాధివలన శరీరముయొక్క యే ప్రత్యేకస్థానమునందైనను కలిగిన వాపులను, వాపుదల ఫలితములను, తొలగించెడి కార్యక్రమములం దధికోద్రేకతను గలిగించుటయు—అయియున్నవి. ఇదిగాక, యిందుమూలమున స్నాయువులయొక్క ముడుచుకొనుశక్తి అదివరకు నశించియుండినయెడల మరల స్వస్థపఱచబడును.

శరీరముపైన రుద్దినగాని మెల్లగా చేతితో దువ్వినగాని రక్తప్రచారమునందు వెంటనే మార్పు గనిపించుచున్నది. చేతివేళ్ళు చర్మముపైన కొంతబలముతో నొత్తిపెట్టి మెల్లగా నడపినచో రక్తనాళములయం దుండెడి రక్తము ముందుకు పోయి మరల నాయొత్తిడిని తీసివేయగనే రక్తము తొందరగ వెనుకకు తిరిగి ప్రవహించుచున్నది. ఈ చురుకుదనమే రక్తప్రచారమునకు సహాయ మొనర్చుచున్నది. ఈ ఒడలు పట్టుటలో నెప్పుడును చేతులనుండిగాని కాళ్లనుండిగాని రక్తప్రవాహము గుండెవైపునకు బోవుటకు సహాయము నొనర్పవలయునుగాని యిందుల కెదురువైపుగా నీ చేతులతో బనిచేయరాదు. ఇటుల క్రమమార్గమున నొత్తుటమూలమున పైవిధముగ రక్తప్రచార మధిక మగుచున్నది. ఇందుమూలమున మేదోనాళముల యందలి వ్యర్థపదార్థములు గూడ వెలువరింపబడుచున్నవి. చర్మమును బొటనవ్రేలునకును చూపుడువ్రేలునకును మధ్య గట్టిగా బట్టుకొని మెలివేసినయెడల నీ రక్తప్రచార మధికమగుచున్నది.

చేతితోగాని వ్రేళ్లతోగాని చరచినయెడల రక్తప్రచారముయొక్క చురుకుదన మధికమై ఆస్థాన మెరప్రబడును.

గుద్దుటవలన నంతగా లాభ ముండనేరదు. ఈ యొడలు పట్టు పనిలో నేర్పరియగువాడు ఎచ్చట వాపుదల లున్నదియు తాకుటవలన దెలిసికొనగలడు. ఇందు — మువ్వుట, తోముట, పిసుకుచు నొక్కుట, గిల్లుట, ఒత్తుట, పిండుట, చిందరవందరగా గొట్టుట — యిన్నివిధములగు పద్ధతులు గలవు. ఈపద్ధతు లన్నియు శరీరమర్దనమునకు సంబంధించినవే యున్నవి. అంతరావయవములయొక్క అల్లికలపై బనిచేయవలయునన్న యెక్కువబలము నుపయోగించ వలసియుండును; పాదముల యొద్దనుండి ప్రారంభించి క్రమముగా కాళ్లపై పునకు రాయవలయును. పిక్కలయొద్ద రెండు చేతుల నుపయోగించవలసి యుండును.

శరీరమునందలి ప్రతిభాగమునకును ఈ పద్ధతి నుపయోగింపవచ్చును. పొత్తికడుపును పట్టుటలో మొదట చర్మమును గిల్లుచు, పిమ్మట స్నాయుప్రాకారమును చేతులలో గుండ్రముగ ద్రిప్పుచు, పొత్తికడు పంతయు గదలునట్లుగ చేతులను త్వరితగతిని పేగులవైపులకు దీసికొని పోవలయును. ఈ కార్యక్రమమునం దెప్పుడును రోగి కేవిధమగు బాధయును కలుగగూడదు. జీర్ణాశయము, కాలేజము, పేగులు వీనియొక్క అస్వస్థతలయందును, అతిమూత్రమునందును, స్నాయువులయొక్క పక్షవాత స్థితియందును, యీచికిత్సాపద్ధతి యుపయోగించునట్లు కనబడుచున్నది.

కాలుయొక్కగాని చెయ్యియొక్కగాని యెముక తొలగినప్పుడుగాని, విరిగినప్పుడుగాని, కొయ్యబద్దలతో గట్టి కొంతకాల ముంచి మరల బయటికి తీసినప్పుడు, యీ "మెసాజ్" పద్ధతి నుపయోగింప వలసియుండును. ఇందుమూలమున నా అవయవము త్వరలో స్వాధీనమునకు రాగలదు. ఈ చికిత్సాపద్ధతి పైవ్యాధులయందు చిన్నవయస్సువారి కెక్కువ యుపకరించును. ఈ చికిత్సామార్గమున రక్తప్రచారమేగాక నరములయొక్క స్వస్థతకూడ సరిచేయబడును. ఆంధ్రదేశమునందలి ఓఢ్రమంగలివార లీ చికిత్సాపద్ధతిని గొంతవరకు దెలిసినట్లు గనబడుచున్నది. మళయాళ దేశమునందు యీ చికిత్సాపద్ధతి యెక్కువ వాడుకలో నున్నది. ఈ పనిచేయునప్పుడు చేతులకు కొంచెము వాసలీన్‌నుగాని చమురునుగాని రాసుకొనుట మంచిది. అందువలన చేతులు పట్టునకు వీలుగా నుండును.



# కొన్ని భారతీయౌషధములు.

## లోధ్రి — Symplocos Racemosa.

(లొడ్డుగ)

బంగాళీము, అసాము, బర్మా ప్రాంతములయందలి దిగువ కొండలపై పెరుగు నొక చిన్న చెట్టుయై యున్నది. దీని బెరడు సాధుస్నాయు ముకుళనమున కుపయోగించుచు, పేగు సంబంధమగు అతివిరేచనములు, ఆమవిరేచనములు మొదలగు వానియందును, నంజు, నేత్రివ్యాధులు, కొర్జాస్వస్థతలు, జ్వరములు, కురుపులు మొదలగు వానియందును, బనిచేయును. మారేడు— విషముష్టి యుతముగను, లేక, కొక కొడిసె బెరడుతోడను, జేర్చి— పేగువ్యాధుల కగు ననేకౌషధయోగములలో నిది యుపయోగింపబడుచున్నది. గర్భాశయ సంబంధమగు నల్లికలయొక్క సడలింపు వలని నొప్పులయందు 20 గ్రియినుల పొడిని చక్కెరతో జేర్చి యిచ్చిన మంచిపని చేయును; దినమునకు రెండు లేక మూడుపర్యాయములు మూడు నాలుగు దినములవర కియ్యనగును. అట్టి విషయములలో అరద్రాము మోతాదులో ద్రావకముగ నిచ్చిన నెక్కువగ బని చేయునట్లు తెలియుచున్నది. జ్వరములు, జిగటవిరేచనములు, కొరిజ వ్యాధులు— వీటిలో నితరఓషధులతో గూడిన కషాయములును, నానబెట్టిన రసమును (ఇన్ఫ్యూజన్) ఉపయోగముగ నుండును. పండ్లనుండి రక్తము గారు చున్నపుడును, పంటి చిగుళ్లు జిగురుగ నున్నపుడును లోధ్రి చెట్టుయొక్క మానుతో జేసిన కషాయము నుపయోగింపనగును. కొండనాలుక పొడగరించినపుడు యీ కషాయమును గొంచెము తేనెతో గలిపి గండూషముగ నుపయోగించును.

---

## అశోక — Saraca Indica.

అశోకవృక్షముయొక్క బెరడు స్నాయువులను ముడుచుకొనునట్లు చేయుచు గర్భాశయబాధలకు శమనమును గలుగజేయును. దీనిబెరడుతో జేయబడిన కషాయమును సామాన్యముగ నుపయోగింతురు. 4 ఔన్సుల బెరడును 4 ఔన్సుల పాలలోను 16 ఔన్సుల జలములోను గలిపి యుడుకబెట్టి ఆజలము ఆవిరియైపోవునంత వరకు మరగ బెట్టినచో నీకషాయ మేర్పడును. గర్భాశయపు నొప్పిసమయమున దీనిని రెండు లేక మూడుమోతాదులలో నియ్యనగును. ఈ మందును ఋతుస్రావపు నాల్గవ దినమున బ్రారంభించి స్రావము నిలచువరకును నియ్యవలయును. బెరడునుండి చేయబడిన ద్రావకము యీ గర్భాశయాస్వస్థతయందు బాగుగా పనిచేసినట్లు డాక్టరు కోమన్‌గారు చెప్పుచున్నారు.

---

## అర్క — Gigantic Swallowwort.

(జిల్లేడు)

ఈ చిన్నచెట్లు (పొదలు) బంగాళా ప్రాంతములలోను, ఉత్తరహిందుస్థానము నందును, దక్షిణయిండియా యందును, బీడు భూములలోను పెరుగుచుండును. దీని యొక్క వేళ్లు, ఆకులు, రసము, పుష్పములు— ఔషధమున కుపయోగించును. ముదిరిన చెట్లయొక్క వేళ్లు యొక్క వ యుపయోగముగ నుండును.

ఈ ఓషధి గుండెపైన డిజిటాలిస్ వలె పనిచేయును. జిల్లేడుపాల యందు చురుకును బుట్టించు గుణ ముండి యున్నది. వేరుయొక్క బెరడు, బలవర్ధకౌషధముగ బనిచేసి, శరీరములో మంచి మార్పును గల్పించి, యీడ్పును బోగొట్టునట్లు జేసి, కఫమును వెలిబుచ్చునట్టి శక్తిని గలిగి యున్నది. పెద్ద మోతాదులలో వాంతికారిగ వర్తించును. అల్టరేటివుగ మోతాదు 3 గ్రే॥ మొదలు 10 గ్రే॥ వరకును, వాంతికారిగ 30 గ్రే॥ మొదలు 60 గ్రే॥ వరకును. ఇది పైత్యస్రావము నధికపరచి పేగులలోని బాధను తగ్గించి ఆమవిరేచనకారణముల దొలగించి రేగుదల నణచివేయును. కొఱుకు వ్యాధి సంబంధమగు నస్వస్థతలయం దిది మంచి ఔషధముగ బనిచేయుచు, "శాకవర్గ పాదరసము" (Vegetable Mercury) అని పిలువబడు చున్నది; విడిచివిడిచివచ్చు జ్వరములయందు పనిచేయును. జ్వరగతియందు చెమటను గూడ బుట్టించును. పుష్పములు జీర్ణకారిగను, బలవర్ధకముగను బనిచేయును. రసము జీర్ణకోశమునం దంతటను ఉద్రిక్తమైన రేగుదలను బుట్టించును. గర్భస్రావము కలుగునట్లు చేయుటకును, క్రొత్తగా బుట్టిన బిడ్డల జంపుటకును— దీని నుపయోగించుట మూలమున గొందఱు దుర్మార్గులు నేరములు చేయుచుందురు.

రసభస్మము 1 గ్రే॥ రసాంజనము (ఆంటిమొని సల్ఫయిడ్) 2 గ్రే॥ వేరు బెరడుపొడి 5 గ్రే॥—వీని నన్నిటిని తేనెతో గలిపి మాత్రగా జేసి— బూరకాలు వ్యాధియందును, కొఱుకు వ్యాధియందును దినమునకు రెండు లేక మూడు మాత్రల చొప్పున నియ్యనగును.

పాముకాటునకు:—

జిల్లేడుపాలను గోలీకాయ యంత మాత్రగా జేసి తమలపాకులో బెట్టి సర్పదష్టునిచే నమలించవలయును; వాంతి కలుగునంత వరకును ప్రతి అరగంటకును యిటులనే యియ్యవలయును. రెండు మోతాదుల నిచ్చిన పిమ్మట పరిమాణమును

తగ్గించ వలయును; అవసరమైనచో 9 మాత్రాదుల వరకును నియ్యనగును. రోగి గుటక వేయలేనిచో జిల్లేడుపాలను నీటితో గలిపి యియ్యవచ్చును.

సర్పదష్టానంతరము రెండు లేక మూడు ఆకులను నమలి మ్రింగవలయును. వేరును నీళ్లతో అరగదీసి పాము కరచినచోట ఆ గంధమును వేయనగును.

---

## విశల్యకరణి — Delphinium Denudatum.

పాము విషమునకును, నాభివిషమునకును విరుగుడుగ నుపయోగింతురు. కషాయము, 1 కి 10 వంతుల నీటితో జేసి, 2 డ్రా॥ మొదలు 4 డ్రా॥ వరకుగల మాత్రాదులలో నియ్యవలయును. పంటినొప్పియందు వేరును నమలవలయును. కొఱుకు వ్యాధియందును కీళ్ళనొప్పియందును ఆల్టరెటివుగ నుపయోగించును. రావణుని శక్తిబాణముచే మూర్ఛనొందిన లక్ష్మణుని పునర్జీవితునిగ జేయుటకుగాను హనుమంతుడు గంధమాదనపర్వతమునుండి దెచ్చుటకు నియోగింపబడిన దీ ఓషధి కొరకే! వానరవైద్యుడగు సుషేణుడు దీనియొక్క అమోఘతను గూర్చి చెప్పియుండెను.

---

## నారింజ — Orange.

ఫల్లని పండ్లలో నారింజ శ్రేష్ఠమైనది. రక్తశుద్ధిని జేసి ఆకలిని బుట్టించును. స్కర్వీ వ్యాధికి వ్యతిరేకముగ బనిచేయును. పైత్యదేహమువారలకు భోజనసమయమున మిక్కిలి యుపయోగించును. దగ్గు, రొమ్మునొప్పడిసెము, అతిమూత్రము, కార్జ హృదయాస్వస్థతలయందును బనిచేయును. పిల్లలకు పాలతో గలిపి యిచ్చినయెడల జీర్ణాశయాస్వస్థతల సరిచేయును.

---

## నిమ్మ — Lemon.

మశూచి, పొంగు వ్యాధులయందు దాహము విశేషముగ నుండినయెడల 4 డ్రా॥ మొదలు 6 డ్రా॥ మాత్రాదులలో నిమ్మరసమును యియ్యనగును. కీళ్ళనొప్పి యందును ఉపయోగించును. శ్వాసకోశములు, పేగులు, గర్భాశయము మూత్రాశయము - వీటినుండి గలుగు రక్తస్రావములందుగూడ నుపయోగమగును. స్కర్వీవ్యాధియం దుపయోగించును. ఇన్ఫ్లూయంజా వ్యాధియందు వేడి నిమ్మరసము పనిచేయును. సమాన భాగ

మగు నీటితో గలిపిన నిమ్మరసము కౌలరా టైఫాయిడ్ల యందు సాధుక్రిమిహార ముగా నుపయోగించును. పాలు గలియని ఘాటగు కాఫీతో నిమ్మరసము గలిపి యిచ్చిన యెడల చలిజ్వరమును గుదుర్చునని చెప్పబడియున్నది. ఉద్రితమగు పడి సెమునందు ఒక పైంటు ఉడుకునీటిలో రెండు నిమ్మకాయల రసమును గలిపి కొంచెము చక్కెరనుగూడ గలిపి పుచ్చుకొనినచో మంత్రమువలె పనిచేయును. ప్లీహము అభివృద్ధినందిన విషయములో ప్రతిదినమును ఒకపండును ఉప్పుతో సేవించినయెడల గుణము నిచ్చును. తలపైన నిమ్మరసమును రుద్దినచో చుండును పోగొట్టును. ఉన్మత్తులకు నిమ్మరసమును తలపై మర్దనచేయుదురు.

---

## మాదీఫలము — Citrus Medica.

దీని రసము సువాసనను గలిగి జీర్ణకారిగ బనిచేయును. పైత్యసంబంధమగు వాంతులను గట్టించును. ఈ రసమును జేర్చి షరబతును జేసి మాదీఫలరసాయన మను పేరున విక్రయించుచుందురు.

---

## పాలు — Lactus.

## (MILK)

పాలయందు విటమిన్స్ యుండును. ఎముకలు, నరములు, స్నాయువులు, తక్కిన అల్లికలును — యెదుగుటకును, పోషణమునకును పాలు ఉపయోగించును. ఆవుపాల యందు కంటె బర్రిపాలయందు యెక్కువ వెన్న యుండును. గాడిదపాలయందు క్షారపదార్థములును క్రొవ్వును తక్కువగా నుండి చక్కెర యెక్కువగా నుండును. మనిషిపాలయందు క్రొవ్వుపదార్థ మధికముగా నుండి క్షారములు తక్కువగా నుండును

ఆవుయొక్క వర్ణమునుబట్టి దానిపాలయందలి గుణము భేదించునని ఆయుర్వేదము చెప్పుచున్నది.

(1) నల్లఆవుపాలు వాతప్రకోపమునందు మంచి పనిచేయును. (2) పసుపు వర్ణముగల ఆవుపాలు వాతపిత్తములయందు గుణము నిచ్చును. (3) తెల్లఆవుపాలు జీర్ణించుట కష్టమై కఫసంబంధమగు నస్వస్థతను గలుగజేయును. (4) ఎర్రిఆవుగాని బల్లిఆవుగాని యిచ్చినపాలు వాతప్రకోపమునందు మంచిఫలితము నిచ్చును. (5) దూడను గల ఆవు పాలు మంచివి. (6) దూడలేని ఆవుపాలు మంచివి కావు. (7) చాలదినముల

క్రింద యీనిన ఆవుపాలు బలవర్ధకౌషధముగ బనిచేసి త్రిదోషముల నివారించును. బర్రెపాలు ఆవుపాలకంటె నెక్కువ తీపిగాను, చిక్కగాను, చమురు సహితముగను నుండును. ఈపాల నెక్కువగా ద్రాగినచో నిద్రమత్తు కలిగి, ఆకలి చెడి, జలుబు చేయును. కొందరకు విరేచనములుగూడ నగును. మేకపాలు తియ్యగా నుండి, చలవ జేసి, మలబద్ధమును గలుగజేయవచ్చును; యిది బలము నిచ్చి ఆకలిని వృద్ధిచేసి జీర్ణత నధికపరచును. గొర్రెపాలు ఉప్పగానుండి, వేడిచేసి, తేలికగా జీర్ణముకాను. గుఱ్ఱపుపాలు ఉప్పగా నుండి బలము నిచ్చును. గాడిదపాలు తేలికగా జీర్ణమగును. ఒంటెపాలు తేలికగా నుండి, యియ్యగా నుండి, కొంచెము ఉప్పగా నుండి, సాధువిరేచనకారిగ బనిచేయును. ఏనుగుపాలు స్నాయువులకు బలము నిచ్చును.

ఆవుయొక్కగాని బర్రెయొక్కగాని పెరుగు పచ్చకామాల వ్యాధియందుపయోగింపుచు రాగివలన కలిగిన విషఫలితములకు విరుగుడుగ బనిచేయును. అందు కారణముననే తామ్రభస్మము నిచ్చిన విషయములలో విరుగుడుగ పెరుగును ద్రాగింతురు. మిరియాల పొడితో గలిపి యిచ్చిన పెరుగు పామువిషమునకు ప్రతిహతముగ బనిచేయును. నెయ్యి, పటికబెల్లము, తేనె— వీనిని గలిపి చిన్నబిడ్డలయొక్క సామాన్యవ్యాధుల కన్నిటికి నియ్యవచ్చును. తరచుగా నేడ్చునట్టియు, తల్లిపాలను ద్రాగనట్టియు, బిడ్డలకు— ఉప్పును, నేతితోడను, పటికబెల్లముతోడను గలిపి యియ్యనగును.

---

## ఈశ్వరవేరు — **Aristolochia Indica.**

ఈ వేరును పాముకాటులయందు లోనికిని పైకినికూడ నుపయోగింతురు. తేలు కుట్టుకుగూడ నుపయోగింతురు. బొల్లియందు దీనిని తేనెతో నరుగదీసి లోనకిచ్చెదరు. నంజువ్యాధియందుగూడ గుణము నిచ్చునని చెప్పబడుచున్నది. మిరియాలపొడితో గలిపి యిచ్చుటవలన కలరావ్యాధియందును అజీర్ణవిరేచనముల యందును బ్రయోజనకారిగ నుండును.

---

## సాలామిశ్రి — **Orchis Mascula.**

ఇది పర్షియా ఆఫ్గనిస్తాన్ దేశములలో నుత్పత్తి యగుచున్నది. దీనియొక్క దుంపలు ఔషధముగా నుపయోగింప బడుచున్నవి. ఒక టీస్పూన్ యీపొడిని ఒక గిన్నెడుపాలలో వేసి యుడుకబెట్టి పుచ్చుకొనినయెడల మంచిఆహారముగ వర్తించును. సంభోగశక్తిని బలపరచును. నరముల బలహీనత యందును యిది యుపయోగించును.

పథ్యము: కారము, ఆమ్లపదార్థములు, కారపుదినుసులు, మత్తుపదార్థములు, రాత్రులు మేలుకొనుట, సంభోగము—వీటిని త్యజింపవలయును.

---

## కర్పూరవంగ — Tomatoes.

దీనియొక్క గుంజును, రసమును— జీర్ణకారులు; రక్తమును పరిశుద్ధపరచును. ఇందు మూడు విధములగు విటమిన్స్ యుండినట్లు చెప్పబడుచున్నది. ఐరోపా అమెరికాలయందు దీనియొక్క రసమును నారింజరసమునకు బదులుగా నుపయోగించెదరు. కార్జమును క్రమముగా బనిచేయునట్లు చేయును. కీళ్ళనొప్పి వ్యాధిగ్రస్తులు వీనిని తినరాదు.

1. విటమిన్స్ ఆహారము లన్నిటిలోను కర్పూరవంగ మిగుల బలమైనది.

2. రక్తమును శుద్ధిచేయుటయందు దీనికి పెట్టినది పేరు.

3. జీర్ణాశయమునందలియు పేగులయందలియు స్రావములను క్రమస్థితిలోనికి దెచ్చును.

4. మూత్రగ్రంధులయొక్క కార్యక్రమమునుగూడ బాగుపరచును.

---

## వేరుసెనగలు — Groundnut.

వేరుసెనగలు పైత్యమును వృద్ధిచేయునని చెప్పబడుచున్నది. వేరుసెనగనూనెను ఆలివ్ ఆయిల్కును బాదంనూనెకును బదులుగా నుపయోగించవచ్చును. ఆహారపదార్థముగ బలము నిచ్చును; రొట్టెలుగా జేసికొని తినవచ్చును; దీనినుంచి వెన్నముగూడ చేయుదురు.

---

## మామిడిపండు — Mango.

ఇండియాదేశమునందలి ఫలములలో నెల్ల నిదియే శ్రేష్ఠమని చెప్పవచ్చును. పచ్చిమామిడికాయలలో పుల్లగా నుండునవి ఊరుగాయగా నుపయోగింతురు. ఈ మామిడిపండ్లయందు "రసములు" అని యొకజాతి యుండును. అవి రోగులకు ఆహారముగ నుపయోగించును. తేలికగ జీర్ణమగును. వీనియందు "బంగినపల్లి" జాతి పండ్లు కూడ ఆహారముగ నుపయోగింపవచ్చునుగాని విశేషముగ దినినయెడల నస్వస్థతను గలుగజేయవచ్చును. ఇప్పుడు వేలకొలది యీ మామిడిపండ్లు యిండియానుండి యింగ్లాండునకు రవానా యగుచున్నవి. ఆంగ్లేయులు కూడ దీని రుచిని గ్రహించినారు.

---

# వ్యాధిసూచిక.



---

# ఔషధ సూచిక.

---



---

# పేటెంట్ మందులు - Patent Medicines.

1 అలెట్రిస్ కార్డియల్ (Al]etris Cordial):— గర్భాశయసంబంధమగు బల వర్ధకౌషధము.

2 అలెన్ అండ్ హాన్‌బరీజ్ బైనిన్ అమారా (Allen and Hanbury's Bynin Amara) – నాడీ బలక్షయమునకు (Nervous Debility).

3 ఆండ్రూస్ లివర్ సాల్ట్ (Andrew's Liver Salt) – పచ్చకామాల వ్యాధి మొదలగు కాలిజాస్వస్థతలకు.

4 బెంజర్స్ ఫుడ్ (Benger's Food) – అజీర్ణవ్యాధియం దియ్యదగు నాహారము.

5 బైసురేటెడ్ మెగ్నీసియా (Bisurated Magnesia) – అజీర్ణాస్వస్థతలకు ఆమ్లసితి అధికముగానున్న స్థితులయందు.

6 హామొగ్లొబిన్ (Homoglobin) – రక్తక్షీణతయందు.

7 పానొపెప్టన్ (Panopepton) – జీర్ణకారి యగు ఆహారము.

8 గాంగ్లిట్ కాప్స్యూల్స్ (Gonglyt Capsules) – సెగవ్యాధియందు లోని కిచ్చుటకు,

9 హక్స్లేస్ నెర్వ్ విగర్ (Huxley's Nerve Vigour) – మెదడునకు బలవర్ధకౌషధము.

10 సల్ఫర్ బిటర్స్ (Sulphur Bitters) – రక్తశుద్ధికారకు.

11 లాక్టోపెప్టిన్ (Lactopeptin) – బిడ్డలకు బలవర్ధకౌషధము.

12 విరాల్ (Virol) – బలవర్ధకౌషధమగు నాహారము.

13 వైబ్రోనా (Vibrona) – బలవర్ధకౌషధమగు సారాయము.

14 విన్కార్నిస్ (Wincarnis) = ఆహారముగ నుపయోగింపదగు సారాయము.

15 వాటర్బరీస్ కాంపౌండ్ (Waterbury's Compound) శ్వాసకోశసంబంధ మగు బలవర్ధకౌషధము.

16 ఓవల్టిన్ (Ovaltine) – రోగులకు ఆహారముగ నుపయోగింపపడదగినది.

17 హపటోగ్లోబిన్ (Hapatoglobin) – రక్తశుద్ధికి గాను.

18 కార్నిక్స లిక్విడ్ పెప్టనాయిడ్స (Carnick's Liquid Peptonoids) — జీర్ణకారియగు ఆహారము.

19 క్రుషన్ సాల్ట్సు (Krushan Salts) — సాధువిరేచనము లగుటకు.

20 యోహింబీన్ టేబ్లాయిడ్స (Yohimbine Tabloids) — సంభోగశక్తి నిటకు.

21 హిమ్రాడ్స ఆస్తమా క్యూర్ (Himrod's Asthma Cure) - ఉబ్బస వయందు యీ పొడిని కాల్చి అందలి పొగను వాసన జూచిన యెడల శాంతిగా నుండగలదు. ఈ క్రింది ప్రకరణము పై మందును బోలియుండును: పొటాసియం నైట్రేట్ (సూరేకారము) 25 పాళ్లు, మసల కాగుచు నీళ్ళు 25 పాళ్లు - కలిపి, పొగాకు ఆకులు 25 ను ఉమ్మెత్తాకులు 25 తేయాకు నీళ్లతో గలిపి, అంతయు 100 పాళ్లు అగునట్లు చెయవలయు వీటి నన్నిటిని గలిపి యెండబెట్టి ఒక చుక్క ఆనిసి ఆయిల్‌ను గవలయును. ఉబ్బస వ్యాధియందు ఒక టీస్పూను దీనిని పడకగదిలో కా పొగ వేయవలయును; లేక యీ పొగను లోనికి బీల్చినను బీలువ వచ్చును.



# రోగ్యుపచారబోధిని.

రోగులకు ప్రతివ్యాధియందును యెట్టెట్టి ఉపచారముల జేయవలసినదియు వివరముగ బోధించు గ్రంథము. చికిత్సాజయము ముఖ్యముగ దీని ననుసరించియే యుండును.

